శ్రీమద్భాగవతసుధాలహరి - 1

బమ్మెర పోతనామాత్య ప్రణీతము

# గజేంద్ర మోక్షము

సంస్కృత మూల సహితము

గోపీనయనోత్పలార్చిత వ్యాఖ్యా విలసితము


సంపాదకులు

**శ్రీ చల్లా సాంబిరెడ్డి**






వ్యాఖ్యాత

**ఉత్పల సత్యనారాయణాచార్య**

శ్రీ పావని సేవా సమితి ప్రచురణ నెం.4

శ్రీమద్భాగవత సుధాలహరి - 1

ప్రథమ ముద్రణము : జూన్ 1999 ప్రతులు : 1000

GAJENDRA MOKSHAMU


| | | |
|---|---|---|
| గజేంద్రమోక్షము | : | శ్రీ బమ్మెర పోతనామాత్య ప్రణీతము |
| వ్యాఖ్యాత | : | ఉత్పల |
| With Commentary named | : | **Gopeenayanotpalarchita Vyakhya"** |
| Divine Blessings by | : | Avadhuta Datta Peethadhipathi, Sri Sri Sri GANAPATI SACHCHIDANANDA SWAMIJI, MYSORE. |
| Appreciations by | : | BRAHMASRI KUPPA VENKATA KRISHNA MURTHY - Vidyadhikari, Avadhuta Datta Peetham, Mysore<br>**'Andhra Vyasa'** Brahmasri YELURIPATI ANANTARAMAYYA, Hyderabad. |
| Edited by | : | SRI CHALLA SAMBI REDDY |
| Published & rights reserved by | : | **SRI PAVANI SEVA SAMITHI,** "Sri Sai Nilayam"SRT270, Sanathnagar, Hyderabad - 500 018, A.P. Phone : 3702898 |
| Title page Drawing | : | Gangadhar |
| PRICE | : | **Rs.100/-** |
| Type Setting at | : | F O N T L I N E G R A P H I C S, Baghlingampalli, Hyderabad - 500 044. |
| Printed at | : | Sri Sai Ram Printers, Hyderabad - 500 004. |

అవధూత

దత్త పీఠాధిపతి

జగద్గురు పరమపూజ్య

శ్రీ శ్రీ శ్రీ గణపతి సచ్చిదానంద స్వామివారికి

యాభై ఏడవ జన్మదిన

శుభ సందర్భమున

సభక్తికముగా సమర్పితము

- చల్లా సాంబిరెడ్డి



**అవధూత దత్త పీఠము**

శ్రీ గణపతి సచ్చిదానంద ఆశ్రమము

మైసూరు

ది. 2.6.99

అవధూత దత్తపీఠాధిపతి - జగద్గురు - పరమపూజ్య

# శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామీజీ వారి

# ఆశీస్సందేశము

"గచ్ఛతి జాయతే - ఇతి గజః" అనీ ఒక నిర్వచనం వుంది. దాని ప్రకారం మరణిస్తూ, మళ్ళీ జన్మిస్తూ, వుండే జీవి పేరే గజం. జీవుడికి ఈ జనన మరణ చక్రంలోనుంచి విడుదల కలిగే విధానపు కథే "గజేంద్ర మోక్షం".

ఒక జీవి మానవుడా పశువా అనటానికి వాడి శరీరం కన్నా మనస్సే ముఖ్యం. శరీరం మానవుడిదే అయినా, బుద్ధి ఉద్బుద్ధం కాకపోతే, వాడు పశువే. శరీరం పశువుదే అయినా, జన్మాంతర తపఃపరిపాక బలంచేత జ్ఞానదీప్తి అందుకుంటే, వాడు మానవుడే. అలాంటి మానవుడి మోక్షకథే గజేంద్ర మోక్షం.

ఉత్పల సత్యనారాయణాచార్య ఈ కథా నాయకుడైన శ్రీహరిని తన గోపీనయనోత్పలార్చిత వ్యాఖ్యతో సమర్చనచేసి జీవితాన్ని ధన్యం చేసుకొన్నాడు. జరిగిన రచనవల్ల కర్తృత్వాహంకారానికి లోనుగాక, తన కృతిని గురువుకు సమర్పణ చేసి కృతార్థుడవుతున్నాడు. మన వాఙ్మయసంపదను తోటి సమాజానికి అందించే కృషిని స్వయం సేవగా శిరసావహించిన సాంబిరెడ్డి ఈ కృతి క్రతువులో భాగస్వామియై ధన్యుడవుతున్నాడు.

ఇక నిజంగా ధన్యులు కావలిసింది పాఠకులు. ఈ గ్రంథం కేవలం సాహిత్య వ్యాఖ్యానం కాదు. శ్రీకృష్ణ సౌందర్యరసంలో రంగరించిన తత్త్వామృతం దీనిలో వుంది. దీనిని ఆస్వాదించే శక్తి వుండాలంటే, దానికి గురువుల కృప కావాలి. ఆది గురుమూర్తి, గురుసంప్రదాయ ప్రవర్తకుడు అయిన శ్రీదత్త గురుమూర్తి కృప ప్రసరించి ఈ గ్రంథ ప్రతిపాద్యమానమైన భక్తితత్త్వం మీ హృదయాలకు పట్టుగాక!

*జయగురుదత్త*

జయ గురుదత్త

# నివేదన

ఈ గజరాజ మోక్షణము నిమ్ముగ నీకు సమర్పణమ్ముగా
శ్రీ గురుదత్త! వ్రాసితిని చేకొను మర్మిలితోడ, నన్ను పు
న్నాగము పూచినట్లు చిరునవ్వున మెత్తువులే, దయారసో
ద్వేగిత కృష్ణ మేఘమయి దీవెన లిత్తువులే దయానిధీ!

అన్వహ మీ కృతి ప్రగతి కండగ నిల్చిన ధార్మికుండు చ
ల్లాన్వయ సాంబిరెడ్డి అనయంబు హృదంతర కృష్ణభక్తి భా
వాన్వితుడా సునామికి ప్రియంబగు దీవెనలందు యాదవేం
ద్రాన్వయ దత్త సద్గురు! శతాంశము నాకు ననుగ్రహింపవే!

దాసులు సేవకుల్ ముదిమి తార్కొన విశ్రమ మాసచేసి సం
త్రాసముచెంది స్వామి గురుదత్త! చనంగలవారు; నేను ప
త్నీ సదృశ ప్రపన్నుడను నీదు ప్రసన్నత కోసమై సదా
నీ సవిధంబునం దొదిగి నిల్చుటె నాకు ముదంబు గూర్చెడున్

చిత్తమెటింగి ఆశ్రమము చెంత ఉదుంబర వృక్షమే యిటన్
పత్తిరి పూచె గావలయు, భక్తులు నీకు గులాబి దండలే
తెత్తురు ప్రేమతో, గణపతిప్రతిమానుడవై చరించినన్
దత్తుడవీవు వైష్ణవ పదస్థుడవే గద! ఆనుపూర్విగన్

స్వామీ! చేతులు మోడ్చి నిల్చెదము నీ జన్మోత్సవం బందు నిం
కేమీ పల్కఁగలే మమేయ మహిమా హేమాద్రి! నీ ముంగిటన్
మేమెంతో పసివార మెల్లపుడు నిన్నే కాచుకొన్నాము, మా
క్షేమంబే తలపోసి దేవ! భవదాశీర్వాదముల్ కోరుచున్.

ఎల్ల జగజ్జీవుల పసి
పిల్లల అవ్యక్తమధుర వివిధ ధ్వనులన్
తెల్లమగు నర్థమేదో
తల్లికి తెలియు, మరియు గురుదత్తకు తెలియున్.

గురువర! నీ సమక్షమునకున్ చొరనిత్తువె? పాపపంకిలా
కరమగు ఈ శరీరమొక గాడిద, బూడితపూత, తుచ్ఛపుం
బరువుల మోత, సంతతము మైథునపుం దలపోత, వీథిలో
దొరకినదెల్ల మేత, కడు దుస్సహమయ్యెడు కూత దీనికిన్

ఏ నటువంటివాడనని యెంచకుమో గురుదత్త! నేటి ఈ
మానవులింత; ఈ జనసమాజము ధర్మపథాన నిల్పి ప్ర
స్థాన మొనర్పబూనిన వదాన్యుల మాన్యుల వర్ధమాన సత్
సూనుల సాంబిరెడ్డి ప్రభృతుల్ భవదీయుల నాదుకో ప్రభూ!

సంపదపెంచి సంతతి కొసంగిన చాలదు, భక్తి భావనా
సంపద - శీలసంపద - సుసంస్కృతి సంపద పుత్ర పౌత్ర పా
రంపరిగా నొసంగవలెరాయని ఉత్తమ గ్రంథరాజి ము
ద్రింపదొడంగు ధార్మిక వరిష్ఠుని మెచ్చెద సాంబిరెడ్డినిన్

**- ఉత్పల**

## కుప్పా వేంకట కృష్ణమూర్తి

**విద్యాధికారి**

శ్రీ అవధూత దత్త పీఠము, మైసూరు


# సాధన సామగ్రి

"మోక్షసాధన సామగ్ర్యాం భక్తిరేవ గరీయసీ" ఇది త్రిమతాచార్యులకూ సమ్మతమైన సిద్ధాంత వాక్యం. "మోక్షాన్ని సాధించేందుకు ఉపయోగపడే సామగ్రులన్నింటిలోనూ ఉత్తమోత్తమమైనది భక్తి" - అంటోంది పై సూక్తి. ఈ మాటవల్ల భక్తి కాకుండా మోక్షసాధన పరికరాలు మరికొన్ని వున్నాయని సూచన అవుతోంది. అలాంటి ఉపాయాలన్నింటినీ వ్యాసభగవానుడు ఇతర పురాణాలలో ప్రతిపాదించి, చివరకు ఉత్తమోత్తమమైన భక్తి సామగ్రిని సమగ్రంగా ప్రతిపాదించేందుకే శ్రీమద్భాగవత రచన చేపట్టాడు. అందుకే భాగవతంలోనే ఒక చోట "తత్ర మార్గ సహస్రేషు భక్తి రేకా గరీయసీ" అన్నాడాయన.

భక్తి కూడా బహుముఖాలు కలదే. ఆ ముఖాలలో నవవిధ భక్తులు సుప్రసిద్ధమైనవి. ఇవిగాక మరికొన్ని భక్తిరీతులను కూడా శ్రీమద్భాగవతం ప్రతిపాదించింది. మోక్షసాధనలలో భక్తి ప్రధానమైనదైతే భక్తిమార్గాలలో శరణాగతి భక్తి ఉత్తమోత్తమమైనది అని శ్రీమద్భాగవతం ప్రత్యక్ష పరోక్షరీతులలో పదే పదే ప్రతిపాదించింది. అలాంటి ఘట్టాలలో గజేంద్రమోక్ష ఘట్టం శిఖరాగ్రం వంటిది.

ప్రాక్కర్మ దోషాలవల్ల పశుత్వానికి పడిపోయిన జీవి, కేవలం ప్రపత్తివల్ల సూటిగా పరమాత్మ పాదాలను అందుకొన్న ఘట్టం ఇందులో వర్ణితమైంది. కనుక ఎటువంటి అధమస్థితిలో వున్న మానవుడైనా సరే, ప్రపత్తి మార్గాన్ని ఆశ్రయిస్తే, మోక్షాన్ని పొంది తీరుతాడని చెప్పటానికి ఈ కథ చక్కని సాక్ష్యంగా పనికి వస్తుంది.

శ్రీమాన్ ఉత్పల సత్యనారాయణాచార్య హేతుబద్ధతను రక్తగతం చేసుకొన్న కవి. కవులకు అందని ఈ అద్భుత గుణం ఆయనకు అలవడటం ఆంధ్రుల భాగ్యం. ఆయన ఈ కథను

మనస్సులో మననం చేసి చేసి, దానిని మూడు భాగాలుగా విభజించుకున్నాడు. మొదటి భాగానికి ఉత్తరణిక అని, రెండవ భాగానికి మహోద్ధరణిక అని పేర్లు పెట్టుకున్నాడు.

కథ వేరు, కథలోని కిటుకు వేరని ఆంధ్రుల ఆదికవి నన్నయముని మునుపే చెప్పాడు. "ప్రసన్న కథాకలిత అర్థయుక్తి" అనే పద్యపాదంలో విశ్వనాథ కవిసమ్రాట్టు ఈ సూత్రాన్ని భారతం మొత్తానికి సమన్వయించి తన రామాయణ కల్పవృక్షానికి పునాదులు వేసుకొన్నాడు. ఇప్పుడీ ఉత్పలకవి గజేంద్రమోక్ష కథానకంలోని అర్థయుక్తిని "లోనారసి" తన గోపీనయనోత్పలార్చన వ్యాఖ్యను విలసింపజేశాడు. ఇలా అనటానిక ఆయన వ్రాసిన అవతరణికే తిరుగులేని సాక్ష్యం.

ప్రధాన కథను ఉత్తరణిక, మహోద్ధరణికలుగా వింగడించిన ఈ వ్యాఖ్యాత, అవతరణికను తాను స్వయంగా కల్పించాడు. అవతరణిక అంటే అవతారిక లేక ఉపోద్ఘాతము. మామూలుగా అయితే ఇంతే. ఈ గ్రంథ సందర్భములో మాత్రం అవతరణిక అంటే జీవుడు కింద పడటం.

ఏనుగై సంసారంలో పడ్డ జీవిని ఉత్తరింప చేయాలంటే, వాడికి కష్టాలు కల్పించాలి. వేరే మార్గం లేదు. "యం తు రక్షితు మిచ్ఛామి తస్య విత్తం హరామ్యహమ్" (నేను ఎవడిని రక్షించాలని అనుకుంటున్నానో వాడి సంపదను హరించివేస్తాను) అనే ఈ భగవద్వాక్యం పై విషయాన్నే ప్రతిపాదిస్తోంది. విష్ణు సహస్రనామాలలో "భయకృత్ భయనాశనః" అనే నామాల దగ్గర కూడా, పరమాత్మే కరుణతో ముందు భయాలను కల్పించి, ఆ పైన వాటిని తనే తొలగిస్తాడని పెద్దలు వివరిస్తున్నారు. సంసారంలో పడ్డ గజేంద్రుడిపై కరుణతో పరమాత్మ కష్టాలను కల్పించిన ఘట్టమే ఉత్పలవారి ఉత్తరణిక.

ఆర్తుడైన జీవుడు జిజ్ఞాసువై ఆక్రోశిస్తాడు. అప్పుడు వాడికి పరమాత్మ "ఉత్ - హరణం" ప్రసాదిస్తాడు. ఆ ఆర్తి నిర్వ్యాజమైనదైతే స్వామి ప్రసాదించే ఉద్ధరణం మహోద్ధరణమవుతుంది. ఇదే గజేంద్రకథలోని మోక్షం. ఇదే ఉత్పలవారి మహోద్ధరణిక.

ఇలా విభాగత్రయంవల్లనే ఈ వ్యాఖ్యత కథలోని ఆయువు పట్టును పట్టివేశాడని విస్పష్టమౌతోంది. ఆ తరువాత మతత్రయానుయాయులైన మహనీయుల వ్యాఖ్యలన్నీ తన తెలివి సానమీద రంగరించి, తన మూసలోకి పోసుకొన్నాడు ఉత్పలకవి.

ఈయన ముందుగా కవి. పోతన్న గారినీ, వ్యాసుడినీ, కవులుగా చూడవలసిన సందర్భాలు వస్తే, ఈయన స్వయంగానే శిఖరాగ్రాలకు ఎక్కి చూస్తాడు. ఉత్తరణికలోని పద్యభాగాలలో ఈ విషయం మనకు స్పష్టంగా దర్శనమిస్తుంది.

తరువాత ఈయన తాత్త్వికుడు, సాత్త్వికుడు, తత్త్వవివేచన దగ్గరకొచ్చేసరికి, ఈయన శ్రీధర, వంశీధర, వీరరాఘవాది వ్యాఖ్యాతల కరావలంబాన్ని ఆదరంగా స్వీకరించి తనదైన ఒడుపుతో మనకు విషయదర్శనం చేయిస్తాడు.

పోతన్నగారి తెలుగు పద్యానికి ప్రతిపదార్థ తాత్పర్యాలు ఇవ్వడమే కాక, దానికి మూలమైన వ్యాస శ్లోకాన్ని కూడా జతచేసి వివరించటం ఈ వ్యాఖ్యానంలోని అపూర్వత. పోతనగారి కవిత్వం తేనెల సోనెలే అయినా, వ్యాసుడి అర్థగాంభీర్యాన్ని ఆకళించుకొన్నప్పుడు భావుకుడికి ఎవడికైనా సరే, వ్యాసపక్షపాతిత్వం తప్పదు. ఉత్పలవారికీ అంతే. కొన్నిచోట్ల ఒక్క శ్లోకానికే పది పేజీల పైబడి అర్థవివరణ చేయటమే దీనికి నిదర్శనం. మూలాన్ని అతిక్రమించి పోతన్నగారు వెళ్ళినచోట్లలో గుణదోషాలను ఉత్పలవారు వివరించిన నిష్పక్షపాత వైఖరి ప్రశంసనీయంగా వుంది.

కావ్యము "శివేతరక్షతయే" అనే విషయం హృదయానికి పట్టినవారి కళ్ళకు ఈ గోపీనయనోత్పలార్చిత వ్యాఖ్య దివ్యాంజనం వంటిది. దీనివి వ్రాసి ఉత్పలవారు తమ రచనా జీవితంలో హిమాలయ శిఖరాలను చేరుకొన్నారు.

శ్రీచల్లా సాంబిరెడ్డిగారు వంటరి సేనాదళం వంటివాడు. వికృత విన్యాసాలు చేస్తున్న సామాజిక వైపరీత్యాలతో సాంస్కృతిక సమరం సాగిస్తున్న నిరాయుధుడు. ఆయన చేపట్టిన పావని సేవాసమితి ఇప్పటికే అనేక శతకాలను వ్యాఖ్యానాలతో సహ సమాజానికి అందించింది. ముఖ్యంగా ఈనాటి యువతను ఉద్దేశించి ఈ సంస్థ చేపట్టిన ప్రచురణ పరంపరలో ఈ గజేంద్రమోక్ష వ్యాఖ్యాప్రకటనం గొప్ప మైలురాయి కాగలదనటంలో సందేహం లేదు.

ఈ వ్యాఖ్యాతకు గాని, ప్రచురణ కర్తకుగాని, కర్తృత్వబుద్ధిలేదు గనుక, పాఠకులు వీరికి ఋణపడి వుంటారనటం కుదరదు. పాఠకుల హృదయాలలో వివేకదీప్తిగా వీరిద్దరూ శాశ్వతంగా వెలుగుతూ వుంటారనటం సత్యసమ్మతంగా వుంటుంది.

ఈ కృతికి కృతిభర్త, దత్తావతారమూర్తులు, అయిన గురుదేవులు శ్రీగణపతి సచ్చిదానంద స్వామీజివారి కృప వీరిద్దరిపైనా, తద్వారా పాఠకలోకం పైనా, ప్రసరించి మన సమాజానికి వెలుగుబాటలు విస్తరించాలని ప్రార్థిస్తున్నాను.

*జయగురుదత్త*

2-6-99 ఇట్లు

మైసూరు

**కుప్పా వేంకట కృష్ణమూర్తి**

దత్తపీఠ విద్యాధికారి

# చిలుక కొట్టిన పండు

ఆంధ్రవ్యాస, కవికుల రత్నదీప, వైదికాగమాలంకార, భాషాప్రవీణ,
**ఏలూరిపాటి అనంతరామయ్య**, ఎం.ఏ.సంస్కృతము, ఎం.ఏ. తెలుగు, బి.ఇడి.,
గుంటూరు డా॥ కె.వి.కె. సంస్కృత కళాశాల రిటైర్డ్ ప్రిన్సిపాల్,
అనంతసాహితి కార్యదర్శి, 16-1-24/సి/6/1, శ్రీ సాయి ఎపార్ట్‌మెంట్స్,
కమ్యూనిటీ హాలు వద్ద, సైదాబాద్ కాలనీ, హైదరాబాద్ - 500 059.

## సాంబిరెడ్డిగారి సదాశయాలు

శ్రీ చల్లా సాంబిరెడ్డిగారు న్యాయవాది. చిన్నతనం నుంచీ శ్రద్ధగా చదువుకొని విద్యాభ్యాసంలోనూ, న్యాయ విద్యాభ్యాసంలోనూ బహుమతులు గెలుచుకొంటూ సమానులలో ఉత్తములుగా పేరుపొందుతూ వచ్చారు. అనంతరం న్యాయవాదిగానూ అన్ని విధాలా విజయమందినవారుగా విఖ్యాతులయిన వారు. బహుసామాన్య వ్యావసాయిక కుటుంబంలో జన్మించినందున, స్థిరమైన నిశ్చయంతో శ్రమిస్తేనే కాని, నిరంతరం దీక్షతో కృషిచేస్తేనే కాని ఎవరూ ఏమీ సాధించలేరు, సాధించినా దానిని నిలుపుకొనలేరు, అనిన వ్యవసాయాత్మికమైన ఏకైకమైన అభిప్రాయమున్నవారు. ఆస్తికులైన వచనమో పద్యమో ఆకర్షకంగా వ్రాయగలవారూ, పాడగలవారూ తమ సామర్థ్యం దైవసేవకు వినియోగిస్తే తమ సమస్యలు తీరిపోతాయనే విశ్వాసం వీడి, వారినీ వీరినీ ఆశ్రయించటంకోసం వెంపర్లాడడమంటే రెడ్డిగారికసహ్యం. దైవచింతకులు, రచయితలు, ఉపన్యాసకులు, సమాజంలోని ప్రముఖులు, గురువులు, స్వాములు, పీఠాధిపతులు తమ కర్తవ్యమైన ధర్మబోధ సరిగా చేయటం లేదని రెడ్డిగారికి తీవ్రమయిన అసంతృప్తి. వారు చేయటం లేదు వీరు చేయటం లేదు అనుకోవటంకంటె, స్వసామర్థ్యం వల్లనో పరసాహాయ్యం వల్లనో ఒడ్డెక్కినవారు - ఆమాటకు వస్తే ప్రతివారూ - ప్రవాహంలో కొట్టుకుపోతున్న వారిని పైకి తీయటానికి, యథాశక్తి ప్రయత్నించటం అవశ్య కర్తవ్యమనే దృఢనిశ్చయం కలవారు. దైవం సర్వాంతర్యామి అయినపుడు, దైవాన్ని సంతోషపెట్టాలంటే ఒకరికి చేస్తే పరిణామంలో వందల వేలమందికి, ఒకనాడు చేస్తే ఎల్లకాలమూ, చేసినట్లు కాగల రీతిని తోద్పడి, వీలయినంత మందిని సంతోషపెట్టాలనే విజ్ఞత కలవారు. న్యాయవాదికీ

వైద్యునికీ లక్ష్యమొకటే, తన కేసు గెలవటం. అతడు అందుకు అవసరమయిన సకల చర్యలూ తీసుకొంటాడు. ఏకాగ్రతతో అందుకే శ్రమిస్తాడు. అందుకు అడ్డుకాగలవారిని దూరంగా ఉంచుతాడు, ఉపకరించగలవారిని ఉపేక్షించకుండా సమకూర్చుకుంటాడు. ఇలా వ్యక్తిగా, బాధ్యత తెలిసిన సమాజ సేవకునిగా తమ కర్తవ్యాన్ని సాంబిరెడ్డిగారు స్పష్టంగా నిర్దేశించుకొన్నారు.

## అష్టాంగ యోగం

పై పై చిహ్నాలకు కాక, మూల కారణం తొలగించటానికే మందు వాడిననాడే రోగం సమూలం పోతుంది. కనుక, వేసే మందు, రోగాన్ని తొలగించి, రోగికి పుష్టినీ తుష్టినీ కలిగించి అతనిని కలకాలమూ స్వశక్తిపై దృఢంగా నిలవగలవానిని చేసేది కావాలి. అందువల్ల, సమాజ రోగ చికిత్సకు సాంబిరెడ్డిగారు కచ్చితమయిన ప్రణాళికలు వేసుకొన్నారు. అవి సమాజ సేవా యోగంలో అష్టాంగాలు. సమాజంలో బాగుచేయవలసిన భాగాలను వారు ప్రధానముగా మూడు భాగాలుగా విభజించుకొన్నారు. అవి 1. అన్నార్తులు 2. ఎదగవలసిన పిన్నవారు 3. ఎదిగి ఉండి పిన్నలను పెంచి ఉభయ లోకాలనూ సాధించుకొనవలసినవారు.

మనుషులు చెడిపోవకుండా ఉండటానికీ బాగుపడటానికీ ముందు కావలసినది దైవబలం, తరువాత మంచి మనస్సుతో కూడిన నైతిక వర్తనం, అన్నింటా అనుస్యూతంగా ఉండవలసినది ధార్మిక నైతిక దైవిక జ్ఞాన వాహిని. ఆయుర్వేదమూ హోమియోపతీ కూడా అఖిల రోగాలకూ ఆలోచనలు మూలముగా భావిస్తున్నాయంటే, అక్కడినుంచి చికిత్స ఆరంభిస్తాయంటే, వీరి దృక్పథంలోని సామంజస్యం తెలుస్తుంది. కనుక, వీరు దైవబలం సంపాదించటానికి దేవాలయాలలో యథావిధి ధూప దీప నైవేద్య విశేషార్చనాదులు జరిగేటట్లు చూస్తుండటం ఎంత అవసరమో, ఆయా ప్రత్యేక పర్వాలలో అన్నదానం అక్కడ చేయించటమూ అంత అవసరమని గుర్తించారు కనుక, ఒక మనిషి కడుపు నిండటానికి అవసరమైన పులిహోర పొట్లమో పులుసన్నపు పొట్లమో ఒకటీ, పెరుగన్నం పొట్లం ఒకటీ ప్రతి అన్నార్థికీ అందించాలన్నది ఒకటి.

పిన్నవారి మనస్సులు భావాలనే విత్తనాలు చల్లటానికి అదనూ పదనూ అయిన పొలాల వంటివి కనుక, వారికి అవసరమయిన ఉత్తమ భావాలనందించే కృష్ణ - దాశరథి - శ్రీకాళహస్తీశ్వర - సర్వేశ్వర - నారాయణ - నరసింహ - భాస్కర - సుమతి - భర్తృహరినీతి - వేమన - గువ్వలచెన్న శతకములను వ్యాఖ్యానాలతో అందంగా ప్రచురించి, వివిధ వయస్సులు కల విద్యార్థినీ విద్యార్థులచేత కంఠస్థం చేయించాలన్నది రెండు.

మన ధర్మానికీ సంస్కృతికీ మూలకందాలనదగినవి వేదాలు. వివిధ విద్యలు చదివిన వారికి ప్రోత్సాహములు లభిస్తున్నాయి కాని, వేదాభ్యాసం చేసిన వారికి లభించవలసినంతగా లభించటం లేదు. కనుక, ప్రతి సభారంభంలో వేద స్వస్తి చెప్పించాలి. ప్రతి యింటిలో జరిగే శుభాశుభ కార్యాలలోనూ కనీసం ఇద్దరు వేద పండితుల ఆశీర్వచనమైనా లభింపజేసి, వారిని సత్కరించే ఏర్పాటుచేయాలి. ఇది మూడవది.

వేదార్థాన్ని విపులీకరించేవి పురాణాలు కనుక, వివిధ ఆలయాదులలో పురాణ ప్రవచనం చేసే పౌరాణికులను సత్కరిస్తుండాలి. ఇది నాలుగవది.

పురాణేతిహాసాలను సామాన్యుల భాషలో ఉన్నవి ఉన్నట్లుగా అందించే కృషిని ప్రోత్సహించాలి. ఇవి విత్తనాలలా భావి కాలాలకూ ఉపకరిస్తాయి. ఇది ఐదవది.

ఇంతింత గ్రంథాలు భాష సులభమయినప్పటికీ సొంతం చదవగలవారు కొంతమంది మాత్రమే ఉంటారు. చదివినా అందులో చెప్పబడిన ఇహపర సాధక విషయాలను కచ్చితంగా గ్రహించగలవారు ఇంకా తక్కువమంది ఉంటారు. కనుక, వీటిలో బహుజన ప్రీతిపాత్రములయినవి భారత భాగవత రామాయణములు కనుక, వీటిలో ప్రధాన ఘట్టాలకూ, ముఖ్యములయిన ధర్మాలకూ, నీతులకూ ససందర్భ వివరణలు ఆకర్షకంగా, సులభంగా వ్రాయించి, సూటిగా గ్రహించవలసిన విషయాలను నీటుగా ప్రజలకు అందించాలన్నది ఆరవది.

జానపద శైలిలో పాటలు పాడుతూ అతి సామాన్యులలో దైవ భక్తిని ప్రచారంచేసే వారిని ప్రోత్సహించటం ఏడవది.

భక్తి విజ్ఞాన ధర్మప్రబోధం విద్యావంతుల నడుమ మాత్రమే జరుగుతున్నది. కాని వాటిని గురించి తెలియవలసిన అవసరమున్న గూడెములలోని ప్రజలకు అవి అందటం లేదు. కనుక, అతి సామాన్యులు నివసించే ప్రాంతాలలో వాటి ప్రబోధం, ప్రసంగాల ద్వారా ప్రవచనాలద్వారా జరిపించాలన్నది ఎనిమిదవది.

## శ్రీ పావని సేవా సమితి

ఇలాంటి ఆశయాలకు సాధనంగా, సాంబిరెడ్డిగారు తాము అధ్యక్షులుగా, శ్రీ జి.సిహెచ్. రామారావుగారు కార్యదర్శిగా, శ్రీ ఎస్సార్కే రాజుగారు ప్రభృతులు సభ్యులుగా శ్రీ పావని సేవా సమితిని స్థాపించారు. వీటిలో కొన్ని అంశాలు కొన్నేండ్ల నుంచి అమలులోనికి వచ్చాయి. అయితే, ప్రచారార్భాటం కంటే పని జరగటమే ప్రధానంగా వారు భావిస్తారు కనుక, ఈ కృషి అంతర్వాహినిలా జరుగుతున్నది. రెండవ అంశం క్రింద కృష్ణ - సర్వేశ్వర - దాశరథి శతకాలు ప్రకటించారు. సుమతి - వేమన - భర్తృహరి నీతి శతకాలు వెంటనే ప్రచురించే ఏర్పాటులు జరుగుతున్నాయి. 1999 - 2000 విద్యా సంవత్సరంలోనే వీటిని పాఠశాలలలో పఠింప జేయటం ప్రారంభించటానికి ప్రణాళిక సిద్ధమవుతున్నది. ఆరవ అంశంలో భాగంగా భాగవతంలోని ప్రసిద్ధ ఘట్టం గజేంద్రమోక్షానికి వివరణం వ్రాయించి ఇలా ప్రకటిస్తున్నారు.

## భాగవత ప్రశస్తి

ఈ గజేంద్రమోక్షణం విశేషం తెలుసుకొనేముందు, దీనికి ఆలవాలమైన భాగవతం గురించి కొన్ని విషయాలు గ్రహించటం అవసరం. దీనిని తెనిగించిన పోతన గారు భాగవతం తాను జగద్ధితంగా చెప్పానన్నారు. 1.11 కనుక ఇది జగద్ధిత సాధనం. తన పూర్వజన్మ సహస్ర సంచితఫలం వల్ల, తాను శ్రీమన్నారాయణ కథా ప్రపంచవిరచనా కుతూహలుడుగా ఉన్నప్పుడు 1.12, రామభద్రుడు కనిపించి, తనకు అంకితముగా దానిని తెనుగు చేయమని చెప్పాడనీ, దానివల్ల అతనికి భవబంధములు తెగుతాయి అని కూడా చెప్పాడనీ అన్నారు. కనుక ఇది దైవ ప్రేరితం. భాగవతము తెలిసి పలుకుట చిత్రంబు శూలికైన తమ్మి చూలికైన అన్నారు. 1.17 దీనిని తెనిగించినందువల్ల తనకు పునర్జన్మ ఉండదనీ, అలా తన జన్మ సఫలమవుతుందనీ

చెప్పారు. 1.19 భాగవతం కల్పతరువు 1.20, అందులోనూ పారిజాతం. 1.21 భాగవతం శ్రీమంతం. మునిశ్రేష్ఠుడు వ్యాసుడు చెప్పినది. దీనిని సద్భావంతో వినగోరే వారి నిర్మల చిత్తాలలో ఈశుడు వేగంగా చిక్కుకొంటాడట. ఇతర సూత్రాలవల్ల చిక్కడట. కనుక మంచివారు, మాత్సర్య రహితులు, నిష్కపటులు అయిన వారు, కాంక్షారహితులై భాగవతం మీద ఆసక్తితో ఉండటం ఉత్తమ బుద్ధి. ఇది ఇహపర సాధకం. ఇంతకీ భాగవతంవల్ల తెలిసే వస్తువు ఆధ్యాత్మిక - ఆధి దైవిక - ఆధి భౌతిక తాపత్రయాన్ని అణచివేస్తుంది. అది పరమార్థం. అఖిలసుఖాలనూ ఇస్తుంది. అదే సమస్తమూ ఔను, కాదు కూడాను. 1.34

## భాగవతం ఎలా పుట్టింది?

ఇట్టి భాగవతం ఎలా పుట్టిందంటే, శౌనకాది మహామునులు నైమి శారణ్యంలో, శ్రీ విష్ణుక్షేత్రంలో, హరిని చేరుకోవాలని వెయ్యి సంవత్సరాలు చేయవలసిన సత్రయాగం ప్రారంభించారు. దానికి వచ్చిన సూతుని, వారు, జీవులకు సుస్థిరమైన శుభాన్ని ఏది ఇస్తుందో అది చెప్పమన్నారు. నీవు చెప్పేది సర్వసౌఖ్యాలూ ఇవ్వాలి. దానివల్ల ఆత్మశాంతి కలగాలి 1.37, 40, 47 మాకు కృష్ణుని కథలు వినాలని ఉన్నది. 1.48 మాకు విష్ణు ప్రభావం తెలుపు 1.49. శ్రీ కృష్ణుడు బలరామునితో చేసిన అతి మానుష పరాక్రమాల గురించి చెప్పు 1.49 అని అడిగారు. దానికి సూతుడు - కార్యకారణాల గురించి ప్రవర్తించేది ఆత్మతత్త్వం. దానిని అధ్యాత్మం అంటారు. దానిని ప్రకాశింప జేసేదీపం, సకలవేద సారాంశం, ఏకైకం, అసాధారణ ప్రభావ సహితం, పురాణ మర్మం భాగవతం. 1.54 శరీర బంధాన్ని త్రెంచి వేస్తుంది ఆ ఉదార గ్రంథం 1.55. వాసుదేవునిపై నెరపిన భక్తి యోగం వైరాగ్య విజ్ఞానాలను పుట్టిస్తుంది. ఏది తత్త్వమంటే పలుమత భేదాలున్నాయి. జ్ఞానమనే పేర అద్వయమైనదే తత్త్వమంటారు తత్త్వవిదులు. ఆ తత్త్వం భగవంతుడంటారు సాత్వతులు. ఆ భగవంతుడు కృష్ణుడు. తన కథలు వినే వారి హృదయంలో కృష్ణుడుండి శుభములు ఆచరిస్తాడు, అశుభములు తొలగిస్తాడు. ముముక్షువులు దేవతాంతర నింద చేయక శాంతులై నారాయణ కథలే వింటుంటారు 1.59 అని చెప్పి, భగవంతుని ఇరవై ఒక్క అవతారాలు చెప్పాడు. భాగవతరచన వృత్తాంతం కొనసాగిస్తూ సూతుడు చెపుతున్నాడు: వ్యాసమహర్షి సరస్వతీనదిలో స్నానం చేసి బదరికాశ్రమంలో కూర్చుని కాలగతిని పరిశీలించాడు. తన జీవిత కృషినీ సమీక్షించుకొన్నాడు. ప్రాణిహితం విషయమై ఆయనకు సంతోషం కలుగలేదు. ఈశుడూ నా పనికి సంతోషించినట్లు లేదు, అన్నీ చేశాను కాని, భాగవతం చెప్పలేదు అని విచారిస్తుంటే, నారదుడు వచ్చాడు. ఎందుకు విచారంగా ఉన్నావన్నాడు. విచారం నిజమే, కారణం నీవు చెప్పాలన్నాడు వ్యాసుడు. ధర్మాలు చెప్పావు కాని, విష్ణుకథలు సమగ్రంగా చెప్పావు కాదు, ఇదే కారణం కనుక, వాసుదేవుని లీలా విశేషాలు భక్తితో వర్ణించమన్నాడు నారదుడు. తన పూర్వజన్మ వృత్తాంతం చెప్పి, స్వామి లీలలు చెప్పమని మళ్ళీ అన్నాడు. తన ఆలోచనకు నారదుడు అన్నది సరిపోయినందున, భాగవతం వ్యాసుడు చెప్పి, తనకుమారుడైన శుకునిచేత చదివించాడు. పరీక్షిత్తు జన్మించాడు. శ్రీకృష్ణుడు

తన అవతారం చాలించాడు. పరీక్షిత్తు రాజ్యాభిషిక్తుడైనాడు. ధరణీధర్మదేవతల నుద్ధరించాడు. వేటకు వెళ్ళాడు. ఆయనకు ఏడవనాడు తక్షకుని కాటువల్ల మరణిస్తాడని శాపం వచ్చింది. గంగా తీరంలో ప్రాయోపవేశమున్నాడు. మహర్షులందరూ చూడవస్తున్నారు. శుకుడు వచ్చాడు. ఏడు దినాలలో తనకు ముక్తి ఎలా వస్తుంది అని, అందరినీ అడిగినట్లే, రాజు ఆయననూ అడిగాడు. గోవింద నామ కీర్తనం వల్ల ముక్తి వస్తుంది. రెండు గడియలలోనే ఖట్వాంగునికి వచ్చింది, నీకు ఏడు రోజులెక్కువ. నీవే కాదు, ఎవరైనా, అంత్యకాలం దగ్గరకు వచ్చినవారు మనస్సులో భగవంతుని ధారణచేసి, ధ్యానిస్తే ముక్తులవుతారు అని చెప్పి, శ్రీహరివిరాడ్విగ్రహాన్ని వర్ణించి, హరిమయము విశ్వమంతయు హరివిశ్వమయియుండు - హరిమయముగాని ద్రవ్యము పరమాణువు లేదు అని చెప్పి, విశ్వరూప భావనతో ప్రారంభించమని సూచించాడు. భక్తియోగంతో పరమ పదం చేరుకొనే క్రమమూ వివరించాడు. పరీక్షిత్తు, ఒకడైన విష్ణువు అనేకమైన క్రమం చెప్పమన్నాడు. ఇదే నారదుడు అడిగితే బ్రహ్మ చెప్పాడని అది వివరించాడు శుకుడు. శ్రీమన్నారాయణుని అవతారాలు బ్రహ్మ చెప్పాడు, సర్వేశ్వరుడు బ్రహ్మకల్పంలో బ్రహ్మకుపదేశించిన, వేదతుల్యమైన భాగవతపురాణం వినిపిస్తానని, శుకుడు పరీక్షిత్తుకు చెప్పాడు. చతుఃశ్లోకరూపంలో దశలక్షణాలతో ఆ పురాణం ఉన్నదని చెప్పాడు. తరువాత విదురమైత్రేయ సంవాదం చెప్పమని శౌనకుడడిగితే, సూతుడు చెప్పాడు : అనంతరం విదురుడు ఉద్ధవుని కలుసుకొని, అతనివల్ల కృష్ణావతార సమాప్తి మొదలయినవి తెలుసుకొన్నాడు. ఆ వెనుక శుకుడు ప్రియవ్రతోపాఖ్యానం మొదలయినవి చెప్పాడు. భూద్వీపాది వర్ణనం చేశాడు. అభిప్రాయం ఏదైనా, ఉద్దేశించినది ఎవరినయినా, భగవన్నామోచ్చారణం తరింపచేస్తుందనటానికి అజామిళోపాఖ్యానాదులు చెప్పాడు. ఏ భావంతోనైనా హరిస్మరణ చేస్తేచాలు ముక్తి వస్తుందనటానికి ప్రహ్లాదవృత్తాంతం చెప్పాడు. తరువాత, శివుని గౌరవం నిలపటానికి హరి చేయించిన త్రిపురాసుర సంహార వృత్తాంతమూ, వర్ణాశ్రమధర్మాలూ చెప్పాడు. ఏయే మన్వంతరాలలో, హరి ఏయే అవతారాలెత్తి, ఏమేమి చేశాడన్న పరీక్షిత్తు ప్రశ్నకు సమాధానంగా, మన్వంతర వృత్తాంతాలు చెపుతూ, నాలుగవ మనువు తామసుడనీ, అతని పాలన కాలంలో హరిమేధునికీ హరిణికీ హరి సంభవించి, గజరాజుని విడిపించాడనీ చెపుతూ, వివరాలు చెప్పమంటే, సవివరంగా గజేంద్రమోక్షణ కథ చెప్పాడు శుకమహర్షి.

## గజేంద్రమోక్షణం

ఈ గజేంద్ర మోక్షణ వృత్తాంతం సంస్కృత భాగవతంలో, నాలుగధ్యాయాలలో, తొంభై ఆరు చిన్నా పెద్దా శ్లోకాలలో ఉన్నదానిని, పోతనగారు అనేక విషయాలు పెంచి, నూట ఇరవై చిన్నా పెద్దా పద్యగద్యాలలో హృద్యంగా అనువదించారు. ఏవైనా కష్టాలలో ఉన్నవారు వాటి నుంచి విముక్తులు కావటానికి, భాగవతంలోని గజేంద్ర మోక్షణ ఘట్టం పారాయణం చేసుకోవాలని సంప్రదాయవేత్తలు చెపుతుంటారు. అది సంస్కృతభాగవతంలోని దయితే మేలు. తెలుగు భాగవతంలోనిదయినా మంచిదే.

## వ్యాఖ్య స్వరూప స్వభావాలు

ఇట్టి గజేంద్రమోక్షానికి గోపీనయనోత్పలార్చిత వ్యాఖ్య చేర్చి శ్రీ పావని సేవాసమితి ప్రచురిస్తున్నది. ఈ వ్యాఖ్యలో పోతన గారి వాక్కులలోని కఠిన పదాలకు అర్థాలూ, పద్యాలకూ మూలశ్లోకాలకూ తాత్పర్యాలూ ఉన్నాయి. ఉన్నచోట్ల వ్యాకరణ - అలంకార - వేదాంతాది శాస్త్ర విషయాల వివరణమూ ఉన్నది. దేనిని బట్టి గ్రహించవలసినది ఏమిటి? అన్న వివరణం సూటిగా, సంగ్రహంగా, అవసరమైనచోట్ల అవసరమైనంత విపులముగా ఉండాలి అనిన సాంబిరెడ్డిగారి సంకల్పానికి అనుగుణంగా, విశేషాంశం ఉన్న ప్రతిభావమూ చక్కగా వివరింపబడింది. అందువల్లనే ఈ గ్రంథం రాయల్ సైజులో 217 పేజీలయింది.

## అతి కారావి అంతరార్థాలు

ఇది అవతరణిక ఉత్తరణిక మహోద్ధరణిక అని మూడుభాగాలుగా విభజింపబడింది. ఈ మూడు విభాగాల ఆద్యక్షరాలు 'అఉమ' అనునవి ఒక చోట చేర్చి చదివితే ఓమ్ అయి, ఈ వ్యాఖ్య ప్రణవ వివరణ ప్రవణమని వ్యాఖ్యాత చేసిన గూఢ చమత్కారం అవగతమవుతుంది. అవతరణికలో అభిమన్యువీరవిహారంనుంచి పరీక్షిత్తుకు శుకయోగి భాగవతం చెప్పటం మొదలు పెట్టడం వరకూ కల కథాసూత్రం ఉన్నది. దీనివల్ల భాగవత సందర్భం అవగతమవుతుంది. తరువాత సత్కథల ప్రశంస ఉన్నది. సత్కథల మూలంగా సదాచారహీనుడు సదాచార పరుడవుతాడు, పతనోన్ముఖుడు ఉత్థానోన్ముఖుడవుతాడు. మనుష్యులకు ఉత్తమచరితను అలవరచి, లోకంలో వారిని మహా పురుషులను కావించినవి సత్కథలే అన్నది యథార్థం. అనంతరం, అష్టమ స్కంధంలోని నాలుగు (గజేంద్ర - బలి- బలిసుతల ప్రవేశ - మత్స్యావతార) కథల ప్రయోజనం వివరిస్తూ, ఆపత్సమయంలో శ్రీహరి సంస్మరణకు ఉదాహృతమైనది గజేంద్ర మోక్షణ కథ అన్న వివరణం ఉన్నది. గజేంద్ర మోక్షణ ప్రశస్తిని వివరిస్తూ, పూజాకాలంలో గజేంద్రుడు చేసిన స్తోత్రం చదవటం హరికి ప్రీతి కలిగిస్తుందని స్కందపురాణ కథనం ఉదాహరింపబడింది. ఆపైన - ఇంద్రియాలకు కామభోగం కాకుండా, భక్తిరసాస్వాదన కలిగితే, ఆ జీవికి శాంతి కలుగుతుందన్నది గజేంద్రకథకు సారాంశంగా చెపుతూ, పురాణ కథలకు అన్నింటికి అర్థాలు కల్పించుకొంటూపోతే, చివరికన్నీ పుక్కిటి పురాణాలయ్యే ప్రమాదముంది అనటం, అంతరార్థ వివరణ ప్రవణులు గమనించవలసిన అంశం. పురాణేతిహాస కథలలోని కొన్ని అంశాలు నేటి కొలబద్దలకు అతీతంగా ఉన్నందున, వాటికన్నింటికీ అసలర్థం వేరని వివరించే ధోరణి, ఆ భావ ప్రకటనకు అవి కల్పించిన కథలనే అభిప్రాయం కలిగించే అవకాశం ఉన్నదని బహుకాలముగా విజ్ఞులు చెపుతున్నదే.

## సూటిగా సారాంశ వాక్య సూక్తులు

ఉత్తరణికలోనూ, అలవైకుంఠపురంబులో మంచి ఉన్న మహోద్ధరణికలోనూ అనేక ముఖ్యాంశాలు చక్కగా వివరించబడినాయి. ఆయా వివరణ సమయాలలో, సూక్తులలా

గమనించదగిన సారాంశవాక్యాలు, వ్యాఖ్య ప్రయోజనాన్ని సులభం చేస్తున్నాయి. వీటిని కొన్నింటిని ఉదాహరిస్తాను:

1. ఏకాంతంలో భక్తుడూ భగవంతుడూ పరస్పరం కలిసిపోతారు.
2. భక్తి స్త్రీ వంటిది, జ్ఞానం పురుషునివంటిది; పురుషుడు సులభంగా మాయానారివలలో పడిపోతాడు. స్త్రీ అందరినీ ఆదరించినా భర్తను మాత్రమే భజిస్తుంది.
3. అహంకారి అయిన సాధకుణ్ణి భగవత్సాధకుడు అనటానికి వీలులేదు. అతడు మహాపరాధి.
4. ముక్తాత్ములనగా రాగాదులు వదలివేసినవారని అర్థం.
5. శ్రీకృష్ణుడు ముక్తినిస్తాడు కాని భక్తి నివ్వడు.
6. విముక్తమానులు అయిన జ్ఞానులకు పతనం నిస్సందేహం.
7. భక్తిసేవితభగవత్ప్రసాదమే ముక్తిలాభం
8. జీవించి ఉండగా ముక్తి కలగడం అసంభవం.
9. జీవన్ముక్తి అనడానికి బదులు విదేహముక్తి అనడం సమంజసం.
10. శంకరాచార్యులు శ్రీ కృష్ణ భక్తులు.
11. శ్రీధరస్వామి అద్వైత వేదాంతి అయినప్పటికీ శుష్క జ్ఞాన మార్గావలంబి కాడు, భక్తిమార్గావలంబియే.
12. ముక్త్యాది సర్వసిద్ధులు దాసీజనం భక్తి దేవికని నారద పాంచరాత్రం.
13. ముక్తివాంఛ పిశాచవాంఛ.
14. భక్తులకు భగవంతుడు క్రీడామృగంలా వశుడవుతాడు.
15. ఏదో ఒక గుణం మీద ఆధారపడ్డ ప్రేమ ఆ గుణం ఏ కారణంవల్లనైనా లోపించితే క్షీణించి పోతుంది.
16. యథార్థమైన ప్రేమగలవారికి తమ ప్రేమాస్పదుల గుణదోషాలను వెదికే అవకాశం ఉండదు.
17. జీవుడు అణువు, ఈశ్వరుని అంశం.
18. శివుడు యోగీశ్వరుడు, విష్ణువు (కృష్ణుడు) యోగేశ్వరుడు.

ఇవి కొన్ని మాత్రమే. ఇలాంటి వాక్యాలే వ్యాఖ్యనిండా ఉన్నాయి.

## వివిధాభిప్రాయ ప్రతిపాదన

భేదాభిప్రాయాలకు అవకాశమున్న పలు విషయాలను ఈ వ్యాఖ్య ఉటంకిస్తూ వాటిని వివరిస్తున్నది. **ఆలాంటి వాటిలో కొన్ని :**

**1. ముక్తి అంటే ఏమిటి?**

1. ముక్తి శబ్దానికి వ్యుత్పత్తిలభ్యమైన సాధారణమైన అర్థం సకల విధ దుఃఖాలనుంచి, బంధాలనుంచి వాసనల నుంచి విముక్తి పొందటం.
2. ఔపనిషదికులు అమృతత్వప్రాప్తి అంటారు.
3. సాంఖ్యయోగులు కైవల్యమంటారు.

4. బౌద్ధులు నిర్వాణమంటారు.
5. ఇతరదార్శనికులు ముక్తి, మోక్షం, అపవర్గం అని పేర్కొంటుంటారు.
6. జైనులు కర్మక్షయమే మోక్ష మంటారు.
7. అద్వైత వేదాంతంలో ముక్తి భుక్తి విషయాలలో మాత్రమే ప్రధానమైన భేదాలున్నాయి.
   అ) బ్రహ్మంతోపాటు జీవాత్మ నిర్భేదస్థితిలో అగ్రగామి అవుతుందంటారు అద్వైతులు. మోక్షంలో జీవబ్రహ్మైక్యం తప్ప అపూర్వవస్తుప్రాప్తి ఏమీ ఉండదని అద్వైత వేదాంతం చెపుతుంది.
   ఆ) అద్వైతియే అయిన చిత్సుఖాచార్యులు ముక్తావస్థలో ఆనందం ఉంటుందని వ్యాఖ్యానించారు.
8. వైశేషిక సూత్రాలలో ముక్తిని గురించి చెపుతూ "జ్ఞాన సుఖాది శూన్యమైన శిలారూపమోక్షప్రాప్తి జీవిత చరమోద్దేశ్యము" అని ఉంది.
9. భక్తి సేవిత భగవత్ప్రసాదమే జీవునికి ముక్తి లాభమని శ్రీమద్రామానుజులు. ముక్తావస్థలో జీవుడు బ్రహ్మానందాన్ని అనుభవిస్తుంటాడు.

**2. శేష శేషిత్వ భావన.**

పరమాత్మ శేముడు, చిదాత్మ కూడా శేమడే. పరమాత్మను శేషి అనటం ప్రసిద్ధం.

**3. ఆత్మ అంటే ఏమిటి?**

**4. గజభక్తి సకామమా నిష్కామమా?**

**5. శివుడు యోగీశ్వరుడు విష్ణువు (కృష్ణుడు) యోగేశ్వరుడు వంటివి మరికొన్ని.**

భక్తియోగం వంటివాటిని వివరించేటప్పుడు వ్యాఖ్యాత, ప్రాచీన మతాలనూ వైదిక భక్తులనూ గూర్చి మాత్రమేకాక, తాజ్, రసఖాన్, అలీఖాన్, ఖాదిర్ బుక్స్ మొదలయిన భక్తులనూ, ఘోజా పంథ్‌నూ గురించీ ప్రస్తావిస్తారు.

## సాంప్రదాయిక విశేషాలు

ఈ వ్యాఖ్యానంవల్ల అనేకమైన సాంప్రదాయిక విశేషాలు తెలుస్తాయి. మచ్చుకి: శ్రీవిష్ణ్వాలయాలలో భగవంతునికి వందనం సమర్పించే విధానమున్నది. ఏకహస్తంతో నమస్కరించకూడదు. ఒక చేతితో నమస్కరించినా, ఒకేసారి ప్రదక్షిణం చేసినా, అకాలంలో దర్శించినా, పూర్వం చేసుకొన్న పుణ్యమంతా నశిస్తుంది. దేహమంతా వస్త్రం కప్పుకొని నమస్కారం చేయగూడదు. భగవంతునికి ఎదురుగా నిలిచి నమస్కరించకూడదు. పృష్ఠ-వామ-భాగాలలో నిలిచి నమస్కరించ కూడదు. గర్భమందిరంలోనికి ప్రవేశించి నమస్కరిస్తే అపరాధమవుతుంది. భగవంతునికి దక్షిణభాగాన నిలిచి ప్రణామంచేస్తే సర్వాభీష్టాలూ సిద్ధిస్తాయి. సాష్టాంగ నమస్కారం సర్వశ్రేష్ఠం. శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి గారికెవరైనా ఒంటి చేతి నమస్కారం చేస్తే దగ్గరికి రమ్మని పిలిచి, నేను నిన్ను నమస్కరించమని అడగలేదు, చేయదలచినవాడవు రెండుచేతులతో ఇలా చెయ్యి, లేదా నీ దారిని నీవు వెళ్ళు అని, ఎలా చెయ్యాలో చేసి మరీ చూపించేవారు. మన పద్ధతి అనుసరించాలనుకొనేవారూ, అనుసరింప జేయాలనుకొనేవారూ తగ్గి పోతున్నారు.

## వ్యాఖ్య బహువిషయభరితం

ఈ వ్యాఖ్యానం నైతిక ధార్మిక ఆధ్యాత్మిక విషయ ప్రధానంగా సాగినదీ సాగవలసినదీ ఐనా, చదువరుల మీది జాలితో వ్యాఖ్యాత తదితర విషయాలను గూడా ప్రసక్తానుప్రసక్తంగా వివరింపక మానరు. మన ప్రాచీన వ్యాఖ్యాతల మార్గమే ఇది. వారు బహుశాస్త్ర పారంగతులయినందున, ఆయా సందర్భాలలో ఆయా శాస్త్రాలలోని విషయాలను వివరించినందున, ఏ ఒక్క గ్రంథానికి ఏ ఒక్క వ్యాఖ్యాత వ్రాసిన వ్యాఖ్య సమగ్రంగా చదివినా, చదువరి సకల శాస్త్ర రహస్యవేత్త అవుతాడు. ఈ వ్యాఖ్యానంలో అలాగే ప్రధాన ప్రాసంగిక విషయాలు పెనవేసుకొని ఉన్నాయి. ఉదాహరణకి :

1. కవుల వర్ణనలలో అతిశయోక్త్యలంకారం గర్భితమై ఉంటుంది. సమస్తాలంకారాలకు బీజమైనది అతిశయోక్తి.
2. శ్రీమద్భాగవతం సర్వ పురాణశిరోమణి మాత్రమే కాదు, అదియొక కావ్యమని కూడా హేమాద్రి తన ముక్తాఫలవ్యాఖ్యలో పేర్కొన్నాడు.
3. ఇతర మృగాలలా కాక, ఏనుగులుంటే మదజలధారలతో పంకిలమైన వింధ్యాద్రిమహావిపినంలో ఉండాలి, మహారాజుల ఇండ్లలో ఉండాలి అనే భావం గల శ్లోకం ఉదాహరించబడింది.
4. ఆనంద వర్ధనుడు ధ్వన్యాలోకంలో ఇతివృత్తంలో రసానికి అనుగుణంగా లేని స్థితి కనిపిస్తే దానిని భగ్న పరచియైనా స్వతంత్రంగానూ, రసానుగుణంగానూ మరొక కథను కల్పించాలి, అందులో దోషం ఉండదు అన్నాడు. ఇది సిద్ధరసమైన ఇతిహాసం, కథలోనే రసానుగుణమైన వర్ణనలకు అవకాశమున్నది.
5. వ్యాలముఖా: = పాము వంటి ముఖంగల జంతువులు. సర్పాకారముఖా: అని శ్రీ వంశీధర వ్యాఖ్య. డైనోసర్‌లు కావచ్చును.
6. ఆషాఢమేఘం వప్రక్రీడ యందు పరిణతమైన ఏనుగులాగా ఉన్నదని కవికులగురువు కాళిదాసు మేఘదూతంలో వర్ణించాడు.
7. చిన్నమడుగులలోని నీటికి ఏనుగులు ఆశపడవు, గభీర సరస్సులలోనే స్నానం చేస్తాయి.
8. సంస్కృత నైషధీయకర్త కుంభస్థలాలను వక్షోజాలతో పోల్చటంలో చక్కని వైచిత్రిని ప్రదర్శించాడు.
9. మరొకకవి, ఆ సుందరి ఊరు యుగళం తమ తొండపు సొగసుల సర్వస్వం అపహరించడం చేత, మతంగజాలు మాతంగత్వం పొంది, అస్పృశ్యతాదోషంతో అడవులబట్టి పోయాయని ఉత్ప్రేక్షించాడు.
10. ముత్యాల మిలమిలవంటిదే, అంగనల ఆయావిడివిడి అవయవాల అందానికంటే వేరైన లావణ్యం వంటిదే శబ్దార్థాతిరిక్తమై మహాకవుల వాక్కులలో ప్రతీయ మానమై ఉండే వస్తువు
11. గజేంద్రునివర్ణనలో మానవీకరణముండటం విశేషం.
12. ఈ గజరాజువర్ణనలో పేర్కొన్న నీలాద్రి నల్లగొండయేయని భావించవచ్చు. పోతనగారచ్చట కొంతకాలము నివసించారనే ఐతిహ్యమున్నది.

13. కవికి కామశాస్త్ర పరిజ్ఞానం ఉండటం తప్పు కాదు. ఉండక పోవటమే తప్పవుతుంది.
14. శృంగార రసంవల్ల వినయోపదేశాలను పాఠకులు సుఖంగా సంతోషపూర్వకంగా గ్రహిస్తారని ఆనందవర్ధనులన్నారు.
15. గజేంద్రుడు జన్మజన్మాంతరాభ్యాసంవల్ల గరుడధ్వజునిపై భక్తి కలవాడని వామన పురాణం చెపుతున్నది.
16. అవ్యథమై యిట్లను పూర్వపుణ్యఫల దివ్యజ్ఞాన సంపత్తితోన్ అన్నపుడు సవ్యథమై అన్న పాఠం తప్పు.
17. స్మృతి అనగా పూర్వము అనుభవించినదానికి చెందిన అనుభవ సంస్కారం వల్ల పుట్టిన జ్ఞానము. అదే పూర్వపుణ్యఫల దివ్యజ్ఞాన సంపత్తి.
18. పరమాత్మ సూక్ష్మాతిసూక్ష్మ పదార్థాలలో కూడా ప్రవేశించి ఉండదగినంత సూక్ష్మంగా ఉంటాడనీ, ఆయన ప్రవేశాన్ని నిరోధింపగల పదార్థమేదీ లేదనీ, ఆయన అన్నింటిలోనూ అంతర్యామిగా ఉంటాడనీ మనుస్మృతి చెపుతున్నది.
19. ఉపనిషద్వికసిత రూపమే పురాణం. ఉపనిషత్తులు తేజోమయ సుందర బ్రహ్మజ్ఞాన మహీరుహాలు, భాగవతాది పురాణాలు శ్యామశాఖా ప్రతాన పల్లవితపుష్పిత ఫలిత ప్రేమభక్తి కల్పతరువులు.
20. గజేంద్రస్తవం ఎంతో మహిమగలది. యశోదాయకము. కలియుగ సమస్త పాపనాశకము. దుఃఖ ప్రణాశకము, శ్రేయ స్సాధకము, దుస్స్వప్న వినాశకము అనే ప్రశస్తి పొందిన స్తోత్రరత్నమిది. దీనిని ఆర్తభావంతో పఠించేవారు లౌకిక పారమార్థిక సంకటాలనుంచి విఘ్నాలనుంచి విముక్తులవుతారు. వారి అజ్ఞాన బంధం తొలగి పోతుంది. ఈ పవిత్ర స్తోత్రాన్ని బ్రాహ్మముహూర్తంలో మేల్కొని పఠించేవానికి, అవసాన సమయంలో నిర్మలబుద్ధిని ప్రసాదించడమే కాక, భగవంతుడతనిని జనన మరణ చక్రం నుంచి విముక్తుణ్ని చేసి, తన సన్నిధానానికి చేర్చుకుంటాడని ఫలశ్రుతి.
21. ఓమ్ నమో భగవతే తస్మై అన్న శ్లోకానికి వ్రాసిన వ్యాఖ్యలో ఈ స్తోత్రం మంత్రతుల్యమన్నమాట అమూల్యం.
22. గజేంద్రుడు ముక్తికోసం ప్రపత్తి మార్గాన్ని అనుసరించాడు, ప్రాణరక్షణార్థం కాదు.
23. నటుడు నాటకంలో ఎవరికీ తుదకు దర్శకునికి కూడా తన నిజరూపాన్ని చూపడు. అయితే స్నేహితులకు దగ్గరివాళ్ళకు తన స్వరూపాన్ని చూపుతాడు. అర్జునుడికీ గజేంద్రుడికీ భగవంతుడు తన స్వరూపాన్ని చూపాడు.
24. జీవబ్రహ్మములు ఐక్య మవుతారన్నది దౌరాత్మ్యబుద్ధి అని వ్యాఖ్యానించాడు శ్రీవిశ్వనాథ చక్రవర్తి.
25. జ్ఞానానంద కళ్యాణ గుణ సముదాయమే పరబ్రహ్మస్వరూపం.
26. సకల వేదసారమైన శ్రీమద్భాగవతంలో రహస్యార్థంలేకుండా ఒక్క శబ్దమూ లేదు.
27. శ్రీ శంకర భగవత్పాదులు విగత విషయతృష్ణులై వారణాసివద్ద గంగ ఒడ్డున నిలిచి ఆరాధించినది శ్రీకృష్ణుణ్నే. ఆ మహాత్ముడు నిలువు బొట్టు పెట్టక పోవుగాక, ఆయన నిరంతరం ధ్యానించినది శ్రీకృష్ణ రూపమునే.

28. భక్తుని దృష్టి దేనిమీద పడినప్పటికి అది శ్యామసుందరుడైన శ్రీ కృష్ణునిరూపంగా భావించి అతడు ప్రణమిల్లుతాడు. అఖిల రూపాలు తన రూపమైన వాడనడంలో, ఈ జగత్తు మిథ్యకాదనీ, జగత్తు మిథ్య అనే సిద్ధాంతం భగవంతుడు సర్వాత్ముడనే సత్యాన్ని దృఢపరచడానికి ఉద్దేశించిందనీ గ్రహించాలి. శ్రీ శంకరభగవత్పాదులు జగత్తు మిథ్య అని ప్రతిపాదించడంలో అనేకంలో ఏకత్వ దర్శనంగా భావించాలి. శ్రీ శంకర భగవత్పాదులు కేవలం వేదాంతి మాత్రమే కాదు. ఆయన మహాభక్తుడు, పరమయోగి, ఈ జగత్తులో ఆయనకు శ్యామసుందరుడైన శ్రీ కృష్ణ భగవానుడొక్కడే కనిపిస్తాడు. జగత్తంతా మిథ్యగా తోస్తుంది. అది జ్ఞానిదృష్టి. భక్తునిదృష్టికి ఈ జగమంతా కృష్ణమయంగా తోస్తుంది. ఏకత్వంలో అనేకత్వదృష్టి భక్తునిది. బ్రహ్మమునందు జగత్తునందు తాదాత్మ్యంతో కూడిన అబాధితమైన అనుభూతియే అనేకత్వానుభవం లేదా ఏకత్వానుదర్శనం అవుతుంది.
29. భక్తిసంప్రదాయం వస్తుతః ప్రవృత్తిమార్గంగా కనిపించినప్పటికి అది నివృత్తిమార్గాన్ని లక్ష్యంగా చేసుకొని సాగుతుంది.
30. శ్రీకృష్ణుడు ద్వారకలో పతిభావంతోను, బృందావనంలో ఉపపతి (ప్రియ) భావంతోను క్రీడిస్తాడనడంలో గల పరమార్థాన్ని, రహస్యాన్ని, జాగ్రత్తగా గ్రహించినప్పుడే, ప్రేమభక్తితత్త్వం బోధపడుతుంది.
31. బృందావనంలోని రాధాది గోపికలు శ్రీకృష్ణునికి పరమ స్వీయలని మొదట గుర్తుంచుకోవాలి. రాధాది గోపికలకు తాను భర్తననీ, వారిని తాను పరిగ్రహించాననీ స్పష్టంగా చెప్పాడు శ్రీకృష్ణుడు. గోపికలు శ్రీకృష్ణునికి పరమ స్వీయలే అయినా పరకీయలుగా నటించారు. పరకీయాభావంలోనే మధుర రసానికి పరమోత్కృష్టవికాసం ప్రాప్తిస్తుంది. (ఈ సందర్భంలో చేసిన స్వీయాపరకీయా స్వభావతారతమ్య చర్చ అక్కడే చదవటం మంచిది.)
32. గజేంద్రుని ప్రార్థనాక్రమంవల్ల, అతనిది సకామోపాసనయే (గ్రాహవిముక్తి) అయినా, భక్తి మహిమ చేత అది సకామంగానే నిలువక, నిష్కామంగా పరిణతి చెందుతుంది. ఇందుకు ఉదాహృతులయిన ధ్రువ కుంతీ గోపికాదులు ధన్యులు.
33. వైకుంఠ గద్యలో తాము వైకుంఠధామాన్ని వర్ణించిన విధంగానే, శ్రీరంగనాథదేవాలయాన్ని సప్త ప్రాకారాలతో భూలోక వైకుంఠధామంగా నిర్మింపజేశారు.
34. ఒక జంతువును రక్షించడంలో భగవంతుడు ఎంత వేగిరపడ్డాడో తెలపడానికి గజేంద్ర మోక్షణ కథానకమే నిదర్శనము.
35. 'సిరికింజెప్పడు' 'అలవైకుంఠపురంబులో' వంటి పద్యాలకు భాగవతంమూలంకాదు. శార్ఙ్గ ధరపద్ధతిలో, హరిభక్తి రసాయనంలో, ఇంకా ప్రాచీన కవుల కవితలలో భాగవత ఘట్టవర్ణనలు (భాగవతంలో లేనివి) ఉన్నాయి.
36. చక్రాయుధుడు ఛందోమయుడైన గరుడుని అధిరోహించి వచ్చాడని చెప్పిన మాటలకు, సుదర్శన చక్రం చేబూని వచ్చాడని భావింపరాదు, వేద పఠనం ఎంత వేగిరంగా జరుగుతుందో అంతవేగంగా గజేంద్రునివద్దకు వచ్చాడని అర్థం.

37. పంచాయుధాలు విష్ణుదేవునికి స్వరూపభూతములైనవే కాని ప్రత్యేక వస్తు మాత్రములు కావు. (వీటి వివరణం విష్ణు పురాణంలో మనోజ్ఞంగా ఉన్నది.)
38. భగవానునికి సూర్యభగవానునికి శిరసు వంచి, చేతులు పైకెత్తి నమస్కరించాలని భరతుని నాట్యశాస్త్రం కూడా చెపుతున్నది. గజేంద్రుడు పశువు కాబట్టి, తన కరమును (తొండమును) పైకెత్తి, నమస్కారంతోపాటుగా భగవంతునికి పుష్పం సమర్పించాడు. నాకు సమర్పించడమే పరమ ప్రయోజనముగా భావించునటువంటి పరిశుద్ధ మనస్కుడు భక్తితో సమర్పించే పత్రము పుష్పము ఫలము తోయమునైనను నేను పరమప్రీతితో ఆరగిస్తానన్నాడు శ్రీ కృష్ణభగవానుడు. (పత్ర సమర్పణకు ద్రౌపదినీ, పుష్ప సమర్పణకు గజేంద్రునీ ఫల సమర్పణకు శబరినీ, తోయ సమర్పణకు రంతిదేవునీ ఉదాహరణగా పేర్కొంటారు పెద్దలు.)
39. పతిభావంలో మర్యాద ఉంటుంది. ప్రియాభావంలో ఇచ్చుకోవడమే ఉంటుంది కాని పుచ్చుకోవడం ఉండదు.
40. విష్ణువును అనుసరించిపోయే లక్ష్మీదేవికి జడిమ ఏర్పడింది. విభావాదులలో ఒకటి జడత. విరహవ్యథాధిక్యంతో అంగాలు మనస్సు కూడా చేష్టారహితం కావడాన్ని జడత అంటారు, (సాహిత్య దర్పణం). అనిష్ట దర్శన శ్రవణవ్యాధులవల్ల జడత ఏర్పడుతుంది. దీని ప్రభావం వల్ల సకల కార్యాలలోను ప్రవృత్తి అనేది లోపిస్తుంది. మౌనం వహించడం, అస్పష్టంగా మాట్లాడటం, గొణుగుకోవడం, నిర్నిమేషదృక్కులతో చూడటం, పరవశత్వం పొందడం జడతాభినయ విశేషాలని నాట్య శాస్త్రం వివరించింది.
41. నాదేవో దేవ మర్చయేత్ అని శాస్త్రం. దేవత్వం పొందకుండగా దేవుణ్ని అర్చింపగూడదని శాస్త్రం చెప్పడంలోని అంతరార్థం ఏమంటే, దివ్యమైన మనస్సుతోనే, పరిశుద్ధ సత్త్వమయమైన హృదయంతోనే, దేవుణ్ని అర్చించాలని.
42. పోతనగారు ఏనుగులు కల్లోల పరచిన సరస్సును ఇంతకు ముందు శృంగార రసబంధురంగా వర్ణించారు. భగవంతుడు దర్శించిన ఆ సరస్సును ఇక్కడ సందర్భోచితమైన శ్లేషలతో అలంకరించారు. శ్లేషాలంకారం రెండు విధాలుగా ఉంటుంది. శబ్దాన్ని ఆశ్రయించిన శ్లేషను శబ్దశ్లేష అంటారు. శబ్దశ్లేషలో శబ్దపరివర్తనం జరగదు. అనగా శ్లిష్ట శబ్ద స్థానంలో దాని పర్యాయ పదాన్ని వాడటానికి వీలుండదు. అర్థశ్లేషలో శబ్ద పరివర్తనం జరిగి మరింత సౌందర్యం చేకూరుతుంది.
43. వేర్వేరు మకరాలు రవినీ కుబేరునీ కూర్మరాజునీ ఆశ్రయించాయనిన పోతనగారి ఉత్ప్రేక్ష వంటిది 'భక్తిరసాయనం'లో ఉన్నది. శ్రీకృష్ణుడు మన్ను తినటం రవిచంద్రులు చూచారు. కాని, తినలేదని అతడు తల్లికి అబద్ధం చెపుతూ, ఇతరులు అబద్ధాలాడుతున్నారన్నాడు. ఈయనను సమర్థించడమా మానడమా అని వారు ఆకాశంలో పరిభ్రమిస్తున్నారని ఆ ఉత్ప్రేక్ష.

44. 'సాగరముప్పొంగెఁ దరంగచుంబితనభోగంగా ముఖాంభోజమై' అని పోతనగారు వర్ణించి కాళిదాసు రఘువంశంలోని 'ముఖార్పణేషు ప్రకృతి ప్రగల్భాః' అన్న శ్లోకాన్ని గుర్తుకు తెచ్చారు.
45. 'లిఙ్లోట్టులవకారంబునకు లోపంబు విభాషనగు' అను బాల వ్యా. సూత్రముచే మధ్యమ పురుషైక వచనములోని వు లోపించినది.
46. శివ భక్తుడు అగస్త్యుడు శ్రీహరిని స్మరిస్తున్న ఇంద్రద్యుమ్నుని శపించటమేమిటి? ప్రతి శాపం ఇవ్వగలిగిన అతడు సహించటమేమిటి? ఇది భగవల్లీల. ఇంద్రద్యుమ్నుడు గజజన్మపొందాలి. తనను కీర్తించిన ఏనుగును కూడా ఆదరించి తన కారుణ్యాతిశయాన్ని భగవంతుడు భక్తలోకానికి చాటిచెప్పాలి. శంఖచక్రాదులతో కూడిన చతుర్భుజ రూపుడైన శ్రీకృష్ణుని పూజించడంవల్ల ఇంద్రద్యుమ్నుడు సకల దేవతలను పూజించిన వాడయ్యాడు. ఇంద్రద్యుమ్నునికి పార్షద పదవి ఇచ్చాడు, గజేంద్రుని ప్రాతః స్మరణీయుని చేశాడు భగవంతుడు.

## వ్యాఖ్యానంలో కథలు

వ్యాఖ్యాత ఉపాధ్యాయునిగా ఉపన్యాసకునిగా గడించిన అనుభవం ఈ వ్యాఖ్యా రచనంలో కూడా ప్రతిఫలిస్తుంది. ఎన్నో కథలు కూడా ఈ వ్యాఖ్యలో ఉదాహరించారు.

1. జీవితమంతా సంసార తాపత్రయంలో ధన సంపాదనమే పరమాశయంగా భావించిన గృహవ్రతునికి అవసాన సమయంలో భగవత్ స్మరణ కలగదనటానికి ఉదాహరించిన చీపురు కట్టకథ. పుట. 55.
2. పరీక్షిత్తు జరాసంధునిఆభరణాలు ధరించిన కథ. పుట 3. ఇది ఎక్కడిదో.
3. ఆత్మ - అనాత్మల భేదాన్ని వివరించే విష్ణుపురాణకథ. పుట 171.
4. అలవైకుంఠపురంబులో పద్యం రాముడు వ్రాశాడన్న కథ. పుట 175.
5. జయదేవుని అష్టపదిలోని ఒక పాదం శ్రీకృష్ణుడు పూరించాడన్న కథ. పుట 175.
6. గుజరాతునర్సీమెహతా తండ్రితద్దినానికి సర్వమూ కృష్ణుడు తెచ్చిన కథ. పుట 176.

## వ్యాఖ్యానంలో హాస్యం

వ్యాఖ్యానంలో హాస్యానికి కూడా అవకాశం లేకపోలేదు.

1. 'తత్త్వమసి' వాక్యంలో జీవబ్రహ్మైక్యాన్ని సాధించబూనటం హంసను పట్టుకోవటానికి ప్రయత్నించి కొంగను పట్టుకొనటమే అవుతుందని శ్రీవల్లభాచార్యులు పరిహసించారు. పుట 124.
2. వైశేషిక సూత్రాలలో ముక్తిని గురించి చెబుతూ జ్ఞాన సుఖాది శూన్యమైన శిలా రూపమోక్షప్రాప్తి చరమోద్దేశ్యమని ఉంది. ఇలా ముక్తిని గూర్చి చెప్పిన గౌతముడు తన పేరును శబ్దతః అర్థతః సార్థకం చేసుకొన్నాడని (అతిశయేన గౌః = ఎద్దు) అని ఎందరో ఆక్షేపించారు.

3. వైశేషిక దార్శనికుడు చెప్పినమోక్షం కంటే బృందావన సరస నికుంజాల నీడలలోనక్కగా పుట్టి జీవించడం మేలని వైష్ణవులు పరిహసించారు.

పరవాదాన్ని వాదపటిమతో గెలవాలి కాని వ్యక్తిగత పరిహాసంతోకాదు. ఈ తప్పు ఈ వ్యాఖ్యాతది కాదు.

పరిత్యక్తపత్నీన్యాయం, అగ్నిప్రవిష్టరాజపుత్రన్యాయం వంటి సంస్కృత న్యాయాలను సందర్భోచితంగా ఈ వ్యాఖ్యాత ఉపయోగించి వక్తవ్యానికి వన్నె తెస్తారు.

## వ్యాఖ్యాత శ్రమ

ఈ వ్యాఖ్య విషయ పరిపుష్టంగా యుక్తియుక్తంగా ఉండటానికి ఈ వ్యాఖ్యాత ఎంత శ్రమించారో వారుటంకించిన గ్రంథాల పట్టికనూ స్మరించిన గ్రంథకర్తృ-భక్త-మహర్షినామ పట్టికనూ చూస్తే తెలుస్తుంది.

## ఉటంకించిన గ్రంథాలు

1. అథర్వ వేదం పిప్పలాదిశాఖ
2. అధ్యాత్మరామాయణం వ్యాసప్రణీతం
3. అలంకారకౌస్తుభం
4. ఆళువందారుస్తోత్రం
5. ఆళ్వారుపాశురాల ఆంగ్లానువాదం
6. ఈశావాస్యోపనిషత్తు
7. ఉపాసనాత్రయ సిద్ధాంతం
8. ఋగ్వేదం
9. ఔచిత్య విచారచర్చ
10. కఠోపనిషత్తు
11. గీతగోవిందం
12. ఛాందోగ్యోపనిషత్తు
13. తిక్కన భారతం
14. తిరుప్పావై
15. తైత్తిరీయశ్రుతి
16. తైత్తిరీయోపనిషత్తు
17. దశరూపకం
18. ధ్వన్యాలోకం
19. నారద పాంచరాత్రంలోని జితంతా స్తోత్రం
20. నారద భక్తి సూత్రాలు
21. నారదీయపురాణం
22. నారసింహ పురాణం
23. నారాయణ సంహిత
24. నారాయణాష్టకం
25. నారాయణోపనిషత్తు
26. నిరుక్తం
27. నృసింహతాపనీయోపనిషత్తు
28. నృసింహపూర్వతాపనీయోపనిషత్తు
29. నైషధీయకావ్యం
30. న్యాయ వివరణం
31. పద్మపురాణం
32. పాంచరాత్రాగమం
33. ప్రబోధసుధాకరం
34. బృహదారణ్యకోపనిషత్తు
35. బృహద్వామనం
36. బ్రహ్మపురాణం
37. బ్రహ్మసంహిత
38. బ్రహ్మసూత్రాలు
39. బ్రహ్మాండపురాణం
40. భక్తి రహస్యం

41. భగవద్గీత
42. భగవద్గుణమణిదర్పణం
43. భరతుని నాట్యశాస్త్రం
44. భాగవతం
45. భాగవతార్థ ప్రకరణం
46. భృగువల్లి శ్రుతి
47. మనుచరిత్ర
48. మనుస్మృతి
49. మహాభారతం
50. మహిమ్నస్తోత్రం
51. ముండకోపనిషత్
52. ముద్గల శ్రుతి
53. మేఘ సందేశం
54. యజుర్వేదం
55. రఘువంశం
56. రామాయణం
57. వంశీధరవ్యాఖ్య
58. వామన పురాణం
59. వివేక చూడామణి
60. విష్ణుచిత్తీయవ్యాఖ్య
61. విష్ణుపురాణం
62. వైకుంఠగద్య
63. వైశేషికదర్శనం
64. వైష్ణవతోషిణి
65. శతపథబ్రాహ్మణం
66. శతరూప(స్వీయం)
67. శరణాగతి గద్య
68. శార్ఙ్గధరపద్ధతి
69. శిక్షాష్టకం
70. శుక్లయజుర్వేదం
71. శ్రీకృష్ణగీతావళి (తులసీదాసు)
72. శ్రీ భాష్యం (రామానుజులు)
73. శ్రీ విష్ణుదివ్యనామస్తోత్రం
74. శ్వేతాశ్వతరోపనిషత్తు
75. సాహిత్య దర్పణం
76. స్కందపురాణం
77. స్తోత్రరత్నం
78. హనుమన్నాటకం
79. హయశీర్షగ్రంథం
80. హరిభక్తి రసాయనం
81. హరివంశం
82. హితహరివంశం

## పేర్కొనిన ఋషి-కవి-భక్త-ప్రభృతుల పట్టిక

1. అభినవగుప్తుడు
2. అలీఖాన్
3. అల్లసాని పెద్దన
4. ఆండాళ్
5. ఆనందవర్ధన
6. ఏమహాత్ముడో
7. కవికర్ణపూరుడు
8. కాళిదాసు
9. కేశవభట్టు (కాశ్మీరి)
10. ఖాదిర్‌బక్స్ (బక్ష్)
11. గోపీనాధ విఠలనాధులు
12. గౌతముడు
13. చార్వాకుడు
14. చిత్సుఖాచార్యులు
15. చైతన్య
16. జయదేవుడు
17. తాజ్
18. తిక్కన

19. తులసీదాసు
20. నర్సీమెహతా
21. నింబార్క
22. పరాశరభట్టరు
23. పుష్పదంతుడు
24. భరతుడు
25. భవభూతి
26. భామహుడు
27. మధుసూదన సరస్వతి
28. మాధవదేవ
29. మాధ్వ
30. మీరాబాయి
31. యామునముని
32. రసఖాన్
33. రాధావల్లభ
34. రామానంద
35. రుద్రటుడు
36. రూపగోస్వామి
37. వంశీధర
38. వల్లభ
39. విశ్వనాధ చక్రవర్తి
40. విష్ణుచిత్తులు
41. వీరరాఘవస్వామి
42. వేదాంత దేశికులు
43. శంకరదేవ
44. శంకరభగవత్పాదులు
45. శ్రీధరస్వామి
46. శ్రీమద్రామానుజులు
47. శ్రీరాఘవేంద్రస్వామి
48. సూరదాసు
49. స్వామి లక్ష్మణాచార్యులు
50. హరిసూరి
51. హూపర్
52. హేమాద్రి

ఇవి యథాలాభంగా క్రోడీకరించినవే కాని పేర్కొనినవన్నీ ఈ పట్టికలలో సమగ్రంగా ఉన్నాయని ప్రతిజ్ఞ చేసి చెప్పలేను.

## వ్యాఖ్యాత ఉత్పల విశిష్టత

ఏడు పదుల సంవత్సరాలకుపైగా (74) చేసిన, సంస్కృతాంధ్రవాఙ్మయ తపస్సు పండిన ఫలంగా రూపొందిన, ఈ గోపీనయనోత్పలార్చిత వ్యాఖ్య విలసిల్ల చేసిన వారు, శ్రీమాన్ ఉత్పల సత్యనారాయణాచార్యుల వారు. వారు గురుకుల క్లిష్టులై సంస్కృతాంధ్రాలు అభ్యసించినవారు. స్వయంకృషితో బెంగాలీ ఇంగ్లీషు హిందీ భాషలలో కూడా నిపుణత గడించినవారు. నిష్కామ సేవారక్తితోనే స్వాతంత్ర్య సంగ్రామంలో పాల్గొని, అనంతరం, భారత ప్రభుత్వం ఇచ్చే ఐదెకరాల పొలం, పెన్షను, ఫోను వంటి ఇతర సౌకర్యాలు కూడా తిరస్కరించినవారు. ఇట్టి పనిచేసిన వారు మా గురువులు కళా ప్రపూర్ణ శ్రీకేశిరాజు వేంకటనృసింహ అప్పారావుగారి వంటి దేశభక్తులు కొలదిగా మాత్రమే ఉన్నారు. ఇప్పటికీ ఇద్దరు మాత్రమే ధరిస్తుంటారు. వారికీ మాకూ వాఙ్మయ పరిచయం చందమామలో ప్రచురింపబడే వారి గేయకథలు చదవటంతో ఆరంభమై పత్రికలలో పద్యాలు చదవటమూ ఆకాశవాణి కవిసమ్మేళనాదులలో వినటమూతో కొనసాగింది. ఆకాశవాణిలో వారి రాసపూర్ణిమ సమీక్షించటమే గ్రంథరూపంలో వారి కవిత చదవటానికి ఆరంభం. ఐదు పదులకు అటూఇటూగా రచనల సంపుటులు ప్రకటించిన ఆచార్యులుగారు ఏ పుస్తకంలోనూ

వారి రచనల పట్టిక ప్రచురించలేదు. నామీది దయతో ఈ పుస్తకానికి ఇది వ్రాయమని ఆదేశించినపుడు, వారి ఇతర రచనలూ వారి జీవిత విశేషాల రేఖా పరిచయమూ కావాలంటే, వారి గత రచనలకూ దీనికీ సంబంధం లేదని, తప్పని సరి అయి, ఆరు మాత్రమే అనుగ్రహించిన గంభీరులు. అంతప్రసిద్ధుల జీవిత విశేషాలడిగిన నా అవినయానికీ, అజ్ఞతకూ అది శిక్ష కావచ్చు, అవి ఇవ్వలేదు. ఇదివరలో వారు కృష్ణ శతకానికి వ్రాసిన గోపీనయనోత్పలార్చిత వ్యాఖ్యా గ్రంథానికి నేను హైయంగవీనమందిస్తూ అందులో వ్రాసిన వారిపేరు కూడా తీసి వేసిన కీర్తి విముఖులు. దీనికీ ఆ పేరే పెట్టటాన్ని బట్టి మల్లినాథుని సంజీవినీ వ్యాఖ్యానామంలా ఇకపై గూడా వీరు వ్రాయబోయే వ్యాఖ్యలకు ఇదే పేరుంటుందని అనుమానించవలసి వస్తున్నది. శ్రీకృష్ణ భక్తులు. విష్ణుర్నారాయణః కృష్ణో వైకుంఠో విష్టరశ్రవాః అని అమరుడు శ్రీ మహావిష్ణువు నామాలలో మూడవదిగా కృష్ణ నామం పేర్కొన్నాడు. విష్ణు సహస్రనామాలలోనూ ఉన్నది. కనుక కృష్ణ నామం దేవకీనందనునికి రూఢమైనా విష్ణు పర్యాయంగానే ఈ వ్యాఖ్యాత బహుళంగా ప్రయోగిస్తారు. పురాణాలలో భాగవతంపై వచ్చినన్ని వ్యాఖ్యలు మరి దేనిపైనీ రాలేదు. వాటిలో అధిక భాగం ఆచార్యులవారు పరిశీలించారు. శ్రీ చల్లా సాంబిరెడ్డిగారు కూడా కృష్ణభక్తులు. ఆచార్యుల వారు ఇష్టపడకపోయినా, నేను చేజిక్కించుకొని చూచిన వీరి ఇతర రచనలలో గూడా వీరి కృష్ణభక్తి తొంగిచూస్తున్నది - నందనందనునెమ్మేని నలుపు మెచ్చి నీలివసనమ్ము దాల్చె రాధాలతాంగి, రాధనెమ్మేనిబంగారు రంగు మెచ్చి అచ్యుతుడు తాల్చె రమ్యపీతాంబరంబు - అని పాతబస్తీ విలాసములో 1983లో చమత్కరించారు. 'ధర్మమునకచ్యుతుడు జనార్దనుడు ప్రభువు, (ధర్మస్య ప్రభురచ్యుతః) సూర్యచంద్రులు గ్రహరాజి సురలు దైత్య గరుడగంధర్వయక్షోరగములు దిగధిపాలురబ్ధులు హరివశవర్తనములు, ఋషులు పితరులు మనము బుద్ధీంద్రియములు జ్ఞానవిజ్ఞానములు యోగశాస్త్రములును ధాతువులు చరాచర మహాభూతములను అలరుజగమెల్ల వాసుదేవాత్మకంబు' అని 1981లో శతరూపలో వాసుదేవతత్త్వం పేర్కొన్నవారు. 'తన సర్వస్వము కృష్ణుండనుకొనువాడే భువి నసలైన ధనాఢ్యుండునికియునుపకరణంబులె తనవనుకొనువాడు నిత్య దారిద్ర్యుడగున్' అని రాస పూర్ణిమలో తూకం వేసినవారు. అసలు రాస పూర్ణిమ కావ్యమే కృష్ణుని మకుటానికి నెమలికన్ను అలంకరించటంవంటిది. 'పుట్టుకచే బ్రాహ్మణుడయి నెట్టన శ్రీకృష్ణచంద్రు నెటిగొలువనియా పుట్టువునకు భూతలమున గిట్టుట యొక్కటియె ఫలము గీఢ్పడి రెడ్డీ' - అని కసిరెడ్డి ద్విశతిలో ప్రకటించినధీరులు. రామాయణం దీర్ఘశరణాగతిగా విశిష్టాద్వైతులకూ, భాగవతం ద్వైతులకూ పరమ ప్రామాణికములయిన గ్రంథరత్నాలు. విశిష్టాద్వైతులైన ఆచార్యులు గారు ఉత్పలమాలలో 1991లోనే 'భాగవతంబు నా ధనము, భక్తులకూటమి షడ్రసాన్నమౌ, నీ గుణకీర్తనంబె ధరణిన్ వ్యవసాయము, నా పరిశ్రమాభోగఫలంబు నీవ, పరిపూర్ణదయాకర, భక్తపాలనోద్వేగ నమోస్తు వేంకటపతీ, అఖిలాండపతీ శ్రియః పతీ' అని ఘంటాఘోషంగా ప్రకటించినవారు. కనుక కృష్ణ భక్తీ, భాగవతరక్తీ ఆచార్యులవారికి సహజములై పరిణతమవుతూ వచ్చినవే కాని, ఇటీవల తెచ్చుకొన్నవి కావు. కనుకనే కృష్ణశతకానికయినా

గజేంద్రమోక్షణానికయినా ఉత్పలవ్యాఖ్య గోపీనయనోత్పల వ్యాఖ్య మేలయింది. తమ పేరు ఉత్పలరూపముగా వికసించటమే వారికిష్టమని వారి పుస్తకాలమీద ప్రకటించిన తీరునుబట్టి తెలుస్తుంది. వారి కృష్ణ శతకవ్యాఖ్య శ్రీ పావని సేవా సమితి శతక వ్యాఖ్యలకు ఒరవడి అయింది. అది కృష్ణ బాలసర్వస్వం. ఈగజేంద్ర వ్యాఖ్య భారత భాగవతరామాయణ వ్యాఖ్యలకు ఒరవడి కాదగినది. ఈ సందర్భంలో ఒకమాట. జమ్ములమడక మాధవరామశర్మగారి నాట్యవేదానువాదంపై ఇచ్చిన తమ అభిప్రాయంలో వేలూరి శివరామశాస్త్రిగారు - శర్మగారు భాష కొంచెం సరళం చేస్తే బాగుండును అని వారితో అన్నాను. అలంకార శాస్త్రానికి ఆ మాత్రం గాంభీర్యం అవసరమని ఆ శైలి నేను సాధన చేశాను అన్నారు - ఇంకేమి గతి - అనే భావం వచ్చే వాక్యాలు వ్రాసినట్టు గుర్తు. నేను ఆచార్యులవారితో - అయ్యా, ఇన్ని అమూల్య - విషయాలు ఇంత అందమయిన వ్యవహారభాషలో వ్రాస్తున్న మీరు మరి కొంచెం సరళంగా ఉండేటట్టు చూస్తే బాగుంటుందేమో, దీని నుద్దేశించినది పోతన పద్యాలు అర్థం చేసుకోలేని వారికి కదా అన్నాను. దానికి వారు - ఇటీవల నేనొక గ్రంథావిష్కరణ సభలో పాల్గొన్నాను. దానిలో నాతో పాటు పాల్గొన్న వ్యావహారిక భాషావాది భాషాశాస్త్ర విద్వాంసులు ఒకరు వ్యావహారిక భాషపేర పేలవంగా వ్రాస్తున్నారు చాలా మంది అన్నారు - కనుక ఆ మాత్రం ఉండవలసిందే అన్నారు. ఏమి చేస్తాము? కాని, 'సౌమ్యసౌశీల్య సౌగంధ్యసౌకుమార్యలావణ్య యౌవనాద్యనంత గుణనిధిస్వరూపుడు, ఉపనిషత్తులు తేజోమయసుందర బ్రహ్మజ్ఞాన మహీరుహాలు, భాగవతాది పురాణాలు శ్యామ శాఖా ప్రతానపల్లవిత పుష్పిత ఫలిత ప్రేమ భక్తి కల్పతరువులు. సర్వేశ్వరత్వ సవిశేషత్వ సర్వకర్మారాధ్యత్వ సర్వఫలప్రదత్వ సర్వాధారత్వ సర్వకార్యోత్పాదకత్వ చిదచిదీశ్వరత్వ సమస్తద్రవ్య శరీరత్వములు ఆభగవంతుని లక్షణాలు, ఈ త్రింశల్లక్షణాలను పాటించడం పరమధర్మం, ఏక హస్తకృతత్వ వస్త్రావృతదేహత్వ భగవత్తదగ్ర-పృష్ఠ-వామ-భాగాంశతన్నికట గర్భమందిర గతత్వాదిమయములైన అపరాధాలు జరగకుండా' వంటి పంక్తులు సాహిత్య ప్రధానములైన గ్రంథాలకు అలంకారాలు కాదగినవి కాని భావం కఠినం అయేకొలదీ భాష సులభము కావలసిన వ్యాఖ్యలకు కాదు. అయితే ఇవి వదలలేక ఉంచినచిరత్నరత్నాలు కాని, చిందరవందరగా దొర్లి పడిన కఠిన శిలలు కావు. - గంగాసంగిని పావ హారిణి శుకాక్రాంత ద్రుమారామ ప్రాసంగగ్రామ తటాంతవాసకలహంసస్తోమ గోపాంగనాపాంగశ్యామ వినీలనీరదసమాంభఃపూర్ణశైలాటవీ శృంగోత్క్రామ కళిందజానదిని గాంచెన్ మార్గమధ్యంబునన్ - ఈ పద్యం రాసపూర్ణిమకు శోభాదాయకం. అట్టి సమాస పంక్తులు వ్యాఖ్యకు కావు. రత్నాలు తాపిన ఒంటిపేట బంగారపు గొలుసు మెడలో ఉంటే వగ. అడుగుకు తగిలిస్తే సంకెల. ఇది ఆచార్యులుగారి దోషం కాదు. శ్రీనాథుని నాటి నుంచి కవులు వదలలేని శబ్ద ప్రీతిది. ఆయన ఒకే శ్లోకంలో ఉన్న గమికర్మీకృతనైకనీవృతా, సదసత్సంశయగోచరోదరీ సమాసాలలో దేనినీ వదల లేక ఒకోదానికి ఒకోమత్తేభం బహుకరించాడు. కనుక సులభతరమైన శైలి కూడా అలవరుచుకొనిన భారత భాగవత రామాయణవ్యాఖ్యలకిది ఒరవడి కావలసి ఉన్నది.

## ప్రాప్తవ్య పురస్కారాలు

అన్ని రంగాలకు చెందిన అతి ప్రసిద్ధులయిన వారందరూ ఆచార్యులవారిని మహాకవి అని కీర్తిస్తున్నారు. వారెన్నో పురస్కారాలను స్వీకరించి వాటికి పురస్కార గౌరవం సమకూర్చారు కాని, కేంద్రసాహిత్య అకాడెమీ పురస్కారం మాత్రం అందినట్లు లేదు. ఎందువల్ల? అందక తప్పదు త్వరలో.

అవకాశం దొరికింది కనుక, మరొక మాట అనాలనిపిస్తున్నది. పరమభాగవతరసికులై, శ్రీకృష్ణైక జీవనులై, పరిణత ప్రజ్ఞులైన ఆచార్యుల వారు శ్రీరామనాయకమైన శ్రీమద్రామాయణకల్ప వృక్షం వంటి, శ్రీకృష్ణ నాయకమైన ఏ శ్రీమద్భాగవత కల్పతరువు వంటి కావ్యమో వ్రాసి, జ్ఞాన పీఠ పురస్కారం ఎందుకివ్వరు అని కూడా ప్రశ్నించే అవకాశం ఎందుకు కల్పించరు?

అయినా, 'నీ వ్యత్యస్త పదంబుల సవ్యముగానుంచు కృష్ణ సాగిలపడి ప్రాప్తవ్యమునకు శిరమొగ్గెద అవ్యాకృత హృదయ మెఱుగు మంచును రెడ్డీ' అని వ్రాసిన ఆచార్యుల వారికి ప్రాప్తవ్యం ప్రాప్తించి తీరుతుంది. ప్రాప్తవ్యమర్థం లభతే మనుష్యః.

ఆచార్యులుగారు ఉదారులు. తమరచనలు ఎందరికో అంకితమిచ్చారు. వారి ఈ గ్రంథాన్ని శ్రీ, సాంబిరెడ్డి గారు దైవానికిస్తున్నట్టుగా శ్రీ గణపతి సచ్చిదానంద సద్గురువులకిస్తున్నారు. విశ్వనాథ వారి నుంచి విశ్వవిద్యాలయాచార్యుల వరకూ ప్రసిద్ధులైన ఎందరి చేతనో తమ గ్రంథాల గురించి పీఠికలో అభిప్రాయాలో వ్రాయించారు. ఇన్నింటికీ నామకుల చేత వ్రాయించాము కదా దీనికి అనామకుని చేత వ్రాయించి నామకుని చేద్దామని కాబోలు నా చేత దీనికి వ్రాయించారు.

ఆచార్యుల వారి వంటి వారి వల్ల శ్రీపావని సేవా సమితీ, పావని సేవా సమితి వల్ల ఇట్టి కవి పండితులూ పరిపుష్టి నంది, శ్రీ సాంబిరెడ్డిగారి సంకల్పం సిద్ధ సంకల్పమవుగాక.

'వేదకల్పవృక్ష విగలితమై శుకముఖ సుధాద్రవమున మొనసియున్న భాగవతపురాణ ఫల రసాస్వాదన పదవిగనుఁడు రసికభావ విదులు.'

ప్రమాథి వైశాఖ బహుళ దశమీ
సోమవారం,హనుమజ్జయంతి
1999 మే 10,హైదరాబాదు

**ఏలూరిపాటి అనంతరామయ్య**

# మా మాట

శ్రీమద్భాగవతం వేదసారం. అది పరమహంస సంహిత. అదొక ముక్తిశాస్త్రం, భక్తి శాస్త్రం. బ్రహ్మసూత్రాలకు అది భాష్యం. భగవద్గీతకు తాత్పర్యం. సకలపురాణాలలో శిరోమణి శ్రీమద్భాగవతం. అందలి ప్రతిఘట్టము పుణ్యప్రదమైనదే. మహామాన్య మాళవీయ అన్నట్లు అదొక ఆశీర్వాదాత్మకమైన పవిత్ర గ్రంథం. పోతనగారు భాగవతాన్ని తెనిగించి అజరామరమైన కీర్తిని ఆర్జించారు. తెలుగు భాషకు మాధుర్యాన్ని ప్రసాదించారు.

సకల సంప్రదాయాలవారికి ఇష్టమైన "ఎవ్వనిచే జనించు జగము" అనే ప్రార్థనా పద్యం చదవని, వినని తెలుగువాడుండడు. ఆ పద్యం పోతనగారి భాగవతంలోని గజేంద్రమోక్షంలోనిదే. అత్యంతగోపనీయమూ, రహస్యాత్మకమూ అయినదే కాకుండా భగవత్స్వరూపాన్ని అనుభవింపజేసే సమస్త వేదాంతసారమూ, ఆధ్యాత్మిక దీపమూ అయిన శ్రీమద్భాగవతం పట్ల ఎనలేని మక్కువగలవారు మహాకవి శ్రీ ఉత్పలవారు. వారి గజేంద్రమోక్ష ఘట్టానికి రచించిన ఈ సవిస్తరమైన వ్యాఖ్య సర్వజనామోదం పొందగలదని మా విశ్వాసం.

శ్రీ పావని సేవాసమితి సవ్యాఖ్యానశతక సాహిత్య పరంపరలో ప్రప్రథమంగా మహాకవి ఉత్పల వారి వ్యాఖ్యతో ప్రారంభించి శ్రీకృష్ణశతకాన్నీ, ఆచార్య యం. కులశేఖరరావు మహోదయుల వ్యాఖ్యతో దాశరథి శతకాన్నీ విద్వద్వర్యులైన డా॥ ముదిగొండ వీరభద్రయ్యగారి వ్యాఖ్యతో సర్వేశ్వర శతకాన్ని తెలుగు పాఠకలోకానికి సమర్పించింది. మరికొన్ని ప్రసిద్ధ శతకాలకు వ్యాఖ్యారచన జరిపిస్తున్నది.

ఈ గజేంద్రమోక్షము గ్రంథాన్ని అవధూత దత్త పీఠాధిపతి పరమపూజ్య జగద్గురు శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామివారికి సభక్తికముగా సమర్పితము చేయటం శ్రీ పావని సేవాసమితి తమ అదృష్టంగా భావిస్తోంది. శ్రీశ్రీశ్రీ గణపతి సచ్చిదానంద స్వామివారు దత్తాత్రేయ స్వరూపులు. వారి ఆశీస్సందేశముతో భక్తి పులకిత గాత్రులమయ్యాము. వారికి మా సాష్టాంగ ప్రణామములు.

దత్తపీఠ విద్యాధికారి వేద శాస్త్ర పురాణ కావ్య నాటకాలంకారాది బహుశాస్త్ర పారంగతులు, పరమ బ్రహ్మణ్యులు, నిష్ఠాగరిష్ఠులు అయిన శ్రీ కుప్పా వేంకట కృష్ణమూర్తి గారి అభిమానానికి ఈ వ్యాఖ్యా గ్రంథం నోచుకొన్నదనగా, ఇక దీని విలువ చెప్పనక్కరలేదు. ఈ పుస్తకానికి 'సాధన సామగ్రి' అనుగ్రహించిన ఆ మహా విద్వాంసునికి సర్వదా కృతజ్ఞులము.

ఈ పుస్తకానికి "చిలుకకొట్టిన పండు" అనుగ్రహించిన ఆంధ్రవ్యాస, 'కవికుల రత్నదీప', వైదికాలంకార, శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్య మహోదయులకు శ్రీ పావని సేవా సమితి పాలకవర్గం కృతజ్ఞతలను తెలుపుకొంటున్నది.

ఈ పుస్తకానికి ముఖపత్రాలంకరణ కావించిన ప్రఖ్యాత చిత్రకారులు శ్రీ గంగాధర్ గారికి ముచ్చటగా టైపు చేసిన ఫాంట్‌లైన్ గ్రాఫిక్స్ వారికి, సుందరంగా ముద్రించిన శ్రీ సాయిరాం ప్రింటర్స్ అధినేత శ్రీ నాగేశ్వరరావు గారికి మా కృతజ్ఞతలు.

**జి.పి.హెచ్. రామారావు**

కార్యదర్శి, శ్రీ పావని సేవా సమితి.

"स्मरंतः स्मारयंतश्च मिथोऽघौघहरं हरिम्"

(श्रीमद्भा. 11-3-31)


I express my heart felt thanks to :

Pujya Sri Sri Sri Goswami Syam Manohar Maharaj, chairman, Sri Vallabha Vidya Peeth, Mumbai.

Brahmasri Kuppa Venkata Krishna murthy : Vidyadhikari, Sri Ganapati Sachchidananda Avadhoota Datta Peetham, Mysore;

"Andhra Vyasa" Sri Yeluripati Anantaramaiah, Hyderabad.

Sri Challa Sambi Reddy, President, Sri Pavani Seva Samithi, Hyderabad.

Sri "Gangadhar" Artist, Hyderabad

Sri G. Ch. Ramarao, Secretary, Sri Pavani Seva Samithi, Hyderabad

Sri Sayyaparaju Ramakrishnam Raju, Hyderbad.

for their spontaneous support and timely assistance in completing this book **"GAJENDRA MOKSHAM"**

**UTPALA**

# గజేంద్ర మోక్షము

## గోపీవయనోత్పలార్చితవ్యాఖ్యావిలపితము

## అవతరణిక

సుభద్ర అర్జునుల పుత్రుడు అభిమన్యుడు. శ్రీకృష్ణునికి మేనల్లుడు. అభిమన్యుని భార్య ఉత్తర విరాటరాజు కూతురు. ఆమె అర్జునునకు కోడలు కాకముందు ఆయనకు శిష్యురాలు. భారత యుద్ధంలో అభిమన్యుడు మహారథుడై పద్మవ్యూహాన్ని ఛేదించి రణరంగంలో వీరమరణం పొందాడు. అప్పటికి అతని భార్య ఉత్తర నిండు చూలాలు.

యుద్ధానంతరం అశ్వత్థామ దుర్యోధనునికి ప్రీతి కావింపదలచి పాండవ వంశం నాశనం చేస్తానని క్రోధంతో ప్రతిజ్ఞ చేశాడు. అర్ధరాత్రి పాండవశిబిరాలకు వెళ్లి అక్కడ నిద్రిస్తున్న ద్రౌపదీ పుత్రులను దారుణంగా హత్య చేశాడు. తెల్లవారగానే ఈ హత్యోదంతం తెలిసి ద్రౌపది దుఃఖంతో విలవిలలాడి పోయింది. అది అశ్వత్థామ దుశ్చర్య అని తెలుసుకొని, భీమాదులు అతణ్ని పట్టి తెచ్చి తగిన శాస్తి చేశారు. కాని, అశ్వత్థామలో ప్రతీకారాగ్ని చల్లారలేదు. ఉత్తర గర్భాన్ని లక్ష్యంగా చేసి బ్రహ్మాస్త్రం ప్రయోగించాడు.

ఆ సమయంలో శ్రీకృష్ణుడు ద్వారకా నగరానికి ప్రయాణమై పాండవ భవనానికి వచ్చాడు. రాజభవనంలో ఏడుపులు పెడబొబ్బలు విన్నాడు. భవన ప్రాంగణంలోనికి కుంతీ ద్రౌపదులు పరుగున వచ్చి శ్రీకృష్ణునికి ఈ సంగతి చెప్పారు. సర్వజ్ఞుడైన శ్రీకృష్ణుడు రథం దిగి అంతఃపురంలోనికి వెళ్లాడు. ఉత్తరను చూచాడు. ఆమె నేలమీద పడి పొర్లి పొర్లి దుఃఖిస్తున్నది. శ్రీకృష్ణుని పాదాలను పట్టుకొని "దేవదేవా! నీవు సర్వసమర్థుడవు. ఈ పాండవవంశాంకురాన్ని రక్షించు" అని కడుపుచుమ్మలు చుట్టగా కన్నీరు మున్నీరుగా ఏడ్చింది. అశ్వత్థామ ప్రయోగించిన బ్రహ్మాస్త్రానికి

శ్రీకృష్ణుడు తన సుదర్శన చక్రం అడ్డుపెట్టి ఉత్తర గర్భాన్ని రక్షించాడు. ఉత్తర గర్భంలోని మృతశిశువును స్పర్శించి బ్రతికించాడు. పాండురాజవంశాన్ని నిలిపి తనను ధన్యురాలిని చేసినందుకు కుంతీదేవి శ్రీకృష్ణుణ్ని స్తుతించింది. పరబ్రహ్మమయిన శ్రీకృష్ణుని వల్ల రక్షితుడైనాడు కాబట్టి ఉత్తర కన్న కుమారునికి బ్రహ్మరాతుడని పేరు కలిగింది. గర్భస్థ శిశువు మృతినొంది మరల బ్రతికినందున ఆ శిశువునకు పరీక్షిత్తు అని మరొక పేరు వచ్చింది. చతుర్వ్యూహ సహితంగా శ్రీకృష్ణ భగవానుడు అంతర్ధానం చెందిన తర్వాత ఈ కర్మక్షేత్రంలో ద్వాపరయుగం ముగిసి కలియుగం ప్రవేశించింది.

పరీక్షిత్తు పరమధార్మికుడైన మహారాజు. దిగ్విజయం చేసి సార్వభౌముడయ్యాడు. అతడు జరిపిన మూడవ అశ్వమేధ యాగంలో దేవతలు స్వయంగా వచ్చి పూజోపహారాలను స్వీకరించారు.

దుష్టశిక్షణకు శిష్టరక్షణకు పరీక్షిన్మహారాజు సర్వప్రదేశాలలో ఆరోపిత శరశరాసనధరుడై కనిపించేవాడు. ఒకనా డాతడు కురుజాంగల భూములలో పర్యటిస్తూండగా రాజలాంఛనాలు గల ఒక పురుషుడు ఒక వృషభాన్ని దారుణంగా తన్నడం చూచాడు. ఆ ఎద్దుకు మూడు కాళ్లు దెబ్బతిన్నాయి. ఒకకాలితో అది కష్టపడుతూ నడవసాగింది. దాని దురవస్థను చూచి అక్కడున్న గోవు కంటనీరు పెట్టుకొన్నది. ఆ వృషభం ధర్మదేవుడు. ఆ గోవు భూదేవి. అతడు కలిపురుషుడు. అతడు ధర్మదేవుని కాళ్ల మీద కొట్టాడని, అందుకు భూదేవి దుఃఖ పడుతున్నదని పరీక్షిత్తు గ్రహించి మహోగ్రరోషంతో ఆ కలిపురుషునిపై కత్తి జళిపించాడు. పరీక్షిత్తు ఎత్తిన భీకరఖడ్గం తన శిరసుపై పడనున్నదని భయపడి కలిపురుషుడు గజగజవణకుతూ వచ్చి అతని పాదాలపై పడి శరణువేడుకొన్నాడు. తాను కలిపురుషుడనని విన్నవించుకొన్నాడు. తనకు ఈ దేశంలో ఆశ్రయం ఇవ్వవలసిందని ప్రార్థించాడు. అర్జున పౌత్రుడైన పరీక్షిత్తు శరణాగతుని వధించడానికి ఇష్టపడక ద్యూతం, మద్యపానం, వివాహేతర సంబంధంగల స్త్రీలు,జీవహింస అనే నాలుగు ప్రదేశాలు, అనగా అసత్యం, మదం, నీచాసక్తి, నిర్దయత అనే నాలుగు విధాలైన అధర్మాలలో నివసించమన్నాడు. కలిపురుషుడు మరొకస్థాన మిమ్మని వేడుకొన్నాడు. పరీక్షిత్తు సువర్ణం (ధనం)లో కూడా స్థానమిచ్చాడు. అప్పటికి కలిపురుషునికి అయిదు స్థానాలు దక్కాయి. అధర్మాలకు మూలకారణాలయిన ఈ అయిదింటికి

ఆత్మకళ్యాణకామియైన పురుషుడు దూరంగా ఉంటే అతనిపై కలి ప్రభావం ఉండదు. అయిదు ప్రదేశాలు అతని నివాసానికి ఇచ్చి, ఇతర ప్రదేశాలలో అడుగుపెట్టవద్దని హెచ్చరించి పంపించాడు. తపం - శౌచం-దయ అనే మూడు పాదాలను ధర్మదేవునికి యథాతథంగా కలిగించి భూదేవికి నిర్భరానందాన్ని చేకూర్చాడు పరీక్షిత్తు.

ఒకనాడు పరీక్షిత్తు వేటకు వెళ్లదలచాడు. అరణ్యాలలో తపోదీక్షలో ఉన్న ఋషులకు క్రూరమృగబాధలు తప్పించాలనుకొన్నాడు. వేటకు సర్వం సిద్ధం చేసుకొని ప్రసాధనమందిరంలోనికి వెళ్లి చూచాడు. అక్కడ తమ తాతలు పాండవులు ముఖ్యంగా భీమసేనుడు జరాసంధుని వధించి అతని కిరీటాద్యాభరణాలను భద్రపరచిన కావడిపెట్టెలున్నాయి. ఆ పెట్టెలు తెరచి రత్నఖచితకిరీటాన్ని, భుజకీర్తులు మొదలైన అమూల్యాభరణాలను పరిశీలించాడు. వాటిని తమ తాతలెవ్వరూ ధరించినవారు కాదు. జరాసంధుని రత్న ఖచితకిరీటం పెట్టుకొని అద్దంలో తన ధీరగంభీరరూపం చూచుకొని అబ్బురపడ్డాడు పరీక్షిత్తు. ఆ అలంకరణతోనే వేటకు వెళ్లాడు. అరణ్యంలో కనిపించిన క్రూరజంతువు నెల్ల వేటాడాడు. చాలా అలసిపోయాడు. ఒక జంతువు అతని బారినుండి తప్పించుకొని పారిపోయింది. పౌరుషంతో దాని వెంటబడ్డాడు. అది శమీకమహర్షి ఆశ్రమం మీదుగా వెళ్లి అదృశ్యమయింది.

అక్కడ ఒక చెట్టు క్రింద శమీక మహర్షి తపోధ్యానమగ్నుడై కూర్చున్నాడు. పరీక్షిత్తు అక్కడికి వెళ్లి ఆ మృగ మేమయిందని అడిగాడు. మహర్షి పలుకలేదు. "నాకు దప్పికగా ఉన్నది. మంచినీళ్లు ఇప్పించు"మని అడిగాడు మార్గాయాసంతో. దానికీ సమాధానం లేదు. మహర్షి కళ్లు తెరచి చూడలేదు.

పరీక్షిత్తు ఆగ్రహోదగ్రుడయ్యాడు. క్రోధపిశాచి అతణ్ని ఆవహించింది. ఆ మహర్షిని అవమానింపదలచి అక్కడ చచ్చిపడిఉన్న సర్పాన్ని బాణాగ్రంతో ఎత్తి మహర్షి మెడలో వేసి అసహనంతో వెళ్లిపోయాడు.

పరీక్షిత్తు రాజధానికి చేరి తన మందిరంలోనికి ప్రవేశించి ఉడుపులన్నిటిని తీసివేసిన తర్వాత ఆశ్రమంలో తాను చేసిన దుశ్చర్య గుర్తుకు వచ్చింది. పశ్చాత్తాపంతో కుమిలి పోయాడు. 'ఈ మహాపరాధానికి దండన పొందవలసిందే' అని నిశ్చయించుకొన్నాడు.

అక్కడ ఋష్యాశ్రమంలో శమీకుని పుత్రుడు శృంగి తన తండ్రి మెడలో మృతసర్పం వ్రేలాడటం చూచి, "అవమానకరమైన ఇట్టి దుశ్చర్యకు పాల్పడినవాడు వారంరోజులలో తక్షక విషాగ్నితో దగ్ధుడగుగాక" అని శపించాడు. ఆ శాపవాక్కులు శమీకమహర్షి విని "కుమారా! తొందరపడ్డావు. క్రోధానికి వేగమెక్కువ. అట్టి క్రోధం నీవంటివానికి రాకూడదు. నీకు అధర్మబుద్ధి పుట్టినందుకు ఖేదిస్తున్నాను. ఈ లోకంలో ఏకైక ధార్మిక ప్రభువును, ప్రజారక్షకుడైన సమ్రాట్టును, మన ఆశ్రమానికి దయచేసిన గౌరవాతిథిని సత్కరించడం మాని అతడు మృత్యువాత పడేటట్లు అనుచితంగా శపించావు. ఈ విషయం శాపోపహతుడైన మన ప్రభువునకు తెలియజేయడం అవసరం. దీనికి ప్రతిక్రియ చేసి మరణం నుంచి తప్పించుకోవడానికి వీలు కాగలదేమో!" అని శమీకమహర్షి శాపవృత్తాంతాన్ని పరీక్షిన్మహారాజుకు తెలియజేయడానికి తన శిష్యులను పంపాడు.

శృంగి శాపం విని పరీక్షిత్తు కలత పడలేదు. పాండవ వంశ ప్రతిష్ఠను పాడుచేసిన తాను ప్రాయోపవేశం చేసి ప్రాణాలను విడవడం మంచిదనుకొన్నాడు. దయార్ద్రహృదయులైన ధార్మికులు, అక్రోధనులైన తపస్వులు లోకంలో అరుదు అను ఆర్యోక్తికి తాను శృంగియే సాక్షీభూతులని భావించి నిరశనవ్రతం చేయడానికి నిశ్చయించాడు. తనను పునర్జీవితుని చేసిన బ్రహ్మణ్యదేవుడైన శ్రీకృష్ణునికి అప్రీతికరంగా, బ్రాహ్మణుని అవమాన పరచిన తాను భగవంతుణ్ని ప్రసన్నుణ్ని చేసుకోవడం ఎలా అని ఆలోచించాడు. తనకీ బ్రతుకును ప్రసాదించిన శ్రీకృష్ణ భగవానుని స్మరించాడు. సమస్త పురుషార్థాలకంటె శ్రీకృష్ణ చరణ స్మరణమే అత్యంత మహత్త్వ పూర్ణమని తలచి పరీక్షిత్తు తనకు ఈ ఏడు రోజులు శ్రీకృష్ణుని గూర్చి చెప్పి, తనను ధన్యుని చేయగలవారెవ్వరా? అని అచ్చటికి చేరిన ఋషీశ్వరులను గమనింప సాగాడు. శ్రీకృష్ణభక్తుడైనవాడే తనకు నిజమైన గురువవుతాడని భావించాడు.

పరీక్షిత్తు ఈ విధంగా తలపోస్తూ ఉండగా హఠాత్తుగా అక్కడికి శ్రీశుకదేవుడు దయచేశాడు. భగవంతుని పట్ల పరమ విశ్వాసమే ఉంటే గురువుకోసం వెదుకనక్కరలేదు. గురువే తన శిష్యుని వెదకుకొంటూ వస్తాడన్నట్లుగా హఠాత్తుగా దయచేసిన శ్రీశుకులవారిని చూచి అచ్చటి ఋషీశ్వరులందరు ఆశ్చర్య సంభ్రమాలతో లేచి ఆయనకు మ్రొక్కారు. ఏ చోటను మూడు క్షణాలైనను నిలువని శ్రీశుకమహర్షి ఆసక్తితో అక్కడికి రావడం అందరిని ఆశ్చర్యపరిచింది.

పరీక్షిత్తు శ్రీశుకమహర్షి పాదాలకు మ్రొక్కాడు. ఆయన హృదయభారం కొంత తగ్గింది. తన ప్రాయోపవేశ నిశ్చయాన్ని తెలిపి "శ్రీశుకదేవా! నేడు నేను మహాభాగ్యవంతుడనయ్యాను. మిమ్ము స్మరించిన మాత్రం చేతనే గృహస్థులు తత్క్షణం పవిత్రులవుతారు. అట్టి మీ దర్శన స్పర్శన పాదప్రక్షాళన ఆసనదానాది సదవకాశం లభించిందంటే నా భాగ్యం ఎంత గొప్పదో! ఓ మహాయోగీ! ఏకాంతవాసివి, అవ్యక్తగతివి, పరమసిద్ధపురుషుడవు అయిన నీవు ఇక్కడికి విచ్చేసి ఈ ప్రాకృత మనుష్యునికి దర్శన మివ్వడం, శ్రీకృష్ణభగవానుణ్ణి పరమ సుహృత్తుగా పడసిన పాండవవంశానికి చెందిన నాపై గల కృపావిశేషమే అని నేను విశ్వసిస్తున్నాను. నీవు మహాయోగులకు పరమ గురువవు. పరమసిద్ధి స్వరూపుడవు. సాధనాపరమైన ఒక ప్రశ్న నిన్నడుగుతాను. నేను మరణాసన్నుడను కాబట్టి దయతో చెప్పవలసినదిగా ప్రార్థిస్తున్నాను.

"ఓ పరమయోగీ! మనుష్యమాత్రుడు ఆచరింపదగిన దేది? ఏ దైవమును గూర్చి వినవలె? ఎవనిని జపించవలె? ఎవనిని స్మరింపవలె? ఎవనిని భజించవలె? ఇందునిమిత్తం వదలుకోవలసినవి ఏవి? ఓ బ్రహ్మస్వరూపా! నీ దర్శనం అత్యంత దుర్లభం. ఆవు పాలిచ్చినంత సేపయినా నీవు గృహస్థజనుల దగ్గర నిలువవట. ఇంతసేపు నీ విక్కడనున్నావనగా అది మా అదృష్ట విశేషము" అని పరీక్షిత్తు తన మనోరథాన్ని తెలిపాడు. శ్రోత మనస్సులో తర్కం, వివాదం లేనప్పుడు ఉండేది కేవలం రసపిపాస మాత్రమే. అలాంటి శ్రోత అడిగిన ప్రశ్న రసస్ఫోరకమవుతుంది. రసావిర్భావానికి అదే కారణమవుతుంది. అప్పుడు శ్రీ శుకదేవుడు - **"తస్మాత్ సర్వాత్మనా రాజన్ హరిః సర్వత్ర సర్వదా, శ్రోతవ్యః కీర్తితవ్యశ్చ స్మర్తవ్యో భగవాన్నృణామ్"** - (శ్రీమద్భా 2-2-36) "పరీక్షిద్రాజా! మనుష్యుడైనవాడు సర్వకాల సర్వావస్థలలో తన సంపూర్ణశక్తితో శ్రీకృష్ణుని గూర్చి వినవలె ఆయనను కీర్తించవలె, స్మరించవలె" అని బోధించాడు.

శ్రవణ కీర్తన స్మరణ పాదసేవనాదులలో శ్రవణానికి ప్రాధాన్యమిస్తూ భగవంతుడు శ్రోతవ్యుడని తొలుతగా చెప్పాడు శ్రీ శుకదేవుడు. **"పిబంతి యే భగవత ఆత్మనః సతాం కథామృతం శ్రవణపుటేషు సంభృతం పునంతి తే విషయవిదూషితాశయం వ్రజంతి తచ్చరణ సరోరుహాంతికమ్"** (శ్రీమద్భా 2-2-37) "సత్పురుషులు భగవత్కథా మధురామృతాన్ని తమ కర్ణపుటాలతో గ్రోలుతుంటారు. వారి హృదయాలలో విషయ విష ప్రభావం

గనుక ఉంటే దాన్ని తుడిచిపెట్టి పరిశుద్ధం చేసి ఆ భాగవతకథ వారిని శ్రీకృష్ణపాదారవింద సన్నిధికి చేరుస్తుంది."

పుణ్యకథా ప్రశ్నకర్త - వక్త - శ్రోత ముగ్గురూ పరమపుణ్యులే. భాగవత సత్కథలవల్ల లోకానికి జరిగినంత ఉపకారం మరి దేనివల్లను జరుగలేదు. ఇప్పటికి లోకంలో మానవత్వం మిగిలి ఉన్నదంటే అది ఇట్టి సత్కథల పుణ్యప్రసాదమే. సత్కథల వలననే సదాచారం తెలుస్తుంది. సత్కథలు సదాచారానికి మూర్తిమంతమైన ప్రతీకలు. సత్కథల మూలంగా సదాచారహీనుడు సదాచారపరుడవుతాడు. పతనోన్ముఖుడు ఉత్థానోన్ముఖుడవుతాడు. సత్కథలు అజ్ఞుల్ని, విజ్ఞుల్ని, పాపుల్ని, పుణ్యుల్నీ అందరినీ ఆకర్షిస్తాయి. మనుష్యులకు ఉత్తమ చరితను అలవరచి లోకంలో వారిని మహాపురుషులను కావించినవి సత్కథలే అన్నది ఐతిహాసిక సత్యం. భాగవత రామాయణాది సత్కథాగ్రంథాలు మానవజాతికి సర్వోత్తమ విద్యాలయాలు. మనుష్యునికి ఇవి బోధించే పాఠాలు అన్యత్ర దుర్లభాలు. అయితే పుణ్యబలం లేకుండా, భగవత్కృప లేకుండా భగవత్కథ వినే, చదివే అవకాశం లభించదు. తార్కికుడు భగవత్కథలు వినడం వ్యర్థమనుకుంటాడు. ఇక గృహాసక్తునికి చావడానికి కూడా అవకాశం ఉండదు. కథలెలా వింటాడు?

శ్రీమద్భాగవతం అష్టమస్కంధంలో ఇరవైనాలుగు అధ్యాయాలున్నాయి. అవి నాలుగు ప్రకరణాలుగా విభక్తమయ్యాయి. ఈ నాలుగు సద్ధర్మ నిరూపణం చేయడానికి ఉద్దేశించినవి. **"మహాంతోఽత్ర యే ధర్మా ఆపత్సు హరి సంస్మృతిః, సంపత్సు సర్వదానాని నిర్వాహ్య వచనం తథా"** (భాగవతార్థ ప్రకరణమ్ 1-20) ఆ పత్సమయంలో శ్రీహరి సంస్మరణకు ఉదాహృతమైనది గజేంద్ర మోక్షణ కథ. సంపత్సమయంలో సర్వదానానికి లక్ష్యమైనది బలి చక్రవర్తికథ. స్వోక్తి నిర్వాహం పరమ ధర్మమని చెప్పడానికి బలి సుతల ప్రవేశ వృత్తాంతం. తర్వాత మత్స్యావతార చరిత్ర. సద్ధర్మ నిరూపణకు చతుర్విధ పురుషార్థ ప్రాప్తికి ఈ ప్రకరణ చతుష్టయం ఉద్దేశింపబడింది.

ప్రాయోపవిష్టుడు, మరణాసన్నుడునయిన పరీక్షిన్మహారాజు ప్రార్థింపగా, శ్రీ శుక యోగీంద్రుడు చెప్పిన గజేంద్రమోక్షణ పుణ్యకథను సూతుడు శ్రీ శుకయోగిని సంస్మరిస్తూ పరమహర్షంతో ప్రయోజన పూర్వకంగా ఉపక్రమించాడు. సూతుని అనుగ్రహ భాషణానికి చేమోడ్పులు ఘటిస్తూ మునీశ్వరులు శ్రద్ధాళులై వినసాగారు. గజేంద్ర మోక్షణ కథానకం శ్రోతలకు శ్రవణాసక్తిని, వక్తకు ప్రవచ. ోత్సాహాన్ని కలిగిస్తుంది.

ఈ ఉపాఖ్యాన ప్రారంభాన్ని బట్టే ఈ గజేంద్రమోక్షణకథ ఎంతటి మహిమ గలదో, ఎంతగా కర్మబంధ విమోచన సామర్థ్యం గలదో, అదెంతటి ప్రాచీనమైన పుణ్యకథానకమో తెలుస్తున్నది. విష్ణుదేవాలయాలలో అర్చనా సమయంలో పఠించే భగవత్ప్రీతికరమైన పంచస్తవాలలో 1. శ్రీవిష్ణుదివ్య సహస్రనామాలు, 2. భీష్మస్తవరాజం (108శ్లోకాలు) 3. గజేంద్ర మోక్షణం 4. గీత, 5. మనుస్మృతి **"పుస్తక స్యాప్యభావే విష్ణునామ సహస్రకం, స్తవరాజం మునిశ్రేష్ఠ గజేంద్రస్య చ మోక్షణం, పూజాకాలే తు దేవస్య గీతాప్రోక్త మనుస్మృతిః పంచ స్తవా మహాభాగ మహాప్రీతికరా హరేః"** అని స్కందపురాణంలోని బ్రహ్మనారద సంవాదంలో ప్రస్తావింపబడింది. గజేంద్రమోక్ష పఠనంవల్ల దుస్స్వప్నాలు సమసిపోతాయని ప్రసిద్ధి. సర్వదోషశాంతికి, శుభావాప్తికి ఆర్తి ప్రశమనతకు ప్రాతఃకాలంలో ఈ మూడు శ్లోకాలు పఠించడం మన సంప్రదాయంగా ఉంది.

**"ప్రాతః స్మరామి భవభీతిమహార్తిశాంత్యై**
**నారాయణం గరుడవాహన మబ్జనాభమ్**
**గ్రాహాభిభూతవరవారణముక్తిహేతుం**
**చక్రాయుధం తరుణవారిజపత్రనేత్రమ్**

**ప్రాత ర్నమామి మనసా వచసా చ మూర్ధ్నా**
**పాదారవిందయుగళం పరమస్య పుంసః**
**నారాయణస్య నరకార్ణవతారణస్య**
**పారాయణప్రవణవిప్రపరాయణస్య**

**ప్రాతర్భజామి భజతా మభయంకరం తం**
**ప్రాక్సర్వజన్మకృతపాపభయాపహంత్యై**
**యో గ్రాహవక్త్రపతితాంఘ్రిగజేంద్రఘోర**
**శోకప్రణాశ మకరోద్ధృతశంఖచక్రః"**

గజేంద్ర మోక్షణకథ ప్రసిద్ధమైన త్రికూట మనే పర్వత వర్ణనతో ప్రారంభమవుతుంది. త్రికూటారణ్యంలో నివసించే గజయూథనాథుడు ఈ కథానాయకుడు గజేంద్రుడు.

త్రికూటమంటే వేదాంతులు విశేషార్థాలు తీస్తారు. తీయవచ్చుకూడా. ఎందుచేతనంటే శ్రీమద్భాగవతం వేదవ్యాస మహర్షి ప్రోక్తం. ఋషి వాక్కులను గూర్చి మహాకవి భవభూతి ఏమన్నాడో చూడండి. **"లౌకికానాం హి సాధూనా మర్థం**

**వాగనువర్తతే ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోఽనుధావతి"** అన్నట్లుగా, వేదవ్యాసుడు మహర్షి. ఆయన వాక్కులను అర్థాలు వెంబడించడం కద్దు. అయితే అలా వెంబడించి సంగతమైనట్లుగా తోచే అర్థాలే ప్రధానమైనవని భావింపగూడదు. త్రికూట పర్వతారణ్యంలో గజేంద్రుడున్నాడనగా వేదాంతులు కొందరు తమ విజ్ఞానమంతా వెచ్చించి బహు దూరాలోచన చేయడం కద్దు. అది ఋషిప్రోక్తం కావడమే అందుకు కారణం. వారి పరిశీలన మిది. జీవాత్మ గజేంద్రుడు. అతడు త్రికూట పర్వతం మీద ఉన్నాడు. త్రికూటపర్వత మొక శరీరం. త్రికూట పర్వతానికి మరొక అర్థం ఏమిటంటే కామ-క్రోధ-లోభాలు త్రికూటపర్వతమయిందని. సంసారం ఒక సరోవరం. సంసారంలోని జీవి కామక్రీడాసక్తుడవుతాడు. కాలమనేది ఒక మొసలి కామక్రీడాసక్తుని మొసలి పట్టుకొంటుంది. మనుష్యుడు తాను కామసుఖాలను అనుభవిస్తున్నాననుకొంటాడు. అది అసత్యం. కామ సుఖాలే అతనిని క్రమంగా మ్రింగి వేస్తాయి. **"భోగా న భుక్తా వయమేవ భుక్తాః"** భోగాలను నేననుభవించలేదు. అవే నన్నునుభవిస్తున్నాయన్నాడు కదా భర్తృహరి. కాబట్టి ఇంద్రియాలకు కామభోగం కాకుండా భక్తిరసాస్వాదన కలిగితే ఆ జీవికి శాంతి కలుగుతుందని సారాంశం.

పై విధంగా పురాణకథలకన్నిటికి అర్థాలు కల్పించుకొంటూ పోతే చివరికవన్నీ పుక్కటి పురాణాలయ్యే ప్రమాదముంది. వేదార్థాన్ని ఉపబృంహితంచేసే పురాణాలు ప్రాచీనేతిహాసాలు. జీవుడికి పరమాత్మతత్త్వం చెప్పి, అతణ్ని ఉజ్జీవింపజేసే లౌకిక పారమార్థిక శాస్త్రాలు. వేదవ్యాసుడు భగవంతునికి జీవుణ్ని సన్నిహితుణ్ని చేశాడు. అంతేకాదు, జీవుని గుండెలో భగవంతుణ్ని సుప్రతిష్ఠితుణ్ని చేశాడు. భగవంతుడు అంశి, జీవుడు తదంశమూ అని గీతార్థాన్ని ప్రతిపదంలోను నిరూపించాడు. శ్రీమద్భాగవత వ్యాఖ్యాతలైన శ్రీధర వంశీధర వీరరాఘవ స్వామిపాదులు రసవిశేషభావనాచతురులు, మహావేదాంతులు, మహాభక్తులు. వారెవ్వరు ఇలాంటి విపరీతవ్యాఖ్యలు చేసి **'మూలచ్ఛేదం పాండిత్యం'** అనే లోకోక్తికి ఉదాహృతులైనవారు కాదు. ఆ మహనీయులు వేదవ్యాస హృదయాన్ని వెల్లడించడంలో లోకోత్తరమైన తమ విజ్ఞతను, బహుజ్ఞతను ప్రదర్శించారేకాని, అందీ అందని పొందీ పొందని అయోమయమైన వ్యాఖ్యానం చేసి వేదవ్యాసుణ్ని వెనకకు నెట్టి తాము గుర్తింపబడాలనుకొన్నవారు కాదు. వాల్మీకి రామాయణం చదివి కుశంకలు, కువ్యాఖ్యలు చేసేవారికి వేదవ్యాసమహర్షి జ్ఞానబోధ చేసేందుకు అధ్యాత్మరామాయణం రచింపవలసి వచ్చింది. ఆ రామాయణంలో ప్రథమసర్గగా "శ్రీరామ హృదయం"

రచించాడు. అందులో విపరీత వ్యాఖ్యలు చేసేవారిని ఇలా మందలించాడు. "మాయాతీత శుద్ధబుద్ధ పరమాత్ముని విషయంలో కూడా మూఢులు తమ అజ్ఞానాన్నే ఆరోపిస్తుంటారు. అనగా ఆ పరమాత్ముడు తనవంటి అజ్ఞాని అనే తలపోస్తుంటారు. కాని, తాము నిరంతరం భార్యాపుత్రుల పట్ల ఆసక్తులమనీ, పామర జీవులమనీ కర్మబంధాలలో ఇరుక్కొని సంసారచక్రంలో పడిపోయిన వారమనీ గుర్తెరుగరు. **స్వాజ్ఞాన మప్యాత్మని శుద్ధబుద్ధే స్వారోపయన్తీహ నిరస్తమాయే సంసారమేవానుసరంతి తే వై పుత్రాదిసక్తాః పురుకర్మయుక్తాః** (అధ్యాత్మరామా. 1-20) ఆ సర్గలోనే హనుమంతునికి శ్రీరాముడు చెప్పిన రహస్య విశేషాన్ని పార్వతికి శివుడు వెల్లడించాడు. "**మద్భక్తి విముఖానాం హి శాస్త్రగర్తేషు ముహ్యతాం న జ్ఞానం న చ మోక్షః స్యాత్తేషాం జన్మశతైరపి**" నాయందు భక్తిని విడిచిపెట్టి శాస్త్రమనే అగాధ గర్తం (గుంట)లో కూరుకొని పోయినవారు నూరు జన్మలెత్తినా జ్ఞానాన్నీ పొందలేరు, మోక్షాన్నీ పొందలేరు అని.

గజేంద్రమోక్షణ పుణ్యకథ చతుర్థమన్వంతరంలోని కథానకము. ఈ మన్వంతరంలోగల త్రికూట పర్వతారణ్యయథార్థ స్థితినే తెలుపుతున్నది ఈ వర్ణన. గజేంద్ర మోక్షణ కథ శ్రీమద్భాగవతంలోనే కాక, వామన పురాణంలో కూడా ఉంది. ఈ రెండు గ్రంథాలలోను త్రికూటపర్వతారణ్య వర్ణన అతివేలంగా ఉంది.

కవుల వర్ణనలలో అతిశయోక్త్యలంకారం గర్భితమై ఉంటుంది. సమస్తాలంకారాలకు బీజమైనది అతిశయోక్తి. "**నిమిత్తతో వచో యత్తు లోకాతిక్రాంతగోచరం, మన్యతే ఽతిశయోక్తిం తా మలంకారతయా యథా**" అని అతిశయోక్తిని నిర్వచించాడు ప్రథమాలంకారికుడు భామహాచార్యుడు. ఏదో ఒక నిమిత్తంతో లోకాతిక్రాంతమూ, అలౌకికమూ అయిన అర్థాన్ని వర్ణన చేస్తే అది అతిశయోక్త్యలంకారమవుతుందని దాని అర్థం.

కవులు సాధారణంగా పర్వతారణ్య ప్రదేశాలను వర్ణించేటప్పుడు కవి సమయాలను పాటిస్తారు. "**శైలే మహౌషధీ ధాతు వంశకిన్నర నిర్ఝరాః, శృంగ పాదగుహారత్న వన జీవాద్యుపత్యకాః**" ఇవి కవి సమయాలు. "**అరణ్యే హి వరాహేభయూథ సింహాదయో ద్రుమాః కాకోలూక కపోతాద్యా ఖిల్లభల్లూ దవాదయః**"

ఏ పర్వతాన్నయినా, ఏ అరణ్యాన్ని అయినా వర్ణించేటప్పుడు కవులు అతిశయోక్తిని ప్రయోగించడం కవి సమయ సిద్ధమైన విషయం. అడవి వర్ణనలో ఏనుగుల ఉనికిని చెప్పకపోతే ఆ వర్ణన లోపభూయిష్ఠమై కవిగారి అవ్యుత్పన్నతను తెలుపుతుంది. అది కావ్యత్వాన్ని కోల్పోతుంది. అదికాక, ఏనుగులున్న అరణ్యమే గహనారణ్యమవుతుంది.

శ్రీమద్భాగవతం సర్వపురాణ శిరోమణి మాత్రమే కాదు; అది యొక కావ్యమని కూడా హేమాద్రి తన ముక్తాఫల వ్యాఖ్యలో పేర్కొన్నాడు. **"వేదాః పురాణం కావ్యం చ ప్రభుః మిత్రం ప్రియేవ చ బోధయన్తీతి హి ప్రాహుః త్రివృద్భాగవతం పునః"**శ్రీమద్భాగవతంలో వేద - పురాణ - కావ్యాల త్రిగుణాలు ఉన్నాయి. శ్రీమద్భాగవతం వేదం వలె ప్రభుసమ్మితం. ప్రభువు ఆజ్ఞాపించిన విధానాన్ని మంత్రులు ఆచరిస్తారు - అది భద్రమైనదైనా అభద్రమైనదైనా విచారించకుండా పనిచేస్తారు. శ్రీమద్భాగవతం పురాణం వలె మిత్రసమ్మితం. మిత్రునివలె ప్రమాణయుక్తి సాపేక్షంగా బోధిస్తుంది. శ్రీమద్భాగవతం కాంతా సమ్మితం. ప్రేయసి వలె సరసతను ఆపాదించి బోధిస్తుంది. కాబట్టి శ్రీమద్భాగవతం సర్వోత్తమమైనదన్నాడు హేమాద్రి. ఈ విధంగా త్రివిధ గుణాలతో సదుపదేశమిచ్చి జీవులను కృతార్థులను చేస్తుంది శ్రీమద్భాగవతం. నిజమేకాని, శ్రీమద్భాగవతాన్ని కేవలం కావ్యంగా భావింపగూడదు. వేదవ్యాసుడు కావ్యం రచింపదలచినవాడు కాదు. ఆయన కవి కాదు. ఆయన మహాతత్త్వవేత్త. కవులను మించినవాడు. భగవంతుని జ్ఞానధర్మంగా అవతరించిన మహాపురుషుడు. తాను వాస్తవం చెబుతున్నానని భాగవతాదియందే ప్రతిజ్ఞ చేసినవాడు. **"ధర్మః ప్రోజ్ఝిత కైతవోఽత్ర పరమో నిర్మత్సరాణాం సతాం, వేద్యం వాస్తవ మత్ర వస్తు శివదం తాపత్రయోన్మూలనమ్"** (శ్రీమద్భా 1-1-3) ఇట్టి ఆశయంతో వ్యాసుడు ప్రవచించిన శ్రీమద్భాగవతం కాంతా సమ్మితమైన గోపీభావ రమణీయోపదేశం కూడా చేస్తుందని చెప్పడం వల్ల దాని ప్రాశస్త్యాన్ని, ఋషివాక్య మహిమను మనం ఆకళించుకొనవచ్చు.



# గజేంద్ర మోక్షము

## గోపీవయహోత్పలార్చితవ్యాఖ్యావిలసితము

## ఉత్తరణిక

మొసలివాతబడిన గజేంద్రుని శ్రీహరి రక్షించాడని శ్రీశుకయోగి చతుర్థమన్వంతర రామచరితం ప్రారంభించగానే, పరీక్షిన్మహారాజు "ఓ యోగీంద్రా! మొసలివాత బడిన గజేంద్రుణ్ణి శ్రీహరి ఎలా రక్షించాడో విని ధన్యుణ్ణి కావాలనుకొంటున్నాను. ఆ కథ మంగళ ప్రదమైనది. కర్మబంధ నివారకమైనది. ఉత్తమ శ్లోకుడైన శ్రీహరి కీర్తనము సుమహత్పుణ్యమైనది" అని తన ఆతురతను వెల్లడించడంలో ఆ మహారాజు ఇంతకు ముందే ఈ పుణ్యకథను వినియున్నాడనీ, దాని మహిమను తెలుసుకొన్నాడనీ ద్యోతకమవుతున్నది. ధర్మరాజ కుటుంబంలో జన్మించిన పరీక్షిత్తుకు మహా మహిమోపేతమైన ఈ కథ తెలియక పోలేదు. ఇప్పుడతడు ప్రాయోపవిష్టుడు, కేవలం శ్రీహరి కీర్తనాసక్తుడు అయినాడు. మహాయోగి అయిన శ్రీశుకుని నోట ఆ పుణ్యకథను చెప్పించుకొని విని తరించాలనుకొన్నాడు.

**కం. మునినాథ! ఈ కథాస్థితి వినిపింపుము వినఁగ నాకు వేడుక పుట్టెన్**
**వినియెదఁ గర్ణేంద్రియములు పెనుఁబండువు సేయ మనముఁ బ్రీతింబొందన్**

టీ : మునినాథ = ఓ శుకమహర్షీ! ఈ కథా స్థితిన్ = ఈ కథలోని ఉన్నరూపును; వినిపింపుము. వినగవేడుక పుట్టెను. కర్ణ+ఇంద్రియములు = చెవులు; పెనుఁబండువు చేయన్ = మహోత్సవము కలిగింపగా; మనము = మనస్సు; ప్రీతిన్ పొందన్ = సంతృప్తి పడునట్లుగా, వినియెదన్ = విందును.

తా : ఓ శుకమహర్షీ! ఈ కథ నీ నోట వినవలెనని బుద్ధి పుట్టినది. కావున, దయతో వినిపింపుము. చెవులకు పండువుగా, మనసునకు సంతృప్తిగా వింటాము.

**కం. ఏ కథల యందుఁ బుణ్య శ్లోకుఁడు హరి సెప్పఁబడును సూరిజనముచే**
**నా కథలు పుణ్యకథలని యాకర్ణింపుదురు పెద్ద లతిహర్షమునన్**

టీ : ఏ కథలయందున్= ఏ కథలలో; పుణ్యశ్లోకుడు = పుణ్యులచే కీర్తింపబడువాడైన, హరి = శ్రీహరి; సూరిజనులచే = పండితులైన వారిచే, చెప్పంబడున్ = చెప్పబడునో, ఆ కథలు పుణ్యకథలని పెద్దలు, అతిహర్షమునన్ = మిక్కిలి సంతోషముతో; ఆకర్ణింపుదురు = విందురు.

తా : పండితులచే ఏయే కథలందు శ్రీహరి వర్ణింపబడతాడో అవి పుణ్యప్రదములైనవని పెద్దలు సంతోషంతో వింటారు.

పుణ్యకథలే సత్కథలు. భగవత్కథలు 'సత్' శబ్దము 1. పరమాత్మవాచకము. 2. సత్తావాచకము. 3. శ్రేష్ఠవాచకము లేదా సాధువాచకము - హృదయంలో క్షమ - దయాది ఉత్తమ గుణాలు 4. ఉత్తమ ఆచరణము. 5. ఉత్తమ కార్యము 6. భగవదర్థమైన కర్మవాచకము. ఈ ఆరింటితో వర్ణింపబడిన కథ సత్కథ అవుతుంది. మానవుడు ప్రగతిశీలుడైన ప్రాణి. అతడు ఏ ప్రయత్నం చేయకుండానే తాను ఔన్నత్యం పొందాలని కోరుకోవడం కూడా కద్దు. ఈ కారణంతో అతడు ఔన్నత్యం పొందడానికి సత్కథలపట్ల ఆకృష్టుడు కావడం జరుగుతుంది.

**వ. శుకుండు రాజున కిట్లనియె**

**సీ. రాజేంద్ర! విను. సుధారాశిలో నొకపర్వ**
**తము త్రికూటంబనఁ దనరుచుండు**
**యోజనాయుత మగు నున్నతత్వంబును**
**నంతియ వెడలుపు నతిశయిల్లఁ**
**గాంచనాయస్సార కలధౌతమయములై**
**మూఁడు శృంగంబులు మొనసియుండుఁ**
**దటశృంగ బహురత్న ధాతుచిత్రితములై**
**దిశలు భూనభములు దేజరిల్లు**

**భూరి భూజలతా కుంజ పుంజములును**
**మ్రోపి పఱతెంచు సెలయేటి మొత్తములును**
**మరగి తిరిగెడు దివ్య విమానములును**
**జఱులఁ గ్రీడించు కిన్నరచయము గలిగి**

టీ: రాజేంద్ర! = ఓ రాజోత్తమా! విను. సుధారాశిలో = పాలసముద్రంలో, యోజన+అయుతమగు = పదివేల ఆమడల పొడవు కలిగిన; ఉన్నతత్వంబును = ఎత్తును; అంతయు వెడలుపు =

అంతటి మేరయే వెడల్పును; అతిశయిల్లన్ = పెంపొందునట్లు; కాంచన+అయస్+సార కలధౌతమయములై = బంగారు, ఇనుము, వెండితో నిండినవై; మూడు శృంగములు = మూడు కూటములు; మొనసియుండున్ = కలిగి యుండును; తట శృంగ = ప్రక్కలనున్న శిఖరములు; బహురత్నధాతు చిత్రితములై = పెక్కు రత్నముల చేతను, గైరికాది ఎఱ్ఱని ధాతువులచేతను; చిత్రితములై = చిత్రింపబడినవై; దిశలున్ = దిక్కులును; భూ నభములున్ = భూమి ఆకాశములును; తేజరిల్లున్ = ప్రకాశించును; భూరి = అనేకములైన, భూజ = చెట్ల యొక్కయు; లతాకుంజ = పొదరిండ్ల యొక్కయు; పుంజములును = సమూహములును; మ్రోసి = ధ్వనించి; పఱతెంచు = ప్రవహించునట్టి, సెలయేటి మొత్తములును = కొండవాగుల సమూహములును; మరగి = అలవాటుపడి; తిరిగెడు; దివ్యవిమానములును = దేవతల విమానములును; చఱులన్ = కొండ చఱియల యందు; క్రీడించు = విహరించు; కిన్నర చయము = కిన్నరుల సమూహము, కలిగి, త్రికూటంబన = త్రికూటమను పేరుగల ఒక పర్వతము; తవరు చుండున్ = శోభించుచుండును.

తా : ఓ రాజోత్తమా! వినుము. పాలసముద్రంలో * త్రికూటమనే పర్వతమున్నది. అది పదివేల ఆమడల ఎత్తు, అంతే వెడల్పుగాను ఉన్నది. బంగారు, ఇనుము, వెండి శిఖరాలు కలది ఆ పర్వతం. ఆ కొండ చఱియలలో గల బహువిధరత్నాలు, ధాతువులు భూమ్యాకాశాలను ప్రకాశింపజేస్తుంటాయి. పెక్కు పొదరిళ్లతో, రొదచేసే సెలయేళ్లతో శోభాయమానమైన ఆ పర్వతాన్ని చూడటానికి దేవతలు విమానాలలో వస్తుంటారు. అది కిన్నరులకు క్రీడాస్థలంగా ఉంది.

**అది మఱియును మాతులుంగ లవంగ లుంగ చూత కేతకీ భల్లాతకామ్రాతక సరళ పనస బదరీ వకుళ వంజుళ వట కుటజ కుంద కురవక కురంటక కోవిదార ఖర్జూర నారికేళ సింధువార చందన పిచుమంద మందార జంబు జంబీర మాధవీ మధూక తాల తక్కోల తమాల హింతాల రసాల సాల ప్రియాళుబిల్వామలక క్రముక కదంబ కరవీర కదళీ కపిత్థ కాంచన కందరాళ శిరీష శింశుపాశోక పలాశ నాగ పున్నాగ చంపక శతపత్ర మరువక మల్లికామతల్లికా ప్రముఖ నిరంతర వసంత సమయ సౌభాగ్యసంపదంకురిత పల్లవిత కుసుమిత ఫలితలలిత విటప విటపి వీరున్నివహాలంకృతంబును,**

**మణివాలుకావేక విమల పులిన తరంగిణీ సంగత విచిత్ర విద్రుమలతా మహోద్యాన**

---

* త్రికూట పర్వతం సింహళంలో ఉన్నదంటారు. చిత్తూరు జిల్లాలో గల కార్వేటి నగరంలోని స్కంద పుష్కరిణిలో గజేంద్రమోక్షం జరిగిందనీ, ఈ విషయం వరాహ, విష్ణు, పద్మ పురాణాల్లో ప్రస్తావింపబడిందనీ శ్రీ స్వామి లక్ష్మణాచార్యులు గారు ఒక పత్రాన్ని శ్రీ చల్లా సాంబిరెడ్డిగారికి అందజేశారు. ఇప్పటికి అక్కడ సమీపారణ్యంలో ఏనుగులనేకం ఉండటం వాస్తవమే. కాని, త్రికూటపర్వతం, పాలసముద్రం మాటేమిటి?

శుక పిక నికర నిశిత సమంచిత చంచూపుట నిర్దళిత శాఖి శాఖాంతర పరిపక్వ ఫలరంధ్ర ప్రవర్షిత రస ప్రవాహ బహుళంబును,

కమనీయ సలిలకాసార కాంచన కుముద కల్హార కమల పరిమళ మిళిత కబళాహార సంతతాంగీకార భార పరిశ్రాంత కాంతా సమాలింగిత కుమార మత్తమధుకర విట సముదయ సమీప సంచార సముదంచిత శకుంత కలహంస కారండవ జలకుక్కుట చక్రవాక బక బలాక కోయష్టిక ముఖర జల విహంగ విసర వివిధ కోలాహల బధిరీ భూత భువనభోంతరాళంబును,

తుహినకరకాంత మరకత కమలరాగ వజ్రవైడూర్యనీలగోమేధిక పుష్యరాగ మనోహర కనక కలధౌత మణిమయా నేక శిఖర తటదరీ విహరమాణ విద్యాధర విబుధ సిద్ధ చారణ గరుడ గంధర్వకిన్నర కింపురుష మిథున సంతత సరససల్లాప సంగీత ప్రసంగ మంగళాయతనంబును,

గంధగజ గవయ గండభేరుండ ఖడ్గ కంఠీరవ శరభ శార్దూల చమర శల్య భల్ల సారంగ సాలావృక వరాహ మహిష మర్కట మహోరగ మార్జారాది నిఖిల మృగనాథ సమూహ సమర సన్నాహ సంరంభసంచకిత శరణాగత శమన కింకరంబునునై యొప్పు నప్పర్వత సమీపంబునందు.

టీ : అది = ఆ త్రికూట పర్వతము; మరియును, మాతులుంగ = మాదీఫలవృక్షాలు; లవంగ = లవంగలతలు, లుంగ = పుల్లని మాదీఫల తరువులు; చూత = మామిడి; కేతకీ = మొగలి; భల్లాతకీ = జీడిచెట్లు; ఆమ్రాతక = అంబాళపు చెట్లు; సరళ = తెల్ల తెగడ, పనస = పనసచెట్లు; బదరీ = రేగు; వకుళ = పొగడ; వంజుళ = ప్రబ్బలిచెట్లు; వట = మఱ్ఱి; కుటజ = కొండ మల్లె; కుంద = మల్లె; కురవక = ఎఱ్ఱగోరంట; కురంటక = పచ్చపువ్వుల గోరంట; కోవిదార = కాంచనపు చెట్లు; ఖర్జూర - నారికేళ = ఖర్జూరపు చెట్లు, కొబ్బరి చెట్లు; సింధువార = వావిలి; చందన = గంధపు చెట్లు; పిచుమంద = వేపచెట్లు; మందార = మందారపు మొక్కలు; జంబు = నేరేడు చెట్లు; జంబీర = నిమ్మచెట్లు; మాధవ = గురువెంద; మధూక = ఇప్పచెట్లు; తాల = తాటి; తక్కోల = తక్కోలమనే చెట్లు; తమాల = చీకటి మ్రానులు; హింతాల = గిరికతాడి; రసాల = తీయమామిడి; సాల = మద్దిచెట్లు; ప్రియాళు = మోరటి చెట్లు; బిల్వ = మారేడు చెట్లు;ఆమలక = ఉసిరిక; క్రముక = పోక; కదంబ = కడిమి; కరవీర = గన్నేరు; కదళీ = అరటి; కపిత్థ = వెలగ; కాంచన కందరాళ = జువ్విచెట్లు; శిరీష = దిరిసెన; శింశుపా= విరుగుడు; అశోక = అశోకపుచెట్లు; పలాశ = మోదుగ; నాగ = పొన్నలు; పున్నాగ = సురపొన్నలు; చంపక = సంపెంగలు; శతపత్ర = తామరలు; మరువక = మరువము; మల్లికా మతల్లికా = ఉత్తమ జాతి మల్లెలు; ప్రముఖ = మొదలైన వృక్షముల చేత;

నిరంతర = ఎల్లప్పుడు; వసంత సమయ = వసంతకాల, సౌభాగ్యసంపత్ = సౌభాగ్య లక్ష్మిచే, అంకురిత = మొలచుటచేత; కుసుమిత = పూయుటచేత; లలిత = మృదువైన; విటపవిటపి = కొమ్మలు గలచెట్లు; వీరుత్ + నివహ = పాదల గుంపులచే; అలంకృతంబును = అలంకరింపబడి నదియును,

మణివాలుకా = మణులతో కూడిన ఇసుక; అనేక = నానావిధములైన; పులిన = ఇసుక తిన్నెలుగల; తరంగిణీ = నదులతో; సంగత = కూడిన; విచిత్ర విద్రుమ = విచిత్రములైన పగడపు; లతా = తీగలునుగల; మహా+ఉద్యాన = పెద్ద తోటలవంటి చోట్ల; శుక = చిలుకల; పిక = కోయిలల; నికర = సమూహముచే; నిశిత = వాడియైన; సమంచిత = ఒప్పిదమైన; చంచూపుట = ముకుదొప్పలచే; విర్దళిత = పగుల గొట్టబడిన; శాఖి = చెట్ల యొక్క; శాఖా+అంతర = కొమ్మల నడుమ యందలి; పరిపక్వ = చక్కగా పండిన; ఫలరంధ్ర = ఫలరంధ్రములనుండి; ప్రవర్షిత = కురిపింపబడిన; రస ప్రవాహ = రసధారలచేత; బహుళంబును = నిండినదియు,

కనకమయ = బంగారు రంగుతో నిండిన, సలిల = నీరుగల; కాసార = కొలనులందలి, కాంచన కుముద = బంగారు కలువల, కల్హార = ఎఱుపు తెలుపుగల సౌగంధికముల; పరిమళ = సుగంధములచే; మిళిత = కూడిన; కబళ+ఆహార = తిను నాహారముగల (మధువు గల), సంతత+ అంగీకార = సర్వదా అంగీకరించునట్టి; భార పరిశ్రాంత = బరువుచే అలసిన; కాంతా సమాలింగిత = ప్రియురాండ్రచే కౌగిలించుకొనబడిన; కుమార = లేత వయస్సునందుండు; మత్త మధుకర విట = మదించిన తేనెటీగ లనెడి విటుల; సముదయ = సమూహమునకు, సమీప సంచార = దగ్గరగా తిరుగుటచే; సముదంచిత = ఒప్పినటులుండు; శకుంత = శకుంతములు; (పక్షులు); కలహంస = హంసలు, కారండవ = కారుండువులను జల పక్షులు; జలకుక్కుట = నీటికోళ్లు, చక్రవాక = జక్కవలు; బక = కొంగ; బలాక = కొక్కెర; కోయష్టిక = చీకు కొక్కెర; ముఖరజల విహంగమ = రొదచేయుచున్న జలపక్షుల; నిసర = సమూహముచే; వివిధ కోలాహల = బహువిధములైన గగ్గోలులచే; బధిరీభూత = చెవుడు పడునట్లుగా చేయబడిన, భూనభస్ + అంతరాళంబు = భూమ్యాకాశాల మధ్యభాగము కలదియు;

తుహినకర కాంత = చంద్రకాంతపు రాళ్లును, మరకత; కమలరాగ; వజ్ర, వైడూర్య, నీల, గోమేధిక, పుష్యరాగములచే మనోహరమై, కనక = బంగారముతోను, కలధౌతమయ = వెండితోను నిండిన; అనేక = పెక్కు; శిఖరతటదరీ = కొండ ప్రక్కలయందలి గుహలలో, విహరమాణ = విహారమొనర్చుచున్న; విద్యాధరులు, దేవతలు, సిద్ధులు, చారణులు, గరుడులు, గంధర్వులు, కిన్నరులు, కింపురుషులు అను దేవతాజాతులయొక్క; మిథున = దంపతుల యొక్క; సంతత = ఎల్లవేళల; సరసపల్లాప = రసవంతములైన సంభాషణములతోను; సంగీత ప్రసంగ = సంగీత చర్చలతోను; మంగళ - ఆయతనంబును = మంగళములకు ఆలయమును,

గంధగజ = మదపు టేనుగులు; గవయ = గురుపోతులు, గండభేరుండ = గండభేరుండములను మృగములతోను, ఖడ్గ = ఖడ్గమృగములతోను, కంఠీరవ = సింహము; శరభ = ఎనిమిదికాళ్ల మృగము; శార్దూలము = పులి; శశ = కుందేలు; చమర = చమరీమృగము; శల్య = ముళ్లపంది; భల్ల = ఎలుగు; సారంగ = జింక; సాలావృక = తోడేలు; వరాహ = అడవిపంది; మహిష = అడవిదున్న; మర్కట = కోతి; మహా+ఉరగ = పెనుబాము; మార్జార + ఆది = పిల్లి మొదలగు, నిఖిలమృగనాథ = సకల మృగశ్రేష్ఠములయొక్క; సమూహ = బృందముల యొక్క; సమర సన్నాహ = యుద్ధసన్నాహమునందలి; సంరంభసంచకిత = హడావడిచేత భయపడిన వారలై; శరణాగత = శరణు వేడుకొనిన; శమన కింకరులును = యమభటులు కలదియు; అయి ఒప్పు = శోభిల్లు, ఆ +పర్వత సమీపంబునందు = ఆ కొండ చేరువ.

**శ్రీశుక ఉవాచ**

**శ్లో. ఆసీద్గిరివరో రాజంస్త్రికూట ఇతి విశ్రుతః**
**క్షీరోదేనావృతః శ్రీమాన్ యోజనాయుతముచ్ఛ్రితః**
**తావతా విస్తృతః పర్యక్ త్రిభిః శృంగైః పయోనిధిం**
**దిశః ఖం రోచయాన్నాస్తే రౌప్యాయస హిరణ్మయైః**

**అన్యైశ్చ కకుభః సర్వా రత్నధాతువిచిత్రితైః**
**నానాద్రుమలతాగుల్మైర్నిర్ఘోషైర్నిర్ఝరాంభసాం**

**స చావనిజ్యమానాంఘ్రిః సమంతాత్ పయ ఊర్మిభిః**
**కరోతి శ్యామలాం భూమిం హరిన్మరకతాశ్మభిః**

**సిద్ధచారణగంధర్వ విద్యాధర మహోరగైః**
**కిన్నరై రప్సరోభిశ్చ క్రీడద్భిరుష్టకందరః**

**యత్ర సంగీత సన్నాదై ర్నదద్గుహ మమర్షయా**
**అభిగర్జంతి హరయః శ్లాఘినః పరశంకయా**

**నానారణ్య పశువ్రాత సంకుల ద్రోణ్యలంకృతః**
**చిత్రద్రుమ సురోద్యాన కలకంఠవిహంగమః**

**సరిత్సరోభిరచ్ఛోదైః పులినై ర్మణివాలుకైః**
**దేవస్త్రీ మజ్జనామోద సౌరభామ్బ్వనిలైర్యుతః**

**తస్య ద్రోణ్యాం భగవతో వరుణస్య మహాత్మనః**
**ఉద్యాన మృతుమన్నామ ఆక్రీడం సురయోషితాం**

సర్వతోఽలంకృతం దివ్యై ర్నిత్యపుష్పఫలద్రుమైః
మందారైః పారిజాతైశ్చ పాటలాశోకచంపకైః

చూతైః ప్రియాలైః పనసై రామ్రైరామ్రాతకై రపి
క్రముకై ర్నారికేలైశ్చ ఖర్జూరై ర్బీజపూరకైః

మధూకైః పాలతాలైశ్చ తమాలై రసనార్జునైః
అరిష్టోదుంబరప్లక్షైర్వటైః కింశుకచందనైః

పిచుమందైః కోవిదారైః సరలైః సురదారుభిః
ద్రాక్షేక్షురంభా జంబూభిర్బదర్యక్షాభయామలైః

బిల్వైః కపిత్థైర్జంబీరై ర్వృతో భల్లాతకాదిభిః
తస్మిన్ సరః సువిపులం లసత్కాంచనపంకజమ్

కుముదోత్పల కల్హార శతపత్రశ్రియోర్జితమ్
మత్తషట్పద నిర్ఘుష్టం శకుంతైశ్చ కలస్వనైః

హంస కారండవాకీర్ణం చక్రాహ్వైః సారసైరపి
జలకుక్కుట కోయష్టిదాత్యూహకులకూజితమ్

మత్స్యకచ్ఛపసంచారచలత్పద్మరజః పయః
కదంబవేతసనలనీపవంజులకై ర్వృతమ్

కుందైః కురవకాశోకైః శిరీషైః కుటజేంగుదైః
కుబ్జకైః స్వర్ణయూథీభిర్నాగపున్నాగ జాతిభిః

మల్లికాశతపత్రైశ్చ మాధవీజాలకాదిభిః
శోభితం తీరజైశ్చాన్యై ర్నిత్యర్తుభిరలం ద్రుమైః

తా : క్షీరాబ్ధి సమీపంలో త్రికూటమనే సుందరమూ, శ్రేష్ఠమూ అయిన సుప్రసిద్ధపర్వతమున్నది. అది పదివేల యోజనాల పొడవు గలది. అంతే వైశాల్యంతో నలువైపుల విస్తరించి ఉన్నది. ఆ పర్వతానికి వెండి - ఇనుము - బంగారు శిఖరాలు మూడున్నాయి. ఆ శిఖరాలు తమకాంతులతో సముద్రాన్ని, దిక్కులను ప్రకాశింపజేస్తుంటాయి. రత్న ధాతువుల రంగురంగుల కాంతులతో దిక్కులను

దేదీప్యమానంగా ప్రకాశింపజేస్తుంటాయి. ఆ పర్వతం మీద వివిధ జాతుల వృక్షాలు, లతానికుంజాలు, శబ్దిస్తున్న సెలయేళ్లు ఉన్నాయి. సముద్ర తరంగాలు ఆ పర్వతరాజ పాదపీఠాన్ని కడుగుతున్నట్లుంటాయి. అక్కడి నీటి పాచి, పచ్చికబయళ్ల భూమిని శ్యామలీకృతం చేస్తుంటాయి. ఆ కొండ గుహలలో సిద్ధులు, చారణులు, గంధర్వులు, విద్యాధరులు, నాగులు, కిన్నరులు, అప్సరసలు మొదలైనవారు విహరిస్తుంటారు. వారి సంగీత ధ్వనులు గుహాముఖాలనుండి ప్రతిధ్వనిస్తుంటాయి. గర్వించిన సింహం ఆ ధ్వని విని మరొక సింహం గర్జిస్తున్నదనే భ్రమతో ప్రతిగర్జన చేస్తుంటుంది. ఆ పర్వతానికి దిగువ అడవి మృగాలు గుంపులు గుంపులుగా తిరుగుతుంటాయి. దేవతల ఉద్యానవనం అక్కడొకటి ఉంది. అందులో వివిధ జాతుల తరులతలు అనేకమున్నాయి. పక్షుల కలకూజితాలతో ఆ చోటు ముఖరితమవుతుంటుంది. అక్కడ ఎన్నో సెలయేళ్లు, సరోవరాలు ఉన్నాయి. అందలి జలాలు బహునిర్మలాలు. అచ్చటి నదీ పులినాలు మణి శకలాలతో మెరుస్తుంటాయి. సురాంగనలు ఆ సరోవరాలలో జలక్రీడలాడుతుంటారు. వారి శరీరసౌరభంతో ఆ జలాలు సుగంధిలమవుతుంటాయి. ఆ సుగంధాలను కలుపుకొని మెల్లమెల్లని గాలులు వీస్తుంటాయి. ఆ త్రికూట పర్వత నిమ్న భూమిలో వరుణదేవుని ఉద్యానవన మొకటి ఉన్నది. దానిపేరు ఋతుమంతము. అక్కడ దేవతాస్త్రీలు ఉల్లాసంగా విహరిస్తుంటారు. అక్కడ శోభాయమానమైన దివ్యవృక్షాలు, వాటికి పువ్వులు, ఫలాలు సర్వదా నిండి ఉంటాయి. ఆ ఉద్యానవనంలో మందారాలు, పారిజాతాలు, గులాబులు, అశోకాలు, చంపకాలు, పుల్లమామిళ్లు, మోరటి, పనస, తియ్య మామిళ్లు, అంబాళం, పోక, కొబ్బరి, ఖర్జూరం, దాడిమ, ఇప్ప, మద్ది, తాడి, మఱ్ఱి, మోదుగు, చందనం, వేము, కోవిదారం, దేవదారువు, సురదారువు, నేల ఉసిరి, మారేడు, వెలగ, నిమ్మ, మరువం, తెల్లగగ్గెర, తాండ్ర మొదలైన వృక్షాలున్నాయి. ఆ వనంలోనే ఒక పెద్ద సరోవరం ఉంది. అందులో స్వర్ణకమలాలు విరియబూచి ఉంటాయి. వివిధ జాతులకు చెందిన కుముద ఉత్పల - కల్హార - శతదళాది పద్మాలు అత్యద్భుత కాంతులతో విరాజిల్లుతుంటాయి. వాటిపై మదించిన తుమ్మెదలు ఝంకృతులు చేస్తుంటాయి. పక్షులు మనోజ్ఞంగా కలరవాలు చేస్తుంటాయి. హంస, కారండవ, చక్రవాక, సారస పక్షులు గుంపులుగూడి ఉంటాయి. నీటికోళ్లు, నీటిగంపపులుగులు, బాతులు ఇంపుగా కూస్తుంటాయి.

చేపలు, తాబేళ్లు నీళ్లల్లో ఎగురులాడటం వల్ల కమల పరాగాలు రాలి నీళ్లకు సౌభాగ్యాన్ని, సౌగంధ్యాన్ని సంతరిస్తుంటాయి. కదంబ, ప్రబ్బలి, కిక్కిస, కసవు, నీరు, కడిమి, తిమిశం మొదలైన వృక్షాలు ఆ సరస్సును చుట్టుముట్టి దట్టంగా ఉన్నాయి. మల్లెలు, గోరంట, అశోకం, దిరిసెన, కొండమల్లి, అంగుదం, నెమ్మి, పచ్చ మల్లె, నాగకేసరం, పొన్న, జాజి, మల్లి, శతపత్ర పద్మం, బండిగురువెంద, కాసెమున్నగు తరులతలతో ఆ సరోవరతటం శోభిస్తుంటుంది.

ఏనుగులు నివసించే అడవి వర్ణనమిది. అడవులలో అడవి ఎద్దులు, దున్నలు, గొర్రెలు, లేళ్లు మొదలైన అల్పజంతువులు కూడా ఉంటాయి. అవి అక్కడక్కడ కొంచెం కొంచెంగా లభించిన పచ్చిక తిని సుఖపడుతుంటాయి. గుహలలో తలదాచుకొంటాయి. ఏనుగులు అలా కాదు; వాటి ఆస్థానం మదజలధారలతో పంకిలమైన వింధ్యాద్రి మహావిపినంగాని, మహారాజుల సదనంగాని అయి ఉంటుందన్న ఈ సొగసైన శ్లోకాన్ని చిత్తగించండి. "**విషేవంతా మేతే వృష మహిషమేషాళ్ళ హరిణా గృహా క్షుద్రార్హాణి కతిపయతృణైరేవ ముఖిన:, గజానా మాస్థానం మదసలిల జంబాలిత భువాం, తదేకం వింధ్యాద్రే ర్విపిన మథవా భూపసదనమ్.**"

**కం. భిల్లీ భల్ల లులాయక భల్లుక ఫణి ఖడ్గ గవయ బలిముఖ చమరీ**
**ఝిల్లి హరిశరభ కరికిటి మల్లాద్భుత కాకఘూక మయమగు నడవిన్**

టీ : భిల్లీభల్ల = ఆడు మగ బోయవారు, లులాయక = అడవిదున్నలు, భల్లుక = (ప్రాచీనమైన) ఎలుగుబంట్లు, ఫణి = సర్పములు; గవయ = గురుపోతులు, బలిముఖ = కొండముచ్చులు, చమరీ = చమరీ మృగములు, ఝిల్లి = ఈల పురుగులు; హరి = సింహములు; శరభ = శరభమృగములు, కరి = ఏనుగులు; కిటిమల్ల = శ్రేష్ఠములైన పందులతో; అద్భుత = ఆశ్చర్యము గొప్ప; కాక = కాకులు, ఘూక = గుడ్లగూబలతో; మయమగు = నిండిన, అడవిన్ = (దట్టమైన) అడవిలో

తా : కిరాత సమూహాలతోను, సింహశరభాది క్రూరమృగాలతోను, కాకఘూకాది పక్షిగణాలతోను భీకరమైన అరణ్యమునందు.

ఏనుగుల పుట్టుకకు నెలవైన అడవి ఇంతటి గహనమై ఉన్నదని ఈ వర్ణన తెలుపుతున్నది. ప్రాచీన మన్వంతరాలలో భౌగోళిక పరిస్థితులను బట్టి మహర్షులు శైలారణ్యోద్యానవనాలను గూర్చి చేసిన వర్ణన యథావస్తువర్ణనమైనప్పటికీ, తర్వాతి కవులకు అదియొక ఒరవడి అయింది. శైల - అరణ్య - ఉద్యానవనాలను

వర్ణించేటప్పుడు తెలుగు కవులు వచనాన్ని ఉపయోగించుకోవడం కూడా మహర్షులు చూపిన ఛందోవిచితియే కారణమనిపిస్తుంది. "**అరణ్యే హి వరాహేభయూథసింహోదయో ద్రుమాః కాకోలూక కపోతాద్యాభిల్లభల్లూ దవాదయః ఉద్యానే సరితః సర్వఫల పుష్పలతా దయః పికాలికేలి హంసాద్యాః క్రీడాచాపృథ్వగ స్థితిః, శైలే మహౌషధీధాతు వంశ కిన్నర నిర్ఝరాః శృంగపాద గుహారత్న వనజీవాద్యుపత్యకాః**" అరణ్య - ఉద్యాన - పర్వతాలను వర్ణించేటప్పుడు వర్ణనీయవస్తువులను ఈ విధముగా కవిసమయాలుగా చేసి కేశవమిశ్రులు తన అలంకారశేఖరంలో తెలిపాడు.

**శా. అన్యాలోకన భీకరంబులు జితాశానేకపానీకముల్**
**వన్యేభంబులు గొన్ని మత్తతనులై వ్రజ్యావిహారాగతో**
**దన్యత్వంబున భూరిభూధరదరీ ద్వారంబులందుండి సౌ**
**జన్యక్రీడల నీరుగాలివడి కాసారావగాహార్థమై**

**శ్లో. తత్రైకదా తద్గిరి కాననాశ్రయః**
**కరేణుభి ర్వారణయూథపశ్చరన్**
**సకంటకం కీచక వేణువేత్రవ**
**ద్విశాలగుల్మం ప్రరుజన్ వనస్పతీన్**

టీ : అన్యాలోకన = ఇతరులు చూచుటకు; భీకరంబులు = భయంకరములైనవి, జిత+ఆశా+అనేకప+అనీకముల్ = జయింపబడిన దిక్కులందలి ఏనుగుల గుంపులు గలవియు, (దిగ్గజాలను జయించునవియు) కొన్ని, వన్య+ఇభంబులు = అడవి ఏనుగులు; మత్తతనులై = మదించిన దేహములు గలవై; వ్రజ్యా = ఆహారము కొరకు; విహార+ఆగత = తిరుగుటకై వచ్చిన; ఉదన్యత్వంబున = దప్పిగొనుటచే; భూరిభూధర = మహాపర్వతాలకు చెందిన; దరీ ద్వారంబులందుండి = గుహాద్వారాలనుండి; సౌజన్య క్రీడలన్ = సయ్యాటలతో, నీరుగాలివడి = నీటి దప్పికవల్ల, కాసార + అవగాహ+ అర్థమై = సరస్సులందు మునుగుట కొరకై

తా : చూడటానికి భయంకరములై, దిగ్గజాలను గెలువ దగిన మదపుటేనుగులు తమ గుహలనుండి బయలువెడలి విలాసంగా సంచరిస్తూ, దప్పిక కలుగగా, నడుస్తూ సరస్సులో స్నానమాడటానికి బయలు దేరాయి.

అచ్చటి పర్వతారణ్యంలో నివసించే ఒక మదపుటేనుగు, ఆడ ఏనుగుల గుంపుతో గుహలలో నుంచి బయలుదేరింది. మార్గమధ్యంలో క్రీడిస్తూ వస్తూండగా గజరాజుకు దప్పిక అయింది. కాసారంలో మునకలాడాలన్న కోరికతో బయలుదేరాయి.

గజరాజు కరిణీయూథంతో బయలుదేరగా వాటికి దప్పిక అయింది. కాసారం కోసం తిరుగుతుండగా వెదుళ్ల పొద కనిపించింది. మదపుటేనుగులు ఆ వెదుళ్లపొదను తొండాలతో విరిచి, అక్కడి వనస్పతిని భిన్నాభిన్నం చేయసాగాయి. **"మదేవ బహుధా భిన్నం మాతంగం మన్యతే జనాః"** మదపుటేనుగు చెట్ల కొమ్మలను విరుస్తుంటే చూస్తూ వినోదిస్తుంటారు జనులు. ఏనుగులు మొద్దుజంతువులు. వాటి శరీరమూ మందమే. బుద్ధికూడా మందమే. కాసారాలకు సమీపంలో వెదుళ్లు పెరుగుతాయి. కాసారంలో మునక లాడటానికి వచ్చిన ఏనుగులు వెదురుపొదలను చూచి వాటిని భగ్నం చేయడం వాటి మందమతిని తెలుపుతున్నది. ఏనుగులు స్నానం చేయడం కూడా ఇంతే. అవి నదులలో స్నానం చేసి, వెలుపలికి వచ్చి ఇసుకను మీద చల్లుకొంటాయి. వ్యర్థంగా స్నానం చేసినవి అవుతాయి. వ్యర్థమైన పనులను "గజస్నానం" అని పేర్కొంటారు.

ఇది సిద్ధరసమైన ఇతిహాసం. కథానిర్వహణలోనే రసానుగుణమైన వర్ణనలు చోటు చేసుకొన్నాయి. తత్త్వవేత్తయయిన వ్యాసమహర్షి శాస్త్ర స్థితి సంపాదనేచ్ఛతో చేసిన వర్ణనలు కావివి. ఆనందవర్ధనుడు ధ్వన్యాలోకంలో **"తత్ర ఇతివృత్తే యది రసాననుగుణాం స్థితిం పశ్యేత్ తదా ఇమాం భంక్త్వాపి స్వతంత్రతయా రసానుగుణం కథాంతరం ఉత్పాదయేత్"** "ఇతివృత్తంలో రసానికి అనుగుణంగా లేని స్థితి కనిపిస్తే దానిని భగ్నపరచియైనా స్వతంత్రంగాను, రసానుగుణంగాను మరొక కథను కల్పించాలి. అందులో దోషం ఉండదు" అన్నాడు. వ్యాసభగవానుడు రచించిన ఈ ఇతివృత్తానికి అట్టి అవసరం ఉండదు.

**ఆ.వె.అంధకారమెల్ల నద్రిగుహాంతర వీథులందుఁబగలు వెఱచి డాఁగి**
**యెడరు వేచి సంధ్య నినుఁడు వృద్ధతనున్న వెడలె ననఁగ గుహలు వెడలెఁ గరులు.**

**శ్లో. యద్గంధమాత్రాద్ధరయో గజేంద్రా వ్యాఘ్రాదయో వ్యాలమృగాః సఖడ్గాః**
**మహోరగాశ్చాపి భయాద్ద్రవన్తి సగౌరకృష్ణాః శరభా శ్చమర్యః**

టీ : అంధకారము+ ఎల్లన్ = చీకటి అంతయును పగలు = పగటి కాలమునందు (సూర్యుడు తీవ్రంగా ఎండలు కాయునపుడు) వెఱచి = భయపడి; అద్రి = కొండలయందలి; గుహా +అంతర = గుహలలోపలి, వీధులందు = దారులలో; డాఁగి = దాగుకొని; ఎడరువేచి = సమయమును కనిపెట్టి; సంధ్యన్ = సంజకాలమున, ఇనుఁడు = సూర్యుడు; వృద్ధతన్ + ఉన్నన్ = వార్ధక్యమువ నుండగా; అస్తమయదశలో నుండగా, వెడలెన్ = వెలుపలికి వచ్చెనో, అనఁగన్ = అనునట్లుగా; కరులు = ఏనుగులు గుహలనుండి వెడలెను.

తా : పర్వతగుహలలో పట్టపగలు చీకట్లు నిండి ఉంటాయి. సూర్య ప్రతాపానికి యపడి చీకట్లు గుహలో జొరబడి, ఆ సూర్యుని వాడిమి వేడిమి తగ్గి స్తమింపబోవు సమయంలో, అనగా సాయంసంధ్యా సమయంలో, ఆ చీకట్లు ుహలను వదలి వెలుపలికి వెడలినవో అన్నట్లు ఏనుగుల గుంపులు బయలు రాయి.

ఏనుగులు నల్లనివి. చీకట్లును నల్లనివే. ఈ రెంటికి సాదృశ్యము. గుహలు ంధకారమయములగుట సహజము. అట్టి గుహలనుండి వెలుపలికి బయలుదేరిన నుగులు సూర్యాతపానికి జడిసి, ఆ సూర్యుని ప్రతాపం చల్లారిన తర్వాత మెల్లగా యటికి వచ్చిన చీకట్లు గుంపులో అనునట్లున్నవి! సాదృశ్యమూలకమైన సంభావన ండటం చేత ఈ పద్యంలో ఉత్ప్రేక్షాలంకారం సొగసుగా ఇమిడింది. **"సంభావనా స్యాదుత్ప్రేక్షా వస్తుహేతుఫలాత్మనా"** ఉపమాన గుణక్రియాదుల సంబంధంతో ఉపమేయం పమానంగానే తర్కింపబడితే అది ఉత్ప్రేక్ష అలంకారం అవుతుంది. ఈ అలంకారం అనేక విధాలుగా ఉన్నా ముఖ్యమైనవి మూడు విధాలు. వస్తూత్ప్రేక్ష - హేతూత్ప్రేక్ష - ఫలోత్ప్రేక్ష అని. ఉత్ప్రేక్షలో సంభావనా ప్రతిపాదకాలైన అనన్, శంకించు, కాబోలు, ఊహించు, భావించు అనే పదాలుంటాయి. అవి లేకపోతే గమ్యోత్ప్రేక్ష అవుతుంది. ఈ పద్యంలో 'అనగ' అనే వాచక శబ్దం ఉన్నది కాబట్టి అది హేతూత్ప్రేక్షాలంకారమయింది.

ఏనుగుల గుంపులను చీకట్లతో పోల్చడం, చీకట్లను ఏనుగుగుంపులతో పోల్చడం కవి సమయమవుతుంది. పై పోతనగారి పద్యం గజయూథవర్ణనకు చెందినది. ఆ ఉత్ప్రేక్షాలంకారంలో ప్రకృతమైనది గజసమూహం. ఈ క్రింది సంస్కృత శ్లోకంలో ప్రకృతమైనది అంధకారం. అప్రకృతమైనది గజసమూహం. **"పతితే పతంగమృగరాజి నిజప్రతిబింబరోషిత ఇవాంబునిధౌ అథ నాగయూథమలినాని జగత్పరితస్తమాంసి పరితస్తరిరే"** సూర్యుడనే సింహం సముద్రజలాలలో తన ప్రతిబింబం చూచుకొని తన ప్రత్యర్థిసింహమని రోషించి సముద్రంలో దూకింది. అప్పుడు ఏనుగుల గుంపుతో సమానమైన చీకట్లు నిశ్చింతగా నలువైపులకు తిరుగాడుతున్నవో అన్నట్లు అంధకారం అంతట వ్యాపించింది. ఇది అంధకార వర్ణన. పోతన చేసినది గజసమూహ వర్ణన.

మన కథానాయకుడైన గజేంద్రుని మదపు వాసన వాయువు వల్ల ప్రసారమైతే చాలు సింహాలు, మహాగజాలు, బెబ్బులులు, సర్పాకారం గల ఘోరమృగాలు, ఖడ్గ

మృగాలు, పెనుపాములు, తెల్లని నల్లని శరభాలు, చమరీ మృగాలు కూడా భయపడి పారిపోతాయి.

సింహాన్ని చూస్తే ఏనుగు భయపడి పారిపోవడం కద్దు. సింహం గజవైరి. మహాపరాక్రమంగల జంతువు. మన కథానాయకుడైన గజేంద్రుని గండస్థలాలనుండి స్రవించే మదజలవాసనలు గాలితాకున ప్రసరిస్తే సింహం కూడా భయపడి పారిపోతుందని చెప్పడంలో కథానాయకుడైన గజేంద్రుని అపూర్వమైన అద్భుత పరాక్రమం వెల్లడవుతున్నది. అంతేకాదు, అతని కారణజన్మ విశేషాన్ని సూచిస్తూ ఆ ఏనుగు అసాధారణమైనదని తెలుపుతున్నది.

వ్యాలముఖాః = పాము ముఖమువంటి ముఖంగల జంతువులు. (సర్పాకారముఖాః అని శ్రీ వంశీధరవ్యాఖ్య 'డైనోసర్‌లు' కావచ్చును)

**కం. తలఁగవు కొండలకైనను మలఁగవు సింగములకైన మార్కొను కడిమిం**
**గలఁగవు పిడుగులకైనను విలబలసంపన్నవృత్తి వేమఁగు గున్నల్**

**శ్లో. వృకా వరాహా మహిషర్క్ష శల్యా గోపుచ్ఛ శాలావృక మర్కటాశ్చ**
**అన్యత్ర క్షుద్రా హరిణా శ్శశాదయః చరన్త్యభీతా యదనుగ్రహేణ**

టీ : ఏనుఁగుగున్నల్ = పడుచు ఏనుగులు; ఇలన్ = భూమియందు; బలసంపన్నవృత్తిన్ = మిక్కిలి బలముగల వగుటచే, కొండలకైనన్ = కొండలు ఎదురైనను, తలగవు = తొలగిపోవవు. మార్కొను కడిమిన్ = ఎదిరించు శౌర్యముండుటచే, సింహములకైనన్ = సింహము లెదుర్పడినను, మలఁగవు = తొలగిపోయెడివి కావు. పిడుగులకైనను = పిడుగులు పడినను; కలగవు = కలత చెందవు.

తా : ఆ గుంపునందలి ఏనుగుగున్నలు మిక్కిలి బలముగలవి అగుటచే కొండలనైనను, సింహములనైనను, పిడుగులనైనను సరకు సేయవు. స్వేచ్ఛగా విహరించునవి అని తాత్పర్యం.

పిల్లయేనుగులే ఇంతటిసాహసముగలవని చెప్పుటచే ఇక మదపుటేనుగుల ఔద్ధత్యాన్ని గూర్చి చెప్పనవసరం లేదు. కథానాయకోత్కర్ష దీనిచే సూచితమైనది. పూర్వకాలపు యుద్ధాలలో శత్రువ్యూహములను ఛేదించుటకు గజసైన్యమును పంపి వాటి బలమును, మొఱకుతనమును ఉపయోగించుకొనుచుండేవారు.

ఆ మదపుటేనుగు యొక్క అనుగ్రహంతో ఆ గజయూథము వెంట తోడేళ్ళు, పందులు, ఎలుగుబంట్లు, ముళ్ళపందులు, గోలాంగూలాలు, కుక్కలు, కోతులు, లేళ్లు, కుందేళ్లు మొదలైన అల్ప జంతువులు కూడా నిర్భయంగా సంచరిస్తున్నాయి.

త్రికూట పర్వతారణ్యాధిపత్యం గజేంద్రునిది. అతని అనుగ్రహంతో అల్పజంతువులు సైతం సింహాదులవలన హాని లేకుండా నిర్భయంగా తిరుగుతున్నాయని తాత్పర్యం.

**సీ. పులుల మొత్తంబులు పొదరిండ్లలోఁ దూఱు**
**ఘోరభల్లూకముల్ గుహలు సొచ్చు**
**భూదారములు నేల బొరియలలో డాఁగు**
**హరిదంతముల కేఁగు హరిణచయము**
**మడువులఁ జొఱఁబాఱు మహిషసంఘంబులు**
**గండశైలంబులఁ గపులు ప్రాఁకు**
**వల్మీకములు సొచ్చు వనభుజంగంబులు**
**నీలకంఠంబులు నింగికెగయు**

**వెఱచి చమరీమృగంబులు విసరు వాల**
**చామరంబుల విహరణశ్రమము వాయ**
**భయదపరిహేల విహరించు భద్రకరుల**
**గాలి వాఱిన మాత్రాన జాలిఁబొంది**

టీ : భయద పరిహేల = భయము గలిగించు విలాసముతో; విహరించు = విహారము చేయుచున్న, భద్రకరుల = మదపుటేనుగుల యొక్క; గాలి సోకిన మాత్రాన = మదపువాసనతో కూడిన గాలి సోకినంతమాత్రం చేతనే; పులుల మొత్తంబులు = బెబ్బులుల గుంపులు, పొదరిండ్లన్ దూరును; ఘోరభల్లూకములు = భయంకరమైన ఎలుగుబంట్లు, గుహలన్ చొచ్చును; భూదారముల్ = అడవిపందులు; బొరియలలో దాగును; హరిత్+అంతములకు = దిక్కుల చివరకు; హరిణచయము = లేళ్ల గుంపులు; ఏగును; మహిషసంఘంబులు = కాఱెనుబోతుల మందలు; మడువులన్ = నీటి మడుగులలోనికి; చొరబాఱును; కపులు = కోతులు; గండశైలములన్ = బండలతో కూడిన కొండలపైకి; ఎగబాకును; వనభుజంగంబులు = అడవియందుండెడి సర్పములు; పుట్టలన్ చొచ్చును; నీలకంఠంబులు = నెమళ్లు, నింగికిన్ = ఆకాశమునకు; చమరీమృగములు = సవరపు మృగాలు, వెఱచి = భయపడి; విహరణ = సంచరించుట వలన గలిగిన, శ్రమలు = అలసటలు, పాయన్ = తొలగునట్లు, వాలచామరంబులన్ = తోకలనెడి చామరములతో వీచుకొనుచుండును.

తా : ఆ మదపుటేనుగుల గాలిసోకగానే అడవిలోని పులులు పొదలలోను, ఎలుగులు గుహలలోను, పందులు నేలబొరియలలోను దాగుకొంటాయి; లేళ్లు నలుదిక్కులకు, మహిషములు మడుగుల లోపలికి, పాములు పుట్టలలోనికి,

కోతులు గిరి శిఖరాలమీదికి పారిపోతాయి. చమరీమృగములు ఎటు పోజాలక తమ వామరములవంటి తోకల నల్లార్చి సేద తీర్చుకొంటున్నాయి.

ఆ మదపుటేనుగుల మదపు వాసన తగులగానే వన్యజంతువులన్నియు భయపడి తమ తమ సురక్షిత స్థానాలకు పరుగిడి దాగుకొంటాయి. చమరీ మృగములు వేగముగా పరుగిడజాలవు. కనుక అటునిటు సంచరించడం వల్ల కలిగిన బడలికను పోగొట్టుకోడానికి అవి తమ వాలములను వీచుకొంటున్నాయి.

**కం. మదగజదానామోదముఁ గదలని తమకములఁ ద్రావి కడుపులు నిండన్**
**బొదలుచుఁ దుమ్మెద కొదమల కదుపులు జుంజుమ్మటంచు గానము సేసెన్**

టీ : మదగజ దాన+ఆమోదము = మదగజముల యొక్క గండస్థలములనుండి స్రవించు జలముయొక్క, పరిమళము; కదలని = స్థిరమైన; తమకమునన్ = మోహముతో, కడుపులు నిండన్, త్రాగి; పొదలుచు = వర్ధిల్లుచు; జుంజుం అటంచు = ఝుంకృతులతో, గానము చేసెన్.

తా : ఆ వనమందలి తుమ్మెదల గుంపులు మదపుటేనుగుల గండభాగములందు స్రవిస్తున్న మదజల పరిమళములకు మోహపడి ఆ మదజలములను కడుపునిండుగా త్రాగి ఝుంకారగానములు చేయసాగాయి.

"పొదలుచుఁ దుమ్మెద కొదమల కదుపులు జుంజుమ్మటంచు గానము సేసెన్" ఇందలి వర్ణవిన్యాసలాలిత్యము ప్రకృతానికి తగినట్లుగా శోభిస్తున్నది.

ఏనుగుల కపోలాల జాఱు చిక్కని మదద్రవానికి 'దాన' మని పేరు. యుక్తవయస్సులో ఉండిన మదపుటేనుగుల చెంపలపై ఇలాంటి ద్రవం స్రవిస్తుంది. ఆ ద్రవాన్ని, దాని వాసనను ఆశించి ఈగలు, తుమ్మెదలు ముసరడం కద్దు. ఏనుగుల మదాతిశయాన్ని తెలపడానికి కవులు దాని కపోలదానధారలను వర్ణిస్తారు. మదక్షీణమైన ఏనుగుల చెంపలకు ఇట్టి మదధారలుండవు. మదపుటేనుగుల **"కరాత్కటాభ్యాం నేత్రాభ్యాం మేఢ్రాచ్చాపి మదస్రుతిః"** 'కరాత్' అంటే నాసారంధ్రంనుంచి అని అర్థం. ఇన్ని చోట్ల మదం స్రవిస్తుందని శాస్త్రం.

**కం. తేఁటి యొకటి యొరుప్రియకును మాటికి మాటికిని నాగమదజల గంధం**
**బేటికి నని తమఁ బొందెడి బోటికి నందిచ్చు నిండుబోఁటుఁదనమునన్**

టీ : తేఁటి యొకటి = ఒక మగతుమ్మెద; ఒరు ప్రియకును = మరొక తేటి ప్రియురాలికి, నాగ-మద జల -గంధంబు = ఏనుగుల మదజలాల పరిమళము; ఏటికి +అని = ఎందులకు? అని; తమున్ = పొందెడి = తనతో సంగమించు, బోటికి = ఆడుతుమ్మెదకు, నిండు పోఁటుఁదనమునన్ = మిక్కుటమైన మగసిరితో; అందిచ్చును = అందజేయును.

తా : ఒక తుమ్మెద తన ప్రియురాలికి ఏనుగుల మదజలగంధమివ్వడం చూచి, దానికిచ్చినందువల్ల ప్రయోజనమేమున్నది? అని మరొక తేటి మగసిరితో మెరసి తన ప్రియురాలికి మదజలగంధము అందిస్తున్నది. ఆ ఆడుతుమ్మెద మదజల గంధమును ఆఘ్రాణించి కామోద్రేకముతో విజృంభించినచో ఆ మగ తుమ్మెద దానికి సమఉజ్జీ కాలేదని, తనకున్న మైథునసామర్థ్యము ఆ మగతుమ్మెదకు లేదని ఇందలి వ్యంగ్యార్థము.

**కం. అంగీకృత రంగ న్మా తంగీమదగంధమగుచుఁ దద్దయు వేడ్కన్**
**సంగీత విశేషంబుల భృంగీగణమొప్పె మ్రానుపెట్టెడి మాడ్కిన్**

టీ : అంగీకృత = సమ్మతింపబడిన; రంగత్ = ప్రకాశించుచున్న; మాతంగీ = ఆడయేనుగుల యందలి, మదగంధము + అగుచు = మదగంధము కలదగుచు, భృంగీగణము = ఆడుతుమ్మెదల గుంపు, తద్దయు వేడ్కన్ = మిక్కిలి ఉత్సాహముతో; సంగీత విశేషంబులన్ = గాన విశేషములచేత మ్రానుపెట్టెడి మాడ్కిన్ = మ్రాన్పడజేయునట్లుగా, (స్తంభింపజేయునట్లుగా), ఒప్పెన్.

తా : ఆడుతుమ్మెదలు తమకు మగతుమ్మెదలు ప్రియముతో ఇస్తున్న మదగజదానజల పరిమళములకు సంతోషపడి వినువారలు మ్రాన్పడునట్లుగా గానవిశేషాలతో ఒప్పుతున్నాయి.

**కం. వల్లభలు పాఱి మునుపడ వల్లభమని మునరిరేని వారణదానం**
**బొల్లక మధుకర వల్లభు లుల్లంబులఁ బొందిరెల్ల యుల్లాసంబుల్**

టీ : వల్లభలు = ఆడుతుమ్మెదలు; మునుపడన్ = ముందుగా; పాఱి = పరుగిడి; వారణదానంబు = ఏనుగుల మదజలము, వల్లభమని = ప్రియమైనదని; మునరిరి+ఏని = మ్రాలినటులైన; మధుకరవల్లభులు = మగతుమ్మెదలు; ఒల్లన్ = క్రోలుటకు ఇష్టపడక, ఉల్లంబులన్ = మనస్సులందు; ఎల్లఉల్లాసంబుల్ = పలువిధములైన వేడుకలను; పొందిరి.

తా : ఆడుతుమ్మెదలు ఆ ఏనుగుల మదజలగంధమునకు ప్రియపడి వెళ్ళడం చూచి మగతుమ్మెదలు తమలో తాము సంతోషిస్తున్నాయి.. మదజలగంధము నాఘ్రాణించి తమవద్దకు చేరిన ఆడుతుమ్మెదల కిక మదన ప్రేరణచేయవలసిన అవసరం తమకుండదని వాటి సంతోషము అని ఇందలి వ్యంగ్యార్థము.

తుమ్మెదలు పడతుల కన్నులకును, జడలకును ప్రధానమైన ఉపమానవస్తువు. ఏనుగులను, పద్మసరస్సులను కవులు వర్ణించేటప్పుడు తుమ్మెదల ప్రసక్తి తప్పదు. సంస్కృత వాఙ్మయంలో తుమ్మెదకు అనేక పర్యాయపదములు ఉండటమే ఇందుకు నిదర్శనము. శ్రీమద్భాగవతంలో భ్రమరగీత అత్యంత ప్రసిద్ధమైన

ుధ్యాయము. బృందావనంలోని రాధాదిగోపికల దగ్గరకు పీతపరాగ పింజర శ్మశ్రువులుగల ఒక భ్రమరం హఠాత్తుగా వచ్చింది. అంతకు ముందే శ్రీకృష్ణుని ంపున దూతగా వచ్చిన ఉద్ధవుణ్ని కల్పించుకొని అన్యాపదేశంగా రాధాదిగోపికలు ులికిన ప్రణయరోషమయ భావభంగీమయ మధురగీతయే భ్రమరగీత. దీనితో ఆరుకాళ్ల మక్షికమైన తుమ్మెద ప్రముఖవర్ణనీయవస్తువైనది. భాగవత రస విశేషభావనా చతురుడైన పోతనగారు కవిసమయ మనుసరించి చేసిన భ్రమరవర్ణన మిది.

వ. **అప్పుడు**

టీ : ఆ సమయంలో తుమ్మెదల గుంపులు ఇలా రొదచేస్తుండగా తక్కిన ఏనుగులు.

**మ. కలభంబుల్ చెఱలాడుఁ బల్వలము లాఘ్రాణించి మట్టాడుచున్**
**ఫల భూజంబులు రాయుచుం జివురు జొంపంబుల్ వడిన్ మేయుచున్**
**బులులం గాఱెనుపోతులన్ మృగములన్ బోనీక శిక్షించుచున్**
**కొలఁకుల్ చొచ్చి కలంచుచున్ గిరులపైఁ గొబ్బిళ్లు గోరాడుచున్**

టీ : కలభంబుల్ = ఏనుగుగున్నలు; పల్వలములు = చిన్నవైన నీటి మడుగులు; ఆఘ్రాణించి = మూచూచి; మట్టాడుచున్ = త్రొక్కులాడుచు, ఫలభూజంబులన్ = పండ్ల చెట్లను; రాయుచున్ = ఒరసికొనుచు; చివురు జొంపంబుల్ = చిగురాకు గుత్తులను; వడిన్ = త్వరగా; మేయుచు; పులులను; కాఱెను పోతులను = అడవిదున్నలను; మృగములన్ = జింకలను; పోనీక, శిక్షించుచును; కొలఁకుల్ = కాసారములను, చొచ్చి; కలంచుచున్ = కల్లోలపరచుచు; గిరులపై = గుట్టలపైన; గొబ్బిళ్లు గోరాడుచున్ = పిల్లల ఆడుకొనుట వలె తొండముతోను, ముఖముతోను కుమ్ములాడుచు.

తా : ఆ ఏనుగుగున్నలు చిన్ని నీటి మడుగులను త్రొక్కి వేస్తూ; పండ్ల చెట్లను ఒరుసుకొంటూ, కనిపించిన వన్యజంతువులను శిక్షిస్తూ, కొలనులను కలచి వేస్తూ గుట్టలను కుమ్మివేస్తూ సాగిపోతున్నవి.

చిన్నచిన్న మడుగులలోని నీటికి ఏనుగులు ఆశపడవు. ఆ మడుగులలో స్నానమాడవు. **"ఆ పాతాళ గభీరే మజ్జతి నీరే నిదాఘ సంతప్తః, న స్పృశతి పల్వలాంభః పంజర శేషోఽపి కుంజరః క్వాపి"** ఏనుగులకు అతిశయ మెక్కువ. ఏనుగు మండుటెండలో పుష్కలంగా నీరున్న గభీరమైన సరస్సులలో స్నానం చేస్తుంది. కాని, అది బోనునుంచి బైటపడినదైనప్పటికి దప్పిగొని క్షుద్రపు మడుగులో నీళ్లు కనిపించినా వాటిని తాకనైనా తాకదు. మదపుటేనుగులు తమ చెక్కిళ్ల వద్ద రొద చేసే

తుమ్మెదలను కోపింపవు. ఏనుగు లెప్పుడును తమతో సమానమైన బలం గలిగిన జంతువులనే ఎదుర్కొంటాయి. "**గండస్థలే హి మదవారి జలౌఘలబ్ధ మత్తభ్రమద్భ్రమర పాదతలాహతోఽపి కోపం న గచ్ఛతి నితాంతబలోఽపి నాగః తుల్యే బలే హి బలవాన్ పరికోపమేతి**"

గొబ్బిళ్లను కోరాడటం పరిణతగజములకు సహజం. గిరిసానువులను ఆక్రాంత మొనర్చుచున్న ఆషాఢమేఘం వప్రక్రీడయందు పరిణతమైన ఏనుగులాగా ఉన్నదని కవికులగురువు కాళిదాసు మేఘదూతలో వర్ణించాడు. "**ఆషాఢస్య ప్రథమ దివసే మేఘ మాశ్లిష్టసానుం, వప్రక్రీడా పరిణతగజ ప్రేక్షణీయం దదర్శ**" (1-2)

**కం. తొండంబుల మదజలవృత గండంబులఁ గుంభములను ఘట్టన సేయం**
**గొండలు దలక్రిందై పడు బెండుపడున్ దిశలు, నూచి బెగడున్ జగముల్**

టీ : తొండంబులన్, మదజల వృత = మదజలముతో కూడిన; గండంబులన్= చెక్కిళ్లను, కుంభములన్ = కుంభస్థలములను; ఘట్టన సేయన్ = గట్టింపగా (క్రుమ్మగా) కొండలు, తలక్రిందై = క్రిందు మీదై, పడున్; దిక్కులు; బెండుపడున్ = బలహీనత నొందును. జగముల్ = లోకములు, బెగడున్ = భయపడును.

తా : ఆ ఏనుగు గున్నలు తొండాలతో కొట్టగా, చెక్కిళ్లతో రాయగా, కుంభ స్థలములతో పొడవగా కొండలు క్రిందుమీదవుతున్నాయి. దిక్కులు నిస్సారములవు తున్నాయి. లోకములు భయభ్రాంతములవుతున్నాయి.

ఇందు మత్తేభవిక్రీడితములు స్వభావ సుందరంగా వర్ణితమైనాయి. అవి ఏనుగుల క్రీడలే అయినా మిక్కిలి భీకరములైనవని భావము.

**కం. ఎక్కడఁ జూచిన లెక్కకు నెక్కువయై యడవి నడచు నిభయూథములో**
**నొక్క కరినాథుఁ డెడతెగి చిక్కె నొక కరేణుకోటి సేవింపంగన్**

టీ : ఎక్కడఁజూచినన్ = ఏచోట చూచినప్పటికి, లెక్కకు నెక్కువయై = అసంఖ్యాకమై, అడవియందు, నడచు = సంచరించు, ఇభయూథములో = ఏనుగుల సమూహములో, ఒక్క కరినాథుడు = ఒకానొక గజరాజు, ఎడతెగి = విడిపోయి; ఒక, కరేణుకోటి = ఆడయేనుగుల గుంపొకటి; సేవింపన్ = తనను సేవించుచుండగా; చిక్కెన్ = వెనుక చిక్కెను.

తా : ఈ విధంగా అసంఖ్యాకంగా చరించు గజసమూహం నుంచి, ఒక గజరాజం లెక్కలేని తనభార్యలతో వెనుకపడ్డది.

మొట్టమొదట పేర్కొన్న కథానాయకుడగు గజరాజే ఇతడని గ్రహింప దగును.

**వ. ఇట్లు వెనుక ముందటఁ నుభయ పార్శ్వంబులఁ దృషార్దితంబులై యరుగుదెంచు**

**వేమఁగుగములం గానక తెఱంగు దప్పి తొలంగుడుపడి యీశ్వరాయత్తంబైన చిత్తంబు సంవిత్తంబు గాకుండుటంజేసి తానును దన కరేణుసముదయంబును నొక్కతెరువై పోవుచు.**

టీ : ఇట్లు; వెనుకముందర; ఉభయపార్శ్వంబులన్ = రెండు ప్రక్కలను, తృషా+అర్దితంబులై = దప్పికచే పీడింపబడినవై, అరుగుదెంచు; ఏనుంగు గములన్ = ఏనుగు గుంపులను, కానక, తెఱంగు దప్పి = త్రోవతప్పి; తొలంగుడుపడి = ఎడబాసి; ఈశ్వర + ఆయత్తంబయిన = దైవమునకు అధీనమైన; చిత్తంబు = మనస్సు; సంవిత్తంబు = తెలివిగలది (మనస్సు స్వాధీనములో లేనిదయి) కాకుండుటవలన, తానును, తన, కరేణుసముదయంబును = ఆడయేనుగుల సమూహమును, ఒక్క తెరువై = ఒక మార్గమును బట్టి పోవుచు.

తా : ఈ విధంగా ఆ గజేంద్రుడు తన చుట్టు ప్రక్కల వచ్చే ఏనుగులు కనిపించనందున దైవయోగం వల్ల దారి తప్పి తనతోపాటు వస్తున్న ఆడయేనుగులతో మరొకదారి పట్టింది.

**సీ. పల్వలంబుల లేఁత పచ్చిక మచ్చికఁ జెలుల కందిచ్చు నచ్చికము లేక**
**నివురు జొంపములఁ గ్రొవ్వేలయు పూఁగొమ్మల బ్రాణవల్లభలకుఁ బాలువెట్టు**
**ఘనదాన శీతల కర్ణతాళంబుల దయితల చెమటార్చుఁ దనువు లరసి**
**మృదువుగాఁ గొమ్మల మెల్లన గళములు నివురుచుఁ బ్రియముతో నెఱపుఁగఱపు**

**పిఱుఁదు చక్కట్ల డగ్గఱి ప్రేమతోడ డాసి మూర్కొని దివికిఁ దొండంబు సాఁచు**
**వెద వివేకించుఁ గ్రీడించు విశ్రమించు మత్తమాతంగ మల్లంబు మహిమతోడ**

టీ : మత్తమాతంగ మల్లంబు = ఆ గజశ్రేష్ఠము. మహిమతోడన్ = గొప్పతనముతో; పల్వలంబుల = చిన్న నీటిమడుగులయందలి, లేత పచ్చికను, చెలులకు, అచ్చికము లేక = కొరతలేకుండగా, మచ్చికన్ = అనురాగముతో, అందించును; ఇవురు జొంపముల = చిగురాకు గుత్తులను; క్రొవ్వేలయు = అధికముగా పూచిన, పూవుకొమ్మలను, ప్రాణవల్లభలకు = భార్యలకు, పాలు పెట్టును = పంచియిచ్చును; తనువులు + అరసి = దేహములను చూచి; ఘనదానశీతల = గొప్పదైన దానజలముచే చల్లనైన, కర్ణతాళంబులన్ = విసనకఱ్ఱలవంటి చెవుల చేత, చెమట +ఆర్చును = చెమటను పోగొట్టును. మృదువుగా = సుకుమారముగా; కొమ్మలన్, మెల్లనన్, గళములు = మెడలను, నివురుచు, వలపును, నెఱపున్ = అగుపరచును; పిఱుద చక్కట్ల = పిఱుదుల వైపునకు సమీపించి, ప్రేమతోడ, మూర్కొని = వాసన చూచి; దివికి = ఆకాశమువైపునకు, తొండమును, చాచును; వెద = ఋతుధర్మమును; వివేకించి = తెలిసికొని, క్రీడించున్ = రమించును; విశ్రమించున్ = విశ్రాంతిగొనును.

తా : ఆ మదగజేంద్రం ఆ విధంగా వెళుతూ తన ప్రియురాండ్రయందలి

మోహంతో మడుగుల చెంత మొలిచిన లేతపచ్చిక నందిస్తున్నది. చిగురు జొంపాలను పూలకొమ్మలను తన ప్రియలకు పంచిపెడుతున్నది. విసనకఱ్ఱల వంటి తన చెవులతో తన ప్రియల దేహాలకు పట్టిన చెమటను పోగొట్టుతున్నది. వాటి మెడలను తొండముతో నాకుచు అనురాగమును చూపుతున్నది. కొన్ని ఏనుగుల పిఱుదులదరికి చేరి వాసన చూచి, తన తొండమును పైకెత్తి ఋతుధర్మమును తెలుసుకొంటున్నది. కొన్నిటితో క్రీడిస్తున్నది. కొంతసేపు సేదదీర్చుకొంటున్నది.

ఈ పద్యంలో "పిఱుదు చక్కట్లు డగ్గరి ప్రేమఁజూపు, డాసి మూర్కొని దివికి దొండంబు సాఁచు" అనునది పశులక్షణము. పశువులకు ఎద కలిగినప్పుడు అవి ఇలా ప్రవర్తిస్తుంటాయి. పశుఋతువును 'ఎద' అంటారు. 'ఎద'కు రూపాంతరం "వెద".

**సీ. తన కుంభముల పూర్ణతకు డిగ్గి యువతుల కుచములు పయ్యెదకొంగు లీఁగ**
**దన యానగంభీరతకుఁ జాల కబలల యానంబు లందెల నండగొనఁగఁ**
**దన కరశ్రీఁ గని తలఁకి బాలల చిఱు దొడలు మేఖలదీప్తిఁ దోడు పిలువఁ**
**దన దంతరుచి కోడి తరుణుల నగవులు ముఖచంద్రదీప్తుల ముసుఁగుఁ దిగువఁ**

**దనదు లావణ్యరూపంబు దలఁచి చూడ నంజనాభ్రము కపిలాది హరిదిభేంద్ర**
**దయితలందఱు దనవెంట దగిలి నడువఁ గుంభివిభుఁడొప్పె నొప్పులకుప్పవోలె.**

టీ : తన కుంభముల పూర్ణతకున్ = తన కుంభస్థలముల సమగ్రతకు; డిగ్గి = తక్కువయై; యువతుల = యౌవనవతుల, కుచములు = వక్షోజములు, పయ్యెద కొంగులు = పైట చెరగులు, ఈఁగన్ = ఇయ్యగా; తన యాన గంభీరతకు = తన నడకలలోని గాంభీర్యానికి; చాలక = చాలనందువలన; అబలల = పడతుల, యానంబులు = నడకలు; అందెలను, అండగొనగ = అందెలను సహాయమును పొందగా; తన కరశ్రీన్ = తన తొండము యొక్క సౌందర్య సంపదను; కని = చూచి; తలఁకి = భయపడి; బాలల చిఱు తొడలు = పడుచుల చిన్ని తొడలు, మేఖలదీప్తిన్ = బంగారు ఒడ్డాణముల కాంతిని; తోడు పిలువన్ = సహాయమర్థింపగా; తన దంతరుచికిన్ + ఓడి = తన దంతముల కాంతులకు ఓడిపోయి; తరుణుల = యౌవనవతుల, నగవులు = నవ్వులు; ముఖ చంద్రదీప్తులన్ = ముఖమనెడి చంద్రుని కాంతులతో; ముసుఁగుఁ దిగువన్ = ముసుగువైచికొనగా; తనదు లావణ్యరూపంబు = తన సుందర రూపము; తలఁచి = భావించి, చూడన్ = చూడగా; అంజన-అభ్ర-కపిల = ఉత్తర దిగ్గజము, తూర్పు దిక్కున గల ఏనుగు; ఆగ్నేయదిశయందలి ఏనుగు; ఆది = మొదలైన; హరిత్ + ఇభ + ఇ ద్ర = దిగ్గజ శ్రేష్ఠముల

ుక్క; దయితలు = ప్రియురాండ్రు; అందరు; తన వెంటన్, అంటుకొని నడువన్ = తనతో ఁడివడువగా; కుంభివిభుఁడు = ఆ గజేంద్రుడు : ఒప్పులకుప్పవోలెన్ = అందాలరాశివలె, ప్పన్ = శోభిల్లెను.

తా : ఆ గజేంద్రుని కుంభస్థలములతో పోలవని కాబోలు యువతులు తమ క్షోజములపై పైట గప్పుకొని యుందురు. ఆ గజేంద్రుని నడకల సొగసుతో తమ డకలు సాటిరావని యెంచి కాబోలు పడతులు అందెల సహాయాన్ని అర్థించి ుందురు. ఆ గజేంద్రుని దంతకాంతులకు తమ చిర్నగవులు సరిపోలవని ఎంచి కాబోలు ముగ్ధాంగనలు మేలి ముసుగులు ధరించి యుందురు. అంజనాది ష్టదిగ్గజముల భార్యలు తమ భర్తలను విడనాడి తనతో కూడి తిరుగునంతటి గావణ్యాతిశయము కలిగి ఆ గజేంద్రుడు సౌందర్యరాశివలె శోభిల్లుతున్నాడు.

యువతుల వక్షోజాలకు ఏనుగుకుంభ స్థలాలు ఉపమాన వస్తువు. కాగా, ఇచ్చట ఏనుగు కుంభ స్థలాలతో సరిరానందున యువతులు తమ వక్షోజాలపై పైటచెరగు కప్పుకొన్నారని ఉత్ప్రేక్షింపబడింది. అట్లే మదవతులైన యువతుల నడకలను గజ గమనంతో పోల్చడం కవిసమయం. కాగా, ఇచ్చట గజయానంతో తమ నడకలు సాటిరానందున పడతులు అందెల సహాయాన్ని పొందినారనడమూ ఉత్ప్రేక్షయే. ఏనుగు తొండముతో యువతుల ఊరువులను పోల్చడం కవిసమయం. కాగా, గజతుండముతో తమ తొడలు సామ్యం కాజాలవని పడతులు నడుమునకు బంగారు ఒడ్డాణాన్ని ధరింప వలసి వచ్చింది. నవయౌవనుల నగవుల కాంతిని గంజదంతపు శోభతో పోలుస్తారు. గజదంతశోభకు తమ హాసకాంతులు సాటిరావని కాబోలు ముగ్ధాంగనలు మేలి ముసుగు ధరిస్తుంటారు.

ఏనుగు కుంభస్థలాలు పడతుల వక్షోజాలకు ప్రసిద్ధమైన ఉపమానము. కాగా, సంస్కృత నైషధీయ కావ్యకర్త ఒక చక్కని వైచిత్రిని ప్రదర్శించాడు. "**ఆభ్యాం కుచాభ్యా మిభ కుంభయోః శ్రీరాదీయతేఽ పావనయోః క్వ తాభ్యాం, భయేవ గోపాయిత మౌక్తికా తౌ ప్రవ్యక్త ముక్తాభరణావిమౌ యత్**" (7-75) "ఆ పడుచుగత్తె వక్షోజాలు ఏనుగు కుంభస్థలాల శోభను పరిగ్రహించాయి. కాని, ఏనుగు కుంభస్థలాలు మాత్రం ఆమె వక్షోజసౌందర్యాన్ని పొందలేక పోయాయి. అందుకు కారణం ఏనుగు తన మస్తకంలో ముత్యాలున్నప్పటికీ అది దాచిపెట్టుకోవడమే. కాని, ముక్తాహారయుక్తంగా ఆమె వక్షోజాలు బాహిరమై ఏనుగు కుంభస్థలాలను మించి శోభిస్తున్నాయి" అని. పడతుల ఊరువులను ఏనుగు తొండంతో పోలుస్తారు. కాని,

మోహంతో మడుగుల చెంత మొలిచిన లేతపచ్చిక నందిస్తున్నది. చిగురు జొంపాలను పూలకొమ్మలను తన ప్రియలకు పంచిపెడుతున్నది. విసనకఱ్ఱల వంటి తన చెవులతో తన ప్రియల దేహాలకు పట్టిన చెమటను పోగొట్టుతున్నది. వాటి మెడలను తొండముతో నాకుచు అనురాగమును చూపుతున్నది. కొన్ని ఏనుగుల పిఱుదులదరికి చేరి వాసన చూచి, తన తొండమును పైకెత్తి ఋతుధర్మమును తెలుసుకొంటున్నది. కొన్నిటితో క్రీడిస్తున్నది. కొంతసేపు సేదదీర్చుకొంటున్నది.

ఈ పద్యంలో "పిఱుదు చక్కట్ల డగ్గరి ప్రేమఁజూపు, డాసి మూర్కొని దివికి దొండంబు సాఁచు" అనునది పశులక్షణము. పశువులకు ఎద కలిగినప్పుడు అవి ఇలా ప్రవర్తిస్తుంటాయి. పశుఋతువును 'ఎద' అంటారు. 'ఎద'కు రూపాంతరం "వెద".

**సీ. తన కుంభముల పూర్ణతకు డిగ్గి యువతుల కుచములు పయ్యెదకొంగు లీఁగ**
**దన యానగంభీరతకుఁ జాల కబలల యానంబు లందెల నండగొనఁగఁ**
**దన కరశ్రీఁ గని తలఁకి బాలల చిఱు దొడలు మేఖలదీప్తిఁ దోడు పిలువఁ**
**దన దంతరుచి కోడి తరుణుల నగవులు ముఖచంద్రదీప్తుల ముసుఁగుఁ దిగువఁ**

**దనదు లావణ్యరూపంబు దలఁచి చూడ నంజనాభ్రము కపిలాది హరిదిభేంద్ర**
**దయితలందఱు దనవెంట దగిలి నడువఁ గుంభివిభుఁడొప్పె నొప్పులకుప్పవోలె.**

టీ : తన కుంభముల పూర్ణతకున్ = తన కుంభస్థలముల సమగ్రతకు; డిగ్గి = తక్కువయై; యువతుల = యౌవనవతుల, కుచములు = వక్షోజములు, పయ్యెద కొంగులు = పైట చెరగులు, ఈఁగన్ = ఇయ్యగా; తన యాన గంభీరతకు = తన నడకలలోని గాంభీర్యానికి; చాలక = చాలనందువలన; అబలల = పడతుల, యానంబులు = నడకలు; అందెలను, అండగొనగ = అందెలను సహాయమును పొందగా; తన కరశ్రీన్ = తన తొండము యొక్క సౌందర్య సంపదను; కని = చూచి; తలఁకి = భయపడి; బాలల చిఱు తొడలు = పడుచుల చిన్ని తొడలు, మేఖలదీప్తిన్ = బంగారు ఒడ్డాణముల కాంతిని; తోడు పిలువన్ = సహాయమర్థింపగా; తన దంతరుచికిన్ + ఓడి = తన దంతముల కాంతులకు ఓడిపోయి; తరుణుల = యౌవనవతుల, నగవులు = నవ్వులు; ముఖ చంద్రదీప్తులన్ = ముఖమనెడి చంద్రుని కాంతులతో; ముసుఁగుఁ దిగువన్ = ముసుగువైచికొనగా; తనదు లావణ్యరూపంబు = తన సుందర రూపము; తలఁచి = భావించి, చూడన్ = చూడగా; అంజన-అభ్ర-కపిల = ఉత్తర దిగ్గజము, తూర్పు దిక్కున గల ఏనుగు; ఆగ్నేయదిశయందలి ఏనుగు; ఆది = మొదలైన; హరిత్ + ఇభ + ఇ ద్ర = దిగ్గజ శ్రేష్ఠముల

యొక్క; దయితలు = ప్రియురాండ్రు; అందరు; తన వెంటన్, అంటుకొని నడువన్ = తనతో కూడినడువగా; కుంభివిభుఁడు = ఆ గజేంద్రుడు : ఒప్పులకుప్పవోలెన్ = అందాలరాశివలె, ఒప్పెన్ = శోభిల్లెను.

తా : ఆ గజేంద్రుని కుంభస్థలములతో పోలవని కాబోలు యువతులు తమ వక్షోజములపై పైట గప్పుకొని యుందురు. ఆ గజేంద్రుని నడకల సొగసుతో తమ నడకలు సాటిరావని యెంచి కాబోలు పడతులు అందెల సహాయాన్ని అర్థించి యుందురు. ఆ గజేంద్రుని దంతకాంతులకు తమ చిర్నగవులు సరిపోలవని యెంచి కాబోలు ముగ్ధాంగనలు మేలి ముసుగులు ధరించి యుందురు. అంజనాది అష్టదిగ్గజముల భార్యలు తమ భర్తలను విడనాడి తనతో కూడి తిరుగునంతటి లావణ్యాతిశయము కలిగి ఆ గజేంద్రుడు సౌందర్యరాశివలె శోభిల్లుతున్నాడు.

యువతుల వక్షోజాలకు ఏనుగుకుంభ స్థలాలు ఉపమాన వస్తువు. కాగా, ఇచ్చట ఏనుగు కుంభ స్థలాలతో సరిరానందున యువతులు తమ వక్షోజాలపై పైటచెరగు కప్పుకొన్నారని ఉత్ప్రేక్షింపబడింది. అట్లే మదవతులైన యువతుల నడకలను గజ గమనంతో పోల్చడం కవిసమయం. కాగా, ఇచ్చట గజయానంతో తమ నడకలు సాటిరానందున పడతులు అందెల సహాయాన్ని పొందినారనడమూ ఉత్ప్రేక్షయే. ఏనుగు తొండముతో యువతుల ఊరువులను పోల్చడం కవిసమయం. కాగా, గజతుండముతో తమ తొడలు సామ్యం కాజాలవని పడతులు నడుమునకు బంగారు ఒడ్డాణాన్ని ధరింప వలసి వచ్చింది. నవయౌవనుల నగవుల కాంతిని గంజదంతపు శోభతో పోలుస్తారు. గజదంతశోభకు తమ హాసకాంతులు సాటిరావని కాబోలు ముగ్ధాంగనలు మేలి ముసుగు ధరిస్తుంటారు.

ఏనుగు కుంభస్థలాలు పడతుల వక్షోజాలకు ప్రసిద్ధమైన ఉపమానము. కాగా, సంస్కృత నైషధీయ కావ్యకర్త ఒక చక్కని వైచిత్రిని ప్రదర్శించాడు. "**ఆభ్యాం కుచాభ్యా మిభ కుంభయోః శ్రీరాదీయతేఽ పావనయోః క్వ తాభ్యాం, భయేన గోపాయిత మౌక్తికా తౌ ప్రవ్యక్త ముక్తాభరణావిమౌ యత్**" (7-75) "ఆ పడుచుగత్తె వక్షోజాలు ఏనుగు కుంభస్థలాల శోభను పరిగ్రహించాయి. కాని, ఏనుగు కుంభస్థలాలు మాత్రం ఆమె వక్షోజసౌందర్యాన్ని పొందలేక పోయాయి. అందుకు కారణం ఏనుగు తన మస్తకంలో ముత్యాలున్నప్పటికీ అది దాచిపెట్టుకోవడమే. కాని, ముక్తాహారయుక్తంగా ఆమె వక్షోజాలు బాహిరమై ఏనుగు కుంభస్థలాలను మించి శోభిస్తున్నాయి" అని. పడతుల ఊరువులను ఏనుగు తొండంతో పోలుస్తారు. కాని,

ఒక కవి ఉత్ప్రేక్షించిన తీరులో వైచిత్రి ఉన్నది. **"మన్యే తదూరూ సంభావ్య హస్తసర్వస్వహారిణౌ, వహంత్య స్పృశ్యతాహేతోః మాతంగత్వం మతంగజాః"** ఏనుగులను మతంగజములని కూడా పేర్కొంటారు. ఆ సుందరి ఊరుయుగళం తమ తొండపు సొగసులు సర్వస్వం అపహరించడం చేత మతంగజాలు మాతంగత్వం పొంది అస్పృశ్యతాదోషంతో అడవులబట్టి పోయాయని ఉత్ప్రేక్షించాడు. ఉపమాన - ఉపమేయాలలో సాదృశ్య సంభావనను చొనిపితే అది ఉత్ప్రేక్షాలంకారమవుతుంది. సంభావన సర్వదా సాదృశ్య మూలకమై ఉండాలి.

యౌవనవతి అయిన సుందరి అవయవాలపై మెరిసే మిలమిలలు ముత్యాల తారళ్యంతో పోలుస్తారు. దాన్ని లావణ్య మంటారు. **"ముక్తాఫలేషుచ్ఛాయాయాస్తరళత్వ మివాంతరా, ప్రతిభాతి యదంగేషు తల్లావణ్య మిహోచ్యతే", "విభాతి లావణ్యమివాంగనాసు"** ధ్వన్యాలోకం.

గజేంద్రుని వర్ణనలో మానవీకరణ ముండటం ఒక విశేషం. మానవుడు స్వాభావికంగా భగవదాకారచిత్తుడు. భగవంతుడు ఆకాశం లాగా సర్వవ్యాపకుడు - సర్వాంతర్యామి. ఆ ధర్మమే మానవుని చిత్తానికి ఉంది. అప్పుడప్పుడు మానవుని చిత్తం అధర్మం వైపు, విషయవాసనల వైపు మరలుతుంది, దుఃఖానుభవం పొందుతుంది. దుఃఖాదులు చిత్తానికి స్వాభావికమైనవి కావు. అవి ఆగంతుక లక్షణాలు. వాటిని పోగొట్టుకొని చిత్తాన్ని పరిశుద్ధం చేసుకోడానికి భగవద్భక్తి అవసరం. తీవ్రమైన భక్తియోగం అనే పుటం పెట్టి ఈ చిత్తసువర్ణానికి యథార్థ స్థితిని కలిగింపవలసి ఉంది. మనుష్యుడు తన మూర్ఖతచేత స్వయంగా బంధితుడవుతాడు. పైగా దుఃఖాలను పిలిపించుకొని వాటితో దగ్ధుడవుతుంటాడు. విలాసిత, పారివారిక సంబంధాల దురుపయోగితల వల్ల మనుష్యుడు పథభ్రష్టుడవుతాడు.

**వ. మఱియు నానా గహన విహరణ మహిమతో మదగజేంద్రము మార్గంబు దప్పి పిపాసా పరాయత్తచిత్తంబున మత్తకరేణు మొత్తంబును దానును జని చని,**

టీ : మరియు, నానాగహన = వివిధములైన కీకారణ్యాలలో, విహరణ = తిరుగుట యందలి; మహిమతో = ఆధిక్యముతో; పిపాసా పరాయత్త = దప్పికకు లోబడిన, చిత్తంబున = మనస్సుతో; మత్తకరేణు = మదించిన ఆడు ఏనుగుల; మొత్తంబును = సమూహమును, తానును, వెళ్లి, వెళ్లి,

తా : ఆ గజేంద్రుడు అనేక గహనాటవులలో సంచరిస్తూ, దారి తప్పి దప్పిక గొన్నవాడై తనను అనుసరిస్తున్న ఆడ ఏనుగుల గుంపుతో వెళ్లి వెళ్లి,

మదమనగా దర్పమనీ, ఏనుగు చెక్కిళ్లనుండి స్రవించు మదజలమనీ రెండర్థాలున్నాయి. **"మదే దర్పేభదానయోః"** అని నిఘంటువు.

**శ్లో. సఘర్మతప్తః కరిభిః కరేణుభి ర్వృతో మదచ్యుత్కలభైరభిద్రుతః**
**గిరిం గరిమ్ణా పరితః ప్రకంపయన్ నిషేవ్యమాణోఽలి కులైర్మదాశనైః**

తా : ఆ గజేంద్రము ఎండదెబ్బకు తట్టుకోలేక పోయింది. దాని వెంట గున్న ఏనుగులు, పిల్లయేనుగులు నడచి వస్తున్నాయి. వాటి మదజలధారలు త్రాగే తుమ్మెదలు కూడా వాటితో పాటే వస్తున్నాయి.ఆ ఏనుగులు స్వాంగ గౌరవంతో కొండలను ప్రకంపింప జేస్తున్నాయి.

**"కలభో హస్తి శాబకః"** అని అమరం. ఏనుగు పిల్లను కలభమంటారు. తుమ్మెదలు దానభోజనులు. మదజలమే భోజనంగా కలవి అని అర్థం.

**మ. అటఁగాంచెం గరిణీవిభుండు నవఫుల్లాంభోజకల్హారమున్**
**నటదిందీవరవారమున్ గమఠమీనగ్రాహదుర్వారమున్**
**వటహింతాళరసాలసాలసుమనోవల్లీకుటీతీరమున్**
**జటులోద్ధూతమరాళచక్రబకసంచారంబుఁ గాసారమున్**

టీ : అటన్ = ఒకానొకచోట; కరిణీవిభుండు = ఆడుఏనుగులకు నాయకుడైన గజేంద్రుడు, నవఫుల్ల+అంభోజ కల్హారమున్ = క్రొత్తగా విప్పారిన తామరలు, సౌగంధికాలును; నటత్ + ఇందీవరవారమున్ = ఆడుచుండిన తుమ్మెదలు కలదానిని; కమఠ = మీన - గ్రాహ - దుర్వారమున్ = తాబేళ్లు, చేపలు, మొసళ్లు వీటిచేత నివారింపరాని దానిని; వట ... తీరమున్ = మఱ్ఱిచెట్లు, గిరిక చెట్లు, తియ్యమామిడి చెట్లు, మద్దిచెట్లు, పూచిన తీగెలు, పొదరిండ్లు - వీటితో కూడిన ఒడ్డు గలదానిని; చటుల = తీవ్రముగా; ఉద్ధూత = ఎగిరెడి; మరాళ = హంసలయొక్కయు; చక్ర = చక్రవాక పక్షుల యొక్కయు, బక = కొంగలయొక్కయు; సంచారమున్ = సంచారము గలదానిని; కాసారమున్ = సరస్సును, కాంచెన్ = చూచెను.

తా : ఆ గజేంద్రుడు పద్మాలును, కల్హారాలును, వానిపై ముసరి ఆడెడి తుమ్మెదలును, మొసళ్లు మున్నగు జలచరసముదాయమును కలదానిని, తీరాన నానావిధ వృక్షసంతతులు కలిగిన ఒక కాసారాన్ని చూచాడు.

**వ. ఇట్లనన్యపురుషసంచారంబయి నిష్కళంకంబైన యప్పంకజాకరంబుఁ బొడగని**

టీ : ఇట్లు, అనన్యపురుష సంచారంబు+అయి = ఇతరులెవ్వరు సంచరింపని చోటయి; నిష్కలంకంబైన = నిర్మలమైనదైన; ఆ+పంకజాకరంబు = ఆ తామరకొలనును, పొడగని = చూచి,

తా : ఇతర జీవసంచారంలేని నిర్మలమగు నీటితో కూడిన ఆ పద్మసరస్సును చూచి,

**సీ. తోయజగంధంబు దోఁగిన చల్లని మెల్లని గాడ్పుల మేను లలరఁ**
**గమలనాళాహారవిమలవాక్కలహంసరవములు సెవుల పండువులు సేయ**
**ఫుల్లదిందీవరాంభోరుహామోదంబు ఘ్రాణరంధ్రంబుల గారవింప**
**నిర్మలకల్లోలనిర్గతాసారంబు వదనగహ్వరములవాడు తీర్పఁ**

**త్రిజగదభినవసౌభాగ్యదీప్తమైన విభవ మీక్షణములకును విందుసేయ**
**నరిగి పంచేంద్రియవ్యవహారములను మరచి మత్తేభయూథంబు మడుఁగు సొచ్చె.**

టీ : తోయజగంధంబు = పద్మాల పరిమళము, తోఁగిన = మునిగిన, చల్లని మెల్లని గాడ్పులన్ మేనులు+అలర = దేహములు హాయినొందగా; కమలనాళ+ ఆహార = తామర తూడులు ఆహారముగా గల, విమల = నిర్మలమైన వాక్+ పలుకులుగల; కలహంస రవముల = రాజహంసల చప్పుడులు; చెవుల పండువులు చేయగా; ఫుల్లత్+ఇందీవర+అంభోరుహ+ ఆమోదంబు = వికసించుచున్న పద్మముల, సౌగంధికముల పరిమళము, ఘ్రాణరంధ్రంబులన్ = ముకుదొప్పలను; గారవింప = ఆనందింపజేయగా; నిర్మల కల్లోల = స్వచ్ఛములైన అలలమండి, నిర్గత = బయలువెడలిన; ఆసారంబు = నీటితుంపురులు; వదన గహ్వరముల = గుహలవంటి నోళ్లయొక్క; వాడుతీర్పన్ = ఎండిపోవుటను మాన్పించగా; త్రిజగత్ + అభినవ = ముల్లోకాలకు క్రొత్తదైన; సౌభాగ్య = సౌభాగ్యముచే; దీప్తమైన = ప్రకాశవంతమైన; విభవము = వైభవము; ఈక్షణములకున్ = నేత్రములకు, విందు సేయన్ = వేడుక చేయగా, అరిగి = వెళ్లి, పంచ+ఇంద్రియ వ్యవహారములను = ఇంద్రియకృత్యములనైదింటిని, మఱచి, మత్తేభయూథంబు = మదగజముల గుంపు, మడుగులో ప్రవేశించెను.

తా : ఆ కాసారమునందలి తామరపూల సువాసనలు చల్లని మెల్లని గాలులు ఆ ఏనుగుల దేహములకు హాయి చేకూరుస్తుండగా, సరోవరమునందలి జలపక్షుల కలరవములు చెవులకు పండుగ చేస్తుండగా, వికసిత పద్మసుగంధములు ఘ్రాణతర్పణం చేస్తుండగా, చిరుగాలి కెరటాలను రేపి జలబిందువులు పిడుచగట్టిన నోళ్లను తడుపుతుండగా, నవనవోన్మీలితపద్మసౌభాగ్యం కళ్లకు ఆనందం కలిగిస్తుండగా, పంచేంద్రియప్రవర్తనం మరచి మదపుటేనుగుల గుంపు ఆ కాసారంలోనికి ప్రవేశించింది.

త్వక్ - శ్రోత్ర - ఘ్రాణ - జిహ్వా - చక్షువులు పంచేంద్రియాలు. ఇవి జ్ఞానానికి సంబంధించినవి. రూప రస గంధ స్పర్శ శబ్దములయిదింటిని పంచతన్మాత్రలంటారు. ఇంద్రియార్థాలనీ పేర్కొంటారు. ఈ అయిదు భూమిమీద జన్మించిన జీవికి పంచభూతములనుండి ఏర్పడ్డాయి. పృథివి, అప్పు (నీరు), తేజస్సు (సూర్యుడు-అగ్ని), వాయువు, ఆకాశం. వీటిని పంచభూతాలంటారు. సాంఖ్య సంప్రదాయ

వేత్తలు సృష్టినిర్మాణక్రమాన్ని తెలిపారు. వారి సిద్ధాంతాన్ని అనుసరించి మొట్టమొదట ప్రకృతివల్ల మహత్తత్త్వం ఉత్పన్నమయింది. మహత్తత్త్వం నుంచి అహంకారం, అహంకారం నుంచి పదహారు పదార్థాలు పుట్టాయి. ఆ పదహారు పదార్థాలు పంచజ్ఞానేంద్రియాలు, పంచ కర్మేంద్రియాలు, ఒక మనస్సు, అయిదు తన్మాత్రలు అయినాయి. ఇందులో కూడా ఈ పంచతన్మాత్రలనుంచి పంచమహాభూతాలు ఉత్పన్న మవుతాయి. అనగా శబ్ద తన్మాత్ర చేత ఆకాశం ఉత్పన్నమయింది. ఆకాశం యొక్క గుణం శబ్దం. శబ్ద స్పర్శలు అనే రెండు తన్మాత్రల చేత వాయువు ఉత్పన్నమయింది. శబ్ద స్పర్శలు రెండూ వాయుగుణాలు. శబ్ద స్పర్శ రూపములు అనే మూడు తన్మాత్రలచే తేజస్సు ఉత్పన్న మయింది. శబ్ద స్పర్శ రూపాలు మూడూ తేజస్సు యొక్క గుణాలు. శబ్ద స్పర్శ రూప రసాలు అనే నాలుగు తన్మాత్రల సంయోగం చేత జలం ఉత్పన్నమయింది. ఈ జలమునకు శబ్ద స్పర్శ రూప రసములని నాలుగు గుణాలున్నాయి. ఈ నాలుగు, గంధం - ఈ అయిదు తన్మాత్రల సంయోగం చేత పృథ్వి ఉత్పన్నమయింది. ఈ పృథ్విలో ఈ అయిదు గుణాలున్నాయన్నది సాంఖ్యమత సిద్ధాంతం. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములు - పంచతన్మాత్రలు.

**శ్లో. సరోనిలం పంకజరేణురూషితం జిఘ్రన్ విదూరా న్మదవిహ్వలేక్షణః**
**వృతః స్వయూథేవ తృషార్దితేవ తత్ సరోవరాభ్యాశమథాగమ ద్ద్రుతమ్**

తా : ఆ గజేంద్రుని కళ్లు మదవిహ్వలములయ్యాయి. అతనికి మహా దాహమయింది. వ్యాకులుడయ్యాడు. అతనితోపాటు వస్తున్న ఆడేనుగుల గుంపు కూడా దప్పిక గొన్నది. ఆ సమయంలో దూరంనుండి కమలపరాగసువాసితములై ఘ్రాణతర్పణం చేస్తున్న సుగంధవాయువులను బట్టి క్షణంలో ఆ సరోవరం దగ్గరికి వెళ్లాయి.

**కం. తుండంబులఁ బూరించుచు గండంబులఁ జల్లుకొనుచు గళగళరవముల్**
**మెండుకొని వలుదకడుపులు నిండన్ వేదండకోటి నీరుంద్రావెన్**

టీ : వేదండకోటి = ఆ ఏనుగుల సమూహము; తుండంబులన్ = తొండములతో; (జలమును) పూరించుచు = నిండించుకొనుచు; గండంబులన్ = చెక్కిళ్లపైన, చల్లుకొనుచున్, గళగళరవముల్ = (త్రాగునపుడు) గడగడ త్రాగుచప్పుళ్లు, మెండుకొనన్ = అధికముకాగా; వలుద కడుపులు = విశాలమైన పొట్టలు; నిండన్, నీరున్, త్రావెన్ = త్రాగెను.

తా : ఆ ఏనుగులు తొండాల నిండుగా నీరు గ్రహించి పైన చల్లుకొంటూ చెంపల మీద చల్లుకొంటూ గడగడ ధ్వనులతో తమ పెద్ద కడుపులు నిండునట్లుగా నీళ్లు త్రాగాయి.

వ. అప్పుడు

మ. ఇభలోకేంద్రుఁడు హస్తరంధ్రమున నీరెక్కించి పూరించి చం
డభమార్గంబున కెత్తి నిక్కి వడి నుద్ధాడించి పింజింప నా
రభటిన్ నీరములోనఁ బెల్లెగసి నక్రగ్రాహపాఠీనముల్
నభమందాడెడు మీనకర్కటములన్ బట్టెన్ సురల్ మ్రాన్పడన్

టీ : ఇభలోక+ఇంద్రుఁడు = ఏనుగుల సమూహమునకు ప్రభువైన గజేంద్రుడు, హస్త రంధ్రములన్ = తొండపు రంధ్రాలలోనికి, నీరెక్కించి, పూరించి = నింపించి, చండభ మార్గంబునకు = సూర్యుని మార్గమునకు; ఎత్తి, నిక్కి = నిక్కి నిలిచి, వడిన్ = వేగముగా; ఉద్ధాడించి = ఇటునటు కదలించి; పింజింపన్ = నీళ్లు చిలకరింపగా, ఆరభటిన్ = పెద్ద ధ్వనితో, నీరములోన = నీటిలోనుండి, పెల్లు+ ఎగసి = తీవ్రముగా పైకి ఎగసి, నక్ర-గ్రాహ-పాఠీనముల్ = ఎండ్రకాయలు, మొసళ్లు, చేపలు, నభమం దాడెడు = ఆకాశమున వర్తించెడి, మీన కర్కటములన్ = మీనరాశిని, కర్కాటకరాశిని, సురల్ = దేవతలు; మ్రాన్పడన్ = (చూచి) నిశ్చేష్టులగునట్లుగా; పట్టెన్ = పట్టుకొనెను.

తా : గజరాజు తన తొండమునిండ నీరెక్కించుకొని పెద్ద పెట్టున పైకి చిమ్మగా ఆ నీరు వెంట తొండములోనికి చేరిన సరోవరమందలి నక్రగ్రాహపాఠీనములు మింటనుండిన మీనరాశిని, కర్కాటక రాశిని పట్టుకొన్నవి. అది చూచి దేవతలు ఆశ్చర్యంతో నిశ్చేష్టులయ్యారు.

గజేంద్రుని దేహబలము, మదపుటేనుగు నీళ్లు త్రాగు విధము, భావి కథాసూచన ఈ పద్యంలో అనితరసాధ్యంగా వర్ణించారు పోతనగారు. సరోవరజలాలలో గల మీన కర్కటములు ఆకాశమందలి శింశుమారచక్రంలోని మీన- కర్కాటక రాసులను పట్టినవనడం అత్యద్భుతమైన విషయం.

వ. మఱియు నగ్గజేంద్రంబు నిరర్గళ విహారంబున.

టీ : మరియు, ఆ గజేంద్రుడు; నిరర్గళ = అడ్డులేని, విహారమందు.

తా : ఆ గజరాజు ఈ విధంగా సరోవర జలంలో అడ్డులేకుండ విహరించేటప్పుడు.

సీ. కరిణీ కరోజ్ఝిత కంకణచ్ఛటఁ దోఁగి సెలయేటి నీలాద్రిచెలువుఁ దెగడు
హస్తినీహస్తవిన్యస్తపద్మంబుల వేయికన్నులవానివెరవు సూపుఁ
కలభసముత్కీర్ణకల్హారరజమునఁ గనకాచలేంద్రంబు ఘనతఁ దాల్చు
కుంజరీపరిచితకుముదకాండంబుల ఫణిరాజమండనప్రభ వహించు
మదకరేణుముక్తమౌక్తికశుక్తుల మెఱఁగు మొగిలుతోడ మేలమాడు
వెదురులేని గరిమ నిభరాజమల్లంబు వనజగేహకేళి వ్రాలునపుడు

టీ : ఇభరాజ మల్లంబు = గజరాజులలో శ్రేష్ఠుడైన గజేంద్రుడు, ఎదురులేని గరిమన్ = తనను అడ్డుపెట్టెడివారు లేరన్న గొప్ప తనముతో; వనజగేహకేళి = పద్మసరస్సునందు జలక్రీడకు, వ్రాలునపుడు = దిగునపుడు, కరిణీకర = ఆడ ఏనుగుల తొండముల నుండి; ఉజ్ఝిత = విడువబడిన; కంకణచ్ఛటన్ = జలబిందువుల సముదాయముచే, తోగి = తడుపబడినదై; సెలయేటి నీలాద్రి = సెలయేళ్లు గల నల్లని కొండ యొక్క; చెలువున్ = సొగసును, తెగడున్ = పరిహసించును; హస్తినీ హస్త = ఆడయేనుగుల తొండములచే, విన్యస్త = ఉంచబడిన; పద్మంబులన్ = తామర పూలచేత; వేయి కన్నులవాని = సహస్రాక్షుడైన దేవేంద్రుని యొక్క, వెరవు = విధమును; చూపును; - కలభ సముత్కీర్ణ = గున్నయేనుగుల చేత చల్లబడిన, కల్హారరజమునన్ = కలువల పుప్పొడిచే; కనకాచలేంద్రంబు = బంగారు కొండ (మేరుగిరి) యొక్క, ఘనతఁదాల్చున్ = గొప్పతనమును పొందును; - కుంజరీ పరిచిత = ఆడ ఏనుగులచే ఏర్పరుపబడిన, కుముద కాండంబులన్ = కలువ తూడులచేత, ఫణిరాజ = ఆదిశేషుని యొక్క; మండన ప్రభన్ = ఆభరణ కాంతిని; వహించున్ = ధరించును; మదక రేణు ముక్త = మదించిన ఆడేనుగులచే వదలబడిన; మౌక్తిక శుక్తులన్ = ముత్యాల చిప్పలతో; మెఱుగు మొగిలుతోడ = మెఱపు గల మేఘముతో మేలమాడు = ఎకసక్కెమాడును. కించ పరచును.

తా : గజేంద్రుడు ఆ కాసారంలో స్వేచ్ఛగా, నిరాటంకంగా విహరించేటప్పుడు ఆడయేనుగులు తొండాలతో చల్లిన జలధారలతో గజరాజు కొండవాగులతో కూడిన నీలాద్రిలాగా ఉన్నాడు. ఆడయేనుగులు సరోవరంలోని తామరపూలను గజరాజుపై ఉంచినప్పుడు అతడు దేవేంద్రునివలె శోభిల్లాడు. ఆడయేనుగులు తమ తొండాలతో పద్మపరాగం చల్లినపుడు అతడు బంగారు కొండవలె ప్రకాశించాడు. ఆడయేనుగులు తామరతూడులను తీసి గజరాజుపై ఉంచినప్పుడు అతడు అలంకృతుడైన ఆదిశేషుని వలె విరాజిల్లాడు. ఆడయేనుగులు సరోవరం నుండి తీసి గజరాజుపై ఉంచిన ముత్తెపు చిప్పలచే అతడు మెఱపుతో కూడిన మేఘంలాగా శోభిల్లాడు.

ఈ పద్యంలో ఏనుగుల జలక్రీడా స్వభావ వర్ణన మున్నది. గజరాజుపై ఆడయేనుగులకు గల ప్రేమాతిశయం వ్యక్తమవుతున్నది. కథానాయకుడైన గజేంద్రుని రూపరేఖావిలాసాలను పోతనగారు సందర్భోచితంగా, అత్యంతసుందరంగా వర్ణించారు. ఈ వర్ణనలో పేర్కొన్న 'నీలాద్రి' నల్గొండయేయని భావించవచ్చు. పోతనగా రచ్చట కొంతకాలము నివసించారనే ఐతిహ్యమున్నది.

**శ్లో. విగాహ్య తస్మి న్నమృతాంబు నిర్మలం హేమారవిందోత్పలరేణురూషితం**

**పపౌ నికామం నిజపుష్కరోద్ధృత మాత్మాన మద్భిః స్నపయన్ గతక్లమః**

తా : ఆ సరోవరంలో గల సుధాస్వాదువులు, కమలోత్పలకేసరాలతో సుగంధిలములునైన నిర్మలజలాలను గజేంద్రుడు తన తొండంతో కడుపు నిండుగా త్రాగాడు. ఆ తర్వాత ఒడలి మీద పోసికొని స్నానం చేసి శ్రమను పోగొట్టుకొన్నాడు.

ఈ గజేంద్రుడు కొంత సరసుడే. ఆడయేనుగులపై నీళ్లు చిమ్మి తన ప్రేమ నొలకబోశాడు. సాధారణంగా గజస్నానం నిష్ఫలమంటారు. "రవితప్తో గజః పద్మాంస్తద్బహోన్ బాధితుం ధ్రువం, సరోవిశతి వ స్నాతుం గజస్నానం హి నిష్ఫలమ్".

**వ. మఱియు నా సరోవరలక్ష్మి మదగజేంద్రవివిధవిహారవ్యాకులితనూతన లక్ష్మీవిభవయై యనంగవిద్యానిరూఢపల్లవప్రబంధపరికంపితశరీరాలంకారయగు కుసుమకోమలియును బోలె, వ్యాకీర్ణ చికుర మత్తమధుకర నికరయు, విగతరసవదనకమలయు, నిజస్థానచలితకుచరథాంగ యుగళయు, లంపటితపులినతలయునై యుండె నంత.**

టీ : మరియు, ఆ సరోవరలక్ష్మి = ఆ సరోవరం యొక్క శోభ; మదగజేంద్ర = గజేంద్రుని, వివిధవిహార = పలు విధములైన విహరణములచే, వ్యాకులిత = కలత పెట్టబడినదై (కలంచబడినదై), నూతన = క్రొత్తదైన, లక్ష్మీ విభవంబునన్ = సంపద్వైభవంతో, అనంగవిద్యా = కామకళాశాస్త్రమునందు; నిరూఢ = ప్రసిద్ధికెక్కిన, పల్లవ = విటుని, ప్రబంధ = చౌసీతిబంధాల (84)చే; పరికంపిత = మిక్కిలి కదలాడుచున్న శరీరాలంకారయగు = దేహాలంకారము గలది యగు; కుసుమకోమలియునుంబోలె = పువ్వువంటి మేను గలదానివలె, వ్యాకీర్ణ = చెదరియున్న, చికుర = ముంగురులన దగిన; మత్తమధుకర నికరయు = మదించిన తుమ్మెదల గుంపు గలదియు; విగతరస = గతించిన రసము గల, వదన = ముఖమనే, కమలయు = పద్మములు గలదియు; నిజస్థాన చలిత = స్వస్థానమునుండి కదలిన, కుచ = వక్షోజములనదగు, రథాంగ యుగళము = చక్రవాక పక్షి జంటలు గలదియు; లంపటిత = శ్రమపెట్టబడిన, జఘన = మొల అనెడి; పులినతలయు = ఇసుక తిన్నెలు గల ప్రదేశము గలదియునై యుండెను - ఆ తర్వాత,

తా : ఆ సరోవరశోభ మదగజేంద్రుని వివిధ విహారాలచేత (త్రిప్పటులచేత) కల్లోలిత మయింది. కామ శాస్త్ర కళా కోవిదుడైన విటునిచే చౌసీతి బంధాల పాలయి చెల్లాచెదరయిన శరీరాభరణాలు గలిగిన కుసుమకోమలివలె ఉన్నది. చెదరి చలించు ముంగురు లనదగిన తుమ్మెదలగుంపు గలదయి ఉన్నది. అధర రసం కోల్పోయిన ముఖపద్మం గలది వలె ఉన్నది. స్వస్థానం నుంచి భ్రష్టమైన వక్షోజయుగ మనెడి చక్రవాకపక్షి జంటలు గలది వలె ఉన్నది. కలచి వేసిన జఘనస్థల మనెడి పులిన స్థలులు గలదిగా ఉన్నది. సరోవ[illegible]శోభను ఇట్లు చేసిన

గజరాజు కామకళా ధురంధరుడైనను అధమవిటుడు. కామతంత్రంలో నిర్లజ్జుడు. రతికేళిలో కర్కశుడు. పద్మసరస్సు కుసుమకోమలి. వివిధరతుల నలయించినట్లుగా కల్లోలపరిచాడు. ఆభరణాలు అస్తవ్యస్తములు కావడం, ముంగురులు చెదరి పోవడం, అధరరసం అడుగంటడం, స్తనాలు స్వస్థానాన్ని విడవడం, జఘనం గాసి చెందడం మొదలైనవి సురత నివృత్తిదశను తెలుపుతాయి. **"సురతం సాక్షాన్నావాకరణ కల్పితం"** అని శాస్త్రం. కామశాస్త్రంలోని వివిధ బంధాలను సూచించినంతమాత్రం చేత పోతనగారు స్త్రీలంపటత్వం గలవాడని భావించడం తగదు. కవికి కామశాస్త్ర పరిజ్ఞానం ఉండటం తప్పుకాదు. ఉండక పోవడమే తప్పవుతుంది. పోతనగారు మహాకవి. లోకజ్ఞుడు కావ్యజ్ఞుడు అయిన కవి వర్ణనీయ వస్తునిష్ఠతో తన ప్రజ్ఞావిశేషమైన ప్రతిభను ప్రదర్శించిన సందర్భమిది. **శక్తి ర్నిపుణతా లోకశాస్త్ర కావ్యాద్యవేక్షణాత్** గలవాడాయన. కవియైన వాని కెన్నెన్నో విషయాలు తెలియాలి. **"న స శబ్దో న తద్వాచ్యం న స న్యాయో న సా కళా, జాయతే యన్న కావ్యాంగ మహో భారో మహాన్ కవేః"** అని ఆచార్యభామహులు కవి బహుశాస్త్రభరం ధరించిన వాడై ఉండాలన్నారు. అదీకాక ఇక్కడ వర్ణనీయ విషయం సరోవరశోభ. సౌందర్యానికి శృంగారానికి అవిచ్ఛేద్యమైన సంబంధ ముంటుంది. పాఠకులను ఉన్ముఖులను చేయడానికి, కావ్యశోభను పెంచడానికి శృంగారరసాంగాల వర్ణన ఎంతగానో తోడ్పడుతుంది. కనుక ఇచ్చట శృంగార ప్రసక్తి దోషం కాదు. శృంగార రసం వల్ల వినయోపదేశాలను పాఠకులు సుఖంగా సంతోషపూర్వకంగా గ్రహిస్తారని ఆచార్య ఆనందవర్ధనులన్నారు. **"వినేయానున్ముఖీ కర్తుం కావ్యశోభార్థమేవ వా"** ధ్వన్యాలోకం. (3-30) ఇందులో శ్లిష్టశబ్ద నిబంధనమగు రూపకాలంకారమున్నది. రూపం యొక్క ఆరోపమే రూపకము. అన్యత్ర అన్యధర్మాన్ని ఆరోపించడం రూపకం.

**శ్లో. స్వపుష్కరేణోద్ధృత శీకరాంబుభి ర్నిపాయయన్ సంస్నపయన్ యథా గృహీ**
**ఘృణీ కరేణూః కరభాంశ్చ దుర్మదో నాచష్ట కృచ్ఛ్రం కృపణోఽజమాయయా**

తా : ఆ గజేంద్రుడు గృహస్థపురుషుని వలె మోహగ్రస్తుడై తన తొండంతో జలకణాలను కురిపిస్తూ, ఆడయేనుగులను ఏనుగుగున్నలను స్నానం చేయిస్తున్నాడు. వాటి నోళ్లల్లో తొండం పెట్టి నీళ్లు త్రాగిస్తున్నాడు. భగవన్మాయవల్ల అతడు పరమ మోహితుడై ఉన్మత్తుడు కాసాగాడు. పాపం ఆ దీనుడు తనకు మహావిపత్తు రానున్నదని ఎరుగడు. విషయసుఖవాంఛయే దుఃఖానికి ఆవాహనమవుతుంది.

శ్లో. తం తత్ర కశ్చిన్నృప దైవచోదితో గ్రాహో బలీయాం శ్చరణే రుషాగ్రహీత్
యదృచ్ఛయైవం వ్యసనం గతో గజో యథాబలం సోఽతిబలో విచక్రమే

తా : ఓ రాజా! ఆ సమయంలో ప్రారబ్దప్రేరణతో చాలా బలం గలిగిన ఒక మొసలి క్రోధంతో సరసరా వచ్చి ఆ ఏనుగు కాలిని పట్టుకొన్నది. హఠాత్తుగా తనకీ విధమైన ఆపద కలగగానే ఆ ఏనుగు తన శక్త్యనుసారంగా దాని పట్టు విడిపించుకోడానికి ప్రయత్నించింది. కాని, ఆ మొసలి తన పట్టు విడువ లేదు.

సీ. భుగభుగాయితభూరిబుద్బుదచ్ఛటలతోఁ గదలుచోఁ దివికి భంగంబు లెగయ
భువనభయంకరపూత్కారరవమున ఘోరనక్రగ్రాహకోటి బెగడ
వాలవిక్షేపదుర్వారఝంఝానిలవశమున ఘుమఘుమావర్త మడరఁ
గల్లోలజాలసంఘట్టనంబులఁ దటితరు లమూలంబులై ధరణిఁ గూల

సరసిలోనుండి పొడఁగని, సంభ్రమించి యుదరి కుప్పించి లంఘించి, హుంకరించి
భానుఁ గబళించి పట్టు స్వర్భానుపగిది నొక్క మకరేంద్రుఁ డిభరాజు నొడిసి పట్టె

టీ : ఒక్క మకరేంద్రుడు = ఒక మొసలి రేడు; భుగభుగాయిత = భుగభుగ ధ్వనులతో, భూరి = గొప్పవైన, బుద్బుదచ్ఛటలతో = బుడగల సమూహముతో; కదలుచున్నప్పుడ; భంగములు = కెరటాలు; దివికిన్ = ఆకాశమునకు; ఎగయన్ = ఎగురగా; భువన భయంకర = లోకములకు భీతిగొల్పునట్టి; పూత్కార రవమునన్ = పూయను ధ్వనులచే, ఘోర నక్రగ్రాహ కోటి = భయంకరమైన మొసళ్లు, ఎండ్రకాయల గుంపు; బెగడన్ = భయపడగా; వాల విక్షేప = తోకను కదల్చుటచేత; దుర్వార = నివారింపశక్యముకాని; ఝంఝానిలవశమునన్ = ప్రచండమైన గాలి వలన; తటితరులు = ఒడ్డునగల చెట్లు; అమూలంబులై = వ్రేళ్లు లేనివై (పెల్లగింపబడినవై) ధరణిన్ = భూమి యందు, కూలగా; సరసిలోనుండి = కాసారము నందుండి; పొడగని = (గజేంద్రుని) చూచి, సంభ్రమించి = తొట్రుపడి; ఉదరి = అదరిపడి; లంఘించి = దుమికి; హుంకరించి = హుమ్మని ధ్వని చేసి; భానున్ కబళించు = సూర్యుని మ్రింగి వేయునట్టి; స్వర్భాను పగది = రాహువు వలె; ఇభరాజున్ = గజేంద్రుని; ఒడిసి పట్టెన్ = ఎగసి పట్టుకొనెను.

తా : ఆ కాసారంలో ఒక పెద్ద మొసలి ఉన్నది. అది నీటిలో సంచరించేటప్పుడు పెక్కు బుడగలు, అలలు ఏర్పడినవి. దాని పూత్కారంతో అందున్న జలజంతువులు అటునిటు పరుగిడుతున్నవి. ఆ మొసలి తన తోక త్రిప్పుటచే కాసారజలాలలో సుడు లేర్పడినవి. ఆ అలలు ఒడ్డునకు దన్నుటచేత ఒడ్డునగల వృక్షాలు పెల్లగిలి నేలపై వ్రాలినవి. ఆ మొసలి సరస్సులో ఒక తావున నుండి గజేంద్రుని చూచి సంభ్రమించి, హుంకారమొనర్చి దుముకుతూ వచ్చి సూర్యుణ్ని రాహువు పట్టుకొన్నట్లుగా ఎగసి అతణ్ని పట్టుకొన్నది.

**కం. వడిఁ దప్పించి కరీంద్రుఁడు నిడుద కరంబెత్తి వ్రేయ నీరాటంబుం**
**బొడవడఁగినట్లు జలములఁ బడి కడువడిఁ బట్టెఁ బూర్వపదయుగళంబున్**

టీ : కరీంద్రుడు = గజరాజు; వడిన్ = వేగమును, తప్పించి, నిడుద కరంబున్ = పొడవైన తొండముతో; ఎత్తివ్రేయన్ = పైకెత్తి కొట్టగా; నీరాటంబున్ = ఆ మొసలియు; పొడవు + అడగినట్లు = రూపుమాయునట్లు; జలములఁ బడి = నీటిలో పడి; కడువడిన్ = చాలతొందరగా; మఱలి=తిరిగి, పూర్వ పదయుగళంబున్ = ముందు కాళ్ల రెంటిని, పట్టెన్ = పట్టుకొనెను.

తా : గజేంద్రుణ్ని మొసలి పట్టుకోగానే దానికి పట్టుపడకుండా గజేంద్రుడు తొండంతో ఒక దెబ్బ కొట్టాడు. అది చచ్చినట్లు పడియుండి తటాలున లేచి వచ్చి, ఆ ఏనుగు ముందు కాళ్లను రెంటిని పట్టుకొన్నది.

**చం. పదములు పట్టినం దలఁకుపాటొకయింతయు లేక శూరతన్**
**మదగజవల్లభుండు ధృతిమంతుఁడు దంతయుగాంతఘట్టనన్**
**బెదరఁగఁ జిమ్మ నమ్మకరి చిప్పలు పాదులు దప్ప నొప్పరన్**
**వదలి జలగ్రహంబు కరివాలము మూలముఁ జీరెఁ గోఱలన్**

టీ : పదములు పట్టినన్ = మొసలి గజేంద్రుని కాళ్ళను పట్టుకొనగా; ధృతిమంతుడు = ధైర్యశాలియైన, మదగజ వల్లభుండు = ఆ గజేంద్రుడు; తలఁకుపాటు = తత్తరపాటు (భయము) ఒకయింతయు లేక = ఏ మాత్రమును లేక; శూరతన్ = శౌర్యముతో; దంత - యుగ + అంత ఘట్టనన్ = దంతముల రెండింటి కొనల చేత కొట్టుట చేత, ఆ + మకరిన్ = ఆ మొసలిని; చిప్పలు పాదులు = దాని శరీరమందలి బొలుసులు కుదుళ్లు, తప్పన్ = ఊడి పోవునట్లుగా; చిమ్మన్ = విసరగా; జలగ్రహంబు = (అప్పుడు) మొసలి; వదలి = ఏనుగుకాళ్లను వదలినదై; కరివాలము మూలమున్ = ఏనుగు తోకను మొదలంట; కోఱలన్ = దంతములతో, చీరెన్ = చీల్చెను.

తా : ఆ విధంగా మొసలి తన పాదాలను పట్టుకొనగా, గజేంద్రుడు శౌర్యాన్ని చూపి తన దంతాలతో ఆ మొసలి ఒంటిమీద చిప్పలు కదలిపోయేటట్లుగా పొడిచాడు. అప్పుడు మొసలి ఏనుగు కాళ్లను వదలి, దాని తోకను పట్టి కోరలతో చీల్చింది.

**కం. కరిఁదిగుచు మకరి సరసికిఁ గరి దరికిని మకరి దిగుచు గరకరి బెరయన్**
**గరికి మకరి మకరికిఁగరి భరమనుచును నతలకుతలభటు లదిరి పడన్**

టీ : కరిన్ = ఏనుగును, సరసికి = కాసారములోనికి, మకరి = మొసలి, తిగుచున్ = లాగును; కరి = ఏనుగు, మకరిన్ = మొసలిని; దరికి = ఒడ్డునకు, తిగుచున్ = లాగును. కర కరి బెరయన్ = క్రౌర్యము అధికముకాగా, కరికి మకరి = ఏనుగునకు మొసలి, మకరికి కరి = మొసలికి ఏనుగు, భరమనుచున్ = ఒక దానికొకటి భారమైనవి అనుచు, అతల కుతల లోకములందుండెడి వీరులు, అదిరి పడన్ = భయపడునట్లుగా.

**శ్లో. తం తత్ర కశ్చిన్నృప దైవచోదితో గ్రాహో బలీయాం శ్చరణే రుషాగ్రహీత్**
**యదృచ్ఛయైవం వ్యసనం గతో గజో యథాబలం సోఽతిబలో విచక్రమే**

తా : ఓ రాజా! ఆ సమయంలో ప్రారబ్ధప్రేరణతో చాలా బలం గలిగిన ఒక మొసలి క్రోధంతో సరసరా వచ్చి ఆ ఏనుగు కాలిని పట్టుకొన్నది. హఠాత్తుగా తనకీ విధమైన ఆపద కలగగానే ఆ ఏనుగు తన శక్త్యనుసారంగా దాని పట్టు విడిపించుకోడానికి ప్రయత్నించింది. కాని, ఆ మొసలి తన పట్టు విడువ లేదు.

**సీ. భుగభుగాయితభూరిబుద్బుదచ్ఛటలతోఁ గదలుచో దివికి భంగంబు లెగయ**
**భువనభయంకరఫూత్కారరవమున ఘోరనక్రగ్రాహకోటి బెగడ**
**వాలవిక్షేపదుర్వారఝంఝానిలవశమున ఘుమఘుమావర్త మడరఁ**
**గల్లోలజాలసంఘట్టనంబులఁ దటితరు లమూలంబులై ధరణిఁ గూల**

**సరసిలోనుండి పొడఁగని, సంభ్రమించి యుదరి కుప్పించి లంఘించి, హుంకరించి**
**భానుఁ గబళించి పట్టు స్వర్భానుపగిది నొక్క మకరేంద్రుఁ డిభరాజు నొడిసి పట్టె**

టీ : ఒక్క మకరేంద్రుడు = ఒక మొసలి రేడు; భుగభుగాయిత = భుగభుగ ధ్వనులతో, భూరి = గొప్పవైన, బుద్బుదచ్ఛటలతో = బుడగల సమూహముతో; కదలుచున్నప్పుడ; భంగములు = కెరటాలు; దివికిన్ = ఆకాశమునకు; ఎగయన్ = ఎగురగా; భువన భయంకర = లోకములకు భీతిగొల్పునట్టి; ఫూత్కార రవమునన్ = పూయను ధ్వనులచే, ఘోర నక్రగ్రాహ కోటి = భయంకరమైన మొసళ్లు, ఎండ్రకాయల గుంపు; బెగడన్ = భయపడగా; వాల విక్షేప = తోకను కదల్చుటచేత; దుర్వార = నివారింపశక్యముకాని; ఝంఝానిలవశమునన్ = ప్రచండమైన గాలి వలన; తటితరులు = ఒడ్డునగల చెట్లు; అమూలంబులై = వ్రేళ్లు లేనివై (పెల్లగింపబడినవై) ధరణిన్ = భూమి యందు, కూలగా; సరసిలోనుండి = కాసారము నందుండి; పొడగని = (గజేంద్రుని) చూచి, సంభ్రమించి = తొట్రుపడి; ఉదరి = అదరిపడి; లంఘించి = దుమికి; హుంకరించి = హుమ్మని ధ్వని చేసి; భానున్ కబళించు = సూర్యుని మ్రింగి వేయునట్టి; స్వర్భాను పగది = రాహువు వలె; ఇభరాజున్ = గజేంద్రుని; ఒడిసి పట్టెన్ = ఎగసి పట్టుకొనెను.

తా : ఆ కాసారంలో ఒక పెద్ద మొసలి ఉన్నది. అది నీటిలో సంచరించేటప్పుడు పెక్కు బుడగలు, అలలు ఏర్పడినవి. దాని ఫూత్కారంతో అందున్న జలజంతువులు అటునిటు పరుగిడుతున్నవి. ఆ మొసలి తన తోక త్రిప్పుటచే కాసారజలాలలో సుడు లేర్పడినవి. ఆ అలలు ఒడ్డునకు దన్నుటచేత ఒడ్డునగల వృక్షాలు పెల్లగిలి నేలపై వ్రాలినవి. ఆ మొసలి సరస్సులో ఒక తావున నుండి గజేంద్రుని చూచి సంభ్రమించి, హుంకారమొనర్చి దుముకుతూ వచ్చి సూర్యుణ్ని రాహువు పట్టుకొన్నట్లుగా ఎగసి అతణ్ని పట్టుకొన్నది.

**కం. వడిఁ దప్పించి కరీంద్రుఁడు నిడుద కరంబెత్తి వ్రేయ నీరాటంబుం**
**బొడవడఁగినట్లు జలములఁ బడి కడువడిఁ బట్టెఁ బూర్వపదయుగళంబున్**

టీ : కరీంద్రుడు = గజరాజు; వడిన్ = వేగమును, తప్పించి, నిడుద కరంబున్ = పొడవైన తొండముతో; ఎత్తివ్రేయన్ = పైకెత్తి కొట్టగా; నీరాటంబున్ = ఆ మొసలియు; పొడవు + అడగినట్లు = రూపుమాయునట్లు; జలములఁ బడి = నీటిలో పడి; కడువడిన్ = చాలతొందరగా; మఱలి=తిరిగి, పూర్వ పదయుగళంబున్ = ముందు కాళ్ల రెంటిని, పట్టెన్ = పట్టుకొనెను.

తా : గజేంద్రుణ్ని మొసలి పట్టుకోగానే దానికి పట్టుపడకుండా గజేంద్రుడు తొండంతో ఒక దెబ్బ కొట్టాడు. అది చచ్చినట్లు పడియుండి తటాలున లేచి వచ్చి, ఆ ఏనుగు ముందు కాళ్లను రెంటిని పట్టుకొన్నది.

**చం. పదములు పట్టివం దలఁకుపాటొకయింతయు లేక శూరతన్**
**మదగజవల్లభుండు ధృతిమంతుఁడు దంతయుగాంతఘట్టనన్**
**బెదరఁగఁ జిమ్మ నమ్మకరి చిప్పలు పాదులు దప్ప వొప్పరన్**
**వదలి జలగ్రహంబు కరివాలము మూలముఁ జీరెఁ గోఱలన్**

టీ : పదములు పట్టినన్ = మొసలి గజేంద్రుని కాళ్ళను పట్టుకొనగా; ధృతిమంతుడు = ధైర్యశాలియైన, మదగజ వల్లభుండు = ఆ గజేంద్రుడు; తలఁకుపాటు = తత్తరపాటు (భయము) ఒకయింతయు లేక = ఏ మాత్రమును లేక; శూరతన్ = శౌర్యముతో; దంత - యుగ + అంత ఘట్టనన్ = దంతముల రెండింటి కొనల చేత కొట్టుట చేత, ఆ + మకరిన్ = ఆ మొసలిని; చిప్పలు పాదులు = దాని శరీరమందలి బొలుసులు కుదుళ్లు, తప్పన్ = ఊడి పోవునట్లుగా; చిమ్మన్ = విసరగా; జలగ్రహంబు = (అప్పుడు) మొసలి; వదలి = ఏనుగుకాళ్లను వదలినదై; కరివాలము మూలమున్ = ఏనుగు తోకను మొదలంట; కోఱలన్ = దంతములతో, చీరెన్ = చీల్చెను.

తా : ఆ విధంగా మొసలి తన పాదాలను పట్టుకొనగా, గజేంద్రుడు శౌర్యాన్ని చూపి తన దంతాలతో ఆ మొసలి ఒంటిమీద చిప్పలు కదలిపోయేటట్లుగా పొడిచాడు. అప్పుడు మొసలి ఏనుగు కాళ్లను వదలి, దాని తోకను పట్టి కోరలతో చీల్చింది.

**కం. కరిఁదిగుచు మకరి సరసికిఁ గరి దరికిని మకరి దిగుచు గరకరి బెరయన్**
**గరికి మకరి మకరికిఁగరి భరమనుచున వతలకుతలభటు లదిరి పడన్**

టీ : కరిన్ = ఏనుగును, సరసికి = కాసారములోనికి, మకరి = మొసలి, తిగుచున్ = లాగును; కరి = ఏనుగు, మకరిన్ = మొసలిని; దరికి = ఒడ్డునకు, తిగుచున్ = లాగును. కర కరి బెరయన్ = క్రౌర్యము అధికముకాగా, కరికి మకరి = ఏనుగునకు మొసలి, మకరికి కరి = మొసలికి ఏనుగు, భరమనుచున్ = ఒక దానికొకటి భారమైనవి అనుచు, అతల కుతల లోకములందుండెడి వీరులు, అదిరి పడన్ = భయపడునట్లుగా.

తా : ఈ విధంగా విద్వేషంతో ఏనుగును మొసలి కాసారంలోనికి ఈడ్చుతున్నది. ఏనుగు మొసలిని ఒడ్డుకు లాగి వేస్తున్నది. రాను రాను ఏనుగునకు మొసలి భారమైనది. ఏనుగు మొసలికి భారమైనది. అతల కుతలలోకములందు నివసించు వీరులు ఇవి రెండును ఒకదానికొకటి అసాధ్యమైనవని భయపడసాగారు.

విశ్వంలో ఒక విభాగాన్ని లోకమనీ, భువనమనీ పేర్కొంటారు. సాధారణంగా స్వర్గ - మర్త్య - పాతాళలోకాలను మూడింటిని పేర్కొంటారు. విశ్వంలోని విశేష విభాగాలను పేర్కొనేటప్పుడు 14 లోకాలంటారు. వాటిలో ఏడు ఊర్ధ్వలోకాలు, ఏడు అధోలోకాలు. అధోలోకాలు ఏడింటికి సప్తపాతాళాలని పేరు. అవి ఇవి : అతల - వితల - సుతల - రసాతల - తలాతల - మహాతల - పాతాళములు. ఏడు ఊర్ధ్వలోకాలు. అవి ఇవి : భూలోక - భువర్లోక - స్వర్లోక - మహర్లోక - జనలోక - తపోలోక - సత్యలోకములు. కుతలమంటే భూలోకం. 'కు' అంటే భూమి. తెలుగులో కుజుడు, కుధరం, కువలయం, కుజం మొదలయిన సమాసాలలోనే దీనిని ప్రయోగిస్తారు.

**శ్లో. తథాతురం యూథపతిం కరేణవో వికృష్యమాణం తరసా బలీయసా**
**విచుక్రుశుర్దీనధియో పరే గజాః పార్ష్ణిగ్రహా స్తారయితుం న చాశకన్**

తా : తక్కిన ఏనుగులు, ఆడయేనుగులు, ఏనుగు గున్నలు గజేంద్రుని స్థితిని చూచి జాలి పడ్డాయి. మొసలి బలంగాను, వేగంగాను ఏనుగును లోపలికి లాగుతున్నది. ఏనుగులకు భయం కలిగింది. దుఃఖంతో అరిచాయి. వాటి మనస్సు వికలమయింది. గజేంద్రుని బయటికి లాగాలనుకొన్నాయి. కాని, ఆ పనికి అవి అసమర్థములయ్యాయి.

**వ. ఇట్లు కరి మకరంబులు రెండును నొండొండ సముద్దండ దండంబులై తల పడి నిఖిలలోకాలోకన భీకరంబులై, యన్యోన్య విజయ శ్రీకరంబులై, సంక్షోభిత కమలాకరంబులై, హరి హరియును, గిరి గిరియునుం దాకి పెలుచువియక పెనంగు తెఱంగున నీరాటంబయిన పోరాటంబునం బట్టుచు, వెలికి లోనికిం దిగుచుచుఁ గొలంకు గలంకం బొందఁ గడువడి నిట్టట్టుఁ బడి తడఁబడక బుడబుడానుకారంబులై బుగులు బుగుల్లను చప్పుళ్ళతో నురువులు గట్టుచు, జలంబు లుప్పరం బెగయం జప్పరించుచుఁదప్పక వదన గహ్వరంబుల నప్పళించుచు నిశిత నితాంత దురంత దంత కుంతంబుల నింతింతలు**

తునియలయి నెప్పళంబువం బునుక చిప్పలుఁ గుదుళ్ళు దప్పి రక్తంబులుఁ గ్రమ్ముదేర హుమ్మని యొక్కుమ్మడిం జిమ్ముచు నితరేతర సమాకర్షణంబులం గదలక పదంబుల మొదలి పట్టు వదలక కుదురై వర్తించుచుఁ బరిభ్రమణ వేగంబున జలంబులం దిరుగుచు మకర కమఠ కర్కట గండక మండూకాది సలిల నిలయంబుల ప్రాణంబులు క్షీణంబులుగా నొండొంటిందాఁకు రభసంబున నిక్కలువడ బ్రక్కంద్రొక్కుచు మెండు చెడి బెండు వడి నాఁచుగుల్ల సిప్పతండంబులఁ బరస్పర తాడనంబులకు నడ్డంబుగా నొడ్డుచు వోల మానగొనక గెలుపు దలంపులు బెట్టిదంబులై రెట్టింప నహోరాత్రంబులుం బోలెఁ గ్రమక్రమ విజృంభమాణంబులై బహుకాల కలహ విహారంబులై నిర్గత నిద్రాహారంబులై యవక్ర పరాక్రమఘోరంబులై పోరుచున్న సమయంబున

టీ : ఇట్లు కరి మకరంబులు = ఏనుగును మొసలియు; ఒండొండ = ఒకదానితో మరొకటి; సముద్దండ = మిక్కిలి అధికమైన; దండంబులై + అతిశయము గలవై, తలపడి = ఎదుర్కొని; నిఖిలలోక = సకల లోకములకును; ఆలోకన = చూచుటకు; భీకరంబులై = భీతి గొల్పునవై; అన్యోన్య విజయశ్రీ = ఒకదాని నొకటి గెలువ వలయునను సంపదకు; వశీకరంబులై = లోబరచుకొనినవై; సంక్షోభిత కమలాకరంబులై = కల్లోల పరుపబడిన పద్మసరస్సు గలవై; హరి హరియును = సింహము సింహమును, గిరి గిరియును = కొండ కొండను, తాకి = ఎదుర్కొని, పిఱుతివియక = వెనుదీయక; పెనంగు తెఱంగున = పోరాడు విధమున; నీరాటంబైన = నీటిలో జరుగుచున్నదైన; పోరాటంబునన్ = యుద్ధమునందు; పట్టుచు, వెలికి లోనికి, తిగుచుచు = లాగుచు; కొలంకు = కాసారము; కలంకం బొందన్ = కల్లోల మగునట్లుగా; కడున్ వడిన్ = మిక్కిలి వేగముగా; ఇట్టట్టున్ పడి, తడఁబడక = తత్తరపడక; బుడబుడ + అనుకారంబులై = బుడబుడ శబ్దములతో, బుగులు బుగుల్లను చప్పుళ్లతో; నురుగులు గట్టుచు; జలంబు ఉప్పరంబెగయ =ఆకాశమునకు అంటగా, వదన గహ్వారంబులన్ = గుహలవంటి నోళ్లతో; అప్పళించుచు = కొట్టుచు; నిశిత = పదునైన; నితాంత = దట్టమైన; దురంత = అంతులేని, దంతకుంతంబులన్=ఖల్లెముల వంటి కోరలతో; ఇంతింతలు = చిన్నచిన్నవియగు; తునియలై, నెప్పళంబులన్ = తొందరలతో; పునుక చిప్పలు = తలపుఱ్ఱెలు; కుదుళ్లు తప్పి; రక్తంబులు; క్రమ్ముదేరన్ = వెలువడునట్లు, హుమ్మను ధ్వనితో, ఒక్కుమ్మడిన్ = ఒక్కసారిగా; చిమ్ముచున్; ఇతర+ఇతర సమాకర్షణంబులన్ = ఒకదానినొకటి లాగుటచేత; కదలక; పదంబుల మొదలి పట్టువదలక = మొదట పట్టిన పాదములను వదలక; కుదురుపడి; ఉండుచు, పరిభ్రమణ వేగంబున = సుడుల వేగముతో; జలంబుల తిరుగుచు; మకర కమఠ కర్కట గండక మండూక+ఆది = మొసళ్లు, తాబేళ్లు, ఎండ్రకాయలు, చేపలు, కప్పలు మొదలైన, సలిల

నిలయంబులు = నీటి జంతువులు; ప్రాణంబులు క్షీణంబులు గాన్ = ప్రాణాలు సన్నగిలునట్లుగా; ఒండొంటిని కొట్టుకొను, రభసంబున = వేగముతో, ఇక్కలు వడన్ = తమ నివాసాస్థనములు భ్రంశమగునట్లుగా; మ్రక్కన్ త్రొక్కుచు = అడుగంటునట్లుగా త్రొక్కుచు; మెండు చెడి = ఆధిక్యమును కోల్పోయి; బెండు వడి = తేలికపడి; నాచుగుల్ల చిప్ప - తండంబులన్ = సమూహములను; పరస్పర తాడనంబులకు = ఒకరొకరి దెబ్బలకు; అడ్డంబుగా ఒడ్డుచు; ఓలమాస గొనక = మఱుగు పడక; (దేహమునందు ఆశ వదలి), గెలుపు తలంపులు, బెట్టిదంబులై = తీవ్రములై; రెట్టింప = ద్విగుణీకృతముకాగా, అహోరాత్రంబులుంబోలె = పగలు రాత్రుల వలె; క్రమ క్రమ విజృంభ మాణంబులై = క్రమక్రమముగా చెలరేగినవై; బహుకాల కలహ విహారంబులై = చాల కాలము యుద్ధమునందు విహరించునవై; నిర్గత నిద్రా+ఆహారంబులై = నిద్రను ఆహారమును వదలినవై; అవక్ర పరాక్రమ ఘోరంబులై = మొక్కవోని పరాక్రమముచే భయంకరములై, పోరుచున్న సమయంబున = పోరాడుచున్న సమయమందు.

తా : ఈ విధంగా కరి మకరుల పోరాటము సింహం సింహంతోను, కొండ కొండతోను తలపడినట్లయి ఆ సరోవరం కల్లోల మయింది. జలజంతువుల కన్నిటికి ప్రమాద మేర్పడింది. ఏనుగు మొసలి సుడివేగంతో తిరుగుతూ పోరునప్పుడు సరోవరంలోని జలజంతువులు అణగిపోవడమేకాక, వాటి నివాసస్థానాలు ధ్వంసమయ్యాయి. జలజంతువులను కరి మకరులు పరస్పరతాడనాలలో అడ్డు పెట్టుకొన్నాయి. ఆ రెండూ రేయింబగళ్లు లాగా, క్రమక్రమంగా విజృంభిస్తూ, బహుకాలం యుద్ధ సన్నాహంతో నిద్రాహారాలు విడిచి, మహాపరాక్రమంతో పోరాడుతున్న సమయంలో -

**కం. జవమును జలమును బలమును వివిధములుగఁ బోరు కరటి వీరతకు భువిన్**
**దివి మకర మీన కర్కట నివహము లొక్కటన మిత్రనిలయముఁ బొందెన్**

టీ.: భువిన్ = భూమియందు; జవమును = వేగమును; చలమును = పట్టుదలయు, బలమును, వీటితో; వివిధములుగ = వేరువేరుగా, పోరాడు; కరటి వీరతకు = ఏనుగు యొక్క వీరత్వమునకు, వెఱచి, దివి = ఆకాశమందలి; మకర = మొసలి, మీన = చేప, కర్కటము = మకరరాశి, మీనరాశి - కర్కాటకరాశులయొక్క, నివహము = సమూహము.

తా : గజేంద్రుడు మహాశౌర్యంతో, పట్టుదలతో విజృంభించి సరసిలోని మొసలితో పోరాడటం చూచి ఆకాశమందలి మకర మీన కర్కటక రాశులు భయపడి మిత్రుని (సూర్యుని) ఆశ్రయించాయి.

మిత్రుడనగా సూర్యుడని అర్థము. సూర్యుని ఆశ్రయించాయనడంవల్ల చాలా కాలం గడిచిందని ప్రతీయమానార్థం.

**శా. ఆటోపంబునఁ జిమ్ముఁ ఔమ్మగల వజ్రాభీలదంతంబులన్**
**దాటించున్ మెడఁ జుట్టి పట్టి హరిదోర్దండాభతుండాహతిన్**
**నీటన్ మాటికి మాటికిన్ దిగువఁగా నీరాటమున్ నీటి పో**
**రాటం దోటమిపాటుఁ జూపుట కరణ్యాటంబు వాచాటమై**

టీ : నీటన్ = సరసీ జలములందు, మాటికి మాటికి, తిగువగా = లాగగా, నీరాటమున్ = నీటిలో సంచరించునదియైన మొసలిని, నీటి పోరు+ఆటందున్ = నీటిలో చేయు పోరునందు; ఓటమిపాటు చూపుటకు = అపజయము కలిగించుటకు, అరణ్యాటంబు = అడవిలో సంచరించునదియైన ఏనుగు, వాచాటమై = పెక్కు మాటలాడునది వలె, ఆటోపంబున = వేగిర పాటుతో, చిమ్మన్; ఔమ్ము + అగలన్ = రొమ్ము పగులునట్లుగా; వజ్ర+ఆభీల = పిడుగువలె భయంకరమైన; దంతంబులన్ = దంతములతో; హరి - దోర్దండ+ఆభ = దేవేంద్రుని భుజదండము వలె ప్రకాశించెడి; తుండ + ఆహతిన్ = తొండము దెబ్బతో, మెడచుట్టు పట్టుకొని, తాటించున్ = కొట్టును.

తా : ఆ మొసలి పదేపదే గజరాజును మడుగులోనికి లాగుతున్నది. గజరాజు వెనుదీయక, దానిని ఓడించడానికి వజ్రాయుధం వంటి తన దంతాలతో, దాని రొమ్ము పగులునట్లుగా కొట్ట సాగింది.

**వ. అప్పుడు**

తా : ఆ సమయమందు

**ఆ.వె. మకరితోడఁబోరుమాతంగ విభుని నొ క్కరుని డించి పోవఁ గాళ్ళు రాక**
**కోరి చూచుచుండెఁ గుంజరీయూథంబు మగలు తగులు గారె మగువలకును.**

టీ : మకరితోడ పోరు = మొసలితో యుద్ధము చేయు, మాతంగవిభుని = గజరాజును, ఒక్కరుని, డించి పోవన్ = విడిచిపెట్టి పోవుటకు; కాళ్ళురాక = బుద్ధి పుట్టక (పోలేక), కుంజరీ యూథంబు = ఆడయేనుగుల గుంపు; కోరి చూచుచుండెన్ = తన విభుని జయమును అపేక్షించి చూచుచుండెను. మగలు = భర్తలు, మగువలకున్ = ఆడవారికి (భార్యలకు) తగులుకారె = అడ్డము గదా! (తగులాటము)

తా : ఆ విధంగా మొసలితో ఘోరంగా పోరాడుతున్న తమ భర్తను ఒంటరిగా విడిచిపెట్టి పోవడానికి బుద్ధి పుట్టక ఆడయేనుగుల గుంపు భర్తృవిజయాశతో అక్కడే ఉండి చూస్తున్నాయి. ఆడవారు తమ ఇష్టానుసారంగా నడచుకోవడానికి మగవారు ప్రతిబంధకమవుతారు కదా!

**శ్లో. వియుధ్యతో రేవమిభేంద్రవక్రయోః వికర్షతో రంతరతో బహిర్మిథః**
**సమాప్సహస్రం వ్యగమ న్మహీపతే! వప్రాణయోశ్చిత్రమమంసతామరాః**

తా : పోరాడుతున్న ఆ గజేంద్రము మొసలి రెండూ బలము కలవి. గజేంద్రము మొసలిని బయటకు లాగుతుంది. మొసలి ఏనుగును లోపలికి లాగుతుంది. ఓరాజా! ఇలా అవి రెండూ ఒకదానితో ఒకటి పోరాడుతుంటే వెయ్యేండ్లు గడిచాయి. ఈ ఘటనను చూచి దేవతలు కూడా ఆశ్చర్యచకితులయ్యారు.

**వ. అంత**

**ఆ.వె.జీవనంబు తనకు జీవనంబై యుంట నలపుఁ జలము నంతకంతకెక్కి**
**మకర మొప్పె, డస్సె మత్తేభమల్లంబు బహుళపక్ష శీతభాను పగిది**

టీ : మకరము = మొసలి; జీవనము = నీళ్లు; తనకు జీవనంబై ఉంటన్ = తన బ్రతుకునకు ఆధారమై ఉండుట చేత; అలవు = బలము; చలము = పట్టుదల; అంతకంతకు, ఎక్కి = అధికమై; ఒప్పెన్ = అతిశయించెను. మత్తేభ మల్లంబు = మదగజశ్రేష్ఠము. బహుళపక్ష = కృష్ణపక్షమందలి శీతభాను పగిది = చంద్రునివలె. డస్సెన్ = క్షీణించెను (అలసి పోయెను)

తా : స్థానబలం వల్ల మొసలికి అంతకంతకు బలం, పట్టుదల అధికమయింది. గజేంద్రుడు కృష్ణపక్షంలోని చంద్రునివలె క్షీణింపసాగాడు.

**శ్లో. తతో గజేంద్రస్య మనో బలౌజసాం కాలేన దీర్ఘేణ మహానభూద్వ్యయః**
**వికృష్యమాణస్య జలేఽవసీదతో విపర్యయోఽభూత్ సకలం జలౌకసః**

తా : బహుకాలం నీళ్లలోనికి లాగబడుతున్న గజేంద్రుని మనోబలం, దేహబలం, ఇంద్రియబలం క్షీణించి పోయాయి. ఇందుకు విపరీతంగా మొసలికి దేహేంద్రియ మనోబలాలు అధికం కాసాగాయి.

**మ. ఉఱుకుం గుంభయుగంబుపై హరిక్రియన్ హుమ్మంచుఁ బాదంబులన్**
**నెఱయుం గంఠము వెన్నుదన్ను నెగయున్ హేలాగతిన్ వాలమున్**
**జఱచున్ నుగ్గుగఁ దాఁకు ముంచు మునుఁగున్ శల్యంబులున్ దంతముల్**
**విఱుగన్ వ్రేయుచుఁ బొంచిపొంచి కదుమున్ వేదండయూథోత్తమున్**

టీ : (గజేంద్రుని బలము క్షీణించుట గమనించి) ఆమొసలి, కుంభయుగంబుపై = కుంభస్థలముపైకి, హరిక్రియన్ = సింహము వలె; హుమ్మంచు = హుంకరించుచు; ఉఱుకున్ = దూకును; పాదంబులన్ = పాదములను, నెఱయున్ = ఆక్రమించును; కంఠము వెన్ను దన్నున్ = గొంతుకను, వీపును తన్నున్; హేలాగతిన్ = తిరస్కారముతో, ఎగయున్; వాలమున్ = తోకను, చఱచును నుగ్గుగ = పొడియగునట్లుగా, తాకును, ముంచు = ఆ ఏనుగును నీళ్లలో ముంచును, మునుఁగున్ = (తాను) మునుగును; శల్యంబులున్ దంతముల్ = ఎముకలు, కోరలు, విఱుగన్ = విరిగిపోవునట్లుగా, వ్రేయుచున్ = కొట్టుచు, వేదం డయూథ+ ఉత్తమున్ =

ఆ ఏనుగుల గుంపులో ఉత్తముడైన గజేంద్రుని, పొంచి పొంచి కదుమున్ = దాగి దాగి దెబ్బకొట్టును.

తా : ఆ పెనుమొసలి గజేంద్రుని కుంభస్థలము మీదికి సింహం వలె ఎగిరి దుముకుతూ హుంకరించి, కాళ్లను పట్టుకొని మడుగులోనికి ఈడుస్తున్నది. మెడమీద, వీపు మీద దెబ్బ కొడుతూ, తోకను పట్టి లాగుతున్నది. బలాత్కారముగా ఏనుగును మడుగులోనికి ముంచుతున్నది. తాను మునుగుతున్నది. ఎముకలను, దంతాలను విరగ గొడుతూ, పొంచి పొంచి గజరాజును దెబ్బతీస్తున్నది.

**మ. పాడ గానంబడకుండ డాఁగు, వెలికిం బోవంగఁ దానడ్డమై**
**పొడసూపుం, జరణంబులం బెనఁగొనుం బోరాక రారాక బె**
**గ్గడిలం గూలఁగఁ దాఁచు, లేచుతఱి నుద్ఘాటించు, లంఘించు, బ**
**ల్విడిఁ జీరుం దగులన్ మలంగు నొడియున్ వేధించుఁ గ్రోధించుచున్**

టీ : (ఆ మొసలి) పొడగానంబడకుండ = తన ఉనికి తెలియకుండునట్లు (నీళ్లలో) డాఁగున్ = దాగుకొనును; వెలికింబోవంగన్ (ఏనుగు) వెలుపలికి పోబోగా; తాన్ + అడ్డమై = తాను అడ్డుగా నిలిచి; పొడసూపున్ = కనిపించును; చరణంబులన్ పెనఁ గొనన్ = కాళ్లను పెనవేయుచు; పోరాక రారాక = వెలుపలికి పోనీయక, లోపలికి రానీయక; బెగ్గడిలం గూలఁగఁదాఁచు = భయపడునట్లుగా, కూలిపోవునట్లు కొట్టును - లేచుతఱిన్ = మరల లేచు సమయమున; ఉద్ఘాటించుచున్ = వ్రచ్చుచు (భేదించుచు), లంఘించును = దుముకును; బల్విడిన్ = మిక్కిలి వేగముతో, చీరున్ = చీల్చును; తలఁగున్ = తప్పుకొనును; మలఁగున్ = అదృశ్యమగును; ఒడియున్ = ఒడిసి పట్టుకొనును; వేధించున్ = బాధించును; క్రోధించుచున్ = కోపగించుచు.

తా : ఆ మొసలి తాను ఏనుగునకు కనిపించకుండా మడుగులో దాగుకొంటుంది. ఏనుగు వెలుపలికి పోబోగా, చప్పున వచ్చి అడ్డు పడుతుంది. ఏనుగు కాళ్లను పెనవేసుకొంటుంది. అది కుప్పగూలునట్లుగా వంచి వేస్తుంది. అది లేచే సమయంలో దెబ్బకొడుతుంది. ఆ ఏనుగును వెలుపలికి పోనీయదు - లోపలికి రానీయదు. అది తన మీదికి వచ్చినప్పుడు చప్పున తప్పించుకొంటుంది. ఈ విధంగా గజేంద్రుని కాలిని గట్టిగా పట్టుకొని క్రోధంతో వేధిస్తున్నది.

**శ్లో. ఇత్థం గజేంద్రః స యదాఽఽప సంకటం**
**ప్రాణస్య దేహీ వివశో యదృచ్ఛయా**
**అపారయన్నాత్మవిమోక్షణే చిరం**
**దధ్యా విమాం బుద్ధిమథాభ్యపద్యత**

తా : ఈ విధంగా గజేంద్రుడు హఠాత్తుగా ప్రాణసంకటంలో పడిపోయాడు. మొసలి పట్టునుంచి విడిపించుకోవడంలో అసమర్థుడయ్యాడు. మొసలి బారి నుంచి తప్పించుకోవడానికి ఎంతో సేపు ఎన్నో ఉపాయాలను ఆలోచించాడు. చివరికి ఇలా నిశ్చయానికి వచ్చాడు.

**వ. ఇట్లు విస్మిత నక్ర చక్రంబయి నిర్వక్రవిక్రమంబున నల్ప హృదయజ్ఞానదీపంబు నతిక్రమించు మహామాయాంధకారంబునుంబోలె నంతకంతకు నుత్సాహ కలహ సన్నాహ బహువిధ జలావగాహంబయిన గ్రాహంబు మహాసాహసంబునఁ బోరె మఱియు.**

టీ : ఇట్లు, విస్మిత నక్ర చక్రంబయి = ఆశ్చర్యపడిన మొసళ్ల గుంపు కలదై, నిర్వక్ర విక్రమంబున = మొక్కవోని పరాక్రమముతో; అల్ప హృదయ జ్ఞానదీపంబున్ = అల్పుని హృదయమునందలి జ్ఞానమనెడి దీపికను, అతిక్రమించు = దాటిపోవు, మహామాయా + అంధకారంబునున్ పోలె = గొప్పమాయ (అజ్ఞానము) అనెడి చీకటి వలె; అంతకంతకు; ఉత్సాహ = ఉత్సాహముతో కూడిన, కలహ సన్నాహ = యుద్ధ ప్రయత్నములైన, బహువిధ = పెక్కు విధములగు; జల + అవగాహంబయిన = నీటిలో మునుకలు గలదియైన, గ్రాహంబున్ = మొసలియు; మహా సాహసంబున = గొప్ప తెగువ (తెగింపు)తో.

తా : ఈ విధంగా ఆ మొసలి మడుగులోని తక్కిన మొసళ్లన్నియు ఆశ్చర్యపడునట్లుగా, అల్పుని హృదయంతో ఉన్న స్వల్పమగు జ్ఞానాన్ని మహామాయాంధకారం కప్పివేసినట్లుగా, అంతకంతకు విజృంభించి మడుగులో పలువిధాలుగా మునుగుతూ తేలుతూ మహాసాహసంతో.

**శా. పాదద్వంద్వము నేలమోపి, పవనుం బంధించి, పంచేంద్రియో**
**న్మాదంబుం బరిమార్చి, బుద్ధిలతకున్ మారాకు హత్తించి, ని**
**ష్ఖేదబ్రహ్మపదావలంబనగతిన్ గ్రీడించు యోగీంద్రు మ**
**ర్యాదన్ నక్రము విక్రమించెఁ గరిపాదాక్రాంతనిర్వక్రమై**

టీ : నక్రము = మొసలి; పాదద్వంద్వము = రెండు కాళ్లను, నేలమోపి = భూమిపై దృఢముగా ఆనించి; పవనున్ = వాయువును, బంధించి = బిగియబట్టి; పంచ+ఇంద్రియ+ఉన్మాదంబున్ = పంచేంద్రియాల స్వేచ్ఛాచారమును, పరిమార్చి = అరికట్టి, బుద్ధిలతకున్ = తీవలు సాగుబుద్ధికి, మాఱాకున్ = అవలంబనమును, హత్తించి = చేకూర్చి; నిష్ఖేద = విచారములేని, బ్రహ్మ = బ్రహ్మము యొక్క, పద = స్థానమును, అవలంబనగతిన్ = అవలంబించు రీతిగా; (ఆనందమయబ్రహ్మ పదవిని అధిరోహించినట్లుగా) క్రీడించు = అనుభవించు; యోగీంద్రు మర్యాదన్ = యోగీంద్రుని మాదిరిగా; కరి పాద + ఆ క్రాంత= ఏనుగు కాళ్లను ఆక్రమించుటచేత, నిర్వక్రమై = అడ్డు లేనిదై, విక్రమించెను = పరాక్రమించెను.

తా : ఆ మొసలి నేలమీద తన పాదాలను దృఢంగా మోపి, శ్వాస ప్రశ్వాసలను బంధించి, పంచేంద్రియాల స్వేచ్ఛా ప్రవృత్తిని అరికట్టి, బుద్ధికి అవలంబనం చేకూర్చి, బ్రహ్మానందాన్ని అనుభవించు యోగీంద్రునివలె, ఏనుగు పాదాలను దృఢంగా పట్టుకొని పరాక్రమించింది.

గజేంద్రుడు తనను బలంగా లాగి ఎత్తి పడవేయకుండా మొసలి తనపాదాలను దృఢంగా భూమి మీద మోపింది. పవనుని బంధించింది. అనగా శ్వాస ప్రశ్వాసల గతిని నిరోధించింది. దమ్ము పట్టిందని అర్థం. రేచక - పూరక - కుంభకముల ద్వారా బాహ్యాభ్యంతరాల రెండు స్థానాలను నిరోధించడాన్ని ప్రాణాయామమంటారు. మొసలికి ఆసనసిద్ధి జరిగింది. దాని వల్ల యోగికి శీతవాతబాధలుండవు. ఆకలిదప్పికల ద్వంద్వమూ ఉండదు. ఆసన సిద్ధి అయిన తర్వాతది ప్రాణాయామం. **"తస్మిన్ సతి శ్వాస ప్రశ్వాసయో ర్గతి విచ్ఛేదః ప్రాణాయామః"** ఆసనసిద్ధి అయిన తర్వాత శ్వాస ప్రశ్వాసల గతిని నిరోధించడమే ప్రాణాయామము. బయటి వాయువును నాసిక ద్వారా లోపలికి ప్రవేశపెట్టడం శ్వాస. లోకడుపున గల వాయువును నాసిక ద్వారా బయటికి వదలడం ప్రశ్వాస. బుద్ధి అనెడి ఒక లతకు అవలంబనమును కల్పించాలి. అనగా బుద్ధికి భగవత్తత్వ చింతనం ఉండాలి. అదే దానికి మారాకు - అనగా అవలంబనం. ఆ బుద్ధి భగవచ్చింతనంలో పైకి పైకి ప్రాకి పోతుంది. అలా చేయక పోతే అయిదు జ్ఞానేంద్రియాలు, అయిదు కర్మేంద్రియాలు ఉన్మాదస్థితికి వస్తాయి. వాటి ఉన్మాదాన్ని అరికట్టకపోతే అవి మనోమయకోశాన్ని కల్మషం చేస్తాయి. ఎలాగంటే : ఈ పంచేంద్రియాలు ఉన్మాదితములై ఆత్మను ఆచ్ఛాదించి సంశయరహితమైన ఆత్మను సంశయ గ్రస్తమైన దానినిగాను, శోకమోహరహితమైన ఆత్మను శోకమోహయుక్తమైనదిగాను, దర్శనరహితమైన ఆత్మను దర్శనాది కర్తృరూపంగాను మార్చివేస్తాయి. యోగాన్ని గూర్చి కఠోపనిషత్తు ఇలా చెబుతున్నది. **"యదా పంచావతిష్ఠంతే జ్ఞానాని మనసా సహ బుద్ధిశ్చ న విచేష్టతి తమాహుః పరమాం గతిం తాం యోగమితి మన్యన్తే స్థిరామింద్రియధారణాం అప్రమత్తస్తదా భవతి యోగో హి ప్రభవాప్యయౌ"**

పంచేంద్రియాలను మనస్సుతోపాటు సుస్థిరపరచాలి. బుద్ధి చేష్టారహితమై ఉండాలి. అనగా చిత్త వృత్తులను నిరోధపరచాలి. పరమగతికి చిత్తం చేరుకోవాలి. అప్పుడు ఆ యోగి ప్రమాద రహితుడై శుద్ధపరమాత్మస్వరూపంలో అవస్థితుడవుతాడు. యోగం ప్రభవస్థానమూ అవ్యయస్థానమూ కూడా. **"సర్వ ద్వారాణి సంయమ్య మనో**

**హృది నిరుధ్యచ మూర్ధ్న్యాధాయాత్మనః ప్రాణమాస్థితో యోగధారణమ్"** (గీత 8-12) ఓ అర్జునా! సకలేంద్రియాల ద్వారాలను బంధించి, అనగా ఇంద్రియ విషయాలను అరికట్టి మనస్సును హృద్దేశంలో స్థిరపరచి ప్రాణాన్ని బ్రహ్మరంధ్రంలో స్థాపనం చేయడం యోగధారణమని శ్రీముఖోక్తి. నిష్ఠిదబ్రహ్మ పదావలంబనము అనగా మోక్షప్రాప్తి. ఆ దశలో జీవుడు సమాధిగతుడై నిస్తరంగ పదప్రాప్తిని పొంది పరబ్రహ్మానంద సుఖాన్ని అనుభవిస్తాడు.

**ఆ.వె. వన గజంబు నెగుచు వనచారిఁ బొడఁగని వనగజంబ కాన వజ్రిగజము**
**వెల్లనై సురేంద్రు వేచి సుధాంధులు పట్టఁ బట్టనీక బయలు ప్రాఁకె**

టీ : వనగజంబు = అడవి యేనుగు అయిన గజేంద్రుని, నెగుచు = బాధించు, వనచారిన్ = జలసంచారియైన మొసలిని, పొడఁగని = చూచి, వజ్రిగజము = దేవేంద్రుని ఐరావతగజము; వన గజంబె కాన = (అదియు) జలమునందు పుట్టిన ఏనుగే కాబట్టి, (భయపడి) వెల్లనై = తెలతెలబోయినదై (వివర్ణత నొందినదై) సురేంద్రున్ = దేవేంద్రుని; వేచి = పడవేసి, సుధాంధులు = దేవతలు; పట్టన్ = పట్టు కొనుటకు యత్నింపగా; పట్టనీక = పట్టనీయకుండగా, బయలు ప్రాకె = ఆకాశమున ప్రాకి పోయెను.

తా : ఈ విధంగా మొసలిచేత బాధింపబడుతున్న వనగజమైన గజేంద్రుని దైన్యాన్ని చూచి, ఇంద్రుని ఐరావతగజము తానును వన గజమే కాబట్టి (నీట బుట్టినది) తెల్లబోయి, పైనున్న దేవేంద్రుని పడవేసి, దేవతలు పట్టబోయినప్పటికి దొరకకుండా భయపడి ఆకాశవీధులవెంట పరుగెత్తింది!

'వన' మనగా అడవి - నీరు అని రెండర్థాలున్నవి. కనుక 'వన' శబ్దాన్ని శ్లిష్టశబ్దమంటారు. వనగజము = అడవి ఏనుగు అనీ, నీటియందు పుట్టిన ఏనుగు ఐరావతగజమనీ రెండర్థాలు. వనచారి = జలములందు సంచరించునది మొసలి అని అర్థము. ఇంద్రుని ఐరావతమునకు శ్వేతగజమని ప్రసిద్ధి. కాగా వనగజమైన గజేంద్రుడు మొసలి చేత బహువిధాలుగా బాధింపబడటంచూచి వనంలోనే జన్మించినదైన ఐరావతగజం భయపడి తెల్లతెల్లబోయిందనీ, వివర్ణమయిందనీ ఇచ్చట హేతువు ఊహింప బడింది. ఐరావతానికి గల సహజమైన తెల్లదనం అపహ్నవింపబడింది. అపహ్నవం అంటే కప్పిపుచ్చడమని అర్థం. "దీనికి ముఖ పృష్ఠాలలో రెండు వైపుల తోకలున్నాయి. ఇది ఎలాంటి దున్న?" అని ఏనుగును చూచి అడిగాడు ఒక పల్లెటూరివాడు నాగరికుణ్ని. "అది దున్నకాదు కాదు, ఏనుగుగున్న. ఒకటి తోక రెండవది తొండము అని తెలియజెప్పాడు నాగరికుడు.

పల్లెటూరివాడు తొండమని తెలిసీకూడా దానిని "కప్పిపుచ్చి" చమత్కారంగా ప్రశ్నించాడు. **"నాగరిక సమధికోన్నతిరిహ మహిషః కోయ ముభయతః పుచ్ఛః నహి నహి కరికలభోఽసౌ శుండాదండోఽయ మస్య న తు పుచ్ఛమ్".**

ఐరావతం శ్వేతగజం. దానికి నాలుగుదంతాలు. సముద్రమథనంలో ఉద్భవించిన పద్నాలుగు రత్నాలలో ఐరావతమొకటి. అది ఇంద్రుని వాహనం. శ్రీకృష్ణ దేవేంద్రుల యుద్ధంలోను, వృత్ర ఇంద్రుల యుద్ధంలోను ఐరావతం గరుత్మంతునిచేతను, వృత్రాసురునిచేతను పరాజితమయిందని శ్రీమద్భాగవత కథనం.

**ఉ. ఊహ కలంగి జీవనపు టోలమునంబడి పోరుచున్ మహా**
**మోహలతానిబద్ధపదమున్ విడిపించుకొనంగ లేక సం**
**దేహముఁ బొందు దేహిక్రియ దీనదశన్ గజముండె భీషణ**
**గ్రాహదురంతదంతపరిఘట్టితపాదఖురాగ్రశల్యమై**

టీ : ఊహ కలంగి = బుద్ధి కలత చెంది; జీవనము + ఓలమునం బడి పోరుచున్ = నీటి మరుగున పడి పోరాడుచు, జీవితపు క్లేశములో పడిపోరాడుచు, మహా మోహలతా = గొప్పదైన అజ్ఞానమను తీగచే, నిబద్ధ = కట్టబడిన, పదమున్ = పాదమును; స్థానమును; విడిపించుకొనంగ లేక, సందేహము పొందు = తన భవిష్యత్తును గూర్చి శంకించు, దేహిక్రియ = ప్రాణివలె, గజము = (మన కథానాయకుడైన) గజేంద్రుడు; భీషణ = భయంకరమైన; గ్రాహ = మొసలి యొక్క, దురంత = చేటు కలిగించు, దంత = కోరలచే, పరిఘట్టిత = గట్టిగా కరవబడిన; పాదఖుర+అగ్రశల్యమై = కాలి గిట్టలపై యెముక కలదై, దీనదశన్ = దీనావస్థలో, ఉండెన్.

తా : బుద్ధి భ్రమించి సంసారక్లేశంలో పడిపోరాడుచు, అజ్ఞానపాశంతో బంధితమైన తన స్థానాన్ని విడిపించుకోలేక ప్రాణాపాయాన్ని శంకిస్తూ ఖిన్నుడైన జీవివలె గజేంద్రము భీషణమైన ఆ మొసలి కర్కశపు నోటి పట్టునుండి తనకాలిని విడిపించుకోలేక దయనీయమైన స్థితిలో ఉన్నది.

కాళ్లలో శక్తి సన్నగిల్లిన దనగా మరణాసన్నమైనట్లే భావించాలి.

**వ. ఇవ్విధంబున**

తా : ఈ విధమైన దీనావస్థలో నిమగ్నమయినదై.

**కం. అలయక సొలయక వేసట నొలయక కరి మకరితోడ నుద్దండత రా**
**త్రులు సంధ్యలు దివసంబులు సలిపెన్ బోరొక్క వేయి సంవత్సరముల్**

టీ : కరి = గజేంద్రుడు; అలయక = విసుగుచెందక; సొలయక = వెనుదీయక; వేసటన్ ఒలయక = శ్రమము పొందక; మకరితోడ = మొసలితో, రాత్రులు, (ఉభయ) సంధ్యలు, దివసంబులు = పగళ్లు, (ఇట్లు) ఒక్క వేయేండ్లు; ఉద్దండతన్ = అధికముగా పోరు సలిపెను.

తా : ఈ విధంగా గజేంద్రుడు విసుగు విరామం లేకుండా, అలపు సొలపు లేకుండా మొసలితో దివారాత్రాలు, ఉభయ సంధ్యలు నిరంతరం ఒక వేయి సంవత్సరాలు వెనుదీయక పోరాడినాడు.

బహుదీర్ఘకాలమని చెప్పడానికి **"సమాః సహస్రం"** అని సంస్కృతమూలంలో ఉంది. ఇట్టివి అత్యుక్తులుగా అభియుక్తులు గ్రహిస్తారు. ఏనుగు స్థలచరము. మొసలి జలచరము ఏనుగు జలాశయంలోనికి దిగితే మొసలి పట్టుకొంటుంది. అప్పుడది దుర్బలమవుతుంది. ఈ సంసారమనేది ఒక సరోవరం. జీవుడు గజేంద్రుడు. ఆ సరోవరంలోనికి జీవుడు దిగి కాలమనే మొసలిచేత పట్టుబడ్డాడు. సాంసారిక సుఖాలలో ఆసక్తుడైనవాడు కాలాన్ని గమనించడు. ఇక్కడ జీవుడు గజేంద్రుడు. అతనిది మందబుద్ధి. అదీకాక, అతడు అతికాముకుడు. కామక్రీడాసక్తుని బుద్ధి మరీ జడమవుతుంది. అలాంటివాడు కాలమనే మొసలివాత పడటం తప్పదు. సంసారంలోని ఇలాంటి జీవికి కాలానికి పెక్కేండ్లనుంచి పోరాటం ప్రపంచంలో జరుగుతూనే ఉంది.

**శ్లో. న మా మిమే జ్ఞాతయ ఆతురం గజాః కుతః కరిణ్యః ప్రభవంతి మోచితుం**
**గ్రాహేణ పాశేన విధాతురావృతోఽప్యహం చ తం యామి పరం పరాయణమ్**

తా : ఈ మొసలి విధాత్ర్ని పాశమే. దీని బారిబడి నేను ఆతురుడ నవుతున్నాను. నాతో సమమైన ఏ గజరాజు కూడా ఇట్టి విపత్తునుంచి తప్పించుకో జాలదు. ఇక ఈ ఆడయేనుగులు నన్ను విడించడానికి సమర్థమైనవి ఎలా అవుతాయి? కాబట్టి నేను బ్రహ్మాదులకు ఏకైకాశ్రయభూతుడైన సర్వేశ్వరుణ్ని శరణువేడుకొంటాను.

**శ్లో. యః కశ్చనేశో బలినోఽన్తకోరగాత్ ప్రచండవేగా దభిధావతో భృశమ్**
**భీతం ప్రపన్నం పరిపాతి యద్భయాత్ మృత్యుః ప్రధావత్యరణం తమీమహి**

తా : మృత్యుదేవత చాలా బలశాలి. మృత్యువనే కాలసర్పం ప్రచండవేగంతో తరుముకొని వెంటబడుతుంది. దానికి భయపడినవాడు భగవంతుణ్ని శరణువేడుకొంటే ఆ ప్రభువు తప్పక అతణ్ని రక్షిస్తాడు. ఆ భగవంతుని భయం వలన మృత్యువు కూడా భయపడి పారిపోతుంది. ఆయన అందరికీ ఆశ్రయుడు. నేను ఆ భగవంతుణ్నే శరణు వేడుకొంటాను.

**మ. పృథుశక్తిన్ గజ మా జలగ్రహముతోఁ బెక్కేండ్లు పోరాడి సం**
**శిథిలంబై తనలావు - వైరిబలముం జింతించి మిథ్యామనో**

**రథ మింకేటికి? దీని గెల్వ సరి పోరంజాల రాదంచు వ**
**వ్యథమై యిట్లను బూర్వపుణ్యఫలదివ్యజ్ఞానసంపత్తితోన్**

టీ : పృథుశక్తిన్ = అధికమైన సామర్థ్యంతో, గజము = గజేంద్రుడు; ఆ జలగ్రహముతో = ఆ మొసలితో, పెక్కేండ్లు = అనేక సంవత్సరములు, పోరాడి, సంశిథిలంబై = (తన శరీరము) సంధులు సడలినదై; తన లావు = తన బలము; వైరి బలమున్ = శత్రువైన మొసలి బలాధిక్యమును, చింతించి = ఆలోచించి, మిథ్యామనోరథము = గెలుతునన్నట్టి వ్యర్థమైన కోరిక, ఇంకేటికి = ఇక నెందుకు? దీని గెల్వన్= ఈ మొసలిని గెలుచుటకు; సరిపోరం జాలరాదు+అంచున్ = సరిసమానముగా పోరుటకు శక్యము కాదని; అవ్యథమై = వ్యథలేనిదై, పూర్వపుణ్యఫల = పూర్వజన్మమునందు చేసికొన్న పుణ్యఫలము వలన కలిగిన, దివ్యజ్ఞాన సంపత్తితోన్ = దివ్యజ్ఞానమనెడి భగవద్భక్తి భాగ్యముతో, ఇట్లనున్ = ఈ విధముగా అనుచున్నది.

తా : అత్యధికమైన బలంతో గజేంద్రుడు చాలా కాలం మొసలితో పోరాడాడు. తన బలం క్షీణించడం, మొసలిబలం అధికాధికం కావడం తెలుసుకొన్నాడు. ఇక దీనితో పోరాడలేను. వ్యర్థమైన ఆశ దేనికి? అని పూర్వజన్మ పుణ్యంవల్ల తాను పొందిన దివ్యజ్ఞానంతో ఇలా అనుకొన్నాడు.

దివ్యజ్ఞానమనగా, భగవంతుడు, ఆయన్ను భజించే తత్త్వమూ అని అర్థం. **"వాసుదేవః సర్వమితి"** అనేదే దివ్యజ్ఞానం. తత్త్వజ్ఞానం మనుష్యుని పూర్వ స్వభావాన్ని మార్చివేస్తుంది.

దివ్యజ్ఞానం మనుష్యుణ్ని దీనుణ్ని చేస్తుంది. భగవదాశ్రయానికి దారితీస్తుంది. అవసానదశలో మనుష్యుడు ఏకాకి అయినప్పుడే అతనిలో యథార్థమైన జ్ఞానం జాగృతమవుతుంది. భగవంతుణ్ని శరణువేడుకొంటాడు. నిర్బలులకు బలం భగవంతుడే కదా!

గజేంద్రుడు ఒంటరివా డయ్యాడు. తాను ఇంద్రద్యుమ్నుడనే మహారాజై ఉన్నప్పుడు అతనికి అభ్యస్తమైన పరమస్తోత్రాన్ని పఠించాడు. దేహాత్మలు ప్రత్యేక జన్మలలో భిన్న భిన్నమైనవిగా ఉంటాయి. ఇంద్రద్యుమ్నునిది ఇప్పుడు గజరూపంతో కూడిన ఆత్మ కావడంవల్ల పూర్వజన్మ స్మృతి ఉండదు. ఉన్నదంటే అది క్షేత్రజ్ఞుడైన భగవంతుని దివ్యప్రేరణతోనే అయ్యుండాలి.

గజేంద్రుడు **"జన్మజన్మాంతరాభ్యాసభక్తిమాన్ గరుడధ్వజే"** అని వామన పురాణం చెబుతున్నది. భగవత్స్మరణం తప్ప సర్వారంభాలను పరిత్యజించాడు గజేంద్రుడు. భక్తుడు చేసే ప్రార్థన శబ్దబాహుళ్యంతో కూడినదైతే అది కేవలం అనుకరణ

మాత్రమవుతుంది. తీరుబాటుగా కూర్చుండి చేసే ప్రార్థన కూడా అలాంటిదే. ప్రార్థన చేసే భక్తునికి శ్రద్ధా విశ్వాసాలుండటం ముఖ్యం. భగవంతుని కృపాళుత్వం పట్ల పరమ విశ్వాసం ఉంటే భక్తుణ్ణి తన ఒడిలోనికి చేర్చుకొంటాడు భగవంతుడు తల్లిలాగా.

**శ్లో. ఏవం వ్యవసితో బుద్ధ్యా సమాధాయ మనోహృది**
**జజాప పరమం జప్యం ప్రాగ్జన్మన్యనుశిక్షితమ్**

తా : గజేంద్రుడు తన బుద్ధిని ఈశ్వరాధీనం చేశాడు. ఏకాగ్రతతో పూర్వజన్మలో నేర్చిన పరమస్తోత్రాన్ని జపించాడు.

గజేంద్రుడు తాను పూర్వజన్మలో ఇంద్రద్యుమ్నుడుగా ఉన్నప్పుడు భగవద్ధ్యానం చేయడం అభ్యసించాడు. అది గజేంద్రుడుగా, అనగా మూఢజంతువుగా తాను పుట్టినప్పుడు కూడా అప్పటి దైవధ్యానం సంక్రమించింది. ఏ రూపంలో, ఎన్ని జన్మలెత్తినప్పటికి భక్తి నశించదు. **"కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి"** (గీత 9-31) అని శ్రీకృష్ణభగవానుడు శపథపూర్వకంగా చెప్పమని అర్జునుణ్ని ఆజ్ఞాపించాడు. బహిరంతర మూఢ జంతువైన ఏనుగుగా పుట్టినప్పటికీ అతని పూర్వజన్మలోని భక్తికి క్షతి కలగలేదు.

సాధారణంగా పూర్వజన్మలో చేసినవన్నీ మరుజన్మలో మరచిపోవడం జరుగుతుంది. భగవద్భక్తులైన పుణ్యాత్ములకు అలాంటిది జరగదు. నిద్రించి లేచినవాడు నిద్రపోయే ముందు చేస్తున్న పనిని మేల్కొన్న తర్వాత మరచిపోకుండా ఏ విధంగా చేస్తాడో ఆవిధంగానే పుణ్యాత్ములైనవారు పూర్వజన్మలో ఆరంభించిన యోగాన్ని (భక్తియోగాన్ని) మరుసటి జన్మలో మరవకుండా ఆచరిస్తారు. గీతలో శ్రీకృష్ణభగవానుడీ విషయాన్ని కూడా వివరంగా తెలిపాడు. **"తత్ర తం బుద్ధి సంయోగం లభతే పూర్వదైహికం యతతే చ తతో భూయః సంసిద్ధౌ కురునందన పూర్వాభ్యాసేన తేనైవ హ్రియతే హ్యవశోఽపి సః"** (గీత 6-43, 44) యోగభ్రష్టుల యింట్లో జన్మించిన యోగభ్రష్టుడు పూర్వజన్మలో తాను ఆర్జించిన యోగజ్ఞానాన్ని అనాయాసంగా పొంది యోగసిద్ధికై ఆ జన్మలో తీవ్రంగా ప్రయత్నిస్తాడు. అతడు తన జన్మ సంస్కారంతో యోగంలో తనకు తెలియకుండానే ప్రవర్తిస్తాడు. అని యోగ మాహాత్మ్యం గూర్చి తెలిపాడు శ్రీకృష్ణభగవానుడు. అదే "పూర్వపుణ్యాఫల దివ్య జ్ఞాన సంపత్తి". అవసానకాలంలో భీష్ముడు భగవంతుణ్ని స్మరించాడు. కురుపాండవ యుద్ధం సమాప్తమయింది. ధర్మరాజ పట్టాభిషేకోత్సవం కూడా

జరిగింది. ఒకనాడు యుధిష్ఠిరుడు శ్రీకృష్ణుని మందిరంలోనికి ప్రవేశించాడు. అప్పుడు శ్రీకృష్ణుడు మంచం మీద కూర్చుండి ధ్యానమగ్నుడై ఉన్నాడు. యుధిష్ఠిరుడు శ్రీకృష్ణుని క్షేమ మడిగాడు. కాని, శ్రీకృష్ణుడు బదులు పలకలేదు. శ్రీకృష్ణుడంతగా ధ్యానమగ్నుడై ఉండటం చూచి ఆశ్చర్యపడి యుధిష్ఠిరుడు "ప్రభూ! తాము ఎవరిని ధ్యానిస్తున్నారు? దయతో చెప్పండి. నేను మిమ్మల్ని శరణువేడుకొంటున్నాను" అని సాష్టాంగ పడ్డాడు.

అప్పుడు శ్రీకృష్ణుడిలా అన్నాడు. "ధర్మరాజా! శరశయ్య మీదున్న నరశార్దూల సదృశుడైన భీష్ముడు నన్ను ధ్యానిస్తున్నాడు. నేనతణ్ణి స్మరిస్తున్నాను. ఈ సమయంలో నేను మనస్సు ద్వారా భీష్ముని దగ్గరున్నాను. వేదాలు, ధర్మాలు సంపూర్ణంగా తెలిసినవాడు, బ్రహ్మచారి, గొప్ప అనుభవశాలి, కురుకుల సూర్య పితామహుడు అస్తమించనున్నాడు. జగత్తులో జ్ఞానసూర్యుడు నిస్తేజుడు కానున్నాడు. కాబట్టి నీవు ఆ మహనీయుని దగ్గరకు వెళ్లి, ఆయన ఉపదేశాలను విను" అన్నాడు.

జీవిత ప్రారంభం నుంచి భగవన్నామస్మరణ చేసినవానికి అంతకాలంలో నిర్మలబుద్ధి కలిగి, నిశ్చయాత్ముడై, భగవంతుణ్ని స్మరించి ఉత్తమలోకాలకు చేరుకొంటాడు. జీవితమంతా సంసార తాపత్రయంతో, ధనసంపాదనమే పరమాశయంగా భావించిన గృహ్యవ్రతునికి అవసాన సమయంలో భగవత్ స్మరణ కలగదు.

ఒక గృహస్థు కడు వృద్ధుడయ్యాడు. అతనికి అవసానదశ ప్రాప్తించింది. జీవితంలో అతడెన్నడు భగవంతుణ్ని స్మరించినవాడు కాడు. మహాస్వార్థపరుడు. అతడు మరణోన్ముఖుడయ్యాడు. అతని మంచాన్ని ఎట్టి ఇంటి వరండాలోనికి చేర్చారు కుమారులు. ఆ వృద్ధుడు మంచం మీద పరుండే వాకిలివైపు సాలోచనగా చూస్తున్నాడు. తలెత్తి తన కుమారుల ముగ్గుర్నీ చూస్తున్నాడు. మాట పడి పోయింది. తండ్రి తాను దాచిపెట్టిన నిధిని ఎరుక పరచడానికి ప్రయత్నిస్తున్నాడనుకొన్నారు కుమారులు. ఆయన నోటివెంట ఒక్క మాట వస్తే బాగుండుననుకొన్నారు. వైద్యుని దగ్గరికి పరుగెత్తారు. "వెయ్యి రూపాయల మందున్నది. అది ఇస్తే మీ తండ్రి ఒక్కమాట మాత్రం పలుకగలుగుతాడ"ని వైద్యుడు చెప్పాడు. వెయ్యి రూపాయలూ ఇచ్చి వైద్యుణ్ని తోడ్కొని వచ్చి, ఆ మందు ఇప్పించారు. ఆ మందు ప్రభావంతో ఆ తండ్రి ఒక్క మాటే పలికాడు. అది ఇది : "ఒరే! వాకిట్లో కుక్క చీపురుకట్టను అలా పాడుచేస్తూ ఉంటే చూస్తూ ఊరకుంటారేమిటిరా" అని. మొగం వేలవేసి కన్ను

మూశాడు వృద్ధుడు. అతడు జీవితంలో ఎన్నడూ భగవద్ధ్యానంలో అయిదునిమిషాలు కూడా గడపినవాడు కాదు. కాబట్టి, చచ్చే సమయంలో కూడా సంసారతాపత్రయాన్ని విడువలేక పోయాడు. "ముసలితనం ముప్పునందు కాలకింకరులు ముంగిట్లోకి వచ్చిన వేళ నీ స్మరణకల్గునొ కల్గదొ నాటికిప్పుడే తప్పక సేతు మీ భజన" అని భావించి ముందు జాగ్రత్తపడిన రామదాసాది భక్తులెందరో ఉన్నారు.

భగవంతుడు తన సృష్టిలో ఏ జీవికి ప్రసాదించని వాక్కును మనుష్యునికి అనుగ్రహించాడు. భగవద్గుణ కీర్తనానికి వాక్కును ఉపయోగించక దానిని వ్యర్థం చేయడం పశుత్వమవుతుంది. తన జిహ్వను భగవన్నామోచ్చారణకు ఉపయోగించిన వాడు మోక్ష నిశ్రేణిని ఆరోహింపగలుగుతాడు. **"జిహ్వాం లబ్ధ్వాపి యో విష్ణుం కీర్తనీయం న కీర్తయేత్, లబ్ధ్వాపి మోక్షనిశ్రేణిం స నారోహతి దుర్మతిః"** జిహ్వ గలిగిన మనుష్యుడు కీర్తనీయుడైన శ్రీకృష్ణుని కీర్తించని కుత్సిత దుర్బుద్ధి గలవాడు మోక్షమనే నిచ్చెన దగ్గరలో కలవాడైనప్పటికి దానిని ఎక్కడానికి అసమర్థుడవుతాడు.

భగవంతుని యెడ భక్తిశ్రద్ధలు కలగడం భగవత్కృపమీదనే ఆధారపడి ఉంటుంది. భగవత్కృప లేనిదే మనుష్యునికి భగవన్నామం మీద విశ్వాసం, శ్రద్ధ కలుగవు. కాబట్టి భక్తి ఉన్నా లేకపోయినా మనుష్యుడు తన జీవన ప్రారంభంనుండి భగవన్నామాన్ని అభ్యసించాలి. తద్వారా భక్తిని గడించాలి. తన జీవిత ప్రారంభ కాలంనుంచి భగవన్నామోచ్చారణను అభ్యసింపనివాడు మృత్యు సమయంలో భగవన్నామాన్ని ఉచ్చరించడం బహుకఠినమవుతుంది. శ్రద్ధాభక్తులతో భగవన్నామాన్ని ఉచ్చరించేవాడు తన మరణసమయంలో భగవన్నామోచ్చారణ చేసి జనన మరణ చక్రం నుంచి తప్పుకోగలుగుతాడు. జీవిత పర్యంతము భగవన్నామాన్ని ఉచ్చరింపనివాడు భగవత్కృపచే మరణ సమయంలో వివశుడై "నారాయణ" అని ఉచ్చరిస్తే అతని పాపాలన్నీ క్షయమవుతాయనీ, అంతేకాక, అతడు భగవత్ సాయుజ్యాన్ని పొందుతాడనీ అజామిళోపాఖ్యానం సాక్ష్యమిస్తున్నది. **"అంతకాలే చ మామేవ స్మరన్ముక్త్వా కళేబరం, యః ప్రయాతి స మద్భావం యాతి నాస్త్యత్ర సంశయః"**(గీత 8-5) "మరణ సమయంలో నన్ను స్మరిస్తూ శరీరత్యాగం చేసినవాడు నా స్వభావాన్ని పొందుతాడు. ఇందు సంశయం లేదని శ్రీకృష్ణభగవదుక్తి." ఆదిభరతుడు తన ప్రియమైన మృగాన్ని స్మరిస్తూ చనిపోయాడు. తత్ఫలితంగా అతడు మృగ సజాతీయాకారుడై మరల జన్మింపవలసి వచ్చింది.

భగవన్నామస్మరణం ఆబాల్యం నుంచే మనుష్యుడికి అభ్యాసం కావాలి. అలా అది అభ్యస్తమైనప్పుడే మరణ సమయంలో భగవంతుణ్ని స్మరించి, ధ్యానించి, కీర్తించి భగవదనుగ్రహాన్ని పొంది ఉత్తమగతికి చేరుకొంటాడు. లేదా తాత్కాలికంగా మృత్యువును తప్పుకోగలుగుతాడు. భగవన్నామోచ్చారణతో మరణించడం జీవించడం కంటె సౌభాగ్యమవుతుంది. జీవిత ప్రారంభం నుంచి భగవన్నామోచ్చారణం అభ్యాసం లేనివానికి మరణ సమయంలో అది స్ఫురణకు రాదు. మనుష్యుడు తన సమగ్ర జీవితంలో శ్రద్ధా భక్తి పూర్వకంగా భగవన్నామాన్ని ఉచ్చరించినవాడైతే అతడు జనన మరణ చక్రం నుంచి (ఆవాగమనచక్రం) నిశ్చయంగా బయటపడతాడు. ముక్తి పొందుతాడు. ముక్తి కోరిన మనుష్యుడు భగవదనుగ్రహప్రాప్తికి లేచేటప్పుడు, కూర్చున్నప్పుడు, పరున్నప్పుడు, మేల్కొన్నప్పుడు, నడుస్తున్నప్పుడు, తిరుగుతున్నప్పుడు, తింటున్నప్పుడు - ప్రతి అవస్థలోను భగవన్నామాన్ని సర్వదా ఉచ్చరిస్తూ ఉండవలసిందే. అతనికి భగవత్సాంగత్యంతో సర్వకాలమూ సుకాలమవుతుంది. **"కృష్ణ త్వదీయ పదపంకజ పంజరాంత రద్యైవ మే విశతు మానసరాజ హంసః, ప్రాణ ప్రయాణ సమయే కఫవాత పిత్తైః కంఠావరోధనవిధౌ స్మరణం కుత స్తే"** వార్ధక్యంలో కఫవాత పిత్తాది దోషాలవల్ల 'కృష్ణ' అని మరణ సమయంలో ఉచ్చరించడానికి వీలు కాక పోవచ్చు. నా మనస్సనే రాజహంసను ముందుగానే నీ చరణపంజరంలో బంధిస్తున్నా నన్నాడొక భక్తుడు. మరణ సమయంలో భగవంతుని స్మరించడానికి మనస్సు నిర్మలంగా ఉండదు. "ప్రభూ! మరణ సమయంలో నా మనస్సును నిర్మలంగా ఉంచు. అదే పదివేల"ని వేడుకొన్న భక్తులు కూడా ఉన్నారు. మనస్సు నిర్మలంగా ఉంటే అభ్యస్తమైన హరినామకీర్తనను మరణ సమయంలో పునశ్చరణ చేసుకోవడానికి వీలవుతుందని వారి ఆశయం.

పై పద్యంలో **"అవ్యథమై యిట్లను పూర్వపుణ్య ఫల దివ్యజ్ఞాన సంపత్తితోన్"** అని ఉండగా ఎవరో "సవ్యథమై" అది దిద్ది శరణాగతి తత్త్వానికి న్యూనత కల్పించారు. పూర్వ పుణ్య ఫల దివ్యజ్ఞానం కలిగిన తర్వాత వ్యథ ఉంటుందా? ఉంటే అది దివ్యజ్ఞానం ఎలా అవుతుందో దిద్దినవారు ఆలోచింపలేక పోయారు.

గజేంద్రుడు మొసలితో పోరాడి పోరాడి అలసిపోయి, ఇక దానిని జయింపలేనని నిశ్చయించాడు. ఇక తాను బ్రతికిబయట పడటం అనేది భగవంతుని చేతిలోనే ఉన్నది. ఆయనకు శరణాపన్నుడను కావడం శ్రేయస్కరమనుకొన్నాడు. అదే అతని

దివ్యజ్ఞానం. వ్యథాభారాన్ని వదలివేశాడు. భగవంతుని దీనదయాళుత మీద, శరణాగత వత్సలత మీద విశ్వాసం ఉంచాడు. అట్టి విశ్వాసం గజేంద్రునికి కలగడం అనేక జన్మలనుండి అతడు చేసిన పుణ్యకర్మల భగవత్ స్మరణల ఫలితం.

భక్తి ఆయాససాధ్యం. ప్రపత్తి అనగా శరణాగతి ప్రబల విశ్వాసానికి చెందింది కావడం వల్ల అది విశ్వాస సాధ్యమవుతుంది. భగవంతుడు శరణాగత వత్సలుడు. దీన దయాళువు. అనే నిశ్చయజ్ఞానం - విశ్వాసం కలిగిన తర్వాత అన్యావలంబనం పట్ల ఆసక్తి ఉండదు. ఏ పాపం వల్ల తనకు ఏనుగు జన్మ ప్రాప్తించిందో ఆ పాపం శరణాగతి వల్ల పటాపంచలై పోతుంది. అంతటి పాపమే తొలగిపోయినప్పుడు ఇక వ్యథ దుఃఖమూ తాపమూ శరణాగతునిలో నిలువ లేవు. ఆనందమయుడైన భగవంతుని అండ జేరినప్పుడు తాపం ఎలా ఉండగలుగుతుంది? పాపతాపాది వ్యథలు విషయసుఖాలను ఆశ్రయించి ఉంటాయి. వాటితో విషయాశ్రితులైన స్త్రీ పురుషుల హృదయాలు తప్త మవుతుంటాయి. భగవంతునికి శరణాపన్నుడైనవాడు పరమశాంతిమయ ప్రసన్న శీతలతా సామ్రాజ్యంలో ప్రవేశించినవాడవుతాడు. అక్కడ వ్యథా దుఃఖ తాపాలకు ప్రవేశంఉండదు.**"మా మేకం శరణం వ్రజ, అహం త్వా సర్వ పాపేభ్యో మోక్షయిష్యామి - మా శుచః"** (గీత 18-66) "నన్ను సర్వజ్ఞునిగా, సర్వశక్తి మంతునిగా, పరమకారుణికునిగా, వాత్సల్యనిధిగా విశ్వసించి నన్నొక్కని శరణువేడటమే ఉపాయంగా నెంచి శరణాగతుడవు అగుము. "త్వాం" అల్పజ్ఞుడవు, అల్పశక్తిమంతుడవు అగు నిన్ను సర్వపాపాలనుండి మత్ప్రాప్తికి విరోధులైన సకల విషయాలనుండి తొలగించి నిన్ను రక్షిస్తాను. ఫల సంశయాదులకు చెందిన దుఃఖం విడిచి పెట్టు" అని ప్రబోధించాడు శ్రీ కృష్ణభగవానుడు. **"ప్రభుః సర్వసమర్థో హి తతో నిశ్చింతతాం వ్రజేత్"** శ్రీకృష్ణ భగవానుడు సర్వసమర్థుడు కాబట్టి భక్తుడు నిశ్చింతుడై ఉండాలి. శరణాగతునికి వ్యథ విషాదం శోకాదులు ఉండవు. అతడు చేయవలసిన పని కూడా ఉండదు. అతని సకల కార్యాలు భగవంతుని కృపాశక్తిచే వాటంతట అవే నెరవేరుతుంటాయి. శరణాగతి చేయడంలో నిబంధనలు ఏవీ లేవు. కాని, "హే కృష్ణ! హే నాథ! నేను నీవాణ్ని, నీ శుభ చరణాలను ఆశ్రయించినవాణ్ని. దీనుణ్ని. హీనుణ్ని. పాపిని. అపరాధిని. సాధనాహీనుణ్ని. మలినబుద్ధిని. నీ కృపను నమ్మినవాణ్ని. నీ సౌలభ్యాన్ని, నీ వాత్సల్యాన్ని ఆధారంగా చేసుకొని నా భారం నీ మీద ఉంచుతున్నాను" అని భరన్యాసం చేయవలసి ఉంటుంది.

కుంతీదేవి జీవితమంతా వ్యథాభరితమే. ఎన్నెన్నో సంకటాలను దుఃఖాలను సంయమంతో భగవద్ధ్యానంతో పోగొట్టుకొన్న సహనశీల. ఆమె తనకు నిరంతరం విపత్తులనే ఇమ్మని శ్రీకృష్ణుణ్ణి ప్రార్థించింది. **"విపదః సన్తు నః శశ్వత్, తత్ర తత్ర జగద్గురో, భవతాం దర్శనం యత్ స్యా, దపునర్భవదర్శనమ్".** (శ్రీమద్భా 1-8-25) హే జగద్గురో! సర్వావస్థలలోను సకల విపత్తులు నాకు కలిగిస్తూ ఉండు. పునర్జన్మ లేకుండా చేసేటటువంటి నీ దివ్య మంగళరూప సందర్శనం నాకు నిరంతరం ప్రాప్తమవుతుంది. నీ దర్శనం ప్రాప్తించినవారికి పునర్జన్మ ఉండదు. లోకంలో దుఃఖ మనుభవింప వలసిన పనీ ఉండదు. అందుచేతనే కుంతీదేవి విపత్తులనే సంపత్తులనుగా స్వీకరించింది. అనుక్షణం స్మరిస్తూ శ్రీకృష్ణ దర్శన భాగ్యం పొందటంతోపాటు సంసార దుఃఖ నివృత్తిని పొందింది. కుంతీదేవి ముఖ్య లక్ష్యం శ్రీకృష్ణ దర్శనం, తన్నామస్మరణమే. ఆనుషంగిక ఫలంగా పొందినది దుఃఖనాశనం.

**శా. ఏ రూపంబున దీని గెల్తు నిట మీఁదే వేల్పుఁ జింతింతు వె**
**వ్వారిం జీరుదు వెవ్వరడ్డ మిఁక నివ్వారి ప్రచారోత్తమున్**
**వారింపందగువార లెవ్వ రఖిలవ్యాపారపారాయణుల్**
**లేరే? మ్రొక్కెద దిక్కు మాలిన మొ ఱాలింపన్ బ్రపుణ్యాత్మకుల్**

టీ : ఏ రూపంబున = ఏ విధముగా, దీనిన్ = ఈ మొసలిని, గెల్తును? ఇటమీదన్ = ఇటుపై, ఏ వేల్పున్ = ఏ దేవుని, చింతింతున్ = ధ్యానింతును? ఎవ్వారిన్ = (సహాయపడుటకు ఏ దేవుని) ఎవరిని, చీరుదున్ = పిలుతును?, ఇక, ఈ +వారి ప్రచారోత్తమున్ = నీట సంచరించు మేటియగు ఈ మొసలిని, వారింపన్ తగువారలు = నివారింపగలవారు; ఎవ్వరు? అఖిల వ్యాపార పారాయణుల్ = సకల కార్యములందు (సాయపడుటకు) ఆసక్తులైనవారు; ప్రపుణ్యాత్మకుల్ = విశేష పుణ్యముగలవారు; దిక్కుమాలిన = నిరాశ్రయుడనైన నా యొక్క, మొఱన్ + ఆలింపన్ = మొర వినుటకు, లేరే = లేనేలేరా? (ఉండ కుండరు. తప్పక యుందురు. వారికి) మ్రొక్కెదన్ = సాష్టాంగముగా మ్రొక్కెదను.

తా : ఇక ఏ విధంగా ఈ మొసలిని గెలువ గలుగుతాను? సహాయపడమని ఏ దేవతలను ప్రార్థింపను? ఎవరిని పిలువను? బలిష్ఠమైన ఈ మొసలిని నివారించేవారే లోకంలో లేరా? నన్ను దయతో ఉద్ధరించే పుణ్యాత్ములకు ఈ లోకంలో కొదువా? ఏమి? ఈ అనాథుని మొరను ఆలింపుమని ఆ దయామయులకు మ్రొక్కుతున్నాను.

గజేంద్రుడు మహాబలిష్ఠమైన ఆ మొసలిని గెలువలేననే నిశ్చయానికి వచ్చాడు. తానిప్పుడు దిక్కులేనివాడు. దిక్కులేనివానికి దైవమే దిక్కు. ఇక ఏ దేవుణ్ణి

ప్రార్థించాలి. యమపాశంలాగా, కాల సర్పంలాగా తనను పట్టిన ఈ మొసలికి భీతి పుట్టించి దీని పీడను తొలగించే సమర్థుడైన దేవుడెవరు? ఆలోచించాడు గజేంద్రుడు. పూర్వపుణ్యాఫల దివ్యజ్ఞానం స్ఫురించింది. **"భీషాస్మాత్ వాతః పవతే - భీషో దేతి సూర్యః - భీషాస్మా దగ్ని శ్చేంద్రశ్చ మృత్యు ర్ధావతి పంచమ ఇతి"** తైత్తిరీయోపనిషత్తు. ఎవనికి భయపడి గాలి వీస్తున్నది. ఎవనికి భయపడి సూర్యుడు ఉదయిస్తున్నాడు, ఎవనికి భయపడి అగ్ని ఇంద్రుడు తమ విధులను నిర్వర్తిస్తున్నారు. ఎవనికి భయపడి మృత్యువు పరుగెత్తుతున్నది. ఆ సర్వలోక నియంత సర్వేశ్వరేశ్వరుడు నాకు దిక్కు. అతణ్ని ప్రార్థిస్తాను. అతనికి మ్రొక్కుతాను. అతడే నాకు శరణ్యము అని గజేంద్రుడు నిశ్చయించాడు. గతజన్మ స్మృతివలననే అతనికి శరణాగతరక్షకుడైన శ్రీమన్నారాయణుని శరణు వేడుకోవలయునను నిశ్చయజ్ఞానం కలిగింది.

ఇట్టి నిశ్చయజ్ఞానము కలుగుటకు కారణం ఏమిటి? గీతలో శ్రీకృష్ణభగవానుడు **"సర్వస్య చాహం హృది సన్నివిష్టః"** (15-15) "సకల జీవుల హృదయాలలో ఆత్మగా చొచ్చినవాడను నేను'' అన్నాడు. హిరణ్యకశిపుడు ప్రహ్లాదుణ్ని "నీకీ బుద్ధి గురువులు ఉపదేశింపలేదు కదా. మరి నీ కెవరివల్ల ఇలాంటి బుద్ధి కలిగింది?'' అని అడిగాడు. అప్పుడు ప్రహ్లాదుడు **"శాస్తా విష్ణు రశేషస్య జగతో యో హృది స్థితః, తమృతే పరమాత్మానం తాత! కః కేన శాస్యతే"** (శ్రీవిష్ణు. పు. 1-17-20) "తండ్రీ! భగవంతుడు అంతర్యామిగా లేని పదార్థము ఒక్కటీ లేదు. అతడు శత్రువగు నీలోను, భక్తుడనగు నాలోను సమముగా ఉండి మనలను కర్మానుగుణముగా, సద్బుద్ధినో దుర్బుద్ధినో పుట్టించి ప్రవర్తింపజేస్తున్నాడు" అని చెప్పాడు.

**"యమో వైవస్వతో రాజా యస్త వైష హృది స్థితః"** మనుస్మృతి. పరమాత్మ సూక్ష్మాతి సూక్ష్మ పదార్థాలలో కూడా ప్రవేశించి ఉండదగినంత సూక్ష్మంగా ఉంటాడనీ ఆయన ప్రవేశాన్ని నిరోధింపగల పదార్థమేదీ లేదనీ, ఆయన అన్నిటిలోను అంతర్యామిగా ఉంటాడనీ మనుస్మృతి చెబుతున్నది.

స్మృతి అనగా పూర్వము అనుభవించినదానికి చెందిన అనుభవ సంస్కారం వల్ల పుట్టిన జ్ఞానము. అదే పూర్వపుణ్యఫలదివ్యజ్ఞానసంపత్తి.

గజేంద్రుడు గతజన్మలో ఇంద్రద్యుమ్నుడను ఒక మహారాజు. మహానిష్ఠతో, ఏకాగ్రతతో భగవంతుణ్ని ఆరాధించిన పుణ్యాత్ముడు. ఇప్పుడు శాపగ్రస్తుడై గజరాజుగా జన్మించాడు. కాని, గజజన్మ కలిగినప్పటికీ అతని భక్తి నశింపలేదు.

"న మే భక్తః ప్రణశ్యతి" (గీత 9-31) భక్తుడు ఎన్ని జన్మలెత్తినను అతనికి పట్టుబడిన భక్తి మాత్రం నశింపదు. అతడెప్పటికైనా ధర్మాత్ముడవుతాడు. భగవద్భజనైక మనస్కుడవుతాడు. అగస్త్యుని శాపం ఇంద్రద్యుమ్నుణ్ని కుంజర యోనిలో జన్మింపజేసినప్పటికిని అతని భక్తిని మాత్రం మరుగుపరచలేకపోయింది. భగవంతుడు న్యాయకారి మాత్రమే కాదు, పరమకృపాళువు కూడా అని ఈ కథావసానంలో గ్రహిస్తాము. భగవంతునికి భయపడి దేవతలందరు తమ విధులను నిర్వర్తిస్తున్నారు. కానీ, భగవంతుడు అంత భయంకరుడు కాడు. ఆయనిది భీకరరూపం కాదు. సౌమ్య సౌశీల్య సౌగంధ్య సౌకుమార్యలావణ్య యౌవనాద్యనంత గుణనిధి దివ్యరూపుడు. ఆశ్రిత వాత్సల్యైక జలధి. శరణాగత రక్షకుడు. దీన దయాళువు. ఆయనకు సూర్యాదిదేవతలు భయపడతారు. కాని, ఆయన తన తల్లి యశోదకు భయపడతాడు. ఆయన యొక్క సభయతా నిర్భయతలు జీవుణ్ని ఉద్ధరించే సాధనాలవుతాయి. యుధిష్ఠిరుని తల్లి కుంతీదేవి తన మేనల్లుడైన కృష్ణుణ్ని చూడటానికి నందుని యింటికి వచ్చింది. నందగృహంలో ఎందరో గోపికలు గుమిగూడి ఉన్నారు. వారి మధ్య శ్రీకృష్ణుడు భయపడుతూ కళ్లు నులుముకొంటూ కజ్జలపంకిలాశ్రువులు స్రవిస్తూ యశోదవైపు పులుకుపులుకున చూస్తూ ఆమె చేతిలో ఉన్న తాడును చూచి తలవంచుకొని నిలబడ్డాడు. అలా ఉన్న కృష్ణుణ్ని చూచి కుంతీదేవి ఒక గోపికను అడిగింది. "యశోదమ్మ ఈ చక్కని బాలుణ్ని ఎందుకు కొట్టింది?" అని. "అమ్మా ఈ పిల్లవాడు చాలా కొంటెవాడు. అంత పెద్ద పెరుగుకడవను పగులగొట్టివేశాడు" అని ఆమె చెప్పింది. కుంతి ఒకానొక సమయంలో శ్రీకృష్ణభగవానుణ్ని స్తుతిస్తూ "శ్రీ కృష్ణా! నిన్ను చూస్తే భయం కూడా భయపడి పారిపోతుంది. కానీ, నీవు పెరుగు కడవ పగలగొట్టిన నేరానికి నీ తల్లి నిన్ను బంధించినప్పుడు నీవు భయంతో హడలిపోయావు. నీ కళ్ల వెంట కజ్జల మలినాశ్రువులు చెంపల మీదుగా జారాయి." ఏమి ఆశ్చర్యం! ఆ విధంగా శ్రీకృష్ణుడు తన వాత్సల్యరసవైచిత్రిని యశోదచేత ఆస్వాదింపజేశాడు. కుంతీదేవి ఆనాటి బాలకృష్ణుని లీలను స్మరించి విమోహితురాలు, విస్మితురాలు అయింది. ఎవనికి కాలుడుకూడా భయపడతాడో అతడు తల్లికి భయపడ్డాడు. **"గోప్యాదదే త్వయి కృతాగసి దామ తావద్, యాతే దృశాశ్రుకలిలాంజనసంభ్రమాక్షమ్, వక్త్రం నినీయ భయభావనయా స్థితస్య, సా మాం విమోహయతి భీరపి యద్బిభేతి".** (శ్రీమద్భా 1-8-31) **"ఇదానీం సా మాం విమోహయతి"** అని తలపోస్తూనే ఉన్నది కుంతి. **"భీషాస్మాద్వాతః**

**పవతే"** అని శ్రుతులు పేర్కొన్న శ్రీకృష్ణభగవానుని భీతిని పోతనగారు ఎంతచక్కగా వర్ణించారో చూడండి. కుంతి ప్రార్థనలోనిదీ పద్యం. **"కోపముతోడ నీవు దధికుంభము భిన్నము సేయుచున్నచో గోపిక త్రాటగట్టిన వికుంచిత సాంజనబాష్పతోయధారాపరిపూర్ణవక్త్రముఁ గరంబులఁ ద్రాముచు వెచ్చ నూర్చుచుం బాపఁడవై నటించుట కృపాపర! నా మది జోద్యమయ్యెడిన్"** కుంతి యాదవస్త్రీ. యాదవులు, యశోదాది గోపస్త్రీలు శ్రీకృష్ణచేతస్కులు. అంతర్ముఖులైన భగవత్సేవాభిలాషిణులు. భగవత్ప్రాప్తికి భక్తి ప్రముఖసాధనమని లోకంలో అందరు అంగీకరిస్తారు. కాని, వ్రజవాసినులైన గోపికలకు భగవత్ప్రాప్తి ముందుగా జరిగింది. భక్తి ఆ తర్వాత అబ్బింది. సాధనంతో సాధ్యం సిద్ధిస్తుందని నియతంగా చెప్పడానికి వీలులేని అపారవాత్సల్యజలనిధి, పరమకృపాసింధువు శ్రీకృష్ణుడు. ఆయనిది అనుగ్రహమార్గము. అదే భగవన్మార్గము. అదే స్వతంత్ర భక్తి మార్గము. **"యస్య స్మృత్యా చ నామోక్త్యా తపోయజ్ఞక్రియాదిషు, న్యూనం సంపూర్ణతాం యాతి సద్యో వందే త మచ్యుతమ్"** "ఎవని స్వరూపాన్నీ నామాన్నీ స్మరించినంత మాత్రం చేత తపస్సులోను, యజ్ఞంలోను, అనుష్ఠానంలోను గల లోపం తీరిపోయి అప్పటికప్పుడు సంపూర్ణతను పొందుతుందో ఆ శ్రీకృష్ణభగవానునికి ప్రణామము''.

ఉపనిషద్వికసిత రూపమే పురాణం. ఉపనిషత్తులు తేజోమయ సుందర బ్రహ్మజ్ఞాన మహీరుహాలు. భాగవతాది పురాణాలు శ్యామశాఖాప్రతాన పల్లవిత పుష్పిత ఫలిత ప్రేమ భక్తి కల్పతరువులు.

**శా. నానానేకపయూథముల్ వనములోనం బెద్ద కాలంబు స**
**న్మానింపన్ దశలక్షకోటికరిణీనాథుండనై యుండి మ**
**ద్దానాంభః పరిపుష్ట చందన లతాంతచ్ఛాయలం దుండ లే**
**కీ నీరాశ నిటేల వచ్చితి భయం బెట్లో కదే యీశ్వరా!**

టీ : ఈశ్వరా = ఓ జగన్నియంతా! నానా + అనేకపయూథముల్ = పెక్కు ఏనుగుల గుంపులు; వనములోనన్ = అరణ్యములో; పెద్ద కాలంబు = చాల కాలము; సన్మానింపన్ = గౌరవింపగా; దశ లక్ష కోటి కరిణీనాధుండనై యుండి = అసంఖ్యాకములైన ఆడ యేనుగులకు ఏలికనై యుండియు, మత్ = నా యొక్క; దాన + అంభః = దానజలముచే; పరిపుష్ట = మిక్కిలి పెంపొందిన; చందనలతా = గంధపు తీగల యొక్క; అంతచ్ఛాయలందు = లోపలి నీడలలో (సుగంధభరితమగు చల్లని నీడలలో) ఉండలేక, ఈ నీరాశన్ = ఈ నీటియందు ఆశతో; ఇటు + ఏలవచ్చితి = ఇక్కడికి ఎందుకువచ్చితిని? భయంబు, ఎట్లోకదే = ఎట్లగునో కదా!

తా : ఓ ఈశ్వరా! ఈ అరణ్యంలో చాలా కాలం అనేక గజములు నన్ను సన్మానిస్తుండగా, పెక్కు ఆడ యేనుగులకు నేను ఏలికనై ఉన్నవాడను. నా దాన జలములచే పెంపొందిన చందనవృక్షాల చల్లని నీడలలో హాయిగా నుండలేక నీటియం దాశతో ఈ చోటికి ఎందుకు వచ్చాను? భయమవుతున్నది. ఇక ఏమి కానుంటినో ఏమో!

ఈ పద్యంలో గజేంద్రుడు తన పూర్వపు వైభవాన్ని తలపోసుకొంటూ, జలక్రీడాసక్తితో ఈ కాసారానికి ఎందుకు వచ్చానా? అని పరితపింపసాగాడు. ఇటువంటి పద్యాన్నే అల్లసాని పెద్దనగారు మనుచరిత్రలో రచించారు. కాలికి పసరు పూసుకొని ఆకాశవీథికి ఎగురజాలిన ప్రవరుడు ఔషధ సత్వాన్ని తెలుసుకోడానికి ఏ పుణ్యక్షేత్రానికో వెళ్లినట్లుంటే ఫలందక్కేది. అలా కాకుండా హిమాలయానికి వెళ్లాడు. అచటి మంచుకు అతని పాదలేపం కరగిపోయింది. వెంటనే అతడు భూమిమీదికి దిగిపోయాడు. దిక్కు తెలియనివాడయ్యాడు ప్రవరుడు. **"అకళంకౌషధ పత్వముందెలియ మాయాద్వారకావంతి కాశి కురుక్షేత్ర గయా ప్రయాగములు వే సేవింపకుద్దండ గండక వేదండ వరాహ వాహరిపు ఖడ్గ వ్యాఘ్ర మిమ్మంచుకొండకు రాజెల్లునె బుద్ధిజాడ్య జవితోన్మాదుల్ గదా శ్రోత్రియుల్"** అనుకొన్నాడు. ఈ పద్యం పోతనగారి పద్యచ్ఛాయతో కూడినదైనా **"సుకవి రుపనిబంధన్ వింద్యతాం నోపయాతి"** సమర్థంగా నిబంధించాడు కాబట్టి అల్లసాని పెద్దనగారి పెద్దతనానికి ఏ లోపమూ రాదు.

**ఉ. ఎవ్వనిచే జనించు జగ మెవ్వనిలోపలనుండు లీనమై**
**యెవ్వనియందు డిందుఁ బర మేశ్వరుఁ డెవ్వఁడు మూలకారణం**
**బెవ్వఁ డనాదిమధ్యలయుఁ డెవ్వడు సర్వము దానయైన వాఁ**
**డెవ్వఁడు వాని నాత్మభవు నీశ్వరునే శరణంబు వేఁడెదన్.**

టీ : జగము = ఈ జగత్తు అంతయు; ఎవ్వనిచే జనించున్ = ఎవనివలన పుట్టినదో; లీనమై = కలిసిపోయినదై, ఎవ్వని లోపల = ఎవనియందు, ఉండున్ = ఉండునో; ఎవ్వనియందు; డిందున్ = నశించునో; ఎవ్వఁడు పరమేశ్వరుఁడు = ఎవడు మహా నియంతయో; మహాప్రభువో; ఎవ్వఁడు మూలకారణంబు = ప్రధాన కారణమో; ఎవ్వఁడు, అనాది మధ్య లయుఁడు = ఆది మధ్య అంతములు తానై ఉన్నాడో; వానిన్ = అట్టివానిని; ఆత్మభవున్ = తనకు తానే పుట్టినవానిని; ఈశ్వరున్ = సర్వలోక నియంతను, నేను, శరణంబు వేడెదను = నేను శరణు వేడుకొందును.

తా : ఈ జగత్తంతయు ఎవనిచేత పుట్టి పెరిగి లీనమవుతున్నదో, ఎవడీ సమస్తానికి మూల కారణమైన ప్రభువై ఉండెనో, ఆదిమధ్యాంతములు మూడును

తానైయున్నాడో, ఎవడు తనకు తాను పుట్టినవాడో, ఈప్రపంచమునకంతటికి అట్టి ప్రభువైనవానిని శరణుచొత్తును.

సంస్కృత శ్రీ మద్భాగవతం అష్టమ స్కంధం తృతీయాధ్యాయంలోని గజేంద్రస్తవం ఇక్కడి నుంచి ప్రారంభమవుతున్నది. ఈ గజేంద్రస్తవం ఎంతో మహిమగలది. యశోదాయకము, కలియుగ సమస్త పాపనాశకము, దుఃఖప్రణాశకము; శ్రేయస్సాధకము, దుస్స్వప్న వినాశకము అనే ప్రశస్తి పొందిన స్తోత్రరత్నమిది. దీనిని ఆర్తభావంతో పఠించేవారు లౌకిక పారమార్థిక సంకటాలనుంచి, విఘ్నాలనుంచి విముక్తులవుతారు. వారి అజ్ఞాన బంధం తొలగిపోతుంది. ఈ పవిత్ర స్తోత్రాన్ని బ్రాహ్మముహూర్తంలో మేల్కొని పఠించే వానికి అవసాన సమయంలో నిర్మల బుద్ధిని ప్రసాదించడమేకాక, భగవంతు డతనిని జననమరణచక్రంనుంచి విముక్తుణ్ని చేసి తన సన్నిధానానికి చేర్చుకొంటాడని ఫలశ్రుతి చెప్పబడింది.

**గజేంద్ర ఉవాచ -**

**శ్లో. ఓమ్ నమో భగవతే తస్మై యత ఏత చ్చిదాత్మకం**
**పురుషాయాదిబీజాయ పరేశాయాభిధీమహి**

ఈ స్తోత్రం **"ఓం నమో భగవతే తస్మై"** అని ప్రారంభమై మంత్రమహిమను పొందింది. జీవునికి భగవత్ప్రాప్తి మహాధర్మము. అది సుఖశాంతి సమృద్ధులను సర్వదా లభింపజేస్తుంది. ధర్మానికి మూడు శాఖలున్నాయని ఛాందోగ్యోపనిషత్తు **"ధర్మస్య త్రయః స్కంధాః, యజ్ఞోఽధ్యయనం దానం"** అని చెబుతున్నది. యజ్ఞం - అధ్యయనం - దానం. భక్తి తపస్సు రెండూ కలిసి యజ్ఞ మవుతుంది. దానం కర్మమవుతుంది. అధ్యయనం జ్ఞానమవుతుంది. జ్ఞానం లేకుండా ఏ కర్మయు జరగదు. జ్ఞానం భక్తికి, కర్మకు సహాయక మవుతుంది. కారణమూ అవుతుంది. ఈ రెంటి బలం వల్ల ఉత్పన్నమైనదే కార్యము. ఈ రెంటియొక్క జ్ఞానం ధర్మము. జ్ఞానానికి పర్యాయపదం వేదము. వేదానికి ముఖ్యతత్త్వం ఓంకారము. శాస్త్రగ్రంథాలు జ్ఞానాన్ని వివేకమనీ, విద్య అనీ పేర్కొన్నవి. భక్తియుక్తమైన జ్ఞానంతో ముక్తి నిశ్చితమని సారాంశము.

భగవదుపాసనతో జ్ఞానం కలుగుతుంది. ఓంకారంతో పరమాత్మను ధ్యానించాలి. ఉపాసనవల్ల జ్ఞానం ఎలా సంభవం? అంటే ఓంకారం ద్వారా భగవంతుణ్ని ధ్యానిస్తే కలుగుతుంది. ఓంకారం అమృతప్రదం - అభయ ప్ర॰ము. భగవంతుడు

ఓంకారరూపుడు. "హరిఃఓమ్" భగవంతుణ్ని పేర్కొనడానికి అత్యంత సన్నిహితమైన పదం ఓంకారం. సర్వశ్రేష్ఠమైన భగవన్నామం కూడా ఓంకారమే. "ఓ పరమాత్మా! నన్ను జ్ఞాపకముంచుకో. మరచిపోవద్దు" అనే వేడుకోలు ఓంకారంలో ఉంది. దీన్ని ప్రణవమనీ, ఉద్గీథ అనీ పేర్కొంటారు. ప్రణవజపం చేస్తే ఆత్మజ్ఞానం కలుగుతుందనీ ఉపనిషత్తులు, యోగదర్శనం చెబుతున్నవి. ఓంకారం విఘ్ననాశనం కూడా చేస్తుందని తత్త్వజ్ఞులు చెబుతారు. ఓంకారము అవినాశిగా భావిస్తారు. చరాచర సమస్త ప్రాణులకు పృథ్వి ఆశ్రయము. ఆ పృథ్వికి సారమైనది జలం. ఆ జలానికి సారమైనవి ఓషధులు. ఓషధులతో పురుషుడు పరిపుష్టి చెందుతాడు. పురుషునియందు సారమైనది వాక్కు. వాక్సారము వేదము. వేదసారం ఓంకారము. భగవంతుని శక్తిని ధ్యానింపజేసే ఓంకారం వంటి శబ్దం మరొకటిలేదని **"ప రసానాం రసతమః"** ఓం కారోచ్చారణం వల్ల వాక్కు ప్రాణం రెండూ ఒక్కటి అవుతుందని ఛాందోగ్యోపనిషత్తు చెబుతున్నది. ఓంకారాన్ని జపించేవారి కోర్కెలు నెరవేరతాయి. **"పమర్థయితా హ వై కామానాం భవతి"** అని ఛాందోగ్యోపనిషత్తు తెలుపుతున్నది. ఓ పరమాత్మా! నన్ను స్మరించు. నన్నెప్పటికీ మరచిపోవద్దు. **"ఓం క్రతో స్మర"** ఇలాంటి ప్రార్థనాత్మకమైన ఓంకారాన్ని ప్రణవమనీ, ఉద్గీథ అనీ పేర్కొంటారు. భగవంతుని కిది సర్వశ్రేష్ఠమైన నామం. ఓంకార పూర్వకంగా భగవన్నామాన్ని ఉచ్చరిస్తూ ఉంటే ఆయన "నేను వింటున్నాను వింటున్నాను" అని పలుకుతాడని ఛాందోగ్యోపనిషత్తు తెలుపుతున్నది.

**'ఓం నమః'** తర్వాత భగవచ్ఛబ్దము ఉండాలి. **"ఓం నమో భగవతే వాసుదేవాయ"**. భగవచ్ఛబ్దం సంపూర్ణ షాడ్గుణ్యయుక్తుడైన శ్రీకృష్ణభగవానుణ్ని తెలుపుతుంది. పరబ్రహ్మ పరమాత్మల అద్వయ జ్ఞాన రూపుడే భగవంతుడు. షాడ్గుణ్యపూర్ణుడైన పూర్ణపురుషోత్తముడు. అతడే శ్రీకృష్ణభగవానుడు. **"ఓ మిత్యేకాక్షరం బ్రహ్మ వ్యాహరన్ మా మనుస్మరన్"** (గీత 8-12) అని శ్రీకృష్ణభగవానుడు ఓం కారాన్ని ఉచ్చరించే విధానాన్ని విదితం చేశాడు. ఓంకారాన్ని ఉచ్చరిస్తున్నప్పుడు ఓంకార స్వరూపమైన నన్ను అనగా రూపమాధుర్య లీలా మాధుర్య ప్రేమమాధుర్య వేణుమాధుర్యములు గల నా అప్రాకృత గోపవేష శ్రీకృష్ణ రూపమును అనుస్మరణం చేయాలని తెలిపాడు. శ్రీకృష్ణప్రోక్తమైన భగవద్గీతను తు.చ. తప్పకుండా అనుసరించినవాడు వేదవ్యాస మహర్షి. అంతమాత్రమే కాదు, షాడ్గుణ్య పరిపూర్ణుడైన శ్రీకృష్ణభగవానుణ్ని ప్రత్యక్షంగా దర్శించిన మహాత్ముడాయన. కాబట్టే లోక సంగ్రహార్థం ఓంకారంతోపాటు

భగవచ్ఛబ్దాన్ని ప్రయోగించి వాసుదేవుడైన శ్రీకృష్ణభగవానుణ్ని స్మరింపజేశాడు. ("ఓం నమో భగవతే వాసుదేవాయ" మహామంత్రం). జనన మరణ చక్రంనుంచి జీవికి ముక్తినిచ్చేవాడు శ్రీకృష్ణుడే. **"బంధకో భవపాశేన, భవపాశాచ్చ మోచకః, కైవల్యదః పరంబ్రహ్మ విష్ణురేవ సనాతనః"** జీవుణ్ని బద్ధుణ్ణి చేసేవాడు, ముక్తుణ్ని చేసేవాడు కూడా ఆ సనాతన పరబ్రహ్మమైన శ్రీకృష్ణుడే అని స్మృతివాక్యం. **"నాన్యా విష్ణుః మోక్షదో నాన్యదేవ"** అనిశ్రుతి. **"ముక్తిం దదాతి"** (శ్రీమద్భా. 5-6-18) సర్వవేదపురాణశాస్త్ర సారాంశ మిది. "ఎవనినుంచి చిదచిదాత్మకమైన ఈ జగత్తు ఏర్పడిందో, ఎవరీ జగత్తుకు పరమ కారణమో, బ్రహ్మాదులకు ప్రభువైన పరమ పురుషుడెవడో ఆ భగవంతునికి నమస్కరిస్తున్నాను" అని శ్లోకార్థము. **"యో బ్రహ్మాణం విదధాతి పూర్వం"** అను శ్వేతాశ్వతర శ్రుత్యర్థమే ఇది.

**శ్లో. యస్మిన్నిదం యత శ్చేదం యేనేదం య ఇదం స్వయమ్**
**యోస్మాత్పరస్మాచ్చ పరస్తం ప్రపద్యే స్వయంభువమ్.**

తా : ఈ జగత్తు ఎవనిలో ఉన్నదో, ఎవని ఆధారంతో ఉన్నదో, ఈ జగత్తునందంతట ఎవడు వ్యాపించి ఉన్నాడో, ఎవడు జగద్రూపంతో స్వయంగా ప్రకటితుడై ఉన్నాడో, ఎవడు ఈ దృశ్యమాన జగత్తుకు, దీనికి కారణభూతమైన ప్రకృతికి సర్వథా విలక్షణుడై అనగా సకలేతరవిలక్షణుడై, సర్వశ్రేష్ఠుడై ఉన్నాడో, ఏ కారణం లేకుండా తనకు తానై స్వయంభువుడైన భగవానుని శరణువేడుతున్నాను.

**యస్మి న్నిదమ్ - "పరమే వ్యోమన్ సర్వా భూతాని" యతశ్చ + ఇదం - "యతో వా ఇమాని భూతాని". యేనేదం - "యేన జాతాని జీవంతి" య ఇదం - "సర్వం ఖల్విదం బ్రహ్మ" "నిహితం గుహాయాం పరమే వ్యోమన్"** అని శ్రుతి. విశుద్ధమైన ఆకాశాన్ని అధిష్ఠానంగా చేసికొని, అందరి హృదయకుహరాలలో నివసించేవాడు అని అర్థం. పరమవ్యోమాన్నే, గోలోకమనీ, వైకుంఠమనీ, శ్వేతద్వీపమనీ పేర్కొంటారు. **"యతో వా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవన్తి"** అని శ్రుతి. అన్న ప్రాణ నేత్ర శ్రోత్ర మనో వాక్కులలో స్ఫురించేవాడు అనగా అన్నాదులలో పరమాత్మ స్ఫురిస్తాడని అర్థము. అన్నాదులన్నీ ఎవరిచే ఉత్పన్నమై, ఎవరి సహయోగంతో, ఎవరి బలంతో జీవిస్తున్నవో ఆ పరబ్రహ్మము. **"సర్వం ఖల్విదం బ్రహ్మ"** శ్రుతివాక్యము (ఛాందోగ్యోపనిషత్తు 3-14) ఈ సమస్త జగత్తు నిశ్చయంగా బ్రహ్మమే. ఈ జగత్తు ఆ బ్రహ్మముచే ఉత్పన్నము; ఆ బ్రహ్మమునందే విలీనము; మరియు ఆ బ్రహ్మమునందే తన సమస్తక్రియలు కలది. **"సర్వ భూతాత్మకే**

**తాత! జగన్నాథే జగన్మయే; పరమాత్మని గోవిందే మిత్రామిత్రకథా కుతః"** "రాగ ద్వేషాదిరహితుడై, సర్వభూతాత్ముడు, జగన్నాథుడు, జగన్మయుడునైన గోవిందుని యెడ మిత్రత్వము, అమిత్రత్వము చూపు టెట్లు?"అనునది వ్యాసవచనము. **"సర్వాత్మకం బ్రహ్మోపాసీత"** అనగా చిదచిత్సర్వాంతర్యామి రూపుడగు గోవిందుని ఉపాసింపుమని శ్రుతివాక్యానికి తాత్పర్యము. **"అనాది రాదిగోవిందః సర్వకారణ కారణ"**మ్మని బ్రహ్మసంహిత. ఆ గోవిందుడు స్వయంగా అనాదియైనవాడు. ఆయన సమగ్రతత్వం కూడా అనాదిదే అవుతుంది. ఆయనకు మరొక పేరు గోవిందుడు. ఆయన అనంత జగత్తునందలి సర్వకారణాలకు మూలకారణమైనవాడు. ఎవడు ప్రకృతికంటె పరుడో, గొప్పవాడో అనే స్తుతిలో పురుషోత్తమనామం అనుచింతనమయింది. **"యస్మాత్ క్షర మతీతోహ మక్షరాదపిచోత్తమః అతోస్మి లోకే వేదే చ ప్రథితః పురుషోత్తమః"** (గీత 15-18) క్షరుడనబడే బద్ధజీవునికంటె, అక్షరుడనబడే ముక్తపురుషునికంటె సర్వోత్తముడుగా స్మృతిశ్రుతులందు ప్రఖ్యాతమైనవాడు పురుషోత్తముడే కదా! ఇక్కడ భగవంతుని పురుషోత్తమత్వం అనుచింతితమయింది. ఇటువంటి స్వాయత్తసత్తాదిమంతుడైన స్వయంభువుని శరణుచొచ్చుతున్నాను. **"ముముక్షుః శరణమహం ప్రపద్యే. (శ్వేతాశ్వ)**

**కం. ఒకపరి జగముల వెలివిడి యొకపరి లోపలికిఁ గొనుచు నుభయము(దానై**
**సకలార్థసాక్షి యగు న య్యకలంకుని నాత్మమయుని నర్థిఁ దలంతున్**

టీ : ఒక పరి = ఒక మారు; జగములన్ = లోకాలను; వెలినిడి = ప్రకటించి; ఒక పరి = మరియొకమారు; లోపలికిఁ గొనుచు = తనలోపల నిమిడ్చుకొనుచు, అంతర్ధానము చేయుచు; ఉభయమున్ = ఆ రెండు పనులను; తానై = తానేయై; సకలార్థ సాక్షియగు = ప్రాపంచిక విషయములకు తాను సాక్షిమాత్రమై యుండు; ఆ+అకలంకునిన్ = దోషము లేనివానిని; ఆత్మమయుని = సర్వాంతరాత్ముని, అర్థిన్ = ఆసక్తితో; తలంతున్ = ధ్యానింతును.

తా : ఒకసారి లోకాలను వెలుపల ఉంచుతూ; మరొకసారి తన లోపల నుంచుకొంటూ, జగత్ప్రకటనకర్త, అంతర్ధానకరణకర్త తానే అగుచు, ప్రపంచ వ్యవహారమున కంతటికి తాను సాక్షి అగుచు దోషరహితుడు, ఆత్మమయుడు అయినవానిని ఆసక్తితో కొలుస్తాను.

గజేంద్రునికి పూర్వ పుణ్యఫల దివ్యజ్ఞానం అనగా బుద్ధియోగం కలుగగానే అతడు ముక్తికోసం ప్రపత్తి మార్గాన్ని అనుసరించాడు. అందుకై సర్వేశ్వరుణ్ణే స్తుతింపసాగాడు. అంతేకాని, ప్రాణరక్షణార్థం కాదు; గ్రాహగ్రస్తబాధ అతని స్తోత్రంలో కానరాదు. **"ఇయం చ గజేంద్రేణ విహితా ప్రపత్తి ర్ముక్త్యర్థైవ, న తు ప్రాణరక్షణార్థా"**

అని శ్రీమద్భాగవత సుప్రసిద్ధ వ్యాఖ్యాత శ్రీ వీరరాఘవస్వామిపాదులు ఈ సందర్భంలో తెలిపియున్నారు.

**శ్లో. యః స్వాత్మనీదం నిజమాయయార్పితం**
**క్వచి ద్విభాతం క్వ చ త త్తిరోహితం**
**అవిద్ధదృక్ సాక్ష్యుభయం యదీక్షతే**
**స ఆత్మమూలోఽవతు మాం పరాత్పరః**

తా : ఈ విశ్వమంతయు ఎవని మాయవలన ఎందు అధ్యస్తమై (పైని పెట్టబడినదై) ఉన్నదో, అది ఒకసారి ప్రతీతమూ, మరొకసారి అప్రతీతమూ అయి ఉన్నదో; ఎవని దృష్టి అనునిత్యము సంకోచ వికాసాది రహితమై అపరిచ్ఛిన్న ధర్మభూత పరిజ్ఞానాశ్రయమై ఉండునో, ఎవడు సర్వజ్ఞుడైన సాక్షిగా ఉండి ఉభయమును చూస్తుంటాడో, ఎవడీ సమస్తానికీ మూలమో, అనన్యకారణమో, ఎవడు సకలకార్యకారణములకు అతీతుడో అతడు నన్ను రక్షించుగాక.

ఈ శ్లోకంలో భగవంతుని విశ్వహేతుత్వము, స్వతస్సిద్ధత్వము, దివ్య ప్రకాశకత్వము వర్ణింపబడినవి. జగత్తు అభివ్యక్తం కావడానికి తిరోహితం కావడానికి ఉభయ కార్యకారణములకు సాక్షి అయినవాడు. అవిద్ధదృక్కు అనగా అలుప్తదృష్టి గలవాడు అనగా అనన్య కారణమైనవాడు అని అర్థం. "**శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనో యద్వాచో హ వాచః స ఉ ప్రాణస్య ప్రాణః చక్షుషశ్చక్షురితి**" అని శ్రుతి. అతడు చక్షురాది సమస్తేంద్రియాలకు జగత్తుకు పరమకారణమైనవాడు. అవి అన్నియు అతని వలననే ఉత్పన్నమైనవి. అతని శక్తిని పొంది తమ తమ విధులకు సమర్థమైనవి. వీని నన్నిటిని ఎరిగినవాడు పరబ్రహ్మమగు పురుషోత్తముడు. వాని కన్నిటికి ప్రేరకుడు అని ఈశ్రుతి వాక్యమునకు అర్థము. అట్టి పరాత్పరుడు నన్ను రక్షించుగాక! అని గజేంద్రుడు శరణాగతి చేస్తున్నాడు.

గజేంద్రుడు చేస్తున్న శరణాగతి స్తోత్రమును బట్టి అతడు తన ప్రాణరక్షణను వేడటం లేదని మోక్షకాంక్షతో భగవంతుణ్ని ప్రార్థిస్తున్నాడని "**జిజీవిషే నాహ మిహ**" అను శ్లోకాన్ని బట్టి, "**మాదృక్ప్రపన్నపశుపాశవిమోక్షణాయ**" అను శ్లోకాలను బట్టి విశదమవుతున్నది.

**కం. లోకంబులు లోకేశులు - లోకస్థులు దెగిన తుది నలోకంబగు పెం**
**జీఁకటి కవ్వల నెవ్వం - డేకాకృతి వెలుఁగు నతని నే సేవింతున్**

టీ : లోకంబులు = పదునాలుగు భువనములు; లోక+ఈశులు = లోకములకు అధిపతులైనవారు, లోకస్థులు = లోకమునందుండిన చరాచరజీవులు; తెగిన =నశించిన; తుదివ్ = కడపట, యుగావసానమను ప్రళయకాలమున; అలోకంబు+ అగు = లోకములు లేనిదగు; పెను జీకటికి = గాఢాంధకారమునకు, అవ్వలన్ = అవతల; ఎవ్వండు, ఏక+ఆకృతిన్ = ఒకే ఆకారముతో, వెలుఁగున్ = ప్రకాశించునో, అతనిని, నే సేవింతున్ = నేను కొలుతును.

తా : లోకములును, లోకాధిపతులును, లోకులును నశించిన తరువాత, లోకమనునది లేనప్పుడు మహాంధకారానికి ఆవల ఏ పరమపురుషుడు ఏకాకృతితో ప్రకాశించునో అతనిని కొలుతును.

**"వేదాహమేతం పురుషం మహాన్త మాదిత్యవర్ణం తమసః పరస్తాత్"** అని శ్రుతి. ఆ మహామహనీయ పరమపురుషుణ్ని నేనెరుగుదును. ఆయన అవిద్యారూపమైన అంధకారానికి అవ్వల జగత్తుకు అతీతుడై సూర్యునివలె స్వయంప్రకాశ స్వరూపుడై ఉన్నాడు. ఆయన్ను తెలుసుకొన్న మనుష్యుడు మృత్యువును దాటి జననమరణ చక్రబంధం నుంచి తప్పుకోడానికి సమర్థుడవుతాడని శ్రుత్యర్థము. **"తమసః పరమో ధాతా శంఖచక్రగదాధరః, శ్రీవత్సవక్షా విత్య శ్రీరజయ్యః శాశ్వతో ధ్రువః"** అజ్ఞానాంధకారానికి అవ్వల స్వయం ప్రకాశంతో వెలిగేవాడు శంఖచక్ర గదాధరుడైన శ్రీమన్నారాయణుడే. అతడు శాశ్వతుడు - నిత్యుడును. ఈ పద్యంలో శ్రీమన్నారాయణానుచింతనం స్ఫురిస్తుంది.

శ్రీశుకదేవుడుగాని, పోతనగారు గాని గజేంద్రుని దివ్య జ్ఞానాన్ని బుద్ధియోగాన్నీ భావశబలతతో వర్ణిస్తున్నారే కాని, అతడింకా మొసలిచే పీడింపబడుతున్నాడని పాఠకులు భావింపరాదు. గజేంద్రుడు నిశ్చయబుద్ధితో భగవంతుణ్ణి శరణువేడినప్పుడే అతని కాలి బాధ తగ్గిపోయింది. అతడిప్పుడు మొసలిపట్టునుంచి విడిపించమని ప్రార్థించడం లేదు, తనకీ పశుజన్మను తప్పించమనీ, అంతేకాదు ముక్తి కలిగించమనీ ప్రార్థిస్తున్నాడు. **"స ఏవ కాలే భువనస్య గోప్తా విశ్వాధిపః సర్వభూతేషు గూఢః, యస్మిన్యుక్తా బ్రహ్మర్షయో దేవతాశ్చ తమేవం జ్ఞాత్వా మృత్యుపాశాం శ్ఛినత్తి"** అను శ్వేతాశ్వతరోపనిషద్వాక్యాన్ని ఇచట అనుసంధించుకోవలసి ఉంది. "భువనగోప్త, విశ్వాధిపుడు, సర్వభూత హృదయకుహర నిగూఢస్థితుడయిన వానియందు బ్రహ్మర్షులు, దేవతలు ధ్యానసంలగ్నులవుతారు. ఆ దేవదేవుడు తనను శరణు చొచ్చినవారల మృత్యుపాశాలను ఖండించి రక్షిస్తాడు" అని ఆ శ్రుతివాక్యానికి అర్థం.

**శ్లో. కాలేన పంచత్వమితేషు కృత్స్నశో - లోకేషు పాలేషు చ సర్వహేతుషు**
**తమ స్తదాసీ ద్గహనం గభీరం - యస్తస్య పారేఽభివిరాజతే విభుః**

తా : ప్రళయ సమయంలో లోకాలు, లోకపాలకులు వీరికందరికీ కారణమైన సమస్తమూ లయమైపోతుంది. ఆ సమయంలో కేవలం అత్యంత గభీరగహనాంధకార మొక్కటే మిగులుతుంది. ఆ సందర్భంలో ఈ లోకాలకన్నిటికీ సర్వధా పరుడై విరాజమానుడయ్యే ప్రభువు నన్ను రక్షించుగాక!

భగవంతుని సంకల్పం వల్ల ఈ జగత్తు ఒకప్పుడు దేహాదినామరూప విభాగంతో ప్రకాశితమవుతుంది, మరొకప్పుడు ఈ జగత్తు నామరూప విభాగాలను త్యజించి సూక్ష్మరూపంతో తిరోహితమవుతుంది. అనగా ప్రలీనమవుతుందని ఇంతకు ముందటి శ్లోకంలో కూడా చెప్పబడింది.

**కం. నర్తకుని భంగిఁ బెక్కగు మూర్తులతో నెవ్వఁడాడు మునులును దివిజుల్**
**కీర్తింపనేర రెవ్వని వర్తన మొరు లెఱుఁగ రట్టివాని నుతింతున్**

టీ : నర్తకుని భంగిన్= నటుని మాదిరిగా, పెక్కు+అగు మూర్తులతోన్ = అనేక ఆకారాలతో, (అనేక అవతారాలతో), ఎవ్వఁడు, ఆడున్ = నటించునో; ఎవ్వని వర్తనము = ఎవని నడవడి, మునులును, దివిజుల్ = (బ్రహ్మాది) దేవతలు; కీర్తింప నేరరు = కీర్తింప జాలరో; ఒరులు = సామాన్యులు; ఎఱుఁగరు = కొంచెమైనను తెలియరో, అట్టివానిన్ = అట్టి అవాఙ్మానసగోచరుడగు పరబ్రహ్మమును, నుతింతును.

తా : నటుని వలె ఎవడు అనేకరూపాలతో వర్తిస్తాడో, ఎవని ప్రవర్తనను మునీశ్వరులు, బ్రహ్మాది దేవతలు కీర్తింపజాలరో, సామాన్యులకు ఎవడు తెలియబడడో అట్టి భగవంతుణ్ని నుతిస్తాను.

**శ్లో. న యస్య దేవా ఋషయః పదం విదుః**
**జంతుః పునః కోఽ ర్హతి గన్తుమీరితుమ్**
**యథా నటస్యాకృతిభి ర్విచేష్టతో**
**దురత్యయానుక్రమణః స మావతు**

తా : ఎవని లీలా రహస్యాలు తెలుసుకోవడమే బహుకష్టమో, అతడు నటుని వలె అనేక వేషాలు ధరిస్తాడు. అతని వాస్తవిక రూపం ఎలాంటిదో దేవతలకుగాని మహర్షులకుగాని అంతుపట్టదు. అట్టివాని స్థానం చేరడానికి గాని, దానిని గూర్చి వర్ణించడానికి గాని ఏ జీవికి సాధ్యమవుతుంది? ఆ ప్రభువు నన్ను రక్షించుగాక!

గీతలో (10-18) **"దివ్యా హ్యాత్మవిభూతయః"** అని శ్రీకృష్ణముఖోక్తి ఉన్నది.

దివ్యమైన అంటే అచింత్యమైన నా విభూతులు అనేకమున్నాయి. అట్టి విభూతులను తెలుసుకోవడం చాలా కష్టం "**పరాస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞాన బలక్రియా చ**" (శ్వేతాశ్వతరోపనిషత్తు-8) "ఆ భగవంతుని జ్ఞానం, బలం, క్రియారూప - స్వరూపభూత దివ్యశక్తులు నానాప్రకారాలని వినబడుతున్నది" అని శ్రుతివాక్యం. నటుడు ఆశ్చర్యకరమైన నానా విధవేషాలు ధరించి తన కటాక్షాద్యంగ చేష్టలను ప్రదర్శించి ప్రేక్షకులను ముగ్ధుల్ని చేస్తాడు. ఆతని అనుకరణలు చాలా సహజమైనవిగా తోస్తాయి. అలాగే భగవంతుడు కూడా తన నిజస్థితిలో ఎట్టి వైషమ్యాలు కలగకుండగా, మూర్త్యంతరాన్ని పరిగ్రహిస్తాడు. సర్వాంశలలో ఇలా అనుకరించడం ఒక్క భగవంతునికే సాధ్యమవుతుంది. భగవంతుని మూర్త్యంతరాలలో, అనగా అవతారాలలో ఆయన తన నిజస్థితిని కోల్పోవ లేదు. వైషమ్యానికి తావివ్వలేదు. అందుచేత ఆ భగవంతుడు జగదేకనటుడని చెప్పవలసి ఉంది. అసురులను వంచించి అమృతకలశాన్ని హరించడానికి విష్ణువు మోహినీరూపం ధరించి కళ్లకు కాటుకకూడా పెట్టుకొన్నాడు. "**కృతారివంచనే దృష్టి ర్యేనాంజన మలీమసా, అచ్యుతాయ నమస్తస్మై పరమౌచిత్యకారిణే**" (ఔచిత్య విచార చర్చా.) విష్ణువు శ్రీరాముడుగా అవతరించి మానుషధర్మాన్ని బహుచాకచక్యంగా నటించి ప్రదర్శించాడు. భార్యావియోగంతో కన్నీరు కార్చడం కంటె గొప్ప నటన మేముంటుంది? దుష్టనిగ్రహసాధనభూత అయింది సీతాదేవి. నటుడు నాటకంలో ఎవరికీ తుదకు దర్శకునికి కూడా తన నిజరూపాన్ని చూపడు. అయితే స్నేహితులకు, దగ్గరివాళ్లకు తన స్వరూపాన్ని చూపుతాడు. అర్జునుడికీ, గజేంద్రుడికీ భగవంతుడు తన స్వరూపాన్ని చూపాడు.

శ్రీవిష్ణు దివ్యసహస్రనామాలలో భగవంతుని శరీరానికి సంబంధించిన ఒక నామమున్నది. "**అనిర్దేశ్యవపుః**" అని. భగవంతుడు షాడ్గుణ్యపూర్ణుడు కావడం వల్ల సమానం లేని శరీరం కలవాడు - లేదా ఇట్టిదని నిర్దేశింపజాలని శరీరం కలవాడు అని అర్థం. భగవంతుని శరీరం పంచభూతసంబంధం కలది కాదు. "**రూపవర్ణాది నిర్దేశ విశేషణ వివర్జితః**" రూపవర్ణాలకు నిర్దేశ విశేషణం లేనివాడని, అనగా సాటిలేనివాడని విష్ణుపురాణం పేర్కొన్నది. "**ఇదం తదితి నిర్దేష్టుం యన్న శక్యతే పరస్మైస్వసంవేద్యత్వా త్తదనిర్దేశ్యం వపు రస్యేతి అనిర్దేశ్యవపుః**" అని శ్రీశంకరభగవత్పాదులు అర్థం చెప్పారు. అనగా భగవంతుని శరీరం అజ్ఞేయమైనదగుటవల్ల అది ఇలాంటిది అని ఇతరులకు

నిర్దిష్టంగా చెప్పలేము. అందుచే ఆ భగవంతుడు అనిర్దేశ్యవపువని పేర్కొనబడినాడు. భగవచ్ఛరీరము అనిర్దేశ్యము. అది పాంచభౌతికము కాదు. కేవలము తేజోరూపము. తన మనుష్యశరీర విశేషాన్ని గూర్చి గీతలో శ్రీకృష్ణభగవానుడు ఇలా చెప్పాడు. (గీత 9-11) **"అవజానన్తి మాం మూఢా: మానుషీం తను మాశ్రితం, పరం భావ మజానంత: మమ భూత మహేశ్వరమ్"** సర్వలోకాధ్యక్షుడు, సర్వభూతాధివాసుడను వాసుదేవుడను అగు నేను జీవులను ఉద్ధరించడానికి మనుష్యశరీరంతో అవతరించాను. సంకుచితజ్ఞానులు, మూర్ఖులు నన్ను తమవంటి మనుష్యునిగా భావించి అవహేళన చేస్తుంటారు. నేను పరమకారుణికుడనై సర్వసమాశ్రయణీయతకు మనుష్య సజాతీయతతో ఆవిర్భవించానని ఆ మూర్ఖులు ఎరుగరు. నన్ను ప్రాకృతమనుష్యునిగా భావించి, ఆ పాపప్రభావంతో, సర్వపురుషార్థాలకు బాహ్యులై దుఃఖాల పాలవుతుంటారు. నన్ను నిందించి పతితులై భ్రష్టులై క్షుద్రులై అనేకానేకజన్మలెత్తుతుంటారు అని తాత్పర్యం. శ్రీకృష్ణునిది అప్రాకృత మనుష్యరూపము. ఆయన మనుష్యుల యెడ పరమకారుణ్యంతో నరాకృతిని స్వీకరించినవాడే కాని, నరుడు కాడు. "న భూత సంఘసంస్థానో దేహస్య పరమాత్మన: న తస్య ప్రాకృతీ మూర్తి: మాంసమేదోస్థిసంభవా" అని భగవంతుని దివ్య దేహం వర్ణితమయింది. ప్రకృతికి సంబంధించిన గుణాలు కాని, తత్కార్యాలుకాని లేనివాడాయన. ప్రకృతికి సంబంధించిన కర్మలు, వాటి ఫలితాలును లేనివాడాయన. అవ్యక్తశక్తి గల బ్రహ్మమును నిర్గుణమంటారు. వ్యక్తశక్తిగల బ్రహ్మమును సగుణమంటారు. సగుణబ్రహ్మములో ప్రాకృతిక గుణం ఎంతమాత్రమూ ఉండదు. ఆయనది "అనిర్దేశ్యవపువు" భూతమయమైనది కాదు. **"అస్యాపి దేవవపుషే మదనుగ్రహస్య స్వేచ్ఛామయస్య న తు భూతమయస్య కోఽపి"** (శ్రీమద్భా. 10-14-2) "ఓ స్వయం ప్రకాశుడవైన శ్రీకృష్ణా! నీ శ్రీవిగ్రహము భక్తజనుల లాలసాభిలాషలను సంపూర్ణముగా నెరవేర్చగలది. నీ చిన్మయేచ్ఛలు మూర్తిమంతమైన స్వరూపాన్ని నాయందు అనుగ్రహంతో సాక్షాత్కరింపజేశావు. నీ శరీరం పాంచభౌతికమైనదని ఎవరు చెప్పగలరు? ప్రభూ! నీ శరీరం అప్రాకృతశుద్ధ సత్వమయము" అని బ్రహ్మదేవుడు శ్రీకృష్ణుణ్ని స్తుతించాడు. ఆయన కూడా శ్రీకృష్ణుడు మానవ మాత్రుడే అనుకొన్నాడు. శ్రీకృష్ణానుగ్రహంతో తర్వాత యథార్థాన్ని గ్రహించాడు. శ్రీకృష్ణునిది పాంచభౌతికమైన శరీరమని పలికేవానిని చూస్తే చాలు, కలిగే పాపాన్ని పోగొట్టుకోడానికి సచేలస్నానం చేసి పరిశుద్ధం కావాలనీ, అట్టి

పాషండుల చేత శ్రౌతస్మార్తకర్మలు జరిపించుకోరాదనీ పురాణ శాస్త్రాలు చెబుతున్నాయి. **"యో వేత్తి భౌతికం దేహం కృష్ణస్య పరమాత్మనః, సుఖం తస్యావలోకేపి స చేలం స్నానమాచరేత్"** అని వరాహపురాణము, **"యో వేత్తి భౌతికం దేహం కృష్ణస్య పరమాత్మనః, స సర్వస్మాద్ బహిష్కార్యః శ్రౌతస్మార్త విధానతః"** అని స్కాందము కంఠోక్తిగా చెబుతున్నాయి. నటుడు కూడా అనిర్దేశ్యవపువే. అతనిచే నాటకమాడించే దర్శకునికి కూడా అతని అసలైన వర్ణమేదో రూపమేదో తెలియదు. అతడెప్పుడూ ఏదో ఒక వేషంతోనే ఉంటాడు. జగదేకనటుడైన భగవంతుడు ఆయా యుగాలకు తగిన శరీరాన్ని ధరిస్తాడు. అందుచేత అనిర్దేశ్యవపు వని పేర్కొన బడినాడని శ్రీపరాశరభట్టరు మరొక అర్థం చెప్పారు.

భగవంతుని నటాకృతిని, అనిర్దేశ్యవపువునుగూర్చి చెప్పేటప్పుడు మరొక విషయం కూడా ప్రస్తావింపదగినది ఉన్నది. యుధిష్ఠిరుని రాజసూయయాగంలో శిశుపాల శిరశ్ఛేదం జరిగింది. ఆతని తేజస్సు శ్రీకృష్ణునిలో ప్రవేశించడం సభాసదులందరు చూచారు. యాగం నిరభ్యంతరంగా పూర్తి అయింది. నారదుడు యుధిష్ఠిరునకు ప్రహ్లాదచరిత్ర చెప్పి "భగవంతుణ్ని దైత్యర్షి అయిన ప్రహ్లాదుడు దర్శించాడు"అని చెప్పాడు. అది విని యుధిష్ఠిరుడు ఆహా! ప్రహ్లాదుని భాగ్యం. సర్వేశ్వరుణ్ని సందర్శించాడు. మేము మందభాగ్యులము అని తన విషణ్ణతను వెల్లడించాడు. అప్పుడు నారదమహర్షి నవ్వి, మహారాజా! నీ భాగ్యమేమీ తక్కువదికాదు. అత్యంత ప్రశంసనీయమైనది నీభాగ్యం. నీ గృహంలో పరబ్రహ్మ మనుష్యరూపాన్ని ధరించి గుప్తరూపంతో నివసిస్తున్నాడు. లోకలోకాలను పవిత్రం చేసే ఋషీశ్వరులు, మునీశ్వరులు ఆ భగవంతుణ్ని దర్శించడానికే నీ యింటి చుట్టూ తిరుగుతున్నారు. ప్రహ్లాదునికి తన దర్శన మిచ్చాడే కాని, భగవంతుడు ఆతని యింటిలో నివసించలేదుకదా. నీ యింటిలో ఆయన నివసిస్తున్నాడు కాబట్టి అతనికంటె నీవే భాగ్యవంతుడవు అన్నాడు. **"యూయం నృలోకే బత భూరిభాగా, లోకం పునానా మునయోఽభియన్తి, యేషాం గృహానావసతీతి సాక్షాద్ గూఢం పరం బ్రహ్మ మనుష్యలింగమ్"** (శ్రీమద్భా. **7-10-48**) దృశ్య మాన మనుష్యులతో సమానంగా ఆ భగవంతుని కరచరణాదు లున్నవి. కానీ, ఆయన రూపాన్ని అనగా శ్రీవిగ్రహాన్ని యథార్థరూపాన్ని వర్ణించి చెప్పడానికి బ్రహ్మాదుల కైనను సాధ్యం కాదు. ఆయనిది అనిర్దేశ్యవపువు. దానిని ఎంతటివారును నిర్ణయించలేరు. ఈ సందర్భంలో వేదవ్యాసుడు చెప్పిన మూడు శ్లోకాలు

అత్యంతానందజనకమైనవి కాబట్టి సప్తమస్కంధ పరిసమాప్తిలో కూడా వీటిని పునరావృత్తి చేశాడు. అందులో మొదటి శ్లోకాన్ని బమ్మెర పోతన్నగారు ఎంత మధురంగా అనువదించారో చూడండి. **"జలజాత ప్రభవాదులున్ మనములోఁ జర్చించి భాషావళిన్ బలుకన్ లేని జనార్దనాహ్వాయ పరబ్రహ్మంబు నీ యింటిలోఁ జెలియై మేనమఱందియై సచివుడై చిత్తప్రియుండై మహాఫలసంధాయకుఁడై చరించుటది నీ భాగ్యంబు రాజోత్తమా!"** యుధిష్ఠిరుడు తన మేనమామ కుమారుడనుకొన్నాడే కాని, ఆ శ్రీకృష్ణుడు పరబ్రహ్మమని అంతకు ముందు తెలుసుకోలేదు. ఇప్పుడాతని ఆశ్చర్యానికి మేరలేదు. బ్రహ్మస్తుతిలో **"యన్మిత్రం పరమానందం పూర్ణం బ్రహ్మ సనాతనం"** అనీ, విష్ణుపురాణంలో **"యచ్చావతీర్ణం కృష్ణాఖ్యం పరం బ్రహ్మ నరాకృతిః"** అనీ, గోపాల తాపనీయశ్రుతిలో **"యోసౌ పరం బ్రహ్మ గోపాల"** అనీ శ్రీకృష్ణుని సర్వలోక సచరాచర గురుత్వాన్ని చాటుతున్నవి. నటవరుడైన శ్రీకృష్ణుని స్వరూపగుణ లీలలను గోపికలు స్మరిస్తున్నారు. నెమలి పింఛాన్ని శిరోభూషణంగా ధరించడం చేత శ్రీకృష్ణుడు నృత్యన్మయూరంలాగా భాసిస్తూ రసనిష్పన్నం చేస్తున్నాడు. నటవరుడు అంటే శ్రీకృష్ణుడే జగదేకనటుడు. గోపికల కళ్లకు నటాత్మకమైన వరుడు. నాట్యరసాన్ని, ప్రేమరసాన్ని పోషిస్తున్నవాడు. కాబట్టి శ్రీకృష్ణుడు నటుడును, వరుడును అయినాడు. **"రసో వై సః"** ఆయన రసస్వరూపుడని శ్రుతులు పేర్కొనే ఉన్నాయి. భగవంతుడు నటుడే. ఆయన బృందావనంలోనికి ప్రవేశించి గోపికలకు, గోపాలురకు నటవరుడయ్యాడు. **"బర్హాపీడం నటవరవపుః కర్ణయోః కర్ణికారం, బిభ్రద్ వాసః కనకకపిశం వైజయంతీం చ మాలాం, రంధ్రాన్ వేణో రధరసుధయా పూరయన్ గోపబృందైః, బృందారణ్యం స్వపదరమణం ప్రావిశద్ గీతకీర్తిః"** (శ్రీ మద్భా. 10-21-5). శ్రీకృష్ణుని చెవులపై కర్ణికార కుసుమాలున్నాయి. కర్ణికారం శృంగారోద్దీపకము. **'కనక కపిశం వాసో బిభ్రత్'** బంగారం వంటి పచ్చని పట్టువస్త్రం ప్రకాశిస్తున్నది. అనగా వ్యామోహక కనకతుల్యతను భజిస్తున్నది. అదే యోగమాయ. ఆయన మెడలో కీర్తిమయమైన వనమాల అనగా వైజయంతీమాల ప్రకాశిస్తున్నది. వైజయంతీమాల అంటే సర్వజయప్రకాశిక. నామలీలారూపమైన వేణునాదం చేస్తున్నాడు కృష్ణుడు. మధుర అనగా రాధ. శ్రీకృష్ణుడు మధురాధిపతి. రాధాధరసుధను గ్రోలడం చేత ఆయన రూపమంతా మధురమే. అధరం మరీ మధురం. లోభాత్మకమైన శ్రీకృష్ణమధురాధరం మీద సప్తరంధ్ర వేణువున్నది. దానినుండి శ్రోత్రపేయమైన మధురనాదం వినవస్తున్నది. సర్వజీవులను భగవదీయులను చేస్తున్నది. బ్రహ్మానందానుభవాన్ని మించిన మహానందాన్ని ప్రసాదిస్తున్నది. ఆ వేణువు ఆనందసార నాదబ్రహ్మమునకు

ఉత్పత్తిస్థానము. గోపికలు తమ కర్ణముల ద్వారా నాదబ్రహ్మాన్ని తమ హృదయంలోనికి ప్రవేశింపజేసుకోవడం చేత ఆ ఆనందము వారి సుందర వదనారవిందాలపై శోభిల్లినది. స్వభోగభోగ్యతను వెల్లడి చేస్తున్నది. ఆవిధంగా శ్రీకృష్ణుడు గోపబృందాలతో విచ్చేసి బృందారణ్యభూమిని స్వచరణారవిందాలతో రమణీయం చేస్తున్నట్లు గోపికలు స్మరిస్తున్నారు. **'స్మరణం స్మర మితి వ్యుత్పత్తి'**. స్మరణమే స్మరము. స్మరుడనగా మన్మథుడు కావున గోపికలకు శ్రీకృష్ణుడు నట - వరుడైనాడు. నటవరుని స్మరణంతో గోపికల హృదయాలలో మరుడు ప్రవేశించాడని సూచించడానికే శ్రీశుకదేవుడు ఆ శ్లోకానికి ముందటి శ్లోకంలో రెండుసార్లు స్మరశబ్దాన్ని ప్రయోగించాడు. **"స్మరంత్యః కృష్ణ చేష్టితం", "స్మర వేగేన విక్షిప్త మనసః"** (శ్రీ మద్భా. 10-2-4) అని. ఈ విధంగా నటవరుని స్మరించే గోపికల ప్రేమభక్తిని గూర్చి ఇక్కడొక విషయం చెప్పడం అప్రాసంగికం కాదు. ఆ గోపికల శ్రవణ యుగళంలో నీలోత్పలాలు, నయన యుగళంలో అంజనం, వక్షస్థలంలో ఇంద్రనీలమణిదామం, ఇంకా ఏమని వర్ణించాలి? బృందావన రమణీ బృందానికి సమస్త మండన స్వరూపం నందనందనుడే అయినాడు. **"శ్రవసోః కువలయ మక్ష్ణో రంజన మురసో మహేంద్రమణిదామ, బృందావన రమణీనాం మండన మఖిలం హరి ర్జయతి"** (కవి కర్ణపూరుని అలంకార కౌస్తుభం 8-77).

**ఆ.వె. ముక్త సంగులైన మునులు దిదృక్షులు - సర్వభూత హితులు సాధు చిత్తు**
**లసదృశవ్రతాఢ్యులై కొల్తు రెవ్వని - దివ్యపదము వాఁడు దిక్కు నాకు.**

టీ : ఎవ్వని దివ్యపదమున్ = ఎవని శ్రేష్ఠమైన పదమును; ముక్త సంగులైన మునులు = ప్రాపంచిక సాంగత్యాన్ని పరిత్యజించిన మునులు; దిదృక్షులు = భగవంతుణ్ణి దర్శింప గోరినవారు; సర్వభూత హితులు = సకలజీవులకు మేలుగోరు వారు; సాధుచిత్తులు = పుణ్యశీలురు; అసదృశ వ్రత+అఢ్యులై = సాటిలేని వ్రతాలను జరుపుటచే శ్రీమంతులై; కొల్తురు = సేవింతురో, వాఁడు = ఆ భగవంతుడు; నాకు దిక్కు = నాకు రక్షకుడు.

తా : సంసార బంధాలను త్యజించిన మునీశ్వరులు పరబ్రహ్మమును దర్శింపగోరినవారై, సమస్త జీవుల పట్ల సమబుద్ధి కలవారై, వ్రతనిష్ఠ గలవారై పుణ్యశీలురై ఎవనిని సేవిస్తారో ఆ భగవంతుడు నాకు రక్షకుడగుగాక.

**శ్లో. దిదృక్షవో యస్య పదం సుమంగళం**
**విముక్తసంగాః మునయః సుసాధవః**
**చరన్త్యలోకవ్రత మవ్రణం వనే**
**భూతాత్మ భూతాః సుహృదః స మే గతిః**

తా : ఎవని పరమ మంగళ స్వరూపమైన పదమును సందర్శించడానికి మహాత్ములు సంసారంలోని సకలాసక్తులను విడిచిపెట్టి, అడవులకు వెళ్లి ఇతరులకు అశక్యమైన, అఖండమైన ఉపవాసాత్మక బ్రహ్మచర్యాది వ్రతాలను చేసి, సర్వజీవహితులై ఉంటారో ఆ మునీశ్వర సహాయకుడు, పరమ దయాళువునగు భగవంతుడు నాకు లక్ష్యమైనవాడు అనగా పొందదగినవాడు. **"తమేవం విదిత్వాతి మృత్యుమేతి, నాన్యః పంథా విద్యతేయనాయ"** అని శ్రుతి. "పరబ్రహ్మమును తెలుసుకొన్నవారు మృత్యువును అతిక్రమిస్తారు. అనగా సంసార సముద్రాన్ని ఉల్లంఘింప గలుగుతారు. ఇందుకు పరబ్రహ్మను పొందడం కంటె వేరే మార్గం లేదు'' అని శ్రుతివాక్యానికి అర్థం. అందుచేత భక్తులు ఆ పరమపదంకోసం దిదృక్షువులై, అపారమైన సాధనచేసి తుదకు భగవత్సన్నిధానంలో సూరులు, నిత్యసూరులు, పార్షదులుగా చేరి సర్వేశ్వరుణ్ని నిరంతరం ఆరాధిస్తుంటారు. ముక్తసంగులైన మునులు, దిదృక్షువులు ఎలాంటివారో ఈశ్లోకం తెలుపుతున్నది. **"పదం పదం వైష్ణవ మామనంతి, యన్నేతి నేతీ త్యతదుత్సిసృక్షవః, విసృజ్య దౌరాత్మ్య మనన్య సౌహృదా, హృదోపగుహ్యార్హపదం పదే పదే"** (శ్రీ మద్భా. 2-2-18) పరమపదాన్ని కోరుకొన్న భక్తులు భగవంతుని పదాన్ని పదే పదే హృదయానికి హత్తుకొంటారన్న భావంగల చక్కని శ్లోకమిది. **"త ద్విష్ణోః పరమం పదగ్ సదా పశ్యంతి సూరయః"** అని శ్రుతివాక్యానికి తాత్పర్య మీ శ్లోకం. "యోగులు "ఇదికాదు ఇదికాదు'' అంటూ పరిశీలించి ఏ పరమాత్మకంటె భిన్నమైన పదార్థాలను పరిత్యజింప గోరుతారో, శరీరాన్నీ దానికి సంబంధించిన పదార్థాలలో ఆత్మబుద్ధినీ విడనాడి అనుక్షణమూ భగవంతుని పదారవిందాలను హృదయంతో ఆలింగనం చేసుకొంటూ, అనన్య ప్రేమతో పరిపూర్ణులై ఉంటారో, అదే శ్రీవిష్ణుభగవానుని పరమపదం. అదే వైకుంఠం. అదే పరంజ్యోతి. భగవద్ధామం. భగవంతుడు నిరాకారుడైతే ఆయన పాదాలను యోగులు ఆలింగనం చేసుకోవడం ఎలా సంభవం? జీవబ్రహ్మలు ఐక్యమవుతారన్నది దౌరాత్మ్య బుద్ధి అని వ్యాఖ్యానించాడు శ్రీవిశ్వనాథ చక్రవర్తి. వైకుంఠధామం ప్రాప్తించిన జీవులకు శ్రీవిష్ణువు పూజనీయుడైన స్వామి. ఆజీవులు సేవకులు. శ్రీవిష్ణురూపమందు మాయికబుద్ధిని చొనపడమే దౌరాత్మ్యం. అంటే నిర్బుద్ధిత్వమని అర్థం. బోపదేవుడీ శ్లోకాన్ని తన ముక్తాఫలవ్యాఖ్యలో వివరిస్తూ నిరాకారవాదులు ఎక్కడికి చేరుకొంటారు? అని ప్రశ్నించాడు. వైకుంఠధామం శ్రీవిష్ణుస్వరూపభూతమైన అధిష్ఠానము అని చెప్పినపుడు శ్రీవిష్ణుపదము నిర్విశేష

బ్రహ్మపదము ఎలా అవుతుంది? కాదు కాబట్టి విష్ణుపదమే వైకుంఠధామము. అది సవిశేష సాకారము అని సారాంశము. అనంతకోటి బ్రహ్మాండాధీశ్వరుడై కూడా శ్రీకృష్ణుడు వైకుంఠంలోను, గోలోకంలోను, గోకులంలోను తన యోగమాయా ప్రభావంతో సర్వదా లీలలు జరుపుతూనే ఉంటాడు.

ఈ సందర్భంలో ఛాందోగ్యోపనిషత్తులో (7-24-1) "**స భగవః కస్మిన్ ప్రతిష్ఠిత ఇతి. స్వే మహిమ్ని**" అని ప్రశ్నోత్తరాల మంత్రవాక్యమున్నది. "సర్వ వస్తువులకు ఆధారసాపేక్షత ఉన్నందువల్ల భగవంతుడు దేని మీద వసిస్తున్నాడు?" అనే ప్రశ్న ఉదయించింది. దానికి "భగవంతుడు స్వీయ మహిమమీద నివసిస్తున్నాడు" అని సమాధానం. అదే వైకుఠపదము. నృసింహపూర్వ తాపనీయోపనిషత్తు వైకుంఠం గురించి తెలుపుతూ ద్వాదశాక్షర మహామంత్రాధ్యాపకులకు అది పరమధామము, అక్కడ దుఃఖాలుండవు. అక్కడ సూర్యప్రకాశమూ వాయుప్రసారమూ ఉండవు. చంద్ర ప్రకాశంగానీ నక్షత్రప్రభగానీ ఉండదు. అందు ప్రవేశించే అధికారం మృత్యువుకు లేదు. అరిష్టాది షడ్దోషాలు అక్కడ ఉండవు. అది మంగళాలయము. ఆనంద నిలయము. శాశ్వతము. శాంతము. బ్రహ్మాదిసకలదేవతావందితము. యోగీశ్వరగణధ్యేయము. ఋగాది మంత్రోక్తము. అపునరావృత్తి రూపము. శ్రీ విష్ణుపరంధామము. అక్కడికి చేరిన యోగులు మరల తిరిగిరారు. "**యం ప్రాప్య న నివర్తంతే తద్ధామ పరమం మమ**" అని శ్రీకృష్ణభగవానుడు గీతలో (8-21) తెలిపాడు. ఆ శ్రీముఖోక్తికి భగవద్రామానుజాలు "**అచిత్సంసర్గవియుక్తం స్వరూపేణావస్థితం ముక్తస్వరూపం పరమం నియమనస్థానం. తచ్చ అపునరావృత్తిరూపం**" అని భాష్యం చెప్పారు. అనగా ప్రకృతిసంసర్గం వీడి, స్వస్వరూపావస్థితమైన ముక్తస్వరూపం నా యొక్క నియమన స్థానము. అది అపునరావృత్తి రూపము. ఆవాగమన రహితము. "**యద్ గత్వా న నివర్తంతే తద్ ధామ పరమం మమ**" (గీత 15-6) "ముక్తసంగులైన పురుషులు దేనిని ప్రాప్తింపజేసుకొని తిరిగిరావడానికి ఇష్టపడరో ఆ పరమధామము - ఆ పరంజ్యోతి నాదే. అనగా అది నా విభూతిరూపము, నా అంశయే" అన్నాడు శ్రీకృష్ణ భగవానుడు. "**తతః పదం తత్పరిమార్గితవ్యం**" (గీత 15-4) "ఏ చోటికి వెళ్లి మరల తిరిగి రానవసరం లేదో ఆ పరమపదము జీవులకు అన్వేషణీయము" అని పరమదయాళువై లోకానికి తెలిపాడు శ్రీ కృష్ణభగవానుడు. అజ్ఞానాన్ని తొలగించుకోవడమే సమస్త పురుషార్థాలకు సాధనమవుతుంది. ముముక్షువుల ప్రవృత్తి శరణాగతియే. అది చాల పురాతనమైనది.

ఎందరో ముముక్షువులు శరణాగతి ద్వారా సంసారవృక్షాన్ని ఛేదించి అజ్ఞానాన్ని తొలగించుకొని బంధవిముక్తులై తన ధామానికి వచ్చారన్న విషయాన్ని గుర్తుకు తెచ్చాడు. శ్రీకృష్ణభగవానుడు. **"బహవో జ్ఞానతపసా పూతా మద్భావ మాగతాః"** (గీత 4-10) "నా జన్మకర్మతత్త్వ జ్ఞానమును పొందడమే ఒక తపస్సు. అట్టి తపస్సుచే పవిత్రులైనవారు నన్ను పొందుతారు'' అనునది శ్రీ కృష్ణముఖోక్తియే.

**సీ. భవము దోషంబు రూపంబు కర్మంబు నాహ్వాయమును గుణము లెవ్వనికి లేక**
**జగములఁ గలిగించు సమయించు కొఱకునై నిజమాయ నెవ్వఁ డన్నియును దాల్చు**
**నా పరేశునకు ననంతశక్తికి బ్రహ్మ కిద్ధరూపికి రూపహీనునకును**
**జిత్రచారునికి సాక్షికి నాత్మరుచికిని బరమాత్మునకుఁ బరబ్రహ్మమునకు**

**మాటల నెఱుకల మనములఁ జేరంగఁ గాని శుచికి సత్త్వగమ్యుఁ డగుచు**
**నిపుణులైనవారి నిష్కర్మతకు మెచ్చువానికే నొనర్తు వందనములు.**

టీ : ఎవనికిన్ = ఏ భగవంతునికి; భవము = పుట్టుకగాని, దోషంబు = పుట్టినందున కలుగు దోషముగాని; రూపంబు = ఆకృతిగాని, కర్మంబు = జన్మవల్లకలిగిన కర్మగానీ, ఆహ్వాయమును = పేరుగానీ, గుణములు = ప్రాకృత గుణములుగానీ, లేకయుండి, ఎవడు, జగములను కలిగించు = పుట్టించుటకును, సమయించు కొఱకును = నశింపజేయుట కొరకును, నిజమాయన్ = తన స్వాభావికశక్తిచే, ఇన్నియును = పుట్టుక మొదలైనవి అన్నియును; తాల్చున్ = ధరించునో, ఆ పరేశునకున్ = ఆ పరాశక్తిమంతునికి; అనంతశక్తికి = అంతులేని శక్తిగలవానికి; బ్రహ్మకు = బ్రహ్మమునకు, ఇద్ధరూపికి = సమృద్ధమైన రూపముగలవానికి; రూపహీనునకు = ప్రాకృత రూపము లేనివానికి, చిత్రచారునకున్ = విచిత్రమైన సంచారము గలవానికి, సాక్షికిన్ = లోకులను చూచువానికి; ఆత్మరుచికి = ఆత్మరుచికలవానికి, పరమాత్మునకు; పరబ్రహ్మమునకు, మాటలను = వాక్కుల చేతను; ఎఱుకలన్ = జ్ఞానముల చేతను; మనములన్ = మనస్సుల చేతను; చేరంగరాని = సమీపింప వీలులేని; శుచికిన్ = పరిశుద్ధునకు; సత్త్వగమ్యుడగుచు = సత్త్వగుణము గలవారికి చేరదగిన వాడగుచు; నిపుణులైనవారి = నేర్పరులైన వారియొక్క; నిష్కర్మతకున్ = ఫలాపేక్షలేని, కర్మలకు = పనులకు; మెచ్చువానికి ఆ దేవదేవునికి, ఏన్ = నేను; వందనములు; ఒనర్తున్ = చేయుదును.

తా: ఎవడు జన్మకర్మములు, వాటికి సంబంధించిన దోషాలు లేనివాడో, సృష్టి - స్థితి - ప్రళయాలకై తనకు లేనివన్నిటినీ స్వీకరిస్తాడో, అట్టి పరబ్రహ్మమునకు, గుణాతీతునకు, బహునామరూపములు గలవానికి, అవాఙ్మానసగోచరునికి, సత్త్వగుణులను, నిష్కామకర్ములను మెచ్చుకొనువానికి వంద న మాచరిస్తున్నాను.

శ్లో. న విద్యతే యస్య చ జన్మ కర్మ వా న నామరూపే గుణదోష ఏవ వా
తథాపి లోకాప్యయసంభవాయ యః స్వమాయయా తాన్యనుకాల మృచ్ఛతి

తా : ఆయనకు జన్మకర్మలుగాని, నామరూపాలు కాని, లేనప్పుడు వానికి సంబంధించిన గుణదోషాల కల్పన ఎలా ఉంటుంది? కాని, ఆయన విశ్వసృష్టి సంహారాలు జరిపేందుకు ప్రతి సమయంలోను తన మాయాశక్తితో జన్మకర్మాదుల నన్నిటిని స్వీకరిస్తుంటాడు.

భగవద్రూపాదులు అప్రాకృతములు. అస్మితాది శరీరాభిమానులకు ప్రాకృత వస్తువులే దృష్టిగోచరం కానప్పుడు, భగవంతుని యందలి ప్రాకృతత్వాన్ని నిషేధించి అప్రాకృతత్వాన్ని తెలుసుకోవడం మహా కష్టమవుతుంది. జన్మకర్మలు, నామరూపాలు గుణదోషాదులు లేనివాడు ఈ జగత్తును సృష్టించడానికి, పోషించడానికి, సంహరించడానికి స్వీయయోగమాయాశక్తితో నియతమైన సందర్భాలలో పైన పేర్కొన్న జన్మకర్మాదులన్నిటిని స్వీకరిస్తాడని తాత్పర్యం. భగవంతునికి జన్మకర్మాదులు లేవు. నిజమే. జన్మమంటే ఏమిటో తెలుసుకోవడం అవసరం. ఒక వస్తువు భావాంతరప్రాప్తికి వికారమని పేరు. పాల వికారం పెరుగు, వికృతి నొందిన పెరుగులో పాల తత్త్వమున్నప్పటికి దానిని పెరుగు అంటారేకాని, పాలు అనరు. అలాగే జీవుని ప్రథమవికారం జన్మ. అనాదిగా బహిర్ముఖుడైన జీవుడు తన పూర్వకృతకర్మచేత బద్ధుడై దేవాది దేహాంతరాన్ని ఆశ్రయించి, తద్దేహాభిమానంతో, ఆత్మవిస్మృతిని పొందుతాడు. అది ఆ జీవికి జన్మ అవుతుంది. అపరిపూర్ణుడైన వ్యక్తి తనకు అభావమైన ఆకాంక్షల పూర్తికోసం చేసే పనులను కర్మ అంటారు. మనోగ్రాహ్య వస్తువులను వ్యవహారార్థం సంకేతించే శబ్దాన్ని 'నామం' అంటారు. చక్షుర్గ్రాహ్యగుణవిశేషాన్ని రూపమంటారు. సత్త్వాదిప్రాకృతగుణనిదానాన్ని, లేదా ఆశ్రయభూతద్రవ్యంయొక్క ఉత్కర్ష విధాయకమైన ధర్మవిశేషాన్ని గుణ మంటారు.

సర్వదా స్వస్వరూపత్వంతో, పూర్ణత్వంతో, మనస్సుకు కూడా అగోచరత్వంతో, స్వప్రకాశత్వంతో, ప్రకృతికి అతీతంగా విరాజిల్లే భగవంతునికి పైన పేర్కొన్న ప్రాకృతజన్మకర్మనామాదులు ఉండకపోయినప్పటికీ తన మాయాశక్తితో ఈ జగత్తులో తన జన్మాదులను ప్రకటించే ఆ భగవంతునికి నమస్కారమని శ్లోకతాత్పర్యము. వేదాలు భగవంతుణ్ని నిష్కలుడు, నిష్క్రియుడు, శాంతుడు, అశబ్దుడు, అస్పర్శుడు; అరూపుడు, అవ్యయుడు ఇత్యాది నిషిద్ధ వాక్యాలతో

వర్ణించినప్పటికి, మరొక శ్రుతి వాక్యం ఆ భగవంతుణ్ణి సర్వకర్ముడు, సర్వకాముడు, సర్వగంధుడు; సర్వరసుడు ఇత్యాదిగా పేర్కొన్నది. **"నిష్కలం నిష్క్రియం శాంతం నిరవద్యం నిరంజనం,** (శ్వేతాశ్వతరోపనిషత్తు) **"అశబ్దమస్పర్శ మరూప మవ్యయం యథారసం నిత్య మగంధవచ్చ యత్"** (కఠోపనిషత్తు) ఈ రెండు ఉపనిషత్తులు ఇలా వర్ణింపగా ఛాందోగ్యోపనిషత్తు ఆ పురుషుడు **"మనోమయః ప్రాణశరీరో భారూపః సత్యసంకల్ప ఆకాశాత్మా సర్వకర్మా సర్వకామః సర్వగంధః సర్వరసః సర్వమిద మభ్యాత్తో ఽవాక్యనాదరః"** అని వర్ణిస్తున్నది. ఆ భగవంతుడు మనోమయుడు అనగా పరిశుద్ధ మనోమాత్ర గ్రాహ్యుడు; వివేకాదిసాధనసప్తకాన్ని పరిగ్రహించి పరిశుద్ధ మనస్కు డైనవానికే ఆయన గ్రాహ్యమవుతాడని అర్థం. ప్రాణశరీరుడు అనగా జగత్తులోని సమస్త ప్రాణులకు ధారకుడని అర్థం. భారూపుడనగా భాస్వర రూపుడు. **"ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్" "పశ్యతో రూప మవర్ణం"** ఇత్యాది శ్రుతివాక్యాలు భగవంతుడు "అప్రాకృత - అసాధారణ - నిరతిశయ కల్యాణ గుణ గణ నిరతిశయ దీప్తి యుక్త విగ్రహశాలి" అని బోధిస్తున్నాయి. సత్య సంకల్పుడనగా అప్రతిహత సంకల్పుడని అర్థం. ఆకాశాత్ముడనగా స్వయంప్రకాశుడే కాకుండా అన్య వస్తువులను కూడా ప్రకాశింపజేసేవాడని అర్థం. సర్వజగత్తు ఎవని కర్మ మవుతుందో అతడు సర్వకర్ముడు. జగత్తులోని సర్వకర్మలు ఎవనికి ఆరాధనలవుతాయో అతడు సర్వకర్ముడని తాత్పర్యం. పరిశుద్ధమైన భోగ్య భోగోపకరణాదులు గలవాడు సర్వకాముడని అర్థం. **"సర్వగంధః - సర్వరసః"** అనే విశేషణాలు అతడు **"అశబ్ద మస్పర్శం"** ఇత్యాది ప్రాకృతగంధ రసాదులను నిషేధిస్తున్నవి. అవి అప్రాకృతములు, అసాధారణములు, నిరవద్యములు, నిరతిశయములు, కళ్యాణమయములు, స్వభోగ్యభూతములు, సర్వవిధాలయిన గంధరసములుగలవాడని అర్థం. ఇటువంటి సమస్త కళ్యాణ గుణములు స్వీకరించినవాడు భగవంతుడు. "సర్వమిద మభ్యాత్తః".

**"గుణదోష ఏవ వా"** గుణాలు లేవు దోషాలును లేవు. ప్రాకృతగుణాలలో పరమార్థత లేనందున అవి దోషరూపాలవుతాయి. ఇక దోషాలనేవి ఆ భగవంతునిలో పూర్తిగా అసంభవాలు. **"ఏష ఆత్మాఽ పహతపాప్మా విజరో విమృత్యు ర్విశోకో విజిఘ త్సో ఽపిపాసః సత్యకామః సత్యసంకల్పః"** అని ఛాందోగ్యోపనిషద్వాక్యానికి శ్రీరంగరామానుజముని **"కళ్యాణభూత కళ్యాణగుణ విశిష్టత్వం తస్యాత్మత్వంచ ఏష ఆత్మాపహత పాప్మే త్యాదినా సత్యసంకల్ప ఇత్యనేన ప్రపఞ్చీకృత్య"** అని వ్యాఖ్యానించారు. అనగా పాపజరామరణ శోక

బుభుక్షా పిపాసా రహితుడైనవాడు, సత్యకాముడు, సత్యసంకల్పుడు అని అర్థం. **"ఏష సంయద్వామ ఇత్యాచక్షతే"** సర్వకళ్యాణ గుణాశ్రయత్వం, సత్యసంకల్పత్వమే సంయద్వామత్వమని, స్వాశ్రితులకు శోభ కలిగించడమే వామనీత్వమనీ, సర్వలోక వ్యాప్త దీప్తిమద్విగ్రహ యుక్తత్వమే భామినీత్వమనీ, సంయద్వామత్వ - వామనీత్వ - భామినీత్వాదులు భగవంతుని లక్షణాలనీ ఛాందోగ్యోపనిషత్తు స్పష్టంగా వెల్లడిస్తున్నది.

**"అమకాలం ఋచ్ఛతి"** అనడంలో భగవంతుని జన్మాది లీలలు నిత్యము జరుగుతుంటాయని అర్థము. "ప్రాప్నోతి" ఒకానొకప్పుడు పొందుతుంటాడని కాకుండా ఎల్లప్పుడు భగవంతుడు తన యోగమాయతో అనగా చిచ్ఛక్తితో లేదా తన స్వరూపశక్తితో ప్రకాశమాను డవుతుంటాడని తాత్పర్యము. భగవంతుని యందు ఆకృతులు అనంతములు. ప్రకాశములు అనంతములు. జన్మ కర్మ లక్షణ లీలలు అనంతములు. అనంత ప్రపంచమునందు వైకుంఠ గతములైన ఆయా స్థానములు కూడా అనంతములు. భగవల్లీలా రసమునకు ఆలంబనభూతములైన, పరికర బృందాదులైన శేష గరుడ విష్వక్సేన గోపికా ప్రభృతులు నిత్యులు. భగవంతుడెవరితో కలిసి లీలలు జరుపుతుంటాడో వారందరు ఆయన పార్షదులే. అనుకూల పార్షదులు, ప్రతికూల పార్షదులు అను రెండు తెరగులవారు భగవంతుని లీలా సహాయకులవుతారు. కాబట్టి భగవల్లీల సమాప్తమయిన దనుకోవడం దోషమూ అపరాధమూ అవుతుంది. భగవంతునికీ ఆయన పరికర పరిజనులకూ విచ్ఛేద మెన్నటికి జరుగనేరదు. జన్మకర్మాది లీలలు భగవంతుని యందు నిత్యములు. అథర్వవేదం పిప్పలాది శాఖలో **"ఏకో దేవో నిత్యలీలానురక్తో భక్తవ్యాపీ భక్తహృద్యంతరాత్మా"**, "నిత్యుడు, లీలానురక్తుడు, భక్తవ్యాపియైన భగవంతుడు భక్తగణాల హృదయంలో అంతరాత్మ రూపంతో సాక్షాత్తు విరాజమాను డవుతుంటాడు" అని చెప్పింది. అంతేకాదు, వేదం **"అజాయమానో బహుధా విజాయతే"** (ముద్గల శ్రుతి) "భగవంతుడు అజాయమానుడైనప్పటికి బహువిధాలుగా జన్మగ్రహణం చేస్తాడు" అని సుస్పష్టం చేసింది. భగవంతుని జన్మ ప్రాకృతజన్మవంటిది కాదు. అది విలక్షణమైనది, స్థిరమైనది, దివ్యమైనది. దానిని జన్మ అనడం కంటె ఆవిర్భావం అనడం సముచితము. భగవంతుని ఆవిర్భావమనగా ప్రాకృత జన్మము కానేరదు. అలాగే అంతర్ధాన మనగా చనిపోవుటగా భావింపరాదు. శ్రీనృసింహావతారసమయంలో

"భగవంతుడు తన భృత్యులైన ప్రహ్లాద బ్రహ్మ సనకసనందనాదుల వాక్కులను సత్యం చేయడానికి, అఖిలభూతాలలోను తన వ్యాప్తిని దర్శింపజేయడానికి సభామండప స్తంభంలో అత్యద్భుత శ్రీనరసింహమూర్తి ధారణచేసి ఆవిర్భవించాడు''. **"సత్యం విధాతుం నిజభృత్య భాషితం, వ్యాప్తించ భూతేష్వఖిలేషు చాత్మనః** (శ్రీ మద్భా.7-8-17) **"దేవక్యాం దేవరూపిణ్యాం విష్ణుః సర్వగుహాశయః, ఆవిరాసీద్యథా ప్రాచ్యాం దిశీందురివ పుష్కలః"** (శ్రీమద్భా.10-3-8) "దేవరూపిణి అయిన దేవకి నుండి సర్వగుహాశయుడైన విష్ణువు తూర్పు దిక్కునుండి ఉదితుడైన పూర్ణచంద్రుని వలె ఆవిర్భవించాడు''. ఈ ఉపమానంవల్ల పైన పేర్కొన్న విషయం సంపూర్ణంగా సమర్థిత మయింది. తనవంశంలో సర్వేశ్వరుడు ఉదయిస్తున్నాడని అష్టమీ చంద్రుడు సంతోషంతో పుష్కలుడు కావడం సుసంగతమైన విశేషం.

ఇక భగవంతుని కర్మయందలి వైలక్షణ్యం ఏమంటే, అది కేవలం ఆ భగవంతుని స్వరూపభూతమైన ఆనందశక్తికి సంబంధించిన విలాసం మాత్రమే అని భావించాలి. **"లోకవత్ తు లీలాకైవల్యమ్"** అని బ్రహ్మసూత్రం. (2-1-32) లోకంలో మహారాజాదులు పరిపూర్ణకాములై నప్పటికి వారియందు క్రీడాప్రవృత్తి కనిపిస్తుంది. సుఖోన్మత్తులు, సుఖోద్రేకులు ఫలనిరపేక్షంగా నర్తిస్తారు. అలాగే ఈశ్వరుడు కూడా ఏదో ప్రయోజనాన్ని ఉద్దేశించి కార్యప్రవృత్తుడు కాడు. కేవలం అది లీలయే. నారాయణ సంహితకూడా **"సృష్ట్యాదికం హరిర్నైవ ప్రయోజన మపేక్ష్యతు కురుతే కేవలానందమాయామత్తస్య నర్తనం"** అని చెప్పింది. ఈ విచిత్ర విశ్వాన్ని సృష్టించడంలో ఈశ్వరుడు ఏ ప్రయోజనాన్నీ లక్షించలేదు. మత్తుని నర్తనం వలె కేవలం ఆనంద స్వభావానికి లోబడి ఈ విశ్వాన్ని సృష్టించాడు అని. **"పూర్ణానందస్య యస్యేహ ప్రయోజనమతిః కుతః?ముక్తా అప్యాప్తకామాః స్యుః కి ముతాస్యాఖిలాత్మనః"** "పరిపూర్ణానంద స్వరూపుడైన భగవంతుడు అపేక్షించే ప్రయోజన విశేషం ఏమి టుంటుంది? ముక్తుడైన వ్యక్తియే ఆప్తకాము డౌతున్నప్పుడు ఇక భగవంతుని విషయంలో చెప్పేది ఏముంటుంది? **"జన్మ కర్మ చ మే దివ్య మేవం యో వేత్తి తత్త్వతః, త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మామేతి సోఽర్జున"** అని శ్రీకృష్ణ భగవదుక్తి (గీత 4-9)అర్జునా! ప్రకృతి త్రిగుణాత్మకమైనది. దానితోడి సంసర్గంవల్లనే జీవులకు జన్మ ఏర్పడుతుంది. నా జన్మ ప్రకృతికి సంబంధించినది కాదు. నేను సర్వజ్ఞత్వం, సర్వేశ్వరత్వం, సర్వసంకల్పత్వం మొదలైన సమస్త కళ్యాణ గుణాలతో కూడినవాడను. ఇటువంటి నేను స్వీకరించిన జన్మాలకు, నా చేష్టితాలకు సాధువులను రక్షించడం,

వారు నన్నాశ్రయించడమే పరమ ప్రయోజనాలు. నా జన్మకర్మలు అప్రాకృతాలు -అసాధారణాలు. నా జన్మ కర్మలు ఇలాంటివి అని యథార్థమును ఎరిగినవాడు పునర్జన్మమును పొందడు. అతడు నన్నే పొందుతాడు. అనగా దివ్యములైన నా జన్మకర్మలలోని యాథాత్మ్య జ్ఞానం చేత నన్నాశ్రయించడానికి విరోధించే పాపాల నన్నిటినీ ఈ జన్మలోనే పోగొట్టుకొని, మన్మనస్కుడై, మద్యాజియై, మద్భక్తుడై నన్నే పొందుతాడని శ్రీభగవానుడన్నాడు. దీనిని బట్టి భగవదవతార రహస్య వాస్తవ జ్ఞానం కూడా పరమపురుషార్థరూపమైన మోక్షానికి ఉపాయమవుతుందని స్పష్టమవుతున్నది. శ్రీకృష్ణావిర్భావం అత్యంత రహస్యమైనది. బుధవారం అష్టమీ తిథి నిశీథి యందు శ్రీ విష్ణురూపంతో, సచ్చిదానంద స్వరూపంతో దేవకీ యశోదల అసంపూర్ణ గర్భకాలంలో రెండు చోట్ల ఆవిర్భవించాడు శ్రీకృష్ణుడు. **"గర్భ కాలే త్వసంపూర్ణే హ్యష్టమే మాసి తే స్త్రియౌ, దేవకీ చ యశోదా చ సుషువాతే సమం తదా"** (హరివంశం). భగవంతుని సృష్టిలో వైషమ్యమూ లేదు.నైర్ఘృణ్యమూ ఉండదు. వాస్తవానికి ఆ భగవంతునికి ఏ ప్రయోజనమూ లేదు. ఈ జగత్తులో పుణ్యం చేసుకొన్నవారు పుణ్యాత్ములు, పాపం చేసుకొన్నవారు పాపులు **"సాధుకారీ సాధుర్భవతి పాపకారీ పాపో భవతి"** అయినారు. ప్రాచీన కర్మ శక్తి వలననే ఈ జగత్తులోని జీవులలో ఈ వైషమ్యం - నైర్ఘృణ్యం ఏర్పడింది. స్వశక్తి చేత స్వకర్మముచేత దేవాది వస్తుతా ప్రాప్తి లేదా అసద్గతి కలుగుతాయి. కాళియమర్దన సందర్భంలో నాగపత్నులు శ్రీ కృష్ణుణ్ణి **"అవ్యాకృతవిహారాయ సర్వవ్యాకృతిసిద్ధయే, హృషీకేశ నమస్తేస్తు మునయే మౌనశాలినే"** అని ప్రస్తుతించారు. 'అవ్యాకృతం' అంటే అప్రతర్క్యమని అర్థం. కృష్ణా! నీ సృష్ట్యాది విహారం వ్యాకరించడానికి అశక్యం. లోకంలో కారణం లేనిదే కార్యం జరగడం అసంభవం. **"కారణం వినా మందోపి న ప్రవర్తతే"** అనే ఆర్యోక్తి ఉన్నది. భగవంతుని లీలలు అప్రతర్క్యమైనవి అయినప్పటికీ ఆత్మారాములైన శ్రీశుకాదులు సైతం వినడానికి సానురాగులవుతారు. **"ఏవం జన్మాని కర్మాణి హ్యకర్తు రజనస్య చ వర్ణయంతి స్మ కవయో వేదగుహ్యాని హృత్పతేః"** (శ్రీమద్భా. 1-3-35) జన్మకర్మలు లేని భగవంతుని అప్రాకృత జన్మ కర్మలను గూర్చి తత్త్వజ్ఞానులైన పండితులు వర్ణిస్తుంటారు. ఆయన జన్మకర్మలు వేదాలలో అత్యంత గోపనీయ రహస్యములై ఉన్నాయి. **"కో వేత్తి భూమన్ భగవన్ పరాత్మన్, యోగేశ్వరోతీ ర్భవత స్త్రిలోక్యామ్, క్వ వా కథం వా కతి వా కదేతి, విస్తారయన్ క్రీడసి యోగమాయామ్"** (శ్రీమద్భా. 10-14-21) భగవంతుని

సకలలీలలు దుర్జ్ఞేయములు. భగవంతుడు భూమ - బ్రహ్మ - వ్యాపకుడు - అపరిచ్ఛిన్నుడు. కాబట్టి ఆయన లీలలకు కారణాలు ఏవో ఎవరికి తెలుసు? తెలుసుకోగలిగేవారు ముల్లోకాలలోను లేరు. ఏ ఏ లోకాలలో ఎక్కడెక్కడ ఎప్పుడెప్పుడు ఆయన ఎన్నెన్ని లీలలు జరుపుతున్నాడో ఎవరికి తెలుసు? ఆయన యోగమాయా వైభవం అచింత్యప్రభావం కలది. మనుష్యులు భగవంతుని లీలాతత్త్వాన్ని తెలుసుకోవడానికి ప్రయత్నించడం కన్నా ఆయన లీలా కథలను గానంచేయడం, శ్రవణం చేయడమే శ్రేయస్కరము. భగవంతుని కర్మలు అత్యద్భుతాలు, అత్యంత చమత్కారమయములు. **"గోవర్ధనోద్ధరణహృష్టసమస్తగోప, నానాస్తుతిశ్రవణలజ్జితమానసస్య, స్మృత్వా వరాహవపురిందుకళాప్రకాశ, దంష్ట్రోద్ధృతక్షితి హరే రవతు స్మితం వః"** ఒక చేతితో గోవర్ధన భూధరాన్ని ఎత్తగానే గోపకులు ఆశ్చర్యంతో చేసిన ప్రశంసలకు శ్రీకృష్ణుడు సిగ్గుపడ్డాడట! ఆయన కపుడు తాను వరాహరూపంతో భూమండలాన్ని ఒక దంష్ట్ర మీద నిలిపిన విషయం గుర్తుకు వచ్చి అది వీరెరుగరని నవ్వుకొన్నాడట! మనం వాటిని చూచి, విని భ్రాంతి చెందుతాము. వాటి పరిణామాలను చూచి సుఖసంతోషాలను పొందుతాము. వాటిలోని చమత్కారమే అది. నిజానికి భగవంతుని విషయం భగవంతునికే తెలుస్తుంది. ప్రాకృత మానవమాత్రులకెలా తెలుస్తుంది? ఈ లోకంలో సంసారంలో పడి దుఃఖాన్ని పొంది భగవంతుణ్ని నిందిస్తాము. భగవంతుడిచ్చిన ఆ దుఃఖం కూడా ఒక మహాసుఖానికి పూర్వభూమిక అవుతుందేమో! మనం తెలుసుకోలేము.

భగవత్స్వరూప జ్ఞానం మనం పొందితే మనకు భగవద్దర్శనమైనట్లే. అవిద్య తొలగి, దేహాత్మజ్ఞానం కలిగి భగవద్విగ్రహంలోని అప్రాకృతత్వాన్ని గ్రహిస్తాము. ఆత్మారాముల మవుతాము. అనగా భగవంతుని జన్మకర్మాదులు, ఆయన లీలలు అనుభవానికి వస్తాయి. **"భక్తి రేవైనం నయతి, భక్తి రేవైనం దర్శయతి"** అను మాఠరశ్రుత్యనుసారంగా భక్తియే జీవుణ్ని భగవత్సమీపానికి చేరుస్తుంది. భక్తియే జీవునికి భగవద్దర్శనం కలిగిస్తుంది. ప్రాకృతజనులు శాస్త్రజ్ఞానంతో భగవంతుని జన్మకర్మలనుగూర్చి తెలుసుకోవడం సాధ్యంకాదు. అక్రూరుడు శ్రీకృష్ణుణ్ని దర్శిస్తూనే **"త్వయోదితోయం జగతో హితాయ, యదా యదా వేదపథః పురాణః, బాధ్యేత పాఖండపథై రసద్భిః తదా భవాన్ సత్త్వగుణం బిభర్తి"** (శ్రీమద్భా. 10-48-23) "స్వామీ! నీవు లోకకళ్యాణానికి ఈ సనాతనవేదమార్గాన్ని ప్రకటించావు. పాఖండపథంలో సంచరించే

దుష్టుల వల్ల వేదధర్మానికి గ్లాని కలిగినప్పుడెల్ల నీవు శుద్ధసత్వమయ దేహాన్ని స్వీకరిస్తుంటావు". ఈ శ్లోకానికి వ్యాఖ్య వ్రాస్తూ శ్రీధరస్వామి భగవంతుని అవతారం శుక్తియందలి రజతజ్ఞానంతో సమమైన అవిద్యాకల్పితం కాదు కాదుసుమా! **"వమ తర్హి మమావతారా స్తచ్చరిత్రాణి చ శుక్తిరజతవ దవిద్యాకల్పితాన్యేవ కిం? నహి నహి ఇయం తు తవ లీలయేత్యాహ ద్వయేన"** "ఇది నీ లీలయే. జగద్ధితార్థం నీ ఆవిర్భావం జరుగుతుంది" అని వివరించి చెప్పారు. ముండకోపనిషత్తు (3-1-౹) **"బృహచ్చ తద్దివ్యమచింత్యరూపం"** "ఆ పరబ్రహ్మ మహనీయ, - దివ్య - అలౌకిక - అచింత్య స్వరూపు" డని వర్ణించింది. ఆ భగవంతుడు **"రసో వై సః"** రసస్వరూపుడని తైత్తిరీయశ్రుతి పేర్కొన్నది. వేదవ్యాసుడు వేదగుహ్యమైన భగవంతుని జన్మకర్మలీలలను లోకానికి వెల్లడించి కృతకృత్యుడయ్యాడు. అంతేకాదు, తాను రచించినదానికి పురాణమనే పేరు పెట్టి దానికి సార్థకత కలిగించాడు. విష్ణు పురాణం (5-2-18) **"రూప కర్మ స్వరూపాణి న పరిచ్ఛేదగోచరే, యస్యాఖిల ప్రమాణాని స విష్ణు ర్గర్భగ స్తవ"** ఆ భగవంతుని రూప - కర్మ - స్వభావాలు, సమస్త పరిమాణాలు (బాలత్వ మమత్వాదులు) విచారణ చేయదగిన విషయం కాదు. అవి ఆయన(నీ) గర్భంలోనే దాగి ఉంటాయి. వాటిని నిర్ధారించి చెప్పడానికి వీలులేదు. అవి గోచరించేవి కావు అని. **"సర్వభూత ప్రకృతిం వికారాన్ గుణాది దోషాంశ్చ మునే వ్యతీతః"** (శ్రీవిష్ణు. పు. 6-5-63) "ఓ మునీ! ఆ భగవంతుడు (వాసుదేవుడు) సర్వాత్ముడు సమస్తావరణాలకు పరమందుండినవాడు" అని చెబుతూ అతడు **"జ్ఞాన శక్తి బలైశ్వర్య వీర్యతేజాం స్యశేషతః, భగవచ్ఛబ్దవాచ్యాని వినా హేయై ర్గుణాదిభిః"** "హేయాది గుణ పరిశూన్యమైన వాడే భగవచ్ఛబ్దవాచ్యుడు. అతడు సమగ్ర జ్ఞాన - సమగ్రశక్తి - సమగ్రబల - సమగ్రైశ్వర్య - సమగ్ర వీర్య - సమగ్ర తేజస్సు కలవాడు." అనగా "సమస్త కళ్యాణ గుణాత్మకుడు" అని విష్ణుపురాణం వాసుదేవ భగవచ్ఛబ్దానికి అర్థం వివరించింది. పద్మపురాణం ఉత్తరఖండం కూడా **"యోఽసౌ నిర్గుణ ఇత్యుక్తః శాస్త్రేషు జగదీశ్వరః, ప్రాకృతై ర్హేయ సంయుక్తై ర్గుణహీనత్వ ముచ్యతే"** "శాస్త్రాలలో నిర్గుణుడనిచెప్పబడిన జగదీశ్వరుడు ప్రాకృతమైన హేయగుణాలు లేని వా"డనియే ప్రతిపాదించింది. భగవంతుడు తనస్వరూపశక్తితో, అనగా ఆత్మమాయతో సృష్టి స్థితి లయాలను జరుపుతాడు. మాయాశక్తి అనగా స్వరూపశక్తి అనియే గాని మరి ఇతరమేమీ కాదు. మాయాశక్తి అనే పదానికి శ్రీధరస్వామి

'చిచ్ఛక్తి' అని అర్థం చెప్పారు. **"అతో మాయామయం విష్ణుం ప్రవదంతి సనాతనం"** అని శ్రుతి. "సనాతనుడైన శ్రీ విష్ణువును మాయామయుడు" అని అంటే యోగమాయా సమావృతుడని శ్రీధరాది వ్యాఖ్యాతలందరు చెప్పిన అర్థం. అది ఇంత అని చెప్పలేని అఘటనాఘటన పటీయసి అయిన శక్తి **"యోగమాయా సమావృతః, మూఢోయంనాభిజానాతి లోకో మా మజ మవ్యయమ్"** అనునది. శ్రీకృష్ణముఖోక్తి (గీత 7-25). "యోగమాయతో కూడిన నేను అందరికి ప్రకాశుడను కాను. అనగా నా భక్తులకు మాత్రం ప్రత్యక్షజ్ఞాన గోచరుడను. నా పరత్వాన్ని సూచించే లోకోత్తరకర్మలను, తేజస్సును ప్రకాశింపజేస్తూనే ఉంటాను. నా నరాకృతిని చూడగానే ఈ లోకం మోహాన్ని పొంది నన్నొక మనుష్యునిగా భ్రమపడుతున్నది. కాని, వాయ్వింద్రాదులను అతిశయించిన నా కర్మలు, సూర్యాగ్నులను మించిన నా తేజస్సు కనిపిస్తున్నప్పటికి అజన్ముడను, అవ్యయుడను, నిఖిలజగదేక కారణుడను, సర్వేశ్వరేశ్వరుడనగు నేను అందరికిని సమాశ్రయణీయుడను కావడానికే ఈ మనుష్యాకృతిని ధరించాను. ఈ విషయం కొందరు మూఢులు తెలుసుకోలేకున్నారు." ఇలా అభక్తుల యెదుట భగవంతుడు తన లీలలను గుప్తపరచుకొంటాడు. భక్తుల యెదట తన లీలలను ప్రకటిస్తుంటాడు.

ఇక భగవన్నామానికి చెందిన చర్చ : భగవంతుని గుణాలు అప్రసిద్ధములైన కారణంగా ఆయన "అనాముడు" అని కీర్తింపబడినాడని బ్రహ్మపురాణం **"అనామా సోఽప్రసిద్ధత్వాదరూపో భూతవర్జితాత్"** చెబుతున్నది. **"న యత్ర నాథ విద్యంతే నామజాత్యాది కల్పనాః, తద్బ్రహ్మ పరమం నిత్యమవికారి భవానజ"** అనీ, **"న కల్పనామృతేర్థస్య సర్వస్యాధిగమో యతః, తతః కృష్ణాచ్యుతానంత విష్ణు నామభి రీడ్యసే"**. "హేనాథ! నామ జాత్యాది కల్పనలు పూర్తిగా లేనిచోట నీవు నిత్యుడవు - అవికారివి - అజన్ముడవు - పరబ్రహ్మవు. కల్పన లేకుండా అనగా విశేషం లేకుండా ఏ పదార్థజ్ఞానమూ కలుగదు. అందుచేత స్వామీ!నిన్ను కృష్ణ - అచ్యుత - అనంత - విష్ణు నామాలతో స్తుతిస్తారు" (శ్రీవిష్ణు. పు. 5-18-53, 54) అనడంలో పరస్పర విరుద్ధత కనిపిస్తుంది. శ్వేతాశ్వతరోపనిషత్తులో **"అజామేకాం"** అనే శ్రుతివాక్యం అజన్ముడు, అనాది అయినవానిని "అజుడు" అని పేర్కొంటారని నిర్ధారణ చేస్తున్నది. దేనిని ఆధారం చేసుకొని భగవంతుని నామజాత్యాదులను కల్పించాలి? నిర్విశేషతా ప్రతిపాదకమూ, అత్యంత కల్పనామయమూ అయిన నామంద్వారా భగవంతుడు ఎలా ప్రశంసితుడవుతాడు? 'ఆప్తకామ' ఆదినామాలతో వేదాలు భగవంతుణ్ని

ప్రశంసించాయి. ఆ నామంలో భగవంతుని స్వరూపసిద్ధమైన శక్తివిలాసం ద్యోతకమవుతున్నది కదా! ఆప్తకాముడన్నది కల్పనకాదు. అది యథార్థమే. "నామభిరీడ్యసే" (నామాలతో స్తుతింప బడుదువు)అనడంలో కృష్ణ - అచ్యుత - అనంత - విష్ణునామాలతో భగవంతుని మాహాత్మ్యం వ్యక్తమవుతుందనే కదా అర్థం? శాస్త్రాలలో పేర్కొనబడిన అత్యంత ప్రసిద్ధమైన ఈ నామాల ద్వారా భగవంతుడు అతిశీఘ్రంగా పరిజ్ఞాతుడవుతాడు - మరీ ప్రసన్నుడవుతాడని స్పష్టమవుతున్నది. భగవన్నామ సంకేతాలకు కూడా అత్యంత ప్రభావమున్నట్లు శాస్త్రగ్రంథాలు తెలుపుతున్నాయి. నామానికే కాదు, నామాభాసానికి కూడా మహిమను చెప్పే అజామిళాది ఉపాఖ్యానాలున్నాయి. కాబట్టి కృష్ణాదినామచతుష్టయం ఉపలక్షణత్వంగా చెప్పబడినదనే గ్రహించాలి. నారాయణశబ్దం నామాభాసంగా ఉచ్చరించి నప్పటికి అజామిళునికి ముక్తిలభించడం శాస్త్ర ప్రసిద్ధమైన విషయం. ఇంతటి ప్రభావసంపన్నమైన భగవన్నామాలు కల్పితాలనడానికి వీలులేదు. వేదాలవలెనే భగవన్నామాలు కూడా అపౌరుషేయాలే. విష్ణు - నారాయణ - పురుషోత్తమ - అనంత - అచ్యుత - కృష్ణ - ఆదినామాలు - శ్రుతులలో ప్రస్తావితాలు, ప్రశంసితాలు అయినాయి. ఉదాహరణకు శ్రీకృష్ణశబ్దం విశేష్యమే కాని, విశేషణం కాదు. **"ఆనందో బ్రహ్మేతి, కో హ్యేవాన్యాత్ కః ప్రాణ్యాద్, యదేష ఆకాశ ఆనందో న స్యాత్, ఆనందా ద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయంతే, న తస్య కార్యం కరణం చ విద్యతే, న తత్సమశ్చాభ్యధికశ్చ దృశ్యతే, పరాస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే, స్వాభావికీ జ్ఞాన బల క్రియా చ"** అని శ్రుతి. "ఆనందం బ్రహ్మ. ఆ బ్రహ్మ లేకపోతే ఎవరు ఆనందిస్తారు? ఎవరు జీవిస్తారు? ఆనందంతోనే ఈ దృశ్యమానజీవజగత్తు ఉత్పత్తి అవుతున్నది. దాని కార్యమూ కరణమూ గాని, దానితో సమానమైన లేదా అధికమైన వస్తువుగానీ లేదు. ఆ ఆనందబ్రహ్మశక్తి అనేక విధాలు, వానిలో ప్రధానమైనవి స్వాభావిక జ్ఞాన బల క్రియలు" అని ఆ శ్రుతివాక్యానికి అర్థం. ఈ శ్రుత్యర్థం యోగవృత్తితో సర్వాకర్షకుడు, పరమ బృహత్తమానందుడునైన శ్రీకృష్ణుణ్ని నిర్దేశిస్తున్నది. ఆనందం అనేది ఒక విగ్రహం కాదనడం తగును. కాని, శ్రీకృష్ణుడు పరముడు, పూర్ణసిద్ధానంద విగ్రహుడు. సచ్చిదానంద లక్షణానికి ఏ విగ్రహం ఉన్నదో ఆరూపం కలవాడు శ్రీకృష్ణుడు. **"త్వమేవ నిత్య సుఖబోధతనావనంతే"** (శ్రీమద్భా. 10-14-22) "స్వామీ! నీవే పరమానందుడవు, పరమజ్ఞాన స్వరూపుడవు, అనంతుడవు" అని దశమస్కంధంలో

బ్రహ్మ చేసిన శ్రీ కృష్ణస్తవనంలో. శ్రీ కృష్ణుడు పరమానంద స్వరూపుడన్న సత్యాన్ని శ్రుతులు చెప్పడమేకాకుండా సకల పురాణాలు ఐకమత్యంతో వక్కాణించాయి. తాపనీహయశీర్షగ్రంథంలో **"సచ్చిదానంద రూపాయ కృష్ణాయాక్లిష్టకారిణే"** అనీ, బ్రహ్మాండపురాణంలోని శ్రీకృష్ణాష్టోత్తర శతనామ స్తోత్రంలో **"నందవ్రజజనానందీ సచ్చిదానందవిగ్రహః"** అనీ శ్రీకృష్ణుని సచ్చిదానంద స్వరూపమే పేర్కొనబడింది. సత్యమనేది ఎప్పుడూ స్వరూపగత మయ్యే ఉంటుంది. దశమస్కంధం (10-2-26) గర్భస్తుతిలో బ్రహ్మాదులు భగవంతుణ్ని ఇలా ప్రస్తుతించారు. **"సత్యవ్రతం సత్యపరం త్రిసత్యం, సత్యస్య యోనిం నిహితం చ సత్యే,సత్యస్య సత్యమృతసత్యనేత్రం, సత్యాత్మకం త్వాం శరణం ప్రపన్నాః"** "ప్రభూ! నీవు సత్యస్వరూపుడవు. నిన్ను ప్రాప్తింప జేసుకోడానికి సత్యమే శ్రేష్ఠమైన సాధనం. సృష్టికి పూర్వం - ప్రళయానికి తరువాత, ఈ జగత్తు స్థితి అనే ఈ మూడు అసత్యావస్థలలో కూడా నీవు సత్యమవు. పృథ్వీ జల తేజో వాయ్వాకాశపంచక దృశ్యమాన సత్యానికి నీవే కారణమవు. వీనిలో అంతర్యామిగా విరాజమానుడవైనవాడవు నీవే. ఈ దృశ్యమాన జగత్తుకు పరమార్థ స్వరూపానివి నీవే. స్వభక్త పాలనైక సత్యవ్రతుడవు నీవే. మాకు నీవే శరణమవు''. తన శరణాగత సత్యవ్రతాన్ని ప్రతిజ్ఞా పూర్వకంగా శ్రీమద్రామాయణంలో శ్రీరాముడు **"సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే అభయం సర్వభూతేభ్యో దదామ్యేత ద్వ్రతం మమ"** అని సార్వకాలికదేశవర్తి అయిన సత్యాన్ని చాటాడు. ఉద్యోగపర్వంలో సంజయకృత నామనిరుక్తిలో (70-12) శ్రీకృష్ణుణ్ని **"సత్యే ప్రతిష్ఠాపితః కృష్ణః సత్యమత్ర ప్రతిష్ఠితం, సత్యాత్ సత్యం తు గోవిందః తస్మాత్ సత్యోపి నామతః"** "శ్రీకృష్ణుడు సత్యమునందు ప్రతిష్ఠితుడు; సత్యము ఆతని యందే ప్రతిష్ఠింపబడినది. భగవంతుడైన గోవిందుడు సత్యము కంటె కూడా శ్రేష్ఠుడనడం సత్యము. అందుచేత ఆయన నామము "సత్యము'' అని శ్రీకృష్ణుడు నిరుపాధి పరబ్రహ్మమని పేర్కొన్నది. సచ్చిదానంద స్వరూపు డతడని దశమస్కంధంలోని బ్రహ్మస్తుతిలో స్పష్టమవుతున్నది. వ్రజవాసులందరికి శ్రీకృష్ణునియందు ప్రీతి ఎలా జనించింది? అనే ప్రశ్నకు **"విదితోసి భవాన్ సాక్షాత్ పురుషః ప్రకృతేః పరః, కేవలానుభవానంద స్వరూపః సర్వ బుద్ధి దృ గితి"** "స్వామీ! నేను తెలుసుకొన్నాను. నీవు ప్రకృతికి అతీతుడవైన పురుషుడవు. కేవల అనుభవానంద స్వరూపుడవు నీవే. సర్వబుద్ధిదృక్కువు, బ్రహ్మానంద రూపుడవు నీవే" అని ఇట్లే శ్రుత్యంతరము లందును వక్కాణింపబడినది. సచ్చిదానంద విగ్రహుడైన

శ్రీకృష్ణుని ఆత్మయే ఆతని విగ్రహము. విగ్రహరూపమే ఆయన ఆత్మ. జీవునికివలె ఆయనకు దేహ దేహి భావం లేదు. శ్రీశుకదేవుడిలా బోధించారు. **"కృష్ణమేన మవేహి త్వా మాత్మాన మఖిలాత్మనాం, జగద్ధితాయ సోప్యత్ర దేహీ వాభాతి మాయయా"** (శ్రీమద్భా. 10-14-55) ఈ శ్రీకృష్ణుణ్ణి అఖిలాత్మలకు ఆత్మగా తెలుసుకోవాలి. జగద్వాసుల మంగళవిధానానికే, వారిని సరియైన మార్గంలో నిలపడానికే ఆయన కృపాపూర్వకంగా సాధారణ దేహధారివలె కనిపిస్తాడు. ఆయన దేహివల్లీలకు కరుణాపరవశత్వము, ఆశ్రితవాత్సల్యము కారణాలు. శ్రీకృష్ణ పరమాత్మ, శ్రీకృష్ణ పరబ్రహ్మము శ్రీ కృష్ణభగవానుడు ఈ మూడు నామాలు శ్రీకృష్ణుని నిరుపాధి రూపాన్నే తెలుపుతాయి. **"భగవానితి శబ్దోయం తథా పురుష ఇత్యపి, నిరుపాధీ చ వర్తేతే వాసుదేవే సనాతనే"** అని శ్రీకేశవకాశ్మీరిభట్టు **"ఆత్మా వా అరే ద్రష్టవ్యః శ్రోతవ్యో మన్తవ్యో నిదిధ్యాసితవ్యః" "సోన్వేష్టవ్యః స విజిజ్ఞాసితవ్యః" "భూమత్వే విజిజ్ఞాసితవ్యః"** అనే శ్రుతివాక్యాలన్నీ శ్రీకృష్ణుని యందే సమన్వయమైనాయని స్పష్టం చేశాడు. అఖిలజీవాత్మలకు పరమాత్ముడైనవాడు శ్రీకృష్ణుడు. పుత్రాదులపట్లప్రీతి, దేహమునందు ప్రీతి కలగడానికి కారణం ఆ జీవులలో కృష్ణపరమాత్మ ఉండటమే. పరమాత్ముడైన శ్రీకృష్ణుని మూర్తి పరిపూర్ణమైనది. **"విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్"** (గీత 10-42) తన ఒకానొక అంశంతోనే ఈ సమస్తజగత్తును నిలిపిన శ్రీకృష్ణునిపట్ల ప్రీతి పరాకాష్ఠ నందియుండక తప్పదు. బహిర్ముఖులైన జీవులు అనగా మాయాసంసారంలో మగ్నులైనవారు తమ దారపుత్రాదుల పట్లనే అధికమగుప్రీతిని చూపుతారు. బృందావనవాసులు మాయాతీతులు, ప్రేమభక్తి పూర్ణులు, యథార్థమైన భగవదనుభవం కలవారు. వారికి తమ దారపుత్రాదుల యందుకంటె శ్రీ కృష్ణునియందే ప్రేమాధిక్యం స్వాభావికంగా ఉన్నది. జగత్కళ్యాణార్థం అవతరించిన ఆ శ్రీకృష్ణుడు కూడా తన యోగమాయాశక్తితో భౌతికమైన దేహం కలవానివలె ప్రతీతుడయ్యాడు. అంతేకాని, మాయోపాధి కలవానివలె కాదు. శ్రీ మధుసూదన సరస్వతీ స్వామిపాదులు **"సచ్చిత్సుఖైక వపుషః పురుషోత్తమస్య నారాయణస్య మహిమా న హి మాన మేతి, చిదానందాకారం జలద రుచి సారం శ్రుతిగిరాం వ్రజస్త్రీణాం హారమ్"** అని శ్రీకృష్ణుని నిరుపాధి విగ్రహత్వాన్ని బహువిధాలుగా వర్ణించారు. కాబట్టి పరమాత్ముడు ఇంద్రియగ్రాహ్యుడు కాడు. కాని, శ్రీకృష్ణ భగవానుడు సర్వజన మనోనయనాలకు దర్శన మిచ్చాడు. ఎందుచేత? సర్వజనహితం కోసం తన స్వాభావికమైన

మాయతో నిర్హేతుక దయామయుడై ఆశ్రిత వాత్సల్యవివశుడై అవతరించి జగజ్జనేంద్రియాలకు తాను దేహివలె ప్రకాశించాడు. అతర్కితేచ్ఛతో ఇంద్రియాలను స్వీకరించిన వానివలె తోచాడు. **"నిత్యావ్యక్తోపి భగవానీక్షతే నిజశక్తితః, నామృతే పరమానందం కః పశ్యేతామితం ప్రభుమ్"**. అవ్యక్తుడైన భగవంతుణ్ని దర్శించాము. అమితమైన పరమానందం అమృతంలో తప్ప మరెందులో ఉంటుంది? (శ్రీవంశీధరస్వామి ఉదాహరించిన కారిక) స్వేచ్ఛా ప్రకాశసామర్థ్యంతో **"సోభివ్యక్తోభవే న్నేత్రే న నేత్రవిషయత్వతః"** శ్రీ కృష్ణుడు అభివ్యక్త మవుతాడు - అది చూచేవాని నేత్రాల సామర్థ్యం వలన కాదు - దర్శన మిచ్చేవాని సామర్థ్యం వలన అని గ్రహింపవలసి ఉంటుంది. అన్యదేశీయులు, అనుకూలజనులు ఆ భగవంతుని కృపాదృష్టి దానంతో, స్వమాధుర్య గ్రహణంతోను శ్రేయస్సును పొందుతారు. ప్రతికూలురకు అనగా కంసాద్యసురులకు పిత్తదూషిత జిహ్వాకు మత్స్యాండికా భోజనం లాగా ప్రాకృతేంద్రియాలకు తన్మాధుర్యగ్రహణ రహితమైన దర్శనము - ధ్యానావేశసిద్ధ్యర్థ మవుతుంది. ఆవేశఫలం వలన కూడా సర్వాపరాధోపశమనపూర్వక మోక్షం లభిస్తుంది. అది వారికి హితమైనది. ఎందుకనగా, వ్రజవాసులు ఐశ్వర్యజ్ఞాన శూన్యులు. తక్కినవారు అనుకూలురైనా ప్రతికూలురైనా వారికి శ్రీకృష్ణుడు దేహి వలెనే కనిపిస్తాడు. **"దేహదేహివిభాగోత్ర నేశ్వరే విద్యతే క్వచిత్"** ఇది శ్రీమన్మధ్వాచార్యులవారు ఉటంకించిన వారాహవచనం. శ్రీకృష్ణుడు సచ్చిదానంద విగ్రహుడు. ఆయన ఆత్మయే ఆయన విగ్రహము. ఆ విగ్రహమే ఆయన ఆత్మ. **"జగద్ధితాయ సోప్యత్ర దేహీవాభాతి మాయయా"** అని శ్రీ శుకముఖోక్తి. భగవంతునియందు దేహ దేహి విభాగం ఉండదు. ఆత్మారాములకు, తత్ప్రియజనులకు శ్రీకృష్ణుడు ఆత్మాధిక నిరుపాధి పరమప్రేమాస్పద సర్వాంశత్వంతోను, త ద్వ్యతిరిక్తులైనవారికి భేదభావంతోను గోచరిస్తాడని వైష్ణవతోషిణి వ్యాఖ్యానించింది. నిరుపాధిపరమ ప్రేమాస్పదత్వ మాత్మానందత్వము. అందుచేతనే శ్రీమధ్వాచార్యపాదులు భగవంతునియందు దేహదేహి భావం లేదని వారాహవచనాన్ని ఉటంకించారు. అసురాది ప్రతికూలురకు మాయావరణం అడ్డుండటం వల్ల వారు శ్రీకృష్ణ భగవత్తత్త్వమును తెలుసుకోలేకపోయారు. **"నాహం ప్రకాశః సర్వస్య యోగ మాయాసమావృతః"** అని శ్రీకృష్ణముఖోక్తి. క్షీరంలో సితాంబుజం ఏకజాతీయతను భజించినట్లుగా, ప్రేమాస్పద స్వభావుడైన శ్రీకృష్ణుని మాధుర్యం శ్రీకృష్ణ ప్రేమ భావితాంతఃకరణులలో అత్యధికంగా

భాసిస్తుంది. అన్యత్ర యథోచితంగా ఉంటుంది. సర్వాతిశాయితమైన ప్రేమభావనకల వ్రజకాంతలను గూర్చి ఇక చెప్పే దేమున్నది? అని వివరించారు శ్రీ వంశీధరస్వామివారు. శ్రీకృష్ణుని ఐశ్వర్యం సర్వత్ర వ్యాప్తమయింది. వ్రజవాసులు ఆయన్ను దర్శించడానికి ప్రయాసపడలేదు. ఆయన సర్వేశ్వరుడైనప్పటికి ప్రేమభక్తి గల వ్రజవాసుల సమక్షంలో గోపబాలుడయ్యాడు. తాను జ్ఞానమయుడై నప్పటికి అజ్ఞానివలె నటించాడు. తనయందు ప్రేమభక్తి గలవారిని కలుసుకోవడంలో విరహాలీలను ప్రకటించాడు. శ్రీకృష్ణుని చరణాశ్రయమే తమ జీవన చరమలక్ష్యంగా భావించి, ఆయన వద్దకు పరుగెత్తడంలో పథమిది అనిగానీ అపథమిది అని గానీ గ్రహింపలేకపోయారు గోపికలు.

జ్ఞానానందాదికమైన కళ్యాణగుణ సముదాయమే పరబ్రహ్మ స్వరూపం. **"ఇదమపి రూపం"** అని శ్రుతి. ఈ శ్రుతివాక్యం భగవంతుని కరచరణనయన వదనాదులను నిర్దేశిస్తున్నది. భగవద్రామానుజాలు తమ శ్రీభాష్యంలో **"పరస్య బ్రహ్మణః ప్రాకృత హేయగుణాన్ ప్రాకృత హేయదేహసంబంధం, తన్మూలకర్మవశ్యతాసంబంధం చ ప్రతిషిధ్య కల్యాణగుణాన్ కల్యాణరూపం చ వదన్తి. తదిదం స్వాభావిక మేవ రూప ముపాసకానుగ్రహేణ తత్ప్రతిపత్త్యనుగుణాకారం దేవమనుష్యాదిసంస్థానం కరోతి స్వేచ్ఛయైవ పరమకారుణికో భగవాన్"** అని వివరించారు. అనగా "శ్రుతులు ఉద్ఘోషించిన రీతిగా పరబ్రహ్మగుణాలలో ప్రాకృతగుణ వికారం లేదు. అవి హేయమైనవి కావు. ఆయన రూపమూ ప్రాకృతహేయమైనది కాదు. ఆయన గుణగణాలు అప్రాకృతమైన కళ్యాణగుణాలు. ఆయన విగ్రహమూ కల్యాణ విగ్రహము. పరమ కృపాళువైన భగవంతుడు తన స్వాభావికమైన స్వరూపాన్ని భక్తా భీష్టసిద్ధికి దేవమనుష్యాది రూపాలతో ఆవిష్కరిస్తాడు. భగవంతుని నామరూప గుణగణాలను గూర్చి భగవద్రామానుజాలు చేసిన సిద్ధాంతాన్ని వేదశాస్త్ర పురాణాదులన్నీ అహమహమికతో సమర్థించాయి. భగవంతుని కల్యాణ గుణాలన్నీ ఆయన స్వరూపానికి చెందినవే. ఆ భగవంతుని ద్రష్టృత్వాదికములైన వ్యాపారాలన్నీ ఇంద్రియాలమీద ఆధారపడినవి కావు. సర్వజ్ఞత్వమూ, సత్యసంకల్పత్వమూ కలవాడు కాబట్టి స్వాభావికంగా, స్వయంగానే ద్రష్టృత్వాదికాలు జరుగుతాయి. శబ్ద స్పర్శరూపరస గంధాలను సాక్షాత్కరింప జేసుకోవడానికి జీవునికి శ్రోత్రాదులైన ఇంద్రియాల ఆవశ్యకత ఉన్నది. జీవుడు అవిద్యాకారణంగా తన స్వాభావికజ్ఞానాన్ని కోల్పోయాడు. బహిర్ముఖుడయ్యాడు, బద్ధావస్థకు లోనయ్యాడు. భగవంతుడు ప్రకృతికి అతీతుడు. ఆయన గుణాలు

దివ్యములు - నిత్యములు. జీవులకు ఉన్నట్లుగా గుణ - గుణి భేదం ఆయనకు లేదు. భగవద్రూపము, ఆయన కల్యాణగుణాలు - రెండూ సచ్చిదానంద స్వరూపాలే. రెంటికి ఒకే రూపం, ఆయన కరచరణాది సమస్తావయవాలు సచ్చిదానంద భగవత్స్వరూపాలే. ఆయన ప్రతి అవయవమూ ద్రష్టృత్వాదికాల నన్నిటినీ జరుపుతుంది. భగవంతునిలోని ప్రతి అణువు, ప్రతి కణమూ ఆయనకు ఆయుధంగా, ఆభూషణంగా, వస్త్రాదులుగా భగవన్మయములవుతాయి. భగవత్స్వరూపాలవుతాయి. భగవంతుని స్వప్రకాశికా శక్తియే ఆయనకు గల విశుద్ధ సత్త్వము. దానిని వసుదేవమంటారు. అట్టి వసుదేవం నుండే భగవంతుడు ప్రకటితుడై వాసుదేవుడవుతాడు. **"సత్త్వం విశుద్ధం వసుదేవ శబ్దితం"** (శ్రీమద్భా 4-3-23) విశుద్ధమైన అంతఃకరణాన్ని వసుదేవమంటారు. భాగవతంలోని వసుదేవనామకుడు లోకవిడంబనార్థం భగవంతుని పరికరమైనాడు. **"సత్త్వం విశుద్ధం శ్రయతే భవాన్ స్థితౌ శరీరిణాం శ్రేయ ఉపాయనం వపుః"** (శ్రీమద్భా 10-2-34) గర్భస్తుతిలో బ్రహ్మాదులు "ఓ దేవాదిదేవా! ఈ జగత్తును ఉద్ధరించడానికి, సమస్త దేహధారులకు పరమకళ్యాణం చేకూరడానికి నీవు విశుద్ధ సత్త్వమయమూ సచ్చిదానందమయమూ, అయిన పరమదివ్యమంగళరూపంతో ప్రాకట్యమొందావు" అని ప్రార్థన చేశారు. **"వసుదేవగృహే సాక్షా ద్భగవాన్ పురుషః పరః, జనిష్యతే తత్ప్రియార్థం సంభవన్తు సురస్త్రియః"** "వసుదేవుని గృహంలో పరమ పురుషుడు సాక్షాత్ శ్రీకృష్ణుడు ఆవిర్భూతుడు కానున్నాడు. ఆయన ప్రసన్నతకోసం దేవతాస్త్రీలు కూడా గోకులంలో జన్మింతురుగాక!" (శ్రీమద్భా. 10-1-23) అని బ్రహ్మ భగవదవతార రహస్యాన్ని దేవగణాలకు తెలిపాడు. సచ్చిదానందరూపుడు నిత్య లీలామయుడు. అఖిల సౌందర్య మాధుర్య ప్రియత్వాది కళ్యాణగుణగణయుక్తుడు శ్రీకృష్ణభగవానుడే పరమతత్త్వము. ప్రేమ భక్తిగలవారికి ఆయన పరమధనము - ప్రియాతిప్రియమైన వస్తువు. శ్రీవల్లభ ప్రభువు లన్నట్లు సకలవేదసారమైన శ్రీమద్భాగవతంలో రహస్యార్థం లేకుండా ఏ ఒక్క శబ్దమూ లేదు. శ్రీశుకదేవుడు వర్ణించిన దంతా ఆ మహాత్ముని ప్రత్యక్షానుభవానికి సంబంధించిన విషయమే.

**వ. మఱియును.**

**సీ. శాంతున కపవర్గసౌఖ్యసంవేదికి నిర్వాణభర్తకు నిర్విశేషు**
**నకు ఘోరునకు మూఢునకు గుణధర్మికి సౌమ్యున కధికవిజ్ఞానమయున**

**కఖిలేంద్రియద్రష్ట కధ్యక్షునకు బహుక్షేత్రజ్ఞునకు దయాసింధుమతికి**
**మూలప్రకృతి కాత్మమూలున కఖిలేంద్రియజ్ఞాపకునకు దుఃఖాంతకృతికి**
**నెఱి ననత్యమనెడి నీడతో వెలుఁగుచు మండు నెక్కటికి మహోత్తరునకు**
**నిఖిలకారణునకు నిష్కారణునకు నమస్కరింతు నన్ను మనుచు కొఱకు**

టీ : శాంతునకు = సత్యమునను సరించువానికి, అపవర్గ సౌఖ్యసంవేదికి = మోక్షమందలి సౌఖ్యమును లెస్సగా తెలిసినవానికి; నిర్వాణ భర్తకు = మోక్షమునకు అధిపతియైనవానికి, నిర్విశేషునకు = నిఖిలాత్మకత్వము గలవానికి: ఘోరునకు = రాజసము ననుసరించువానికి; మూఢునకును = తమోగుణధర్మము ననుసరించువానికి, గుణధర్మికి = సత్త్వరజస్తమో గుణధర్మములను అనుకరించువానికి, సౌమ్యునకు = వైషమ్యాదులులేనివానికి, అధిక విజ్ఞానమయునకు = జ్ఞానాకారునకు, అఖిల+ఇంద్రియద్రష్టకు = శ్రోత్రాది సకలేంద్రియాల శబ్దాదులకు సాక్షి అయిన వానికి; అధ్యక్షునకు = (సాక్షి అయినప్పటికిని నిర్వికారుడైన) అధిపతికి; బహుక్షేత్రజ్ఞునకు = బహుక్షేత్రములకు ఏకైక జ్ఞాత అనగా సర్వసాక్షి అయిన వానికి, దయాసింధుమతికి = కృపాసముద్రమువంటి మనస్సు గలవానికి; మూలప్రకృతికి = సర్వమునకు ఉపాదానభూతుడైన వానికి - కారణవిశేషమైన వానికి; ఆత్మమూలునకు = క్షేత్రజ్ఞులకు మూలమైనవానికి; అఖిల+ఇంద్రియజ్ఞాపకునకు = సకలేంద్రియాలను నడిపించు శక్తి గలవానికి, దుఃఖాంతకృతికి = దుఃఖమును వశింపజేయుటలో నేర్పరికి; నెఱిన్ = ఒప్పుగా; అసత్యమనెడి నీడతో వెలుగుచుండు = ప్రకాశించుచుండు, ఎక్కటికిన్ = ఒంటరివానికి, మహోత్తరునకున్ = మిక్కిలి గొప్పవానికి, నిఖిలకారణునకున్ = సకల కారణములైనవానికి; నన్ను మనుచుకొఱకు = నన్ను కాపాడుటకు; నమస్కరింతును.

తా : సత్యము ననుసరించు శాంతాకారునికి, మోక్షసౌఖ్యమును చక్కగా తెలిసినవానికి, కైవల్యాధిపతికి, నిఖిలాత్మునకు, సత్వరజస్తమోగుణ ధర్మముల ననుకరించువానికి, జ్ఞానమయునికి, సకలేంద్రియద్రష్టకు, బహుక్షేత్రజ్ఞునకు, మూలప్రకృతికి, ఆత్మమూలునకు, కృపాసముద్రునకు, దుఃఖాంతకృతికి, సర్వకారణకారణునికి, నిష్కారణునికి నన్ను రక్షింపుమని నమస్కరిస్తాను.

క్షేత్రజ్ఞుడు : క్షేత్రము అనగా శరీరమును తెలిసినవాడు. అనగా ముక్తులకు తన అనుభవాన్ని కలిగించడానికి తగినశరీర మిది అని ఎరిగినవాడు. "**క్షేత్రాణి హి శరీరాణి బీజం చాపి శుభాశుభం, తాని వేత్తి స యోగాత్మా తతః క్షేత్రజ్ఞ ఉచ్యతే**" (మహాభా. శాం. 351-6) ఈ శరీరమే ఒక క్షేత్రము. దానికి బీజములు శుభాశుభకర్మలు. వాటిని యోగాత్ముడు గ్రహింపగలుగుతాడు కనుక, అతడు క్షేత్రజ్ఞుడని చెప్పబడుతున్నాడు.

గీతలో శ్రీకృష్ణభగవానుడు **"క్షేత్రజ్ఞం చాపి మాం విద్ధి సర్వక్షేత్రేషు భారత"** (గీత. 13-2) అర్జునా! నన్ను క్షేత్రజ్ఞునిగా కూడా తెలుసుకో'' అన్నాడు. పరబ్రహ్మము, పరమాత్మ, భగవానుడు అయిన శ్రీకృష్ణుడు క్షేత్ర విషయములను ఎరిగిన వాడగుటచే క్షేత్రజ్ఞుడని కూడా పిలువబడుతున్నాడు. క్షేత్రజ్ఞునినే పరబ్రహ్మగా భావింపగూడదు. పరబ్రహ్మకు సర్వజ్ఞత్వము, సర్వశక్తిత్వము, అపహతపాప్మత్వము, స్వాభావికమైన నిర్దోషత్వము, అప్రాకృత కళ్యాణగుణాకారత్వము ఉంటాయి. పరబ్రహ్మ శబ్దంలోనే పైన పేర్కొనబడినవన్నీ ఇమిడి ఉన్నాయని గ్రహించాలి. ఇట్టి బృహత్వగుణయోగమే బ్రహ్మ శబ్దమయింది.

విష్ణుశక్తికి పరాశక్తి అని పేరు. **"పరాస్య శక్తిః వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబల క్రియా చ"** అని శ్రుతి (శ్వేతాశ్వ 9-8) వాక్యం. "భగవంతుని జ్ఞాన బలక్రియా రూపమైన స్వరూపభూత దివ్యశక్తులు నానావిధాలుగా ఉంటాయని వినబడుచున్నది'' అని ఆ శ్రుతి వాక్యానికి అర్థం. ఆ విష్ణువుయొక్క అపరాశక్తికి క్షేత్రజ్ఞశక్తి అని పేరు. ఆయన యొక్క మూడవశక్తిని 'అవిద్య' అని పేర్కొంటారు. అవిద్యచే ఆవృతమైన క్షేత్రజ్ఞశక్తి అనేక విధాలుగా ఈ విస్తృత సంసారంలో దుఃఖతాపాలను అనుభవిస్తుంటుంది. అవిద్యాశక్తి తొలగి పోగానే ఈ క్షేత్రజ్ఞశక్తి సర్వజీవులలోని తారతమ్యాలను ఎరుకపరచ గలుగుతుందని విష్ణుపురాణం చెబుతున్నది. క్షేత్రజ్ఞశక్తి జడపదార్థాలలో చాలాతక్కువ. వృక్షాలలోను, పర్వతాది స్థావరాలలోను కొంత ఉంటుంది. అంతకంటె సరీసృపాలలో, వాటిలో కంటె పక్షులలో, వాటిలోకంటె మృగాలలో, వాటిలోకంటె పశువులలో ఈ క్షేత్రజ్ఞశక్తి అధికంగా ఉంటుంది. మనుష్యులలో కంటె నాగులలో, ఆ తర్వాత గంధర్వులలో, ఆ పిమ్మట యక్షులలో, ఆ తర్వాత దేవగణాలలో, తర్వాత ఇంద్రునిలో - ఆ తర్వాత ప్రజాపతిలో - పిమ్మట హిరణ్యగర్భునిలో ఈ క్షేత్రజ్ఞశక్తి విశేషంగా ప్రకాశిస్తుందని వివరించింది శ్రీవిష్ణుపురాణం.

నిర్విశేషుడు : ప్రకృతికి సంబంధించిన గుణములు, రూపము లేనివాడు. అనగా పరమ కళ్యాణగుణములు, దివ్యరూపము గలవాడని అర్థము. సకలేతర విలక్షణుడు అనగా సర్వేశ్వరత్వ - సవిశేషత్వ, సర్వకర్మారాధ్యత్వ, సర్వఫలప్రదత్వ, సర్వాధారత్వ సర్వకార్యోత్పాదకత్వ, చిదచిదీశ్వరత్వ సమస్త ద్రవ్య శరీరత్వములు ఆ భగవంతుని లక్షణాలు. భగవంతుడు సర్వతంత్ర స్వతంత్రుడని తెలియజేయుడానికి నిర్విశేషుడని

పేర్కొనబడినాడు. కాని, ఆయన సకలేతర విలక్షణుడు. కాబట్టి సవిశేషుడే అని చెప్పాలి. నిఖిలాత్మకత్వమే నిర్విశేషత్వమని అర్థం. వేదాలు శబ్దప్రమాణైక గమ్యాలు,వాటికి గౌణార్థకల్పన చేయడం న్యాయం కాదని వాదిస్తారు కొందరు. కానీ, నిర్విశేషబ్రహ్మవిషయంలో వేదాల ముఖ్యతాత్పర్యం సవిశేష బ్రహ్మకు చెందినదే అయింది. గౌణతాత్పర్యాన్నే తప్పనిసరిగా స్వీకరింపవలసి వచ్చింది.

**కం. యోగాగ్ని దగ్ధ కర్ములు యోగీశ్వరు లే మహాత్ము నొండెఱుఁగక స**
**ద్యోగ విభాపిత మనముల బాగుగ వీక్షింతు రట్టి పరము భజింతున్**

టీ : యోగ+అగ్ని దగ్ధ కర్ములు = యోగమనెడి అగ్నిచే కాల్చబడిన పూర్వకర్మలు గలవారైన; యోగి+ఈశ్వరులు = యోగిశ్రేష్ఠులు; ఒండు+ = ఎఱుఁగక = ఇతర మేమియు ఎరుగక; ఏ మహాత్మున్ = ఏ మహాపురుషుని; సద్యోగ విభాపిత మనములన్ = చక్కని ధ్యానయోగముచే ప్రకాశించెడి మనస్సులందు, బాగుగ, ఈక్షింతురు = చూతురో; అట్టి, పరము = పరాత్పరుని; భజింతున్ = స్తుతింతును.

తా : యోగాగ్నిచే పూర్వజన్మలో చేసిన కర్మల నన్నిటిని దగ్ధము కావించుకొన్న మహాయోగులు ఇతరాలోచనలు చేయక, చక్కని ధ్యానయోగంతో ఏ మహాపురుషుని దర్శిస్తారో ఆ పరాత్పరుని స్తుతిస్తాను. యోగవిశుద్ధ మనస్కులు సాక్షాత్కరించుకొనే పరాత్పరుని నేను దర్శించడం అశక్యము కావున నేను స్తుతి మాత్రమే చేయగలను అని భావము.

**సీ. సర్వాగమామ్నాయజలధికి నపవర్గమయునికి నుత్తమమందిరునకు**
**సకలగుణారణిచ్ఛన్నబోధాగ్నికిఁ దనయంత రాజిల్లు ధన్యమతికి**
**గుణలయోద్దీపితగురుమానసునకు సంవర్తితకర్మనిర్వర్తితునకు**
**దిశలేని నాబోఁటి పశువుల పాపంబు లణఁచువానికి సమస్తాంతరాత్ముఁ**
**డై వెలుంగువాని కచ్ఛిన్నునకు భగవంతునకుఁ దనూజపశునివేశ**
**దారసక్తులయినవారి కందఁగ రానివాని కాచరింతు వందనములు**

టీ : సర్వ+ఆగమ+ఆమ్నాయ జలధికి = సకల శాస్త్రములకు, వేదములకు సముద్రమువంటి వానికి, అపవర్గమయునికి = మోక్షస్వరూపునికి, ఉత్తమ మందిరునకు = ఉత్తములకు నివాసమైన వానికి; సకలగుణ+అరణిచ్ఛన్న బోధాగ్నికి = సమస్త సద్గుణము లనుఅరణిపిడి కట్టెయందు దాగియుండిన విజ్ఞాన మనెడి అగ్ని కలవానికి; తనయంతన్ = తనంత తాను; రాజిల్లు = ప్రకాశించు; ధన్యమతికి = ధన్యునకు; గుణలయ+ఉద్దీపిత = గుణములు లయమై పోవుటచే ప్రకాశించు, గురుమానసునకున్ = గొప్ప మనసు గలవానికి, సంవర్తిత కర్మ నిర్వర్తితునకు = పునర్జన్మకు కారణమైన కర్మను మరలింప జేయువానికి; దిశలేని = రక్షకులు లేని; నాబోటి,

పశువుల పాపంబు = జీవుల పాపాలను, అణచువానికిన్ = నశింపజేయువానికి; సమస్త+అంతరాత్ముఁడై = సమస్తమునకు అంతరాత్మయై, వెలుంగువానికి; అవిచ్ఛిన్నునకు = నాశరహితునికి; భగవంతునికి = షాడ్గుణ్య పరిపూర్ణుడైనవానికి, తనూజ - పశు - నివేశ - దార సక్తులయిన వారికి = కొమరులు, పశువులు, ఇల్లు, ఇల్లాలు మొదలగువారి పట్ల ఆసక్తిగలవారికి, అందగరానివానికి = తెలియరానివానికి, వందనములు ఆచరింతును = నమస్కారములు చేతును.

తా : సకలవేదశాస్త్రజలధి, మోక్షస్వరూపుడు, సుజనసేవితుడు; శాంతాకారుడు, స్వయం ప్రకాశుడు, సాధనాపరులకు బోధపడువాడు, పునర్జన్మను నివారించువాడు, నావంటి దీనుల పాపాలను నశింపజేయువాడు, సంసారతాపత్రయంలో మునిగిన వారికి అందనివాడు అగు భగవతునికి నమస్కరింతును.

ఆగమములు : దేవపూజా విధానాలకు సంబంధించిన విషయాలను తెలిపే శాస్త్రాలు. ఉదా. పాంచరాత్రాగమము. ఆమ్నాయము వేదము, లేదా శాస్త్రము. భగవంతుడు షాడ్గుణ్య పరిపూర్ణుడు. **"జ్ఞానశక్తి బలైశ్వర్య వీర్యతేజాం స్యశేషతః, భగవచ్ఛబ్ద వాచ్యాని వినా హేయై ర్గుణాదిభిః"** (శ్రీ విష్ణు. పు. 6-5-79) సత్వరజస్తమో గుణాలను వాటివల్ల కలిగే క్లేశాలను విడువగా జ్ఞాన, శక్తి, బల, ఐశ్వర్య, వీర్య, తేజస్సులను సమగ్రములైన సద్గుణములకు భగవత్ అనిపేరు. **"ఐశ్వర్యస్య సమగ్రస్య ధర్మస్య యశసశ్శ్రియః, జ్ఞానవైరాగ్య యోశ్చైవ షణ్ణాం భగ ఇతీరణా** (శ్రీ విష్ణు. పు. 6-5-74) సంపూర్ణ ఐశ్వర్య ధర్మ యశస్ శ్రీ జ్ఞాన వైరాగ్యముల కారింటికి 'భగ'మనిపేరు. సంపూర్ణైశ్వర్యాది షడ్గుణాలు కలవాడు భగవంతుడు.

**శ్లో. తస్మై నమః పరేశాయ బ్రహ్మణేఽనన్తశక్తయే**
**అరూపాయోరురూపాయ నమ ఆశ్చర్యకర్మణే**

తా : అరూపుడైనప్పటికి బహురూపుడైనవాడు,అత్యంతాశ్చర్యకరమైన కర్మలు గలవాడు, అనంత శక్తిమంతుడు, సర్వైశ్వర్యమయుడు అగు పరబ్రహ్మ పరమాత్మకు నమస్కారము.

అరూపుడనగా ప్రాకృతమైన రూపములేని వాడని అర్థం. బహురూపుడు అనేక రూపములుగలవాడు. బహురూపములు గలవాడని పేర్కొనడంకంటె అరూపుడనడం మేలు. నిర్గుణుడంటే గుణం లేనివాడనడంకంటె హేయమైన ప్రాకృతగుణాలు లేనివాడనడం మేలు. ఉరురూపుడనగా అప్రాకృతచిన్మయ రామకృష్ణాది బహురూపములు గలవాడని తాత్పర్యం. **"అదృశ్యత్వా న్మమైతస్య రూపస్య చర్మచక్షుషా, అరూపం మాం వదన్తే తే వేదాః సర్వే మహేశ్వర"** (పద్మ. పాతా. 51-73) శ్రీకృష్ణ

భగవానుడు శ్రీశంకరునికి ఇలా చెప్పాడు. "ఓ మహేశ్వరా! నా రూపాన్ని చర్మచక్షువులతో చూడజాలరు. అందుచే వేదాలు నన్ను రూపరహితునిగా వర్ణించాయి. **"వ్యాపకత్వా చ్చిదంశేవ బ్రహ్మేతి చ విదు ర్బుధాః"** నా చైతన్యాంశంతో సర్వవ్యాపినైన కారణంగా నన్ను బుధులు బ్రహ్మ మని పేర్కొన్నారు". శాస్త్రగ్రంథాలలో భగవంతుడు నిర్గుణుడా? సగుణుడా? అనే చర్చ యుక్తియుక్తంగా జరిగింది. భగవంతుడు ప్రాకృతగుణాలకంటె అతీతుడు. కాబట్టి ఆయన్ను నిర్గుణుడన్నారు. ఆ భగవంతుని యందు ఆయన స్వరూపానికి చెందిన అచింత్యానంత కల్యాణ గుణగణాలుండటం చేత ఆయన్ను సగుణుడని పేర్కొన్నారు. కొందరు మాయ అనే ఉపాధిని పొందడం వల్ల బ్రహ్మయందు సగుణభావం ప్రతీతమవుతున్నదని వాదిస్తారు. అది సరికాదు. బ్రహ్మము యొక్క శక్తి మాయ. **"మాయాం తు ప్రకృతిం విద్యా న్మాయినం తు మహేశ్వరమ్, తస్యావయవభూతైస్తు వ్యాప్తం సర్వమిదం జగత్"** (శ్వేతాశ్వతరోపనిషత్ (5-10) మాయ అనేది భగవంతుని శక్తిరూపమైన ప్రకృతి. ఈ మాయానామముగల శక్తిరూపమగు ప్రకృతికి అధిపతి పరబ్రహ్మ పరమాత్మయగు భగవంతుడు. భగవంతునికి ఈ మాయాశక్తియగు ప్రకృతి అంగభూతమైన కారణంగా అది సర్వత్ర పరివ్యాప్తమైనదని ఆ శ్రుతివాక్యానికి అర్థం. భగవంతుని శక్తి మాయ. అగ్ని - దాని దాహకశక్తి అభిన్నమైనట్లుగా, శక్తిమంతుడు - శక్తి అభిన్నులే కదా! ఆ శక్తిని పరాశక్తి అని శ్రుతి పేర్కొన్నది. **"పరాస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చ"** (శ్వేతాశ్వ 6-8) భగవంతునికి స్వాభావికశక్తికి చెందిన జ్ఞాన బల క్రియలు వివిధములని శ్రుతులు చెబుతున్నవి. "ఆ భగవంతుడు సర్వలోక నియంత. సర్వజ్ఞుడు. ఆయన అంతర్యామి. సమస్తమునకు కారణమైనవాడాయన. ఆయన వలననే సకల జీవోత్పత్తి జరుగుతున్న"దని మాండూక్యోపనిషత్తు **"ఏష సర్వేశ్వర ఏష సర్వజ్ఞ ఏషోంతర్యామ్యేషయోనిః సర్వస్య ప్రభవాప్యయౌ భూతానాం"** "చూచేవాడు, స్పర్శించేవాడు, వినేవాడు, ఆఘ్రాణించేవాడు, రుచి చూచేవాడు, మననం చేసేవాడు, తెలుసుకొనేవాడు, పని చేసేవాడు అగు విజ్ఞానమయాత్ముడైన పురుషుడతడు అని ప్రశ్నోపనిషత్తు భగవంతుని సగుణత్వాన్ని విశదీకరించింది. **"ఏష హి ద్రష్టా స్ప్రష్టా శ్రోతా ఘ్రాతా రసయితా మంతా బోద్ధా కర్తా విజ్ఞానాత్మా పురుషః"** అని. ఇంకా భగవంతుని ఆశ్చర్యకర్మ కొక ఉదాహరణ. విరుద్ధ ధర్మాశ్రయత్వం భగవంతుని విశిష్టత. ఆయన అణువులలో అణువు. మహనీయులలో

మహామహనీయుడు. అణువైనప్పటికి దానికి మహావ్యాపక ముంటుంది. ఉదాహరణకు యశోద ఒడికెక్కినప్పటికి శ్రీకృష్ణుడు సర్వజగదాధారుడే. స్తన్యాసక్తుడైనప్పటికి శ్రీకృష్ణుని ముఖంలో సమగ్రబ్రహ్మాండం దర్శనమయింది.

**శ్లో. నమ ఆత్మప్రదీపాయ సాక్షిణే పరమాత్మనే**
**నమో గిరాం విదూరాయ మనస శ్చేతసామపి**

తా : స్వయం ప్రకాశునికి, సమస్తమునకు సాక్షి అయినవానికి, మనస్సునకు వాక్కునకు చిత్తవృత్తికి అత్యంత దూరమైనవానికి, పరమాత్మకు నమస్కారము.

ఈ శ్లోకంలో తైత్తిరీయ శ్రుత్యర్థమున్నది. **"యతో వాచో నివర్తంతే, అప్రాప్య మనసా సహ."** పరమానంద స్వరూపుడైన భగవంతుని సన్నిధికి మనస్సు, వాక్కు, ఆది సకలేంద్రియాల సముదాయ రూపమైన మనోమయ శరీరం కూడా చేరజాలదు. అయితే భగవత్ప్రాప్తికి సాధనచేసేవారి మనోవాక్కులు మొదలైనవి కొంతవరకు సహాయపడతాయి. అవి సాధనా పరాయణుడైన పురుషుణ్ని భగవన్మందిర ద్వారం దాకా చేర్చి మరల తిరిగి వస్తాయి. ఆనందమయుడైన భగవంతుని స్వరూపం తెలుసుకోగోరిన విద్వాంసుడు ఎన్నటికి భయపడనవసరం లేదని తైత్తిరీయ శ్రుతి ఆశ్వాసిస్తున్నది. **"ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కదాచన"** అని సమస్తమునకు సాక్షి అయినవాడు భగవంతుడు. **"కర్మాధ్యక్షః సర్వభూతాధివాసః సాక్షీ చేతా కేవలో నిర్గుణశ్చ"** అని శ్వేతాశ్వతరోపనిషత్తు (6-11) సమస్త కర్మములకు అధిష్ఠాత, సమస్తజీవులకు నివాసస్థానము, సమస్తమునకు సాక్షి, చేతన స్వరూపము, సర్వధా పరిశుద్ధము, గుణాతీతము అయినవాడు ఆ భగవంతుడు. "పరమాత్మ" అంటే ఏమిటి? జీవుడు పరమాత్ముని అంశము. భగవంతుడు తనదైన ఈ అంశముతో లీల జరుపుతాడు. కొన్ని జీవులు తమకు ప్రాప్తించిన స్వాతంత్ర్యాన్ని దురుపయోగం చేసి పరమాత్మకు విముఖములవుతాయి. నిఖిలక్షేత్రముల క్షేత్రజ్ఞుడు పరమాత్మ. బ్రహ్మ - పరమాత్మ - భగవానుడు అను మూడు నామాలు ఉన్నప్పటికి తత్త్వ మొక్కటే. కాని, అనుభూతి మూడు విధాలుగా ఉంటుంది. శ్రీమద్భాగవత వ్యాఖ్యాత శ్రీధరస్వామి ఔపనిషద సంప్రదాయులు 'బ్రహ్మ' మంటారనీ, హిరణ్య గర్భ సంప్రదాయులైన యోగులు 'పరమాత్మ' అంటారనీ, భక్తులు భగవానుడంటారనీ వివరించారు. **"వదంతి తత్తత్త్వవిద స్తత్త్వం యద్ జ్ఞాన మద్వయం, బ్రహ్మేతి పరమాత్మేతి భగవానితి శబ్ద్యతే"** (శ్రీమద్భా 1-2-11) జగత్తత్త్వమే బ్రహ్మజ్ఞానము. ఆత్మతత్త్వమే

పరమాత్మజ్ఞానం లేదా యోగం. ఈశ్వరతత్త్వమే భగవత్స్వరూపం లేదా భక్తి. లీలాభేదంతో పరమాత్మ - పరబ్రహ్మ భగవానుడని మూడు స్వరూపాలతో పేర్కొనబడుతున్నాడు కాని, భగవంతుడు సర్వదా సర్వథా ఒకే ఒక తత్త్వమని గ్రహించాలి. "సర్వశాస్త్రసమన్వయః స ఏవ పరమాత్మా భగవాన్ వాసుదేవః" అన్నారు శ్రీధరస్వామి. "వేదైశ్చ సర్వై రహమేవ వేద్యః" అనునది గీతలో శ్రీముఖోక్తి. ఇక బ్రహ్మసంహిత "ఈశ్వరః పరమః కృష్ణః సచ్చిదానంద విగ్రహః, అనాది రాదిః గోవిందః సర్వకారణ కారణమ్" అని స్పష్టపరిచింది. జగదీశ్వరుడు శ్రీకృష్ణుడు. ఆయన సచ్చిదానంద విగ్రహుడు. అనగా ఆయన శ్రీమూర్తి నిత్యజ్ఞానానంద స్వరూపము. ఆయన అనాది. కావున సమస్తతత్త్వాలకును అనాదియే. ఆయన సమస్తమునకు మూలము. ఆయనకు పూర్వము ఏ తత్త్వమును లేదు. ఆయనకు మరొక నామము "గోవిందుడు." ఈ అనంత జగత్తులోని సర్వకారణాలకు మూలకారణమైనవాడు శ్రీకృష్ణుడు.

**శ్లో. సత్త్వేన ప్రతిలభ్యాయ నైష్కర్మ్యేణ విపశ్చితా**
**నమః కైవల్యనాథాయ నిర్వాణసుఖసంవిదే.**

తా : వివేకులైన జనులు కర్మసన్న్యాసం ద్వారా లేదా కర్మసమర్పణం ద్వారా తమ అంతఃకరణాన్ని పరిశుద్ధ మొనర్చుకొని ఎవనిని ప్రాప్తింపజేసికొంటారో, తాను నిత్యముక్తుడు, పరమానందుడు, జ్ఞాన స్వరూపుడునై ఇతరులకు కైవల్యముక్తి దానం చేసే సామర్థ్యం గల ప్రభువెవరో వానికి నమస్కరిస్తున్నాను.

కైవల్యమనగా ప్రకృతి సంబంధ రాహిత్యము. అనగా మోక్షమని అర్థం. ఆ కైవల్యమునకు అధిపతి నిర్దుఃఖానందజ్ఞానస్వరూపుడు. వివేకవంతులు తమ అంతఃకరణాన్ని పరిశుద్ధం చేసుకోవడం మరొక ప్రయోజనంకోసం కారాదు. భగవత్ప్రవేశానికే పరిశుద్ధాంతఃకరణాన్ని ఉపయోగించుకోవాలి. కేవల బ్రహ్మజ్ఞాన మాత్రంచేత ఏ ఫలమును చేకూరదు. పరిశుద్ధాంతఃకరణులు చేపట్టిన శ్రవణ కీర్తన స్మరణాది ప్రక్రియ చేతనే జ్ఞాతయైన భగవంతుడు ఫలప్రదాత అవుతాడు.

**శ్లో. నమః శాంతాయ ఘోరాయ మూఢాయ గుణధర్మిణే**
**నిర్విశేషాయ సామ్యాయ నమో జ్ఞానఘనాయ చ**

తా : సత్త్వ రజస్తమముల మూడింటి ధర్మాన్ని స్వీకరించి క్రమంగా శాంత - ఘోర - మూఢ అవస్థలను ధారణ చేయునటువంటి, భేదరహితుడు, సమభావస్థితుడైన జ్ఞానాకారుడగు ప్రభువునకు పదే పదే నమస్కారం చేస్తాను.

**శ్లో. క్షేత్రజ్ఞాయ నమస్తుభ్యం సర్వాధ్యక్షాయ సాక్షిణే**
**పురుషాయాత్మమూలాయ మూలప్రకృతయే నమః**

తా : నీవు సమస్తమునకు స్వామివి, సమస్త క్షేత్రములకు ఏకైక జ్ఞాతవు. సర్వసాక్షివి. నీకు నమస్కారము. నీకు నీవే కారణమవు. మూల ప్రకృతి రూపముననున్న పురుషుడవగు నీకు నమస్కారము.

పై రెండు శ్లోకాలలోని విశేషార్థాలు ఇంతకు ముందే చర్చింపబడినవి. సాక్షి అనగా సర్వద్రష్ట. మూలప్రకృతి సర్వోపాదాన భూతము. కుండకు మట్టి ఉపాదాన కారణ మవుతుంది. మట్టిలేకుండా కుండ రూపొందదు. కావున అది మూల ప్రకృతి. "**ప్రకృతిం పురుషం చైవ విద్ధ్యనాదీ ఉభావపి**" (గీత 13-19) ప్రకృతి అనాదిభోగ్య అయినప్పుడు దాని భోక్త కూడా అనాది యై ఉండటం అనివార్యం. ఆ ఇద్దరి సంయోగానికి కారణ మిదే. "**ద్వావిమౌ పురుషౌ లోకే క్షరశ్చాక్షర ఏవ చ, క్షరః సర్వాణి భూతాని కూటస్థోక్షర ఉచ్యతే.**" "**ఉత్తమః పురుషస్త్వన్యః పరమాత్మేత్యుదాహృతః, యో లోకత్రయ మావిశ్య బిభర్త్యవ్యయ ఈశ్వరః**" (గీత 15-16, 17) క్షర - అక్షరులనే రెండు విధాలైన పురుషులు లోకంలో ప్రసిద్ధులు. వారిలో సమస్తజీవులు క్షర పురుషులు. కూటస్థులు అక్షర పురుషులు. వీరిద్దరికంటె కూడా ఒక ఉత్తమపురుషుడున్నాడు. అతనిని పరమాత్ముడంటారు. అతడే సర్వలోక నియంతయగు ఈశ్వరుడు. అతడు లోకత్రయంలో ప్రవిష్టుడై ఈ బ్రహ్మాండాన్ని పరిపాలిస్తుంటాడు. అతడే పురుషోత్తముడుగా, జగత్తుకు చరమ తత్త్వంగా కీర్తింపబడుతున్నాడు. ప్రకృతి - పురుషు లిరువురు ఆ పురుషోత్తముని శక్తికి లోబడినవారు.

కూటస్థుడు : "**కూటవత్ తిష్ఠతీతి కూటస్థః**" కూటమనగా బంగారునగలు చేసేవాని వద్దనుండు దిమ్మె. దానిమీద బంగారమునుపెట్టి సుత్తితో కొట్టి నానారూపములగు నగలు చేస్తాడు. కాని, ఆ దిమ్మె మాత్రం రూపు మారకుండా యథారీతిగానే ఉంటుంది. ముక్తాత్మ కూడా అలాంటిదే. బ్రహ్మాదిదేహాలతో సంబంధించియుండి కూడా, తద్వికారానికి లోను కాకుండా జ్ఞానైకాకారంతో ఉంటుంది. అందుచేత అతడు కూటస్థుడనీ అక్షరుడనీ పేర్కొనబడినాడు. అనగా అచిత్సంసర్గాన్ని వీడి స్వకీయరూపంతో ఉన్న ముక్తాత్మ అని అర్థము.

**శ్లో. సర్వేంద్రియగుణద్రష్టే సర్వప్రత్యయహేతవే**
**అసతాచ్ఛాయయోక్తాయ సదాభాసాయ తే నమః**

తా : నీవు సకలేంద్రియాలకు వాటి విషయాలకు ద్రష్టవు. సర్వజ్ఞానాలకు ఆధారమవు. అహంకారాది ఛాయారూపాలైన అసద్వస్తువుల వలన కూడా నీ అస్తిత్వము వెల్లడవుతుంది. సమస్త వస్తువుల ఉత్తమత్వరూపంతో కేవలం నీవే భాసమాను డవుతుంటావు. అటువంటి నీకు నమస్కారం చేస్తున్నాను.

సకలేంద్రియాలు శ్రోత్రాదులు. వాటి విషయాదులైన శబ్దాదులకు నీవు ద్రష్టవు. ఇంద్రియాల వృత్తిని ఎరిగినవాడవని అర్థం. సాంఖ్యదర్శనం ప్రకృతి - పురుషుల అనాదితత్త్వాన్ని తెలుపుతుంది. ప్రకృతి వలన మహత్తత్వం, దానినుండి అహంకారం, దానినుండి పంచతన్మాత్రలు ఉత్పన్నమయ్యాయి. వాటి వలన పంచ మహాభూతాలు ఏర్పడ్డాయి. మహత్తత్వం, అహంకారం, తన్మాత్రలు వీటి మూలంగా జ్ఞానేంద్రియ, కర్మేంద్రియాలు, మనస్సు మొదలైనవి ఆ ప్రకృతికి చెందిన వికృతులు. ప్రకృతి అచేతనమైనది. దాని యందు చేతనపుంజరూపమైన గర్భాన్ని ఉంచేవాడను నేనే అని శ్రీకృష్ణుడు గీతలో (14-3) చెప్పియున్నాడు. "మమ యోని ర్మహద్బ్రహ్మ తస్మిన్ గర్భం దధామ్యహమ్" ఈ ప్రకృతుల రెంటికి భగవంతుడు కావించిన సంయోగం వల్ల (సంయుక్తమైన రెండు ప్రకృతులవల్ల) బ్రహ్మాది స్తంబపర్యంతం గల సమస్తభూతాలకు పుట్టుక ఏర్పడుతున్నది. సత్త్వాదిగుణాలు శబ్ద స్పర్శాది గుణాల వలె ప్రత్యక్షంగా కన్పించవు. పృథివి యొక్కగుణమైన గంధము దాని యందు తెలియక దానిలో పుట్టిన పుష్పంవల్ల తెలుస్తుంది. చిత్తునకు అచిత్తునకు నామరూప విభాగమేదీ లేని సూక్ష్మావస్థ కారణావస్థ అవుతుంది. నామరూప విభాగ యుక్తమైనప్పటి స్థూలావస్థయే కార్యావస్థ అవుతుంది. ఈ రెండు అవస్థలలో అవి ఈశ్వరునికి అపృథక్సిద్ధములై అనగా ఆ ఈశ్వరుని విడిచి వేరుగా ఉండజాలనివై, అంతా ఈశ్వరుడే అన్నట్లుంటాయి. కనుక భగవంతుడు చిదచిద్విశిష్టుడై కార్యమవుతున్నాడు. ఆయన కార్యావస్థలో ఉన్నప్పుడు పరపురుషుడు. కారణావస్థలో ఉన్నప్పుడు పరమపురుషుడు అవుతున్నాడు. కాబట్టి అహంకారాది ఛాయారూపాలైన అసద్వస్తువులన్నీ భగవత్స్వరూపాన్ని వెల్లడిస్తాయి.

**శ్లో. నమో నమస్తేఽఖిలకారణాయ నిష్కారణాయాద్భుతకారణాయ**
**సర్వాగమామ్నాయమహార్ణవాయ నమోపవర్గాయ పరాయణాయ**

తా : నీవు సమస్తానికి మూలకారణమవు. నీకే కారణమూ లేదు. ఏదైనా కారణంగాని ఉంటే నీయందు ఏ వికారమూ పరిణామమూ జరగదు. కాబట్టి నీవు

విలక్షణమూ అద్భుతమూ అగుకారణమవు. నీకు పదే పదే నమస్కారము. సమస్త నదీ ప్రవాహాలకు పరమాశ్రయం సముద్రమైనట్లుగా, నీవు సమస్తవేదశాస్త్రాలకు పరమతాత్పర్యమవు. మోక్షస్వరూపుడవు. భక్తియోగనిష్ఠులైన ఉత్తములకు పరమప్రాప్యుడవు. నీకు నమోవాకము.

అఖిలకారణుడవు. అనడంవల్ల కర్తృ కర్మ కరణ సంప్రదాన అపాదాన అధికరణ రూపుడవు నీవే యని సర్వకారకములు నీచేతనే జరుగుతున్నవని తాత్పర్యం. అన్యత్ర చూడబడని, వినబడని అద్భుతకార్యములు గలవాడవు, సర్వవేదశాస్త్ర ప్రతిపాదితుడవు "సకలవేదశాస్త్రోపనిషద్రసమ్ము" అగు నీకు నమస్కారము.

**శ్లో. గుణారణిచ్ఛన్నచిదూష్మపాయ తత్క్షోభవిస్ఫూర్జితమానసాయ**
**నైష్కర్మ్యభావేన వివర్జితాగమస్వయంప్రకాశాయ నమస్కరోమి**

తా : సత్త్వాదిగుణాలనెడి అరణి (నిప్పు చేయు సాధనం) చేతకప్పబడిన జ్ఞానాగ్నివి నీవు. గుణ సంక్షోభం కలిగినపుడు వాటితోనే వివిధప్రకారాలైన సృష్టిరచనకు సంకల్పిస్తావు. కర్మ సన్న్యాసం ద్వారా గానీ, కర్మ సమర్పణ ద్వారా గానీ నైష్కర్మ్య భావంతో ఆత్మతత్త్వాన్ని తెలుసుకొన్నట్టి ఆగమాతీతులైనవారికి స్వయంగా ప్రకాశమానుడవుతుంటావు. అటువంటి నీకు నమస్కారము.

సత్త్వాదిగుణాత్మికయైన ప్రకృతి ఒక అరణి. దానిచేత సంఛన్నమైనది జీవసమష్టి రూపమగు అగ్నిని త్రాగుతుంటావు. చిదచిద్విక్షోభసమయంలో స్వసంకల్పాను సారంగా వివిధసృష్టిరచన చేస్తుంటావు. కర్మసన్న్యాసంగాని, కర్మసమర్పణగాని చేసిన ఆగమాతీతులకు స్వయంప్రకాశుడవవుతుంటావు. అనగా పరమయోగి వాఙ్మనసాపరిచ్ఛేద్యజ్ఞానస్వరూపుడవు. ఎంతటివారైనను మోక్షలాభపర్యంతము శాస్త్రమును అనుసరింపవలసినదే. కానీ, నైష్కర్మ్యనిష్ఠులుమాత్రం ఆగమాతీతులవుతారు.

**శ్లో. మాదృక్ప్రపన్నపశుపాశవిమోక్షణాయ**
**ముక్తాయ భూరికరుణాయ నమోఽలయాయ**
**స్వాంశేన సర్వతనుభృ న్మనసి ప్రతీత**
**ప్రత్యగ్దృశే భగవతే బృహతే నమస్తే**

తా : దయాళుడగు పురుషుడు ఉచ్చులో పడిన జంతువును విడిపించినట్లుగా నీవు కర్మపాశంనుండి నా వంటి శరణాగతునికి విముక్తి కలిగిస్తావు. నీవు ముక్తి స్వరూపుడవు. దయాసముద్రుడవు. భక్తరక్షణలో ఎన్నడు ఆలసింపనివాడవు. నీ

శుభచరణములకు నమస్కారము. సమస్త ప్రాణుల హృదయాలలో నీ అంశతో అంతరాత్మరూపంతో విరాజిల్లుతుంటావు. నీవు సర్వైశ్వర్య పరిపూర్ణుడవైన భగవానుడవు. (పరబ్రహ్మవు) అనంతుడవు. నీకు నమస్కారము.

**"బృహత్వాత్ బృంహణత్వాచ్చ బ్రహ్మ బృహత్".** విస్తారమైనవాడు జగద్రూపంతో మిక్కిలి విస్తరించినవాడు. **"మహతో మహీయాన్"** అని శ్రుతి. ఆ భగవంతుడు ఉత్కృష్టుల కంటె కూడా ఉత్కృష్టుడు (మహత్తుకంటె మహత్తుగా నున్నవాడు) **"అణుర్ బృహత్ కృశః స్థూలః"** అని విష్ణుసహస్రనామాలలో కఠోపనిషద్వాక్యమే ఉన్నది. "భూరి కరుణాయ - అలయాయ" రెండు విశేషణాలు సన్నిహితంగా ఉండటంచేత భగవంతుడు తన భక్తులను రక్షించడంలో ఆలసింపని కరుణాసముద్రుడన్న భావమున్నది. **"న మే భక్తః ప్రణశ్యతి"** (గీత. 9-31) నా భక్తుడు నాశమునొందడు. అనగా నా భక్తికి అడ్డుతగిలిన ఆటంకములు అన్నియు నశించి, నన్ను భజించుటకు ఉపక్రమించినవాడు పరిపూర్ణభక్తుడవుతాడు. నా యెడ నారంభించిన భక్తి పరిపూర్ణభక్తికి హేతువవుతుంది. అందుకు కారణం భగవంతుడు కృపాసముద్రుడగుట చేతనే అని గ్రహింపవలయును. ఇది ఆ శ్రీకృష్ణుని దివ్యవాణి. ఆ భూరికరుణాసముద్రుని హృదయోద్గారమే భగవద్గీత. శ్రీకృష్ణభగవద్గుణశ్రవణం వల్లనే హృదయంలోని కాఠిన్యం కరగి ద్రవిస్తుంది. ద్రుతహృదయ ధారావాహికత్వమే భక్తి. అది అవిచ్ఛిన్న ప్రవాహము. దానికి క్షతి ఉండదు. "మద్గుణశ్రుతిమాత్రేణ మయి సర్వగుహాశయే, మనోగతి రవిచ్ఛిన్నా యథా గంగాంభసోం ఒబుధౌ" (శ్రీమద్భా. 3-29-11) "అఖండగంగాప్రవాహం మహాసముద్రంలోనికి పరుగిడినట్లుగా నా కల్యాణగుణాలను విన్నమాత్రంచేత వినువాని చిత్తవృత్తి సర్వాంతర్యామినైన నా లోనికి అవిచ్ఛిన్నంగా ప్రవహిస్తుంది." ఇది భగవదుక్తి. కాబట్టి **"తస్మాత్ కేనా ప్యుపాయేన మనః కృష్ణే నివేశయేత్"** (శ్రీమద్భా. 7-1-31) కాబట్టి ఏ ఉపాయం చేతనైనప్పటికి మనస్సును శ్రీకృష్ణునియందు లగ్నము చేయవలయునన్నది నారదమహర్షి చేసిన ఉపదేశము. ఉపాయమనడంవల్ల ఇది శిశుపాలాదులకు వర్తించదు. భగవంతుని కల్యాణగుణాలను ధర్మబుద్ధితో విన్నప్పుడే భక్తిలక్షణాలు కలుగుతాయి. ద్వేషబుద్ధితో ఉన్నప్పుడు భక్తి కలుగదు. శిశుపాలుడు ద్వేషంతోను, కంసుడు భయంతోను శ్రీకృష్ణునిపై మనసుంచినట్లుగా కాదు, తమకు శ్రేయస్సు కలిగిస్తాడన్న విశ్వాసంతో వృష్ణివంశజులవలె, విదురభీష్మాక్రూరార్జునగోపగోపికలవలె శ్రీకృష్ణునియందు మన సుంచవలయునని తాత్పర్యము.

వ. మఱియును

సీ. వరధర్మకామార్థవర్జితకాములై విబుధు లెవ్వాని సేవింతు రిష్ట
గతిఁ బొందుదురు, చేరి కాంక్షించువారి కవ్యయదేహమిచ్చు నెవ్వాఁడు కరుణ
ముక్తాత్ములెవ్వని మునుకొని చింతింతు రానందవార్ధిమగ్నాంతరంగు
లేకాంతు లెవ్వనినేమియుఁ గోరక భద్రచరిత్రంబుఁ బాడుచుందు

రా మహేశు నాద్యు నవ్యక్తు నధ్యాత్మయోగగమ్యుఁ బూర్ణు నున్నతాత్ము
బ్రహ్మమయినవానిఁ బరుని నతీంద్రియు నీశు స్థూలు సూక్ష్మునే భజింతు.

టీ : వర = శ్రేష్ఠములైన; ధర్మ - కామ - అర్థ = ధర్మము, కామము,ధనము అను పురుషార్థత్రయముచేత, వర్జిత = విడువబడిన; కాములు = కోర్కెలు గలవారై, (పురుషార్థత్రయాన్ని విడిచిపెట్టడంలో ఆసక్తి గలవారై), విబుధులు = పండితులు, ఎవ్వానిని, సేవించి = ఆరాధించి; ఇష్టగతిన్ = కోరిన మార్గమును, పొందుదురో; చేరి = దరిజేరి, కాంక్షించువారికి = కోరువారికి, ఎవ్వాడు, కరుణన్ = కృపతో; అవ్యయదేహమున్ = దివ్య శరీరమును; ఇచ్చునో; ముక్తాత్ములు = దేహాభిమానమును విడుచువారు, ఎవ్వని = ఏదేవదేవుని, మునుకొని చింతింతురు = ముందుకు వచ్చి చింతింతురో - ధ్యానింతురో; ఆనందవార్ధి మగ్న+అంతరంగులు = ఆనందమనెడి సముద్రములో మునిగిన మనస్సుగలవారు, అగు, ఏకాంతులు = అనన్యభక్తులు, ఎవ్వానిని, ఏమియుకోరక, భద్రచరిత్రంబు = ఆ భగవంతుని దివ్యకళ్యాణ చరిత్రమును, పాడుచుందురో, ఆ మహేశుని = ఆ మహేశ్వరుని; ఆద్యున్ = ఆదిదేవుని; అవ్యక్తున్ = తెలుసుకొనుటకు సాధ్యముకానివానిని, అధ్యాత్మయోగగమ్యున్ = అధ్యాత్మయోగముచే చేరదగినవానిని; పూర్ణున్ = పరిపూర్ణుని; ఉన్నత+ఆత్మున్ = పరమాత్మను; బ్రహ్మమయినవానిని = పరబ్రహ్మమైన వానిని, పరుని = పరాత్పరుని, అతీంద్రియు = ఇంద్రియముల శక్తిని మించినవానిని, ఈశున్ = జగన్నియంతను, స్థూలున్ = విశ్వమంతటను వ్యాపించి బలిసిన వానిని; సూక్ష్మ = అణుస్వరూపుడైనవానిని, సర్వేశ్వరేశ్వరుని; నేను భజింతును.

తా : ధర్మార్థకామాలను వదలుకొనిన జ్ఞానులు ఏభగవంతుని కొలుచుటకు ఇష్టపడతారో, తనను కొలుచువారికి ఏ భగవంతుడు శాశ్వతమగు మోక్షమును ప్రసాదిస్తాడో, అనన్యభక్తులు ఏ భగవంతుని నిరంతరం నవవిధభక్తిచే భజిస్తూ ఆనందసముద్రమందు ఓలలాడుతూ ఏమియు కోరక కీర్తిస్తుంటారో, ఆ మహేశ్వరుని, మనోవాక్కులకు అతీతుని, ఆద్యుని, అవ్యక్తుని, అధ్యాత్మయోగగమ్యుని, పూర్ణపురుషుని, పరమాత్మను, పరబ్రహ్మను, పరాత్పరుని, హృషీకేశుని, స్థూలుని, సూక్ష్మని నేను భజిస్తాను.

పురుషార్థములు నాలుగు. ధర్మము, అర్థము, కామము, మోక్షము అనునవి.

వీటిలో మూడింటిని అనగా ధర్మార్థకామాలను వదలుకొని కేవలము మోక్షమును కోరుకొని భగవంతుని సేవించేవారు కొందరు. వారు మోక్షకాంక్షులు. మోక్షం పొందడానికి మూడు విధాలైన సాధనాలున్నాయి. భక్తి యోగము, జ్ఞానయోగము, అష్టాంగయోగము అని. ఈ మూడింటి లక్ష్యము ఒకటే. **"భగవాన్ పరమాత్మేతి ప్రోచ్యతే ఽష్టాంగయోగిభిః, బ్రహ్మేత్యుపనిషన్నిష్ఠైః జ్ఞానం చ జ్ఞానయోగిభిః"** విశ్వచైతన్యసత్తును భక్తులు భగవంతుడని పేర్కొంటారు. ఆయన్ను అష్టాంగయోగులు 'పరమాత్మ' అంటారు. వేదాంతులు "బ్రహ్మ"మంటారు. సాంఖ్యయోగ జ్ఞానులు 'జ్ఞానస్వరూప' మంటారు. యోగులు "ఆత్మపరమాత్మల ఐక్యాన్ని" కోరుకొంటారు. వేదాంతులు తాము "బ్రహ్మభూతులు" కావడాన్ని వాంఛిస్తారు. జ్ఞానులు "స్వరూపస్థితి"ని కోరుకుంటారు. భక్తులు "భగవత్ప్రాప్తి"ని కోరుకొంటారు. భక్తులు "దాసోఽహమ్" అంటే, జ్ఞానులు'దాస'లోని 'దా'ను వదలివేసి కేవలం "సోఽహమ్" అంటారు. దానికే 'స్వస్వరూపస్థితి' అనీ, "బ్రహ్మనిష్ఠ" అనీ పేరు. భగవంతుని దురత్యయమైన మాయ జ్ఞానులను మోహపెట్టవచ్చు. అహంకారాన్ని కలిగించవచ్చు. కాని, ఆ మాయ తన ప్రభావాన్ని భక్తుల పట్ల చూపదు. భక్తులందు అనన్యత్వమూ అకించనత్వమూ నిశ్చయంగా ఉంటుంది. అనన్యత్వమంటే భగవంతుని వదలి మరి దేనిమీదను ఆసక్తి లేకుండటం, భార్య సాంసారికజీవనంలో అందరిని ఆదరిస్తుంది. కాని, కేవలం తన భర్తను మాత్రమే భజిస్తుంది. తన హృదయంలో భర్తకే స్థానమిస్తుంది. భక్తుని స్థితి కూడా ఇంతే. ప్రేమాస్పదుడైన భగవంతునికి ప్రేమకు మధ్య మరెవ్వరికీ స్థానముండదు. ఏకాంతు లనగా దేవతాంతర శూన్యులని అర్థం. భగవంతుడు భక్తుడు ఎల్లప్పుడు ఏకాంతంలోనే ఉంటారు. భక్తుడు ఏకాంతంలో భగవంతునిలో కలిసిపోతాడు. భగవంతుడుకూడా భక్తునిలో కలిసి పోతాడు. ఏకాంతభక్తికి లక్షణ మిదే. భక్తిజ్ఞానాలకంటె అన్యమైన ఫలం ఆశింపనివాడు పరమైకాంతి. జ్ఞానం పురుషుని వంటిది. భక్తి స్త్రీ వంటిది. పురుషుడు మాయానారి వలలో సులభంగా పడిపోతాడు. మాయానారినుంచి అతడు విడిపోయినప్పుడే వైరాగ్యవంతుడవుతాడు. జ్ఞానికి మాయానారీబాధ తప్పదు. కాని, భక్తి దరిదాపులకు మాయానారి రాలేదు. వస్తే పరిహాసపాత్ర అవుతుంది. అహంకారి అయిన సాధకుణ్ణి భగవత్సాధకుడు అనడానికి వీలుకాదు. అతడు మహాపరాధి అవుతాడు. కాని, భగవంతుణ్ని దీనంగా ప్రార్థన చేసే ఒక పాపిని సాధకుడని చెప్పవచ్చు.

ఆనందవార్ధిమగ్నాంతరంగులు : ఆనందమనేది ఒక అంతులేని సముద్రం. ఆనందానికి సుఖానికి అంతరమున్నది. దుఃఖానికి వ్యతిరేకమైనది సుఖం. ఆనందం కేవలం ఆనందం ఆనందమే. ఆనందం భగవంతుని యందున్నది. ఆయన ఆనందస్వరూపుడు. **"ఆనందం బ్రహ్మణో విద్వాన్ న బిభేతి కదాచన"** (తైత్తిరీయ శ్రుతి). భగవంతుడు ఆనందస్వరూపుడని గ్రహించిన విద్వాంసుడు ఎన్నటికి భయపడడని ఆ శ్రుతివాక్యానికి అర్థం. ఈ జగమంతా భగవన్మయము. ఇక భయమెందుకు? అనుక్షణం ఈ జగత్తులో భగవంతుని లీలలు దర్శనమిస్తున్నాయి. కాబట్టి సర్వత్ర సర్వదా ఆనందమే ప్రాప్తిస్తుంది. అట్లు భావింపక ఈ జగత్తునుండి భగవంతుణ్ని వేరుపరచి కేవలం జగత్తును, దాని కార్యాలను చూస్తేమాత్రం ఈ జగత్తు నిశ్చయంగా అశాశ్వతమైనదిగా, భయానకమైనదిగా, దుఃఖాలయంగా కనిపిస్తుంది.

బ్రహ్మమనగా **"బృహత్వాద్ బృంహణత్వాచ్చ బ్రహ్మ ఇత్యభిధీయతే" "బృహంతోయస్మిన్ గుణాః"** ఇత్యాది శ్రుత్యంతర వాక్యాల వల్ల అలౌకిక సర్వగుణ యుక్తుడని అర్థము. సచ్చిదానందరూపుడు, వ్యాపకుడు, సర్వశక్తిమంతుడు, స్వతంత్రుడు, ప్రాకృతగుణరహితుడు బ్రహ్మ. బ్రహ్మమే పరబ్రహ్మ. కొందరు బ్రహ్మను నిర్ధర్మునిగా భావిస్తారు. బ్రహ్మ నిర్ధర్ముడైతే అనుపాస్యుడు, అప్రాప్యుడు అవుతాడు. అట్టి వానివల్ల ఎట్టి ఫలమూ ప్రాప్తించదు. కాబట్టి బ్రహ్మ స్వతంత్రుడే. నిరతిశయ జ్ఞాన క్రియాశక్తులు గలవాడే పరబ్రహ్మ: ఆయన నిర్విశేషుడు అనగా హేయగుణములు లేనివాడని అర్థం. సవిశేషుడనగా అనంత కళ్యాణగుణాలు గలవాడని అర్థం. ఆయన అచ్యుతుడు. **"ఏవం ప్రకృతి రవ్యక్తః కర్తా చైవ సనాతనః, పరం చ సర్వభూతేభ్య స్తస్మాద్ బృహత్తమోచ్యుతః"** ఇత్యాది శ్రుతిస్మృతులను బట్టి బ్రహ్మమనగా సనాతనుడైన అచ్యుతుడు. **"పూర్ణం బ్రహ్మసనాతనమ్"** (శ్రీమద్భా. 10-14-32). ఇది చతుర్ముఖ బ్రహ్మ వాక్యము. భగవచ్ఛబ్దము యొక్క ముఖ్యవృత్తి సర్వేశ్వరుడగు శ్రీకృష్ణునికే అన్వయిస్తుంది. **"భగవానితి శబ్దోయం తథా పురుష ఇత్యపి, నిరుపాధీ చ వర్తేతే వాసుదేవే సనాతనే"** ఆ వాసుదేవునికి సంబంధించినదే జ్ఞానం. ద్రష్టవ్యుడు, శ్రోతవ్యుడు, మంతవ్యుడు, నిదిధ్యాసితవ్యుడు అతడే. స్వరూపగుణ శక్త్యాదులచేత నిరతిశయ బృహత్తముడైనవాడు, బ్రహ్మశబ్ద వాచ్యుడు, వాసుదేవుడగు శ్రీకృష్ణభగవానుడే జిజ్ఞాసితవ్యుడు, వేదవేదాంగ సమస్తశాస్త్ర ప్రతిపాదితుడైన భగవానుడు శ్రీకృష్ణుడే. శ్రీశంకరభగవత్పాదులు విగతవిషయతృష్ణులై వారాణసి

వద్ద గంగ ఒడ్డున నిలిచి ఆరాధించినది శ్రీకృష్ణున్నే. **"భగవతి తవ తీరే నీరమాత్రాశనో ఽహం విగతవిషయతృష్ణః కృష్ణ మారాధయామి"** అన్నారు. ఆ మహాత్ముడు నిలువు బొట్టు పెట్టకపోవుగాక, ఆయన నిరంతరం ధ్యానించినది శ్రీకృష్ణరూపమునే అని స్పష్టమవుతున్నది. **"యం శైవాః సముపాసతే శివ ఇతి బ్రహ్మేతి వేదాంతినో, బౌద్ధా బుద్ధ ఇతి ప్రమాణపటవః కర్తేతి నైయాయికాః, అర్హన్నిత్యథ జైనశాసనరతాః కర్మేతి మీమాంసకాః, సోయం వో విదధాతు వాంఛితఫలం త్రైలోక్యనాథో హరిః"** అని ఏ మహాత్ముడో శ్రీహరిని స్తుతించాడు. 'శైవులచేత శివుడనీ, వేదాంతులచేత బ్రహ్మమనీ, బౌద్ధులచేత బుద్ధుడనీ, ప్రామాణ్యావాదులచేత కర్త యనీ, జైనుల చేత అర్హతుడనీ, మీమాంసకులచేత కర్మమనీ ఉపాసింపబడే ఆ త్రైలోక్యనాథుడైన శ్రీహరి మాకు అభీష్ట ఫలములను ప్రసాదించుగాక!" భగవంతుడు **"అణోరణీయాన్ మహతో మహీయాన్"** అని శ్రుతులు వెల్లడించాయి. త్రికాలనిత్యస్థితుడు. త్రిలోకవ్యాప్తుడు. త్రిలోకాల కావలనున్నవాడు. అసీముడు. అందరియందున్నవాడు. ఆయనకు ఆయనయే జ్ఞాత. ఆయనస్వరూపభేదాలు ఆయనకే తెలుసు. మన మనస్సులలోగల మాలిన్యాన్ని తొలగించుకొని సమస్త జగత్తులో ఆ భగవంతుణ్ని సాక్షాత్కరింప జేసుకోవడమే మన ధర్మం. సమస్త ధర్మాలు, సంప్రదాయాలు ఆ భగవంతునిచాయనుమాత్రమే ప్రత్యక్షం చేస్తాయి. నానాదిశలనుండి వచ్చే నదులన్నీ సముద్రం వైపునకు పరుగిడినట్లుగా సకలసంప్రదాయాలవారును సుఖస్వరూపుడగు భగవంతుని వైపునకు చేరుకోవడమే పరమధర్మం. **"రుచీనాం వైచిత్ర్యాత్ ఋజుకుటిల నానాపథజుషాం, నృణామేకో గమ్యః త్వ మసి పయసా మర్ణవ ఇవ"** అని శ్రీపుష్పదంతులవారి భావమే మానవాళిని తరింపజేస్తుంది. ముక్తాత్ములు, పరమాత్మైక నిష్ఠులు, ఆత్మారాములు భగవంతుణ్ని నిష్కామంగా భజిస్తారు. నిఖిల విషయ విరక్తజన మనోవశీకరణ చతురగుణగణ సుందరరూపుడైన శ్రీకృష్ణభగవానుని యోగులు స్మరిస్తూ ఆనందామృత సాగరంలో తేలుతుంటారు. **"ఆత్మారామాశ్చ మునయో నిర్గ్రంథా అప్యురుక్రమే, కుర్వ న్త్యహైతుకీం భక్తి మిత్థంభూతగుణో హరిః"** (శ్రీమద్భా. 1-7-10) జీవన్ముక్తుల చిత్తాన్ని హరించేవాడు శ్రీకృష్ణభగవానుడు. ఆయన నామాలలో **"ఆత్మారామగుణాకర్షి"** అనేది ఒకటి.

**వ. అని మఱియు నిట్లని వితర్కించె.**

ఈ విధంగా స్తుతించి గజేంద్రుడు భగవత్తత్త్వం గురించి ఆలోచింపసాగాడు.

**సీ. పావకుం డర్చుల భానుండు దీప్తుల నెఱ్ఱంగి నిగిడింతు రెట్లడంతు**
**రా క్రియ నాత్మ కరావళిచేత బ్రహ్మాదుల వేల్పుల నఖిలజంతు**

**గణముల జగముల ఘననామరూపభేదములతో మెఱయించి తగ నడంచు**
**నెవ్వఁడు మనము బుద్ధీంద్రియంబులుఁ దాన యై గుణ సంప్రవాహంబు నెఱపు**

**స్త్రీ నపుంసక పురుషమూర్తియునుఁగాక తిర్యగమరనరాదిమూర్తియును గాక**
**కర్మగుణభేదసదసత్ప్రకాశిగాక వెనుక నన్నియుఁ దానగు విభుఁ దలంతు**

టీ : పావకుండు = అగ్ని,అర్చులన్ = మంటలను, భానుండు = సూర్యుడు, దీప్తులన్ = కాంతులను, ఏ భంగిన్ = ఏవిధంగా, నిగిడింతురు = ప్రసరింపజేయుదురో; ఎటు వలె అడంతురు = ఏవిధంగా అణచివేయుదురో, ఆక్రియన్ = ఆ విధంగా; ఎవ్వడు; ఆత్మకర+ఆవళిచేతన్ = తన కిరణ సమూహములచేత, బ్రహ్మాదులన్ = బ్రహ్మ మొదలగు వారలను, వేల్పులన్ = దేవతలను; అఖిల జంతు గణములన్ = సకల జీవసమూహములను, జగములన్ = లోకములను, ఘన నామ రూప భేదములతో = గొప్పవైన నామాలతోఆకారాలతో, మెఱయించి = కనిపింపజేసి, తగన్ = తగినట్లుగా, అడంచున్ = అణచివేయునో, ఎవ్వఁడు, మనము, బుద్ధి, ఇంద్రియములు, తానెయై, గుణప్రవాహంబు = గుణముల ప్రచారమును; నెఱపునో; ఎవడు, స్త్రీకాని, నపుంసక = షండుడు గాని, పురుష మూర్తియును, కాక, తిర్యక్+అమర - నర+ఆదిమూర్తియును కాక; పశుపక్షులు, దేవతలు, మనుష్యులు మున్నగువారును కాకుండగా, కర్మ = కర్మకుగాని, గుణ గుణమునకుగాని,భేద = వేరైన, సత్+అసత్ = ఉండుట లేకుండుటయును ఐన వానిని, ప్రకాశిగాక = ప్రకాశింపజేసేవాడు కాకుండా; ఉండి,వెనుక ఆ పిమ్మట అన్నియును, తాను+అయ్యెడు = తానగునట్టి, విభుని = ప్రభువును, తలంతున్ = ధ్యానింతును.

తా : అగ్ని మంటలను, సూర్యుడు కాంతులను ప్రసారంచేసి తనలో అణచుకొనునట్లుగా, ఏ ప్రభువు బ్రహ్మాదులను తన సంకల్ప మాత్రమున సృజించి, మరల అణచివేయునో, బుద్ధీంద్రియాలకు ఎవడు లోకవర్తనము కలిగించునో, ఎవడు స్త్రీ పుం నపుంసక లింగభేదములు లేక యుండునో, ఎవడు దేవమనుష్యతిర్యక్ జాతులకు చెందియుండడో, ఎవడు గుణకర్మలకు సత్ అసత్తులకు లోనుకాకుండునో అట్లుండియు అవి యన్నియు తానై యున్న పరబ్రహ్మమును ధ్యానింతును.

వామనావతార ఘట్టంలో బలిచక్రవర్తి భార్య వింధ్యావళి శ్రీహరిని ఇలా ప్రస్తుతిస్తుంది. **"క్రీడార్థ మాత్మన ఇదం త్రిజగత్ కృతం తే"** (శ్రీమద్భా. 8-22-20) "ప్రభూ! నీవు నీ క్రీడకై ఈ సంపూర్ణ జగత్తును రచించుకొన్నావు. కుబుద్ధులు ఇదంతా తమదే అనుకొంటారు. నిజానికి కర్తవు, భర్తవు, సంహర్తవు నీవే" అని ఆ శ్లోక తాత్పర్యం. ఈ జగత్తులో నిఖిలవస్తువులు భగవదీయములే. భగవద్బుద్ధిని

సంపాదించుకొని దేహాదులను భగవత్సేవోపయోగ కార్యానికి నివేదించుకోవడమే మనుష్యధర్మం. భగవదీయమైన వస్తువులందు స్వకీయత్వాభిమానం కలిగిందంటే మనుష్యుడు బహిర్ముఖుడవుతాడు. అప్పుడు భగవన్నివేదన మనేది వ్యర్థమవుతుంది. ఈ జగత్తు భగవంతుని క్రీడార్థ మేర్పడింది. **"భోగార్థం సృష్టి రిత్యన్యే, క్రీడార్థమితి చాపరే, దేవస్యైష స్వభావోయ మాప్తకామస్య కా స్పృహా"** భగవంతుడు ఆప్తకాముడు, అనగా అవాప్తసమస్తకాముడు. ఆయనకు కావలసింది ఏదీ ఈ జగత్తులో లేదు. అనగా అన్నీ ఆయనకున్నవి. ఆయన పరమాత్మ. ఆత్మకు స్త్రీ పుం నపుంసకత్వాలు ఉండవు. **"న స్త్రీ న పుమానేషా నైవ చేయం నపుంసకమ్"** లింగభేదం ఈ త్రిగుణాత్మకమైన ప్రకృతిలోనే ఉంటుంది. భగవంతుడు ఈ ప్రకృతికి చెందినవాడు కాదు. కాబట్టి ఆయన త్రివిధలింగ రహితుడు. భగవంతుని చరిత్ర, లీల అత్యద్భుతం. ఆయన మహిమను చెప్పడానికి వాక్కు చాలదు, వాయి చాలదు. అట్టి భగవంతుడు ఈ అల్పజీవి చేసే ఆక్రందనను వింటాడా? ఈతని ధ్యానాన్ని గమనిస్తాడా? ప్రేమ భక్తివిధానాలలో ఆత్మనివేదనకు భగవంతుడు సంతుష్టుడవుతాడు. అందుకు మనుష్యుడు దేహాదులందు స్వకీయత్వబుద్ధిని నివృత్తి చేసుకొని భగవదీయత్వ బుద్ధిని సంపాదించుకోవలసియున్నది. భగవదీయత్వబుద్ధియే ప్రేమలక్షణమైన భక్తిగా మార్పుచెంది ఆత్మనివేదనకు అనుకూలమవుతుంది. "ప్రీయతేఽమలయా భక్త్యా హారిరన్యద్ విడంబనమ్" (శ్రీమద్భా. 7-7-52). అనన్య భక్తికే శ్రీహరి ప్రీతి చెందుతాడు. తక్కిన సాధనాలన్నీ విడంబనములే. **"భక్త్యాహ మేకయా గ్రాహ్యః"** (శ్రీమద్భా. 11-14-21). కేవలం భక్తిచేతనే నేను గ్రహింపదగినవాడను. **"వశీ కుర్వంతి మాం భక్త్యా"** (శ్రీమద్భా. 9-4-66) భక్తిచేతనే నన్ను వశపరచుకోగలుగుతారు. **"భక్త్యైవ తుష్టి మభ్యేతి"** భక్తిచేతనే భగవంతుడు సంతుష్టి చెందుతాడన్న ఈ మొదలైన వాక్యాలన్నీ ప్రేమలక్షణభక్తితోనే భగవంతుడు లభ్యుడవుతాడని చెబుతున్నాయి. ప్రేమభక్తిచే కాకుండా తదితరసాధనాలవల్ల భగవంతుడు లభింపడనడానికి మరొక ఉదాహరణ: యశోద శ్రీకృష్ణుణ్ని ఎన్నెన్నో త్రాళ్లతో బంధించడానికి ప్రయత్నించింది. కానీ శ్రీకృష్ణుడు బద్ధుడు కాలేదు. అది చూచి యశోద దుఃఖపడింది. తల్లి అశక్తురాలు కావడం, దుఃఖపడటం చూచి జాలిపడి తన భక్తవశ్యతను లోకానికి చాటడానికి శ్రీకృష్ణభగవానుడు ఆ త్రాళ్లకు బద్ధుడయ్యాడు.

ఈ పద్యంలోని విశేషాలను తెలుసుకోవడానికి **"యథార్చిషోగ్నేః"** అనే శ్లోక వ్యాఖ్యానాన్ని పఠింపుడని మనవి.

**కం. కలఁడందురు దీనుల యెడఁ గలఁడందురు పరమయోగిగణములపాలం**
**గలఁ డందు రన్ని దిశలను గలఁడు కలం డనెడివాఁడు కలఁడో లేఁడో!**

టీ : దీనులయెడన్ = దీనుల పట్ల; కలఁడందురు = (భగవంతుడు) ఉన్నాడందురు. పరమయోగి గణముల పాలన్ = మహాయోగుల సమూహములందు కలడందురు; అన్ని దిశలను, కలడందురు. కలడు కలడు అని రూఢిగా చెప్పు దేవుడు, కలడో లేడో! ఎంత ప్రార్థించినను రాలేదు. అసలు ఉన్నాడా లేడా?

పోతనగారు సప్తమస్కంధంలో ప్రహ్లాదచరిత ఆపాత రమణీయంగా రచించారు. అందులో ప్రహ్లాదుడు "**కలఁడంభోధిఁ గలండు గాలిఁగలఁడాకాశంబునం గుంభినింగలఁడగ్నిన్ దిశలం బగళ్ల నిశలన్ ఖద్యోత చంద్రాత్మలం, గలఁడోంకారమునం ద్రిమూర్తులఁ ద్రిలింగవ్యక్తులం దంతటం, గలఁ డీశుండు గలండు తండ్రి! వెదుకంగా నేల యీయా యెడన్**" అని రచించిన చక్కని పద్యమే తలపునకు రాగా, గజేంద్రుని పరిదేవనలో శంకకు తావిచ్చి రచించిన స్వకపోలకల్పన ఈ పద్యం. విపత్తులకు భయపడినవాడు భగవంతుణ్ని సంశయిస్తాడు. అంతేకాదు, భగవత్సాన్నిధ్యాన్ని వదలుకొని ఒక విధంగా భగవంతుణ్ని అవమానించినవాడు కూడా అవుతాడు.

భగవంతునికి దీనబంధువనే బిరుదమున్నది. దీనులు ఆర్తులు. ఆర్తత్రాణపరాయణుడు భగవంతుడు. సాక్షాత్కృత పరబ్రహ్మ స్వరూపవైభవులు పరమయోగులు. వీరు శ్వేతద్వీపవాసులు. బృందావనంలోని గోపికలు పరమ యోగినులు. వానప్రస్థులు. మోక్షసన్న్యాసినులు. అప్రాకృతదేహులు. గోపికలకు భగవత్ప్రాప్తి ముందుగా కలిగింది. ఆ తర్వాత అనన్యభక్తి కుదిరింది.

**సీ. కలుగఁడే నాపాలికలిమి సందేహింపఁ గలిమిలేములు లేక గలుగువాఁడు**
**నాకడ్డపడరాఁడె వలి నసాధువులచేఁ బడిన సాధుల కడ్డపడెడువాఁడు**
**చూడఁడే నాపాటుఁ జూపులఁ జూడక చూచువారలఁ గృపఁ జూచువాఁడు**
**లీలతో నా మొఱాలింపఁడే మొఱఁగుల మొఱ లెఱుంగుచు దన్ను మొఱఁగువాఁడు**

**అఖిలరూపులు తన రూప మైనవాఁడు ఆదిమధ్యాంతములు లేక యలరువాఁడు**
**భక్తజనముల దీనుల పాలివాఁడు వినఁడె చూడఁడె తలఁపఁడె వేగరాఁడె**

టీ : నాపాలి = నాకు చెందిన, కలిమి సందేహింపన్ = భక్తి సంపదను సందేహింపకుండగా, కలిమి లేములు లేక = సంపదను, దారిద్ర్యమును లేకుండగా, కలుగువాఁడు = ఉండెడివాడు; కలుగఁడే = లేడా ఏమి? వలి = అధికముగా, అసాధువులచే = దుష్టుల చేత, పడిన సాధులకు = (బాధలు) పడిన సాధువులకు, అడ్డపడెడివాడు = సహాయపడువాడు; నా కడ్డపడరాడె = నాకు

సహాయపడుటకు రాడా?; చూపులఁ జూడక = చర్మ చక్షువులతో చూడక, చూచువారలన్ = అంతరంగమునందు, చూచువారలన్ = భగవంతుని దర్శించువారైన పరమయోగులను; కృపఁ జూచువాడు = దయతో చూచెడివాడు, నా పాటు = నా దురవస్థను, చూడడే = చూడడా ఏమి? మొఱగుల = ఆర్తులైనవారి, మొఱలు = దీనాలాపాలను, ఎఱుంగుచున్ = తెలిసికొనుచు, తన్నున్ = తనకు తానే; మొఱఁగు వాడు = మోసగించు కొనువాడు అనగా భక్తులకు కనిపించకుండగనే వారి మొఱలను వినువాడని అర్థము, అఖిల రూపులు = చరాచర జీవుల రూపాలన్నియు; తన రూపమైనవాఁడు = తన ఆకారమే అయినవాడు; ఆది మధ్య + అంతములు లేక = మొదలు నడుమ చివరలు లేకుండ; అలరువాడు = ఒప్పెడివాడు; భక్తజనముల, దీనుల పాలివాడు = భక్తులకు దీనులకు రక్షకమైనవాడు. వినడె = నా మొఱ వినడా? చూడడె = నన్నీ మొసలి గ్రసించుటను చూడడా? తలఁపఁడె = నన్ను రక్షింప తలపడా? వేగ రాఁడె = శీఘ్రముగా రాడా?

తా : దేవదానవ, ధనిక నిర్ధన, మనుష్య పశు పక్షి భేదాన్నీ తారతమ్యాన్నీ గమనించని ఆ భగవంతుడు నా భక్తిని సందేహింపకుండ నన్ను రక్షింపడా? సాధుజనులను బాధించే దుష్టులకు అడ్డపడువాడు నాకు సహాయపడడా? అంతర్దృష్టులతో చూచు సర్వతోముఖుడైన, సర్వసాక్షి అయిన భగవంతుడు నన్ను చూడడా? తాను కనిపింపక సమస్త జీవుల మొఱలను వినువాడు నా మొఱ వినడా? సమస్త రూపాలు తన రూపమైన వాడు, ఆదిమధ్యాంతములు లేనివాడు భక్తులను, దీనులను సదా రక్షించువాడు; నా దీనాలాపములు వినక, నా దురవస్థను చూడక, నన్ను కాపాడక ఊరకున్నాడేమి?

ఈ కనిపిస్తున్న వినిపిస్తున్న సమస్తజగత్తు శ్రీమన్నారాయణ స్వరూపమే. ఈ జగత్తుకు బయటను లోపలను శ్రీమన్నారాయణుడు సర్వవ్యాపియై నిలిచియున్నాడు అని **"యచ్చ కించి జ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేపి వా, అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః"** అని శ్రుతి చెబుతున్నది. **"ఈశావాస్యమిదం సర్వం యత్కించ జగత్యాం జగత్"** ఈ అఖిల బ్రహ్మాండంలో జడ చేతన జగత్తంతా ఈశ్వరునిచేత వ్యాప్తమై ఉన్నదని శుక్లయజుర్వేదం చెబుతున్నది. **"సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానీతి శాంత ఉపాసీత"** (ఛాందోగ్యోపనిషత్తు) ఈ సమస్త జగత్తు నిశ్చయంగా బ్రహ్మమే. బ్రహ్మనుండే ఉత్పన్నమైనది. ఆయన యందే లీనమవుతుంది. ఆయన యందే క్రియాకలాపాలను జరుపుతుంది. **"వాసుదేవః సర్వమితి"** (గీత 7 - 19)ఈ సమస్తం వాసుదేవమయము. **"బ్రహ్మైవేదం సర్వం"** అని శ్రుతి. **"ఖం వాయురగ్నిం సలిలం మహీం చ జ్యోతీంషి సత్త్వాని దిశో ద్రుమాదీన్, సరి త్సముద్రాంశ్చ హరేః శరీరం యత్ కించ భూతం**

**ప్రణమే దనన్యః"** (శ్రీమద్భా.11-2-41) "ఈ ఆకాశం, వాయువు, అగ్ని, జలం, పృథ్వి, ఈ నక్షత్రాలు, ప్రాణులు, దిక్కులు, వృక్షాదులు, నదీ సముద్రాలు సమస్తమూ భగవంతుని శరీరమే. ఇట్టి సకల రూపాలతో భగవంతుడు స్వయంగా ప్రకటితుడవుతాడు. భక్తునిదృష్టి దేనిమీద పడినప్పటికి అది శ్యామసుందరుడైన శ్రీకృష్ణునిరూపంగా భావించి అతడు ప్రణమిల్లుతాడు"*. అఖిల రూపాలు తన రూపమైనవాడనడంలో ఈ జగత్తు మిథ్య కాదనీ, జగత్తు మిథ్య అనే సిద్ధాంతం భగవంతుడు సర్వాత్ముడనే సత్యాన్ని దృఢపరడానికి ఉద్దేశించిందనీ గ్రహించాలి. శ్రీశంకరభగవత్పాదులు జగత్తు మిథ్య అని ప్రతిపాదించడంలో అనేకంలో ఏకత్వ దర్శనంగా భావించాలి. శ్రీశంకరభగవత్పాదులు కేవలం వేదాంతిమాత్రమే కాదు, ఆయన మహాభక్తుడు, పరమయోగి, ఈ జగత్తులో ఆయనకు శ్యామసుందరుడైన *శ్రీకృష్ణభగవానుడొక్కడే కనిపిస్తాడు. జగత్తంతా మిథ్యగా తోస్తుంది. అది జ్ఞానిదృష్టి. భక్తునిదృష్టికి ఈ జగమంతా శ్రీకృష్ణమయంగా తోస్తుంది. ఏకత్వంతో అనేకత్వదృష్టి భక్తునిది. బ్రహ్మమునందు జగత్తునందు తాదాత్మ్యంతో కూడిన అబాధితమైన అనుభూతియే అనేకత్వానుభావం లేదా ఏకత్వానుదర్శనం అవుతుంది. అంతేకాని, జగత్తు నిజంగా మిథ్యయే అయితే ఈ ప్రపంచం మధ్య పాతితులైన మనుష్యులు ఇక ముక్తికోసం ప్రయత్నించడం వ్యర్థమేకదా! ఈ జగత్తు ప్రళయంలో నష్టమైనప్పటికి వెనువెంటనే భగవంతుడు దానిని యథాప్రకారంగా సృష్టిస్తూనే ఉంటాడు. "**సూర్యా చంద్రమసౌ ధాతా యథాపూర్వ మకల్పయత్**" అని ఋగ్వేదం చెబుతున్నది. జగత్తు నశించదనడానికి ఈ శ్రుతివాక్యం ప్రమాణం.

**కం. విశ్వకరు విశ్వదూరుని విశ్వాత్ముని విశ్వవేద్యు విశ్వు నవిశ్వున్**
**శాశ్వతు నజు బ్రహ్మప్రభు నీశ్వరునిం బరమపురుషు నే సేవింతున్**

టీ : విశ్వకరున్ = విశ్వాన్ని నిర్మించినవానిని; విశ్వదూరుని = విశ్వానికి దూరంగా ఉన్నవానిని; విశ్వాత్ముని = విశ్వంలో ఆత్మరూపంతో వ్యాపించిన వానిని, విశ్వవేద్యున్ = ప్రపంచం తెలుసుకోదగిన వానిని; విశ్వున్ = విశ్వరూపమైన వానిని; అవిశ్వున్ = విశ్వమునకు సదా పరుడైన వానిని; బ్రహ్మప్రభువున్ = చతుర్ముఖ బ్రహ్మకు ప్రభువైనవానిని; ఈశ్వరున్ = సర్వలోక నియంతను, పరమపురుషున్ = సర్వశ్రేష్ఠుడైన పురుషోత్తముని, నేను సేవింతున్ = నేను భజింతును.

---

* పరబ్రహ్మ, పరమాత్మ, జగత్స్రష్ట, విశ్వవిధాత మొదలగు శబ్దాల సమగ్రతా సిద్ధికి, శ్రీకృష్ణనామం చేర్చడం ఆవశ్యకమవుతుంది. శ్రీకృష్ణ శ్రీనారసింహ శ్రీరామ నామాలు విశేష్యాలు. తక్కిన భగవన్నామాలన్నీ విశేషణాలే.

విశ్వాన్ని సృష్టించినవాడు, విశ్వరూపుడు, విశ్వమునకు భిన్నమైనవాడు, విశ్వవేత్త విశ్వానికి ఆత్మ, జన్మరహితుడు అయిన పురుషోత్తముణ్ని సేవిస్తున్నానన్నాడు గజేంద్రుడు. భగవంతుని విశ్వమయత్వాన్ని గూర్చి భగవద్గీతలో శ్రీముఖోక్తియే ఉన్నది. "**మయా తత మిదం సర్వం జగ దవ్యక్తమూర్తినా , మత్ స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః**" (గీత 9-4) "ఇంద్రియాలకు గోచరింపని స్వరూపం కలవాడను, చేతనా చేతనాత్మకమైన సర్వజగత్తునందంతట వ్యాపించి ఉన్నవాడను. సమస్త భూతములు నాయందున్నవి. కానీ, నేను వాటికి అధీనుడనై లేను" అని శ్రీకృష్ణుడు తన అధిష్ఠానానికి అధిష్ఠేయానికి గల అభేదాన్ని వివక్షించాడు. శ్రీమద్భాగవతంలోని "ఉలూఖల దామ బంధన లీల"లో ఈ విశేషం అత్యంత మనోజ్ఞంగా ప్రతిపాదింప బడింది. "**న చాంతర్న బహిర్యస్య న పూర్వం నాపి చావరం, పూర్వాపరం బహిశ్చాంత ర్జగతో యో జగచ్చ యః**" (శ్రీ మద్భా. 10-9-13) యశోద శ్రీకృష్ణుణ్ని త్రాళ్లతో రోటికి కట్టి వేయడానికి చాలా శ్రమిస్తూ విఫల ప్రయత్నురాలైన విషయాన్నీ, శ్రీకృష్ణుడు త్రాళ్లకు కట్టబడకుండటంలోని పరమార్థాన్నీ శ్రీశుకదేవుడు యుక్తియుక్తంగా వర్ణించాడు. "ఆ కృష్ణుడు బయట లేడు - లోపలను లేడు. ఆయనకు ఆది లేదు - అంతమూ లేదు. ఆయన జగత్తుకు మొదట ఉన్నాడు. తర్వాత కూడా ఉన్నాడు. ఈ జగత్తు లోపలి రూపంలోను, బాహ్యరూపంలోను ఉన్నాడు. ఇంకా చెప్పవలెనంటే జగద్రూపంగా కూడా ఆయనే ఉన్నాడు. శ్రీకృష్ణుణ్ని త్రాళ్లతో బంధించేందుకు ప్రయత్నించిన యశోద లోకంలో భగవత్స్వరూప పరిజ్ఞానం కలవారిలో పరమ ప్రామాణికురాలు కావడం ఒక అద్భుతమైన విషయం. సర్వవ్యాపి అయిన భగవంతుడు తాను బాహ్యంలో కూడా ఉన్నానననడానికి తన వ్యాపకత్వాన్ని ప్రదర్శించాడు. లోపల కూడా తానున్నానననడానికి తన సర్వాంతరత్వాన్ని వెల్లడించాడు. భగవంతుని సర్వత్ర స్థితిలో బాహ్యాభ్యంతరాలలో, పూర్వాపరాలలో, ఉత్తర దక్షిణాలలో ఒకచోట ఉన్నాడననడానికి వీలుకాదు. కాబట్టి ఆయన్ను బంధించడమనేది కుదరదు. అదీకాక, ఈ జగత్తు ఆయన ఆజ్ఞతోనే తన ధర్మాన్ని నిర్వర్తిస్తుంది. అది స్వబంధనానికి ఎలా ప్రేరకమవుతుంది? కాదు, కాబట్టి ఏదో విధంగా భగవంతుణ్ని బంధించామనుకొని భక్తులు నిశ్చింతులవుతారు. అలాగే యశోద శ్రీకృష్ణుణ్ని రోటికి కట్టివేసి నిశ్చింతురాలయింది.

**శ్లో. ఆత్మాత్మజాప్త గృహవిత్త జనేషు సక్తైః దుష్ప్రాపణాయ గుణసంగవివర్జితాయ**
**ముక్తాత్మభిః స్వహృదయే పరిభావితాయ జ్ఞానాత్మనే భగవతే నమ ఈశ్వరాయ**

తా : శరీరమునందు, పుత్రులందు, గురుజనులందు, గృహమునందు, సంపత్తి యందు ఆసక్తులైన జనులకు నీవు ప్రాప్తించడం అత్యంత కఠినం. నీవు ఇట్టి ప్రాపంచిక గుణాలపట్ల ఏమాత్రం ఆసక్తి లేనివాడవు కనుక జీవన్ముక్తులు, అనగా ముక్తాత్ములు తమ హృదయాలలో నిన్ను నిరంతరం ధ్యానిస్తుంటారు. సర్వైశ్వర్య పరిపూర్ణుడవు. జ్ఞానస్వరూపుడవు, భగవంతుడవగు నీకు నమస్కారము.

ముక్తాత్ములు అనగా రాగాదులను వదలివేసినవారని అర్థం. అట్టివారిని జీవన్ముక్తులనడం పరిపాటి అయింది. అలాంటివారు భగవంతుణ్ని, ఆయన లీలలను, గుణాలను ధ్యానిస్తూ ఆనందిస్తుంటారే కాని, తురీయావస్థకు చేరామని ఊరక కూర్చొనరు. బొందిలో ప్రాణమున్నంత వరకు భగవంతుణ్ని ఎంతటివారైనా ధ్యానిస్తూ ఉండవలసిందే. **"ఆత్మారామాశ్చ మునయో నిర్గంధా అప్యురుక్రమే, కుర్వ న్త్యహైతుకీం భక్తి మిత్థంభూతగుణో హరిః"** (శ్రీమద్భా. 1-7-10). ఎంతటి మునీశ్వరులైనా, వైరాగ్య సంపన్నులైనా తమ ఆత్మలలో భగవదీయమైన ఆనందాన్ని పొందుతూనే ఉంటారు. వారు సమస్తసందేహాలను నివృత్తి చేసుకొన్నట్టివారే. అయినా నిష్కామభక్తితో వారు భగవంతుణ్ని ధ్యానిస్తారు. అందుకు కారణమేమిటి? వారికి కావలసిన దేమిటి? అంటే, ఆ భగవంతుని స్వరూప రూప గుణ విభవాదులు వారికి ధ్యానాసక్తిని కలిగించి ఆత్మానందాన్ని చేకూరుస్తాయి. కనుక **"ఇత్థంభూతగుణోహరిః"** అనే వాక్యం లీలామాధుర్య వేణుమాధుర్య ప్రియామాధుర్య రూపమాధుర్యాలు గల శ్రీకృష్ణ భగవానుణ్ని ఉద్దేశించి చెప్పిందనడంలో సందేహం లేదు. **"యదుపతికథావియోగే వ్యర్థం గత మాయురితి చింతా"** అన్నారు శ్రీ శంకరభగవత్పాదులు. శ్రీకృష్ణ కథను ఒక క్షణం తలపకపోతే తమ జీవితం వ్యర్థమైనదే అని విచారపడేవారట శ్రీ శంకరాచార్యులవారు. ఎందరో దేవతలున్నారు. కానీ, తమకు శ్రీకృష్ణుని పైననే మక్కువ అంటూ శ్రీశంకర భగవత్పాదులు **"యద్యపి జలధే రుదకం యద్యపి వా ప్రేరకో ఽనిల స్సర్వత్ర, తదపి పిపాసాకులితః ప్రతీక్షతే చాతకో మేఘమ్"** "సముద్రంలో పుష్కలంగా నీరున్నది. చల్లని గాలి సర్వత్ర ఉన్నది. కాని, చాతకపక్షి నల్లని మేఘం కోసమే నిరీక్షిస్తుంటుంది" అని భంగ్యంతరంగా శ్రీకృష్ణ భగవద్భక్తిని వెల్లడించారు. శ్రీమద్భాగవత వక్త అయిన శ్రీశుకదేవుడు తన హృదయంలో విరాజిల్లుతున్న శ్రీకృష్ణభగవానుణ్ని గురించి చెప్పడానికే భాగవతంలోని ప్రతిపదాన్ని, ప్రతిఘట్టాన్ని తదభిముఖంగా చేసి, తుదకు దశమస్కంధంలో సర్వేశ్వరుడైన శ్రీకృష్ణుణ్ని సాక్షాత్కరింపజేశాడు. పరీక్షిత్తుకు భగవత్ప్రాప్తి కలిగించడం ఒకటి,

లోకులకు సర్వేశ్వరుడెవరో తెలియజెప్పటం మరొకటి. ఈ రెండు విషయాలు శ్రీ శుకదేవునిమనసులో ఉన్నాయి. గీతలో శ్రీకృష్ణ భగవానుడు **"యే త్వన్యదేవతాభక్తా యజన్తే శ్రద్ధయాన్వితాః, తేఽపి మామేవ కౌంతేయ యజ న్త్యవిధిపూర్వకమ్"** (గీత 9-22) అన్నాడు. "ఇతర దేవతలను ఆరాధిస్తే వారిపూజ నాకే అందుతుంది. నేను సర్వదేవతాస్వరూపుడను కాబట్టి నాకు శరీరస్థానీయులు వారు. వారిని ఆరాధిస్తే నన్ను ఆరాధించినట్లే అవుతుంది. కాని, అది అవిధి పూర్వకమైన అనగా అశాస్త్రీయమైన ఆరాధన అవుతుంది. నేరుగా నన్నే ఆరాధన చేసినవారు శాశ్వతమైన ప్రయోజనం పొందుతారు" ఇట్టి శ్రీకృష్ణముఖోక్తిని లోకులకు సుస్పష్టం చేయాలన్నది శ్రీశుకదేవుల ఆశయం. **"సర్వాసా మపి సిద్ధీనాం మూలం తచ్చరణార్చనమ్"** (శ్రీమద్భా. 10-81-19) "సకల యోగసిద్ధులకు మూలమైనది శ్రీకృష్ణ చరణార్చనమే" అను సత్యాన్ని చాటి చెప్పి లోకుల భగవదారాధనను శాస్త్రసమ్మతం చేసి దానికి విశ్వసనీయతను కలిగించాడు శ్రీశుకదేవుడు.

**శ్లో. యం ధర్మకామార్థవిముక్తికామా భజంత ఇష్టాం గతి మాప్నువంతి**
**కిం చాశిషో రాత్యపి దేహ మవ్యయం కరోతు మే ఽదభ్రదయో విమోక్షణమ్**

తా : ధర్మ అర్థ కామ మోక్షము లందలి కోరికచే మనుష్యులు నిన్ను భజించి అభీష్ట వస్తువులను పొందుతుంటారు. అంతేకాదు. సర్వవిధ సౌఖ్యాలను వారికి నీవు ప్రసాదిస్తుంటావు. మరియు, వినాశరహితమైన నీవంటి దేహాన్నికూడా వారికి కలిగించి నీ పార్షదులనుగా చేసుకొంటావు. ఓ పరమకృపాళువైన ప్రభూ! నాకు విమోక్షణం కలిగించుము (ముక్తి నొసగుము).

చతుర్విధపురుషార్థాలలో శ్రేష్ఠమైనది మోక్షం. మోక్షమిచ్చేవాడు వాసుదేవుడైన శ్రీకృష్ణుడు. భక్తుడు భావించిన రూపమును పొంది సాక్షాత్కరించేవాడాయనయే. **"భక్తేచ్ఛోపాత్త రూపాయ"** (శ్రీమద్భా.10-49-25) ఐహికమైన సిరిసంపదలను ప్రసాదించడం ఆయన మహిమలో అత్యంతస్వల్పవిషయం. ఆయన తన భక్తుని అభీష్టాలను నెరవేర్చడమే కాక, వానికి అవినాశి అయిన తన దివ్యస్వరూపాన్ని ప్రసాదించి నిత్యపార్షదుని చేసుకొంటాడు. అది ఆయనఅనుగ్రహ విశేషానికి తగిన ఉదాహరణ. ముక్తి నివ్వడంలో ఆలస్యం చేయడు. **"ముక్తిం దదాతి కర్హిచిత్స్మ న భక్తి యోగం"** (శ్రీమద్భా 5-6-18) శ్రీకృష్ణుడు ముక్తినిస్తాడు కాని, భక్తి నివ్వడు. ఈ పంక్తికి వ్యాఖ్య వ్రాస్తూ శ్రీధరస్వామి భక్తియోగమనే మాటకు ప్రేమ భక్తి అని అర్థం చెప్పాడు.

ప్రేమ భక్తిని భగవంతుడు చాల కొద్దిమందికే ప్రసాదిస్తాడు. ముక్తి కంటె భక్తి గొప్పదని తాత్పర్యం. **"అనిమిత్తా భాగవతీ భక్తిః సిద్ధే ర్గరీయసీ"** (శ్రీమద్భా. 3-25-33) భగవంతుని పట్ల స్వాభావికము, అహైతుకము అయిన భక్తి ముక్తికంటె చాలా గొప్పది. కర్మాచరణ కంటె భగవద్ధ్యానం గొప్పది. భక్తిలేని జ్ఞానం ఫలప్రదమైనది కాదు. జ్ఞానం కంటె భక్తి గొప్పది. జ్ఞానం బోధిస్తే కలుగుతుంది. బోధచేత కలిగేది కాదు భక్తి. భక్తిని బోధించడం సాధ్యంకాదు. భక్తి అలవడటానికి భగవంతునికృప ఉండాలి. **"నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన, యమేవైష వృణుతే తేన లభ్యః"** అని శ్రుతి (కఠోపనిషత్తు 2 -23) బుద్ధివైదగ్ధ్యంతోను, తార్కిక శక్తితోను, ఆ భగవంతుణ్ని తెలుసుకోలేము. భగవంతుడు ఎవరిని తనవద్దకు చేర్చుకోదలచాడో వానికి భక్తియోగం ప్రసాదించి, వానిని స్వీకరిస్తాడు. **"శ్రేయః స్రుతిం భక్తి ముదస్య తే విభో"** (శ్రీమద్భా 10-14-4) అనే శ్లోకానికి శ్రీధరస్వామి వ్యాఖ్యానం వ్రాస్తూ **"భక్తిం వినా జ్ఞానం తు నైవ సిద్ధిః"** "శ్రేయః స్రుతిః" "భక్తి సరోవరం నుండి నిర్గతమైన కాలువల వంటివి ధర్మార్థ కామ మోక్షాలు. అట్టి అభ్యుదయకారకమైన భక్తిని వదలి కేవలం జ్ఞానాన్ని చేపట్టడం వడ్లను వదలి పొట్టును దంచిన విధంగా శ్రమయే మిగులుతుంది'' అని ఆ శ్లోకానికి అర్థం. భగవద్భక్తుడు ఐహిక సుఖాలకోసం, కష్టనివారణ కోసం వ్యథ పడనవసరం లేదని చెబుతున్నది శ్రీమద్భాగవతం. అత్యంత శ్రేష్ఠమైన మోక్షాన్ని ప్రసాదించే భగవానుడు తన భక్తుణ్ని సాంసారిక కష్టాల నుంచి తొలగించ లేడా? మనుష్యునికి పురుషార్థాలు అవసరం కదా? వాటిని భగవంతుడు ప్రసాదిస్తాడా? కేవలం మోక్షమేనా? అంటే "భగవాన్! నీవు పరమానందమూర్తివి. నిన్ను నిరంతరం నిష్కామభావంతో నీ భక్తులు భజిస్తారు. వారి భజనకు రాజ్యాదిభోగప్రాప్తికంటె నీ శ్రీచరణకమల ప్రాప్తియే సత్యమైన ఫలము. స్వామి! ఆవు వంటి పశువు తన బిడ్డకు పాలిస్తుంది. వ్యాఘ్రాదుల బారినుండి తప్పించి సంరక్షిస్తుంది. అలాగే నీవు సకామభక్తులను సంసారభయం నుండి తప్పించి, వారికి అవసరమైన వాటిని ప్రసాదించి, వారి కష్టాలను పోగొట్టి రక్షిస్తుంటావు. **"సత్యాఽ శిషో హి భగవంస్తవ పాదపద్మ, మాశీస్తథానుభజతః పురుషార్థమూర్తేః, అప్యేద మర్య భగవాన్ పరిపాతి దీనాన్, వాశ్రేవ వత్సక మనుగ్రహ కాతరోఽస్మాన్"** (శ్రీమద్భా.4-9-17) సకామ భక్తుల కోర్కెలు నెరవేరడంలో ఆశ్చర్యమేమీ లేదు. అది భగవచ్చరణాల మహిమ. ఏ వేని కోర్కెలను పురస్కరించుకొని భజించేవారికి అభీష్టపదార్థాలను భగవంతుడు ప్రసాదిస్తాడు. కాని, అది భగవంతుని వాస్తవికదానం మాత్రం కాదు.

ఎందుకనగా, మనుష్యుడు తనకు అభీష్టమైన వస్తువులను ఒకటొకటే పొందుతూ కూడా అతని మనసులో ఇంకా ఏవేవో కోర్కెలు మిగిలి పోతూనే ఉంటాయి. కాబట్టి భగవంతుణ్ని ఏ కోరిక కోరకుండా నిష్కామభావంతో భజిస్తే మనకు శ్రేయస్కరమైనవాటిని ఆయనచరణకమలాలే ప్రసాదిస్తాయి. **"సత్యం దిశత్యర్థిత మర్థితో నృణాం, నైవార్థదో యత్పున రర్థితా యతః, స్వయం విధత్తే భజతా మనిచ్ఛతా మిచ్ఛాపిధానం నిజపాదపల్లవమ్"** (శ్రీమద్భా.5-19-27) ఇది జగత్తులో భారతభూమి నివాసుల అదృష్టం. ఒక వరం. వర్ణాశ్రమ ధర్మాచరణం మానవుని కర్తవ్యం. స్వధర్మాన్ని నిర్వర్తింపనివాడు పతితుడు కావడం తథ్యం. మరల అతడు ఆవాగమన చక్రంలో పరిభ్రమించక తప్పదు. వర్ణాశ్రమ ధర్మాలను స్వధర్మాన్ని ఆచరింపక ముక్తికి, భగవత్ప్రాప్తికి అఱ్ఱులు చాచడం నిష్ప్రయోజనం. ఆ పురుషుడు స్వధర్మాన్ని పాటించాడు. అతనికి యోగ్యతాపత్ర మెవరిస్తారు? స్నానం చేయడం శరీర పరిశుద్ధతకు. స్నానం చేయకపోతే శరీరం పుచ్చి పోతుంది. స్నానం చేసినవాడు పరిశుద్ధమైన మనస్సుతో నిష్కామభావంతో, భక్తితో భగవంతుణ్ని ఆరాధన చేస్తే వానికి ప్రయోజన ముంటుంది. భక్తిలేని స్వధర్మపాలనకు ప్రాముఖ్యం లేదు. అది మనుష్యునికి విహితకృత్యం. విధ్యుక్త ధర్మం. ఈ సంసారం విషయసుఖాలతో నిండి ఉంటుంది. కర్మగతి అచింత్యమైనది. మనుష్యుని ప్రయత్నంలేకుండానే సుఖదుఃఖాలు స్వాభావికంగా సంక్రమిస్తాయి. ఏ సుఖం, ఏ దుఃఖం మనుష్యుణ్ని పతితుణ్ని చేస్తుందో చెప్పలేము. కాబట్టి భగవంతుని శ్రీచరణాలను ఆశ్రయించిన భక్తుడే కర్మగతిని దాటగలుగుతాడు. కర్మగతిని అడ్డుకొనే శక్తి భగవచ్ఛక్తికి మాత్రమే ఉన్నది. మనుష్యుడు ఉద్ధరింపబడటానికి సత్య దయా తపస్యాదులు ఇరవైఒక్క ధర్మాలు, ముక్తికి లేదా భగవత్ప్రాప్తికి తొమ్మిది ధర్మాలు (నవ విధ భక్తులు) మొత్తం ముప్పై ధర్మాలుండాలని **"నృణామయం పరోధర్మః సర్వేషాం సముదాహృతః, త్రింశల్లక్షణవాన్ రాజన్ సర్వాత్మా యేన తుష్యతి"** (శ్రీమద్భా.7-11-12) ఈ త్రింశల్లక్షణాలను పాటించడం పరమధర్మం. అటువంటి వానిపట్ల భగవంతుడు ప్రసన్నుడవుతాడు. భగవంతుని పట్ల ఏకాగ్రతా పూర్వకమూ, సమ్యక్ప్రకారమూ అయిన భక్తి ఏర్పడినదంటే జ్ఞాన వైరాగ్యాలు స్వయంగా వచ్చి భక్తిని బలపరుస్తాయి. **"వాసుదేవే భగవతి భక్తియోగః సమాహితః, సధ్రీచీనేన వైరాగ్యం జ్ఞానం చ జనయిష్యతి"** (శ్రీమద్భా 4 - 29 -37) భక్తిమాతకు జ్ఞానవైరాగ్యాలు బిడ్డలు. భక్తిని వదలి కేవలం జ్ఞానంతో బ్రహ్మసాక్షాత్కారం పొందాలనుకొన్న సాధకుడు విఘ్న పరంపరలో విపత్పరంపరలో - పతిత్యక్తపత్నీన్యాయంగా దుస్థితికి లోనుకావడం తథ్యం.

**శ్లో. ఏకాంతినో యస్య న కంచనార్థం వాంఛంతి యే వై భగవత్ప్రపన్నాః**
**అత్యద్భుతం తచ్చరితం సుమంగళం గాయంతు ఆనందసముద్రమగ్నాః**

తా : అనన్య ప్రేమ భక్తియుక్తులైనవారు నిన్ను శరణుచొచ్చినవారలై ఉంటారు. కాని, వారు ఏ వస్తువును గానీ, తుదకు మోక్షాన్ని కూడా అభిలషింపరు. కేవలం నీ దివ్యమంగళమయమైన లీలలను గానం చేస్తూ ఆనంద సాగరంలో నిమగ్నులై ఉంటారు. (అటువంటి భగవానుణ్ణి స్తుతిస్తున్నాను.)

ఏకాంతులనగా ప్రపన్నులని అర్థం. భగవచ్చింతనకు కొందరు ఏకాంతాన్ని కోరుకొంటారు. బయటి ఏకాంతం యథార్థమైన ఏకాంతం కాదు. మనస్సు సంకల్ప శూన్యమై ఉండటమే ఏకాంతం. ఏకాంతులలో ఏకాంతి - పరమైకాంతి అని రెండు విధాలైన వారున్నారు. రెండు తెరగులవారు దేవతాంతర శూన్యులే. వారిని అనన్య భక్తియుక్తు లనవచ్చును. **"అనన్యా శ్చింతయంతో మాం, యే జనాః పర్యుపాసతే, తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్"** (గీత 9 - 22) అని శ్రీముఖోక్తి. అనన్యభావంతో ఏ జనులు నన్ను నిరంతరం ఉపాసిస్తుంటారో ఆ నిత్యయోగుల యోగక్షేమాలను స్వయంగా నేను వహిస్తానన్నాడు శ్రీకృష్ణ భగవానుడు. అనన్య భావమనేది ఏ వస్తువు? అది ఎలాంటిది? అనన్యత అనేది మహామహిమోపేత సాధన కాకపోతే భగవంతుడు దానియందు అంత అధికమైన విశ్వాసాన్ని ప్రకటిస్తాడా? ఏ భావంతో చరాచర జగత్తులో ఒకే ఒక ప్రియతముణ్ణి దర్శించుకొంటామో ఆ ఒక్కణ్ణీ వదలివేసి మరొకరిని కల్పనలో కూడా మనస్సులోనికి రానివ్వకుండటమే అనన్యత.

అనన్య భక్తులు అంటే ఇతర ప్రయోజనాలను, ఇతరులను ఆశింపక ఆశ్రయింపక ఒకే ఒక దైవాన్ని భజించేవారని అర్థం. ఉపాసకుడు ఒకే దైవాన్ని నమ్ముకోవాలి. బహువిధ దేవతలను ఉపాసించేవాని ఉపాసనలో ఏకాగ్రత కుదరదు. అందువల్ల ఒకే ఒక దైవాన్ని విశ్వసించి ఉపాసించడంవల్ల త్వరగా భగవదనుగ్రహం ప్రాప్తిస్తుందన్న ఉద్దేశ్యంతో చెప్పినదే, కాని, ఇతర దేవతలను తక్కువచేసి చెప్పినది కాదని గ్రహించాలి. సమస్త దేవతలు భగవంతునికి శరీరమైనవారే. వారిని ఆరాధిస్తే నిజానికి భగవంతుణ్ణి ఆరాధించినట్లవుతుంది. కాని, వారిది అవిధిపూర్వకమైన అనగా అశాస్త్రీయమైన ఆరాధన మవుతుంది. కనుక వాసుదేవుడనగు నన్నే ఆరాధింప వలసినదని గీతలో (9-23) శ్రీకృష్ణ భగవానుడన్నాడు. **"యేత్వన్య దేవతాభక్తా యజన్తే**

**శ్రద్ధయాఽన్వితాః, తేపి మామేవ కౌంతేయ యజన్త్యవిధిపూర్వకమ్"** అని. శివకేశవులకు భేదం లేదు కనుక ఏకాంతులు, పరమైకాంతులు శివభక్తులలోను, విష్ణు భక్తులలోను ఉంటారు. మోక్షఫలంతోపాటు ఫలాంతరమును భగవంతుడు ప్రసాదిస్తే స్వీకరిస్తాడు ఏకాంతి. భక్తి జ్ఞానాల ఫలం తప్ప, అన్యమైన ఫలం ఆశింపనివాడు పరమైకాంతి. భగవంతునియందు తప్ప మరిదేనియందును మనసుంచని ఏకాంతులు తమ భారాన్ని భగవంతునిపై మోపి నిశ్చింతగా ఉంటారు. **"ఆనుకూల్యస్య సంకల్పః ప్రాతికూల్యస్య వర్జనమ్"** తమ ప్రభువునకు అనుకూలమైన కార్యం చేయడం ప్రతికూలమైన కార్యాన్ని త్యజించడం ఏకాంతుల ధర్మం. అది ఉత్తమురాండ్రైన కాంతల ధర్మం వంటిది కూడా. భార్యకు గల ప్రతిష్ఠను ఆమెను రక్షించే భారమూ భర్తదై ఉంటుంది. అలాగే భార్యకు కూడా కర్తవ్యం లేకపోలేదు. భర్తకు రుచించే పనులు చేయడం, రుచింపని పనులను మానివేయడమే ఆమె విధి. ఈ విధంగా ప్రపన్నులు భగవదిచ్ఛానుకూలంగా తమ ఆహార విహారాలను, అన్యకర్మలను జరుపుతుంటారు. భగవదిచ్ఛకు విరుద్ధంగా ఎలాంటి శారీరక మానసిక కర్మలు చేసేందుకు తలపెట్టడు. ఏ పని తనకు, సమాజానికి, లోకానికి కళ్యాణకారక మవుతుందో అదే భగవంతునికి అనుకూల కర్మగా భావించి ఆచరిస్తాడు. ఏ కర్మ తనకు ఇతరులకు కూడా అనిష్టకరమో అది భగవంతునికి ప్రతికూలకర్మ అవుతుందని విసర్జిస్తాడు. పతిపరాయణమైన పత్ని శృంగారాదులు లేనిదైనప్పటికి ఆమె సేవకు ప్రసన్నుడై భర్త ఆమెను అమితంగా ప్రేమిస్తాడు. ప్రేమించడం తన ధర్మమన్న సంగతి మరచిపోడు. అట్లే భగవంతుడు తన సేవలో నిరంతరం మెలగే భక్తుని కులాన్నిగానీ, మరే ఇతరగుణాలను గాని గమనింపక కేవలం పరిశుద్ధమైన అతని సేవకే ప్రసన్నుడై, అతణ్ని సంపూర్ణంగా అనుగ్రహిస్తాడు.

ముక్తి అంటే ఏమిటి? ముక్తి శబ్దానికి వ్యుత్పత్తి లభ్యమైన సాధారణమైన అర్థం సకల విధ దుఃఖాలనుంచి, బంధాలనుంచి* వాసనల నుంచి **(సంసార వాసనా బద్ధ శృంఖలా)** విముక్తిని పొందడం. ఇది పారిభాషిక దార్శనిక శబ్దం. **"పునరపి జననం పునరపి**

---

* (వాసనలు రెండు రకాలు. 1. ప్రాక్తని. 2. ఇదానీంతని. పూర్వజన్మలో చేసిన శుభా శుభ కర్మలు ఈ జన్మలో మనసు మీద పడిన సంస్కారంతో సుఖ దుఃఖాలకు కారణమవుతాయి అది ప్రాక్తని. కావ్య నాట్య శ్రవణావలోకన కాలవర్తిని అయిన వాసన ఇదానీంతని. ఉభయ విధ వాసనా విశిష్టులైనవారే రసాస్వాదన చేయగలుగుతారని కావ్యశాస్త్ర వేత్తల నిర్ణయం.)

**మరణం పునరపి జననీజఠరే శయనమ్"** నుంచి సర్వదా విముక్తుడు కావడం. జనన మరణ ప్రవాహం నుంచి తొలగి బయట పడినప్పుడే ఈ జీవికి నిరతిశయ దుఃఖనివృత్తి సంభవ మవుతుంది. కైవల్యం, నిర్వాణం, నిఃశ్రేయసం, అమృతం, మోక్షం, అపవర్గం అని ముక్తికి అనేకపర్యాయపదాలున్నాయి. అయితే దార్శనికులు వీటిని విడదీసి వేరు వేరు అర్థాలతో వాడతారు. ఔపనిషదికులు "అమృతత్వ ప్రాప్తి" అంటారు. సాంఖ్యయోగులు 'కైవల్య' మంటారు. బౌద్ధులు 'నిర్వాణ'మంటారు. ఇతర దార్శనికులు 'ముక్తి', 'మోక్షం', 'అపవర్గం' అని పేర్కొంటూంటారు. జైనులు 'కర్మక్షయ'మే మోక్షమంటారు.

విముక్తమానులు అనగా మేము విముక్తుల మయ్యామని భావించేవారు (**విముక్తా వయమితి మన్యమానాః**) వాస్తవానికి ముక్తులు కాలేరని చెబుతున్నది శ్రీమద్భాగవతం. **"యేఽన్యేఽరవిందాక్ష విముక్తమానిన స్త్వయ్యస్తభావా దవిశుద్ధబుద్ధయః, ఆరుహ్య కృచ్ఛ్రేణ పరం పదం తతః పతంత్యధోఽ నాదృత యుష్మదంఘ్రయః** (శ్రీమద్భా.10-2-32) ముక్తుల మైనామనుకొన్న జ్ఞానులు పరమపదారూఢావస్థనుండి భ్రష్టులయినట్లుగా భక్తులు సాధనావస్థలో కూడా స్ఖలితులు కారు. ఇక వారు సిద్ధావస్థలో భ్రష్టులవుతారన్న మాటే లేదు. వృత్రాసురుడు, గజేంద్రుడు, జడభరతుడు మొదలైనవారు భగవద్భజనోపయోగమైన మనుష్యత్వంనుంచి ఎందుకు భ్రష్టులైనారన్న ప్రశ్నకు సమాధాన మిది. వారు ఉత్తమ జన్మనుండి భ్రష్టులైనప్పటికి భగవద్భజనవాసన వారికి బలీయమై ఉన్నది. వృత్రాసురుని అసుర దేహంలో, ఇంద్రద్యుమ్నుని గజదేహంలో, జడభరతుని మృగదేహంలో బలీయమైన ఆ వాసనయే వ్యక్తమయింది. కాబట్టి, భక్తివాసనకు క్షతి కలుగనందువల్ల వారి పతనం పతనశబ్దవాచ్యం కాకుండా పోయింది. జ్ఞానమార్గం అవరోధాలమయం. అది **"క్షురస్య ధారా"**. అది దుఃఖకరమూ **"క్లేశోఽధిక తరః"**. కాబట్టి జ్ఞానులు తాము ముక్తులము, జీవన్ముక్తులము అనుకొంటే పూర్తిగా పొరపడినట్లే. భగవంతుని పట్ల అనేక అపరాధాలు చేసినట్లే అవుతుంది. **"అవజానంతి మాం మూఢాః మానుషీం తనుమాశ్రితం, పరం భావ మజానంతో మమ భూతమహేశ్వరమ్** (గీత 9-11) సర్వభూత మహేశ్వరుడనైన నా పరమమైన భావాన్ని ఎరుగనివారై మూర్ఖులు మనుష్యదేహంతో ఉన్న నన్ను అవమానిస్తారు అని శ్రీకృష్ణ భగవానుని వాక్యాన్ని, భజనీయమైన ఆయన విగ్రహాన్ని మాయిక బుద్ధితో అనాదరించి అపరాధంచేసి అనేక విఘ్నపరంపరకు లోనవుతారు. జ్ఞానం వారి అంతఃకరణాన్ని విశుద్ధం

చేయలేకపోయింది. శమదమాదులను అలవరచుకొని కామాదులను జయించినవారైనప్పటికి వారిజ్ఞానం విశుద్ధమైనది కాకుండా పోయింది. తపశ్శమాది కృఛ్రాదివ్రతజనితమైన జ్ఞానంతో జీవన్ముక్తదశను అధిరోహించినవారైనప్పటికి వారు భక్తిశూన్యులై పొట్టును దంచినవారై వృథాప్రయాసకు లోనయ్యారు. **"తేషా మసౌ క్లేశల ఏవ శిష్యతే నాన్యద్యథా స్థూలతుషావఘాతినామ్** (శ్రీమద్భా.10-14-4) సకలకల్యాణాలకు మూలస్రోతస్సయిన భక్తిని వదలి జ్ఞానాన్ని నమ్ముకొన్నవారిస్థితి ఎండమావులలో నీళ్ల వెతకబోయి పతనం కావడం వంటిదే. సంసారోత్తీర్ణులయిన మహాభక్తులే తామింకా సంసార బంధాలలోనే ఉన్నట్లు పరితపిస్తుండగా, ఈ ముక్తాభిమానులు తాము అగాధసంసారంలో పతితులై ఉన్నప్పటికి విముక్తులమని అహంకరించడం వారు చేసిన భగవదపచారాలలో వేరొకటవుతుంది. **"భక్త్యాహ మేకయా గ్రాహ్యః" "భక్త్యా త్వనన్యయా శక్యః"** (గీత 11 - 54) అనన్య భక్తి చేతనే తెలుసుకోడానికి శక్యమైనవాడను. **"భక్త్యా మా మభిజానాతి"** (గీత 18 - 55) భక్తిచే నా స్వరూప గుణ విభూతులను తెలుసుకొంటాడు అన్న భగవద్వాణిని నిర్లక్ష్యం చేయడం ఈ ముక్తాభిమానుల మహాపరాధం. ఇట్టి అపరాధాల మూలంగా వారి బుద్ధి విశుద్ధం కాకపోవడంచేత అపరోక్షానుభవానికి అనర్హమయింది. **"దగ్ధానామపి కర్మాణాం"** వారు దగ్ధకర్ములైనప్పటికి వారి కర్మలు పునః ప్రరోహము లవుతాయి. **"ముక్తా అపి ప్రపద్యంతే పునః సంసారవాసనాం, యద్యచింత్య మహాశక్తౌ భగవత్యపరాధినః"** (వాసనా భాష్యం) జీవన్ముక్తులైన మహాపురుషులు అచింత్య మహాశక్తి సంపన్నుడైన భగవంతునికి అపచారం చేస్తే మరల వారు కర్మరాశి ద్వారా సంసారబంధాన్ని పొందుతారు. అనగా సంసార వాసనానువృత్తులవుతారు. బహిర్ముఖులవుతారు. విముక్తంమన్యులైన జ్ఞానులు పతనం కావడం ఎంత నిస్సందేహమో భక్తులు అపతితులు కావడం అంత నిస్సందేహం. ఇందుకు తార్కాణంగా గజేంద్రునివృత్తాంతం ఒక్కటి చాలు. భక్తులు పతనం కాకపోవడానికి కారణం భగవంతునిపట్ల వారికున్న సుహృద్భావం - సుదృఢ విశ్వాసము. భక్తులు భగవంతుని సంరక్షణలో ఉండి నిర్విఘ్నంగా భగవత్ప్రాప్తినీ, ముక్తినీ పొందుతారు.

అద్వైతవేదాంతంలో ముక్తి - భుక్తి విషయాలలో మాత్రమే ప్రధానమైన మత భేదాలున్నాయి. బ్రహ్మతోపాటు జీవాత్మ నిర్భేద స్థితిలో అగ్రగామి అవుతుందంటారు అద్వైతులు. మోక్షంలో జీవబ్రహ్మైక్యం తప్ప అపూర్వవస్తుప్రాప్తి ఏమీ ఉండదని అద్వైతవేదాంతం చెబుతుంది. **"బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి"** (ముండకోపనిషద్) బ్రహ్మను

తెలుసుకొన్నవాడు బ్రహ్మమవుతాడు. అనగా బ్రహ్మసామ్యుడవుతాడని కాకుండా తాను బ్రహ్మమే అవుతాడని ఆ శ్రుతివాక్యానికి అర్థం చెబుతారు. అద్వైత వేదాంతియే అయినా శ్రీచిత్సుఖాచార్యులు ముక్తావస్థలో ఆనందముంటుందని **"అనవచ్ఛిన్నానంద ప్రాప్తిః"** అని ఆ శ్రుతివాక్యాన్ని వ్యాఖ్యానించారు. భగవంతుడు ఆనంద స్వరూపుడు. మనం ఈ ప్రపంచంలో భగవత్ప్రేమ భక్తియుక్తులమై అనుక్షణం ఆ భగవంతుని లీలలను దర్శిస్తుంటే మనకు కూడా సర్వత్ర ఆనందమే ప్రాప్తిస్తుంది. అలా చేయక భగవంతుణ్ని ఈ జగత్తునుంచి వేరుచేసి తొలగించి కేవలం జగత్కార్యాలను మాత్రమే చూచేవారికి ఈ జగత్తు నిశ్చయంగా 'దుఃఖాలయ' మే అవుతుంది. **"దుఃఖాలయ మశాశ్వతమ్"** (గీత 8-15)

వైశేషికసూత్రాలలో ముక్తినిగురించి చెబుతూ "జ్ఞాన సుఖాది శూన్యమైన శిలా రూప మోక్షప్రాప్తి జీవిత చరమోద్దేశ్య"మని ఉంది. ఇలా ముక్తిని గూర్చి చెప్పిన గౌతముడు తన పేరును శబ్దతః అర్థతః సార్థకం చేసుకొన్నాడని (అతిశయేన గౌః = ఎద్దు అని) ఎందరో ఆక్షేపించారు. వైశేషిక దార్శనికుడు చెప్పిన మోక్షం కంటె బృందావన సరస నికుంజాల నీడలలో నక్కగా పుట్టి జీవించడం మేలని వైష్ణవులు పరిహసించారు. **"వరం బృందావనే రమ్యే సృగాలత్వం వృణోమ్యహమ్, వైశేషికోక్తమోక్షాత్తు సుఖలేశవివర్జితాత్"** బౌద్ధులు పేర్కొన్న నిర్వాణం మానవ జీవితానికి సార్థకత చేకూర్చేది కాదు. కాగా ముక్తికి సంబంధించిన ఇతర దార్శనికుల మాన్యతలు కూడా ఉపేక్షింప దగిన వయ్యాయి. **"అజ్ఞానసంజ్ఞౌ భవబంధమోక్షౌ"** అనగా అజ్ఞానం లేదా అవిద్య తొలగిపోతే కలిగినటువంటి ఆత్మ - బ్రహ్మల ఐక్యానుభవమే ముక్తి అన్నది అద్వైత దార్శనికుల ప్రముఖ సిద్ధాంతం.

శ్రీమద్రామానుజుని దర్శనంతో భక్తిశాస్త్రం పునర్జన్మను స్వీకరించింది. **"సాపరానురక్తి రీశ్వరే"** ఈశ్వరుని యందు అనన్యమైన ప్రేమయే భక్తి అని నారద సూత్రం. 'భక్తి' శబ్దం భజ్ ధాతువునకు 'క్తి' ప్రత్యయంతో ఏర్పడింది. **'భజ్ ఇతి సేవాయాం'** "క్తి" కి అర్థం "ప్రేమ" అని. సేవలో ప్రేమకు ప్రాధాన్యం ఉంది. భక్తి సర్వస్వతంత్రమైనది. అది జ్ఞానం మీద కర్మమీద ఆధారపడినది కాదు. మోక్షం నాలుగు విధాలని శాస్త్రం చెబుతున్నది. **"లోకేషు విష్ణో ర్నివసంతి కేచి త్సమీప మృచ్ఛంతి చ కేచి దన్యే, అన్యే తు రూపం సదృశం భజంతే సాయుజ్య మన్యే స తు మోక్ష ఉక్తః"** శ్రీమద్భాగవతంలో పంచవిధముక్తులను గూర్చిన చర్చ ఉంది. "సాలోక్య - సార్ష్టి- సామీప్య - సారూప్య - సాయుజ్యములు.

భగవంతుని నిత్యధామంలో నివాసం సాలోక్యం. భగవంతునితో సమానంగా ఐశ్వర్యభోగం సార్ష్టి, భగవంతునికి నిత్య సమీపత్వం సామీప్యం. భగవద్రూపాన్ని తాను పొందడం సారూప్యం. సమ్యగ్భావం సాయుజ్యం. ఇందులో సాలోక్యాదులు నాలుగు అంతర్భవిస్తాయని ఇలా మోక్షంలో తారతమ్యాలుంటాయని ఆయా సంప్రదాయజ్ఞులు చెబుతారు. ముక్తావస్థలో జీవుడు బ్రహ్మలో లీనమవుతాడన్న వాదనను శ్రీమద్రామానుజులు అంగీకరింపరు. జీవం బ్రహ్మయొక్క అంశం. అది అణువు - అల్పజ్ఞము. అటువంటిది పరమాత్మలో ఏకీభావం పొందడం ఎన్నటికి జరుగదు. సంసార దశలో జీవుడు బ్రహ్మము కంటె భిన్నుడై ఎలా ఉన్నాడో ముక్త దశలో కూడా అలాగే వేరుగా ఉంటాడు. ముక్త దశలో బ్రహ్మానందాన్ని అనుభవిస్తాడు. ముక్తి పొందడానికి భక్తియే ఏకైక సాధనం. **"ప్రీతిపూర్వ మనుధ్యానం భక్తి రిత్యభిధీయతే"** జ్ఞానం దానికి సహాయకారి మాత్రమే. భక్తిసేవిత భగవత్ప్రసాదమే జీవునికి ముక్తిలాభమని శ్రీరామానుజుల సిద్ధాంతం. **"తత్త్వమసి" (దాసః)** అనగా ఆ భగవంతునికి నీవు దాసుడవు అనే అర్థాన్ని ప్రతిపాదించి జీవబ్రహ్మైక్యం అసంభవమని, జీవబ్రహ్మలకు స్వరూపంలో గల భేదాన్ని ఒక వంక అంగీకరిస్తూ ఆ రెండూ ఏకమవుతాయనడం సమజసం కాదన్నారు శ్రీమద్రామానుజులు. **"అహం బ్రహ్మాస్మి"** అనే వాక్యం కేవలం స్తుతి వాక్యమే. సాధకులను ప్రోత్సహించాలని చెప్పినదే కాని. యథార్థమైన ఐక్యోపదేశవాక్యం కాదన్నారు శ్రీరామానుజులు. ముక్తి అనేది దేహపాతం జరిగిన తర్వాతనే సంభవమవుతుంది. కాని, జీవించియుండగా ముక్తి కలగడం అసంభవమని శ్రీరామానుజులంటారు. దైహికంగా అమరత్వం పొందినట్లయితే జీవన్ముక్తుడనవచ్చు. మృత్యువును జయించకుండా జీవన్ముక్తుడెలా అవుతాడు? జీవన్ముక్తి అనడానికి బదులుగా విదేహముక్తి అనడం సమంజసం. శాస్త్రసమ్మతం కూడా. దేహపాతం జరిగిన తర్వాత కూడా జీవుడుంటాడు. కాని, అతడు బ్రహ్మమాత్రం కాలేడు. ఆ సమయంలో బ్రహ్మానందాన్ని అనుభవిస్తుంటాడని శ్రీమద్రామానుజులు వివరించారు. పరమాత్మ తత్త్వంలో ఆత్మ విలయాన్ని స్వీకరించినట్లయితే భోక్త అనేవాడూ లేడు, భోగ్యమనేదీ లేకుండా పోతుంది. భగవత్ప్రేమభక్తిబంధానికి ఒక విలక్షణమైన స్వభావమున్నది. అది వేరు వేరు తత్త్వాలను సంయుక్త పరుస్తుంది. జీవాత్మ తన అస్తిత్వాన్ని కోల్పోయినప్పుడు ఇక బంధనం త్రెంచుకోవడం ఉండదు గదా! అలాగే ఆనందం అనుభవించడమూ ఉండదు. అందుచేతనే భగవద్రామానుజ మాధ్వ

నింబార్క వల్లభ రామానంద చైతన్యాది దార్శనికులు పరమాత్మతో జీవుడు పరిణతి చెందుతాడన్న వాదనను, జీవబ్రహ్మల ఐక్యాన్ని అంగీకరింపనివారయ్యారు. **"తత్త్వమసి"** అనే వాక్యాన్ని వివరిస్తూ శ్రీవల్లభప్రభువులు అది **"జీవబ్రహ్మణోరైక్యం న బోధయతి ........ సాధు బుద్ధిమతాం బకబంధన ప్రయాసో వృత్తః"** ఆ వాక్యం జీవబ్రహ్మల ఐక్యాన్నిబోధించదు. **"తత్త్వమసి"** వాక్యంతో హంసను పట్టుకోటానికి ప్రయత్నించి కొంగను పట్టుకోవడమే అవుతుందని పరిహసించారు శ్రీ వల్లభాచార్యులు.

**"భస్మీభూతస్య దేహస్య పునరాగమనం కుతః?"** "చచ్చి బూడిదై పోయిన ఈ దేహం బ్రతికి రావడం ఎలా?" అని ప్రశ్నిస్తారు చార్వాకులు. లోకంలో జ్ఞానభక్తి యుక్తులైన మహనీయులు పేర్కొన్న ముక్తిని నిరసిస్తారు చార్వాకులు. ఎందుకని? కొందరి సిద్ధాంతం ప్రకారం ముక్తి చెందిన భక్తుడు బ్రహ్మ మవుతాడు కాడు అనే సిద్ధాంతాలు రాద్ధాంతాలు విని విని **"న స్వర్గో నాపవర్గో వా లోకాః క్లిశ్యంతి వై వృథా"** "స్వర్గం లేదు అపవర్గమూ లేదు, వృథాగా లోకులను బాధపెట్టడమే" అని చార్వాకులు అనగా సుందరమైన వాక్కులు గలవారు ఆక్షేపించారు.

శ్రీమద్భాగవత వ్యాఖ్యాత శ్రీధరస్వామి **"ధర్మః ప్రోజ్ఝితకైతవోఽత్ర పరమో నిర్మత్సరాణాం సతామ్"** (శ్రీమద్భా 1-1-2) పదాన్ని వ్యాఖ్యానిస్తూ **"ప్రోజ్ఝితకైతవ"** శబ్దంలో ప్రయుక్తమైన "ప్ర" ఉపసర్గ ప్రయోగంతో ప్రధానకైతవం మోక్షవాంఛ అని అర్థం చెప్పి, **"అత్ర 'ప్ర' శబ్దేన మోక్షాభిసంధిరపి నిరస్తః"** అని వ్రాశారు. అనగా ఆయన దృష్టిలో మోక్షవాంఛ కూడా కైతవమే (కపటమే).

ప్రపన్నులు, ఏకాంతులు ఈ లోకంలోనే బ్రహ్మానంద సౌఖ్యాన్ని అనుభవిస్తుంటారు. మనుష్యులు సుఖాన్ని కోరుకొంటారు. స్వర్గ వైకుంఠ లోకాల నామాలు మనుష్యుని సుఖ పిపాసను అభివ్యంజకం చేసేవి మాత్రమే. భక్తునికి ముక్తిపట్ల విరక్తి కలుగుతుంది. భక్తుడు వైకుంఠానికో కైలాసానికో వెళ్లి తానే పరమాత్ముడైనప్పుడు తన ఇష్ట దైవానికి ప్రీతి కలిగించే సేవను ఎలా చేయగలుగుతాడు? ముక్తిలో సేవకు అవకాశం లేదు కదా! భగవత్సేవలో మాధుర్యమున్నది. ఆనందమూ ఉన్నది. ముక్తిలో ఇలాంటి సేవ చేసే భాగ్యం ఉండదు. అందుచేత భక్తులు ముక్తిని తిరస్కరిస్తారు. భ్రమరానికి మకరందం మీద ప్రబలమైన కోర్కె ఉంటుంది. ఆ భ్రమరమే మకరంద రూపాన్ని పొందితే ఇక మకరంద మాధుర్యాన్ని ఎలా అనుభవించడం? అనుభవించే వారెవరు? భగవత్సేవలో ఉన్న దివ్యతమ మధుర సుఖం నిరంతరం అస్వాదించినా తరగనంతగా

ఉంది. ఇట్టి ప్రేమమయభూమిక నుండియే భక్తుడు ముక్తిని నిషేధించడం జరిగింది. ప్రపంచంలో భక్తి సిద్ధాంతానికి అఖండమైన ప్రాచుర్యాన్ని తెచ్చిన భగవద్రామానుజులు తాము చేసిన ప్రార్థనలో కూడా ముక్తిని కోరుకో లేదు. భక్తిని మాత్రమే కోరుకొన్నారు. **"అఖిలభువనజన్మస్థేమభంగాదిలీలే, వినతవివిధభూతవ్రాతరక్షైకదీక్షే, శ్రుతిశిరసివిదీప్తే బ్రహ్మణి శ్రీనివాసే, భవతు మమ పరస్మిన్ శేముషీ భక్తిరూపా"** అని భగవంతునికి నిరంతరం దాస్యం చేయడానికే ఆయన భక్తిని కోరుకొన్నారు.

ద్వైతసంప్రదాయప్రతిష్ఠాపకులు శ్రీమదానందతీర్థభగవత్పాదులు **"జీవగణా హరే రనుచరాః"** జీవగణాలన్నియు శ్రీహరికి అనుచరాలే అనే సిద్ధాంతాన్ని ప్రబల తర్కంతో ప్రతిపాదించారు. ప్రేమలోని సర్వవిధ విచిత్రతలు దాస్యబంధంలో సంపన్నమవుతాయి. భగవద్భక్తి యుక్తులు స్వసుఖవాసనా విరహితులై భగవంతునికి సేవ ద్వారా ప్రీతి కలిగించడమే తమ జీవితానికి ధన్యతగా విశ్వసిస్తారు. ఈ దాస్యభావాన్నే శ్రీమద్రామానుజులు శేషశేషిభావమన్నారు. ఆయనకు ఆరాధనీయుడైన శ్రీయామునముని తన స్తోత్రరత్నంలో **"భవంత మేవానుచర న్నిరంతర ప్రశాంత నిశ్శేష మనోరథాంతరః, కదాహ మైకాంతికనిత్యకింకరః ప్రహర్షయిష్యామి సనాథ జీవితః"** "నిన్నొక్కనినే సదా అనుసరించినవాడనై, అన్యవాంఛలు నిశ్శేషంగా విడిచి పెట్టినవాడనై, నీ ఐకాంతిక నిత్యదాసుడనై నా జీవితాన్ని సనాథం చేసుకొని నిన్నెప్పుడు సంతృప్తి పరతునో గదా స్వామీ" అన్నారు. దాస్యభక్తిలో భక్తుని మనస్సులో మమత్వ సంచారం జరుగుతుంది. 'ప్రభువు నా వాడు. నేను ప్రభువు మనిషిని' ఇట్టి ఆనందమయమైన మమత భక్తుని హృదయ సాగరాన్ని సదా మథనం చేస్తుంటుంది. ఈ మమత దాస్యం చేసే సేవకునిలోనే కాదు, దాస్యం చేయించుకొనేవానిలో అంటే సేవ్యునిలో కూడా ఉంటుంది. భక్తుడెలా భగవంతునికి సేవ చేస్తాడో అలాగే భగవంతుడు కూడా తన ప్రియభక్తునికి సేవ చేయడంలో ఆనందానుభూతిని పొందుతాడు. సేవకుని ధర్మం అనిర్వచనీయమైనది. అది యోగులకు కూడా అగమ్యమైనది. సేవకు - స్వార్థానికి స్వభావసిద్ధమైన వైరముంటుంది. స్వామిపట్ల నిస్స్వార్థమైన భక్తిభావనయే నిజమైన సేవ. స్వామి సర్వదా తనకాత్మీయుడై ఉంటాడన్నదే సేవకుని ఏకైక స్వార్థం. తాను చేసే సేవ కంటె స్వామి తనకు చేసే సేవ చాలా గొప్పదనుకొంటాడు సేవకుడు. ఇట్టి సేవా భావనలో అనిర్వచనీయమైన ఆత్మనివేదన ఇమిడి ఉంటుంది. ఆత్మనివేదన శబ్దానికి పండితులు రెండర్థాలు చెబుతారు. 1. అహంభావానికి ఆస్పదమైనది దేహ

- జీవాత్మ. 2. మమత్వానికి ఆస్పదమైనది దేహం. జీవాత్మ నివేదనలో శ్రీయామునముని ఇలా వేడుకొంటారు. **"వపురాదిషు యోఽపి కోఽపి వా గుణతోఽసాని యథాతథావిధః, తదయం తవ పాదపద్మయో రహ మద్యైవ మయా సమర్పితః"** (స్తోత్రరత్నం)" హే భగవన్! ఈ శరీరం, ఇంద్రియాలు, మనస్సు, ప్రాణం, బుద్ధి మొదలైనవాటిని బట్టి నే నెవరనో తెలియదు. గుణాలను బట్టికూడా నేనెలాంటివాడనో తెలియదు. నీ చరణకమలాలకు నన్ను నేను సమర్పించుకొంటున్నాను. నాకు నీకు రక్ష్య రక్షక సంబంధం ఉండనే ఉంది. వీటిని గూర్చి విచారింపవలసిన పని నాకేమున్నది? అదీకాక వాటి స్వరూప ప్రకారాల పరిజ్ఞానం నాకులేదు. స్వతస్సర్వజ్ఞుడవు కాబట్టి నీవే తెలుసుకో స్వామి!" అంటారాయన. **"చింతా కుర్యా న్న రక్షాయై విక్రీతస్య యథా పశోః, తథార్పయన్ హరౌ దేహం విరమేదస్య రక్షణమ్"** "అమ్మివేసిన గొడ్డు యొక్క రక్షణను గూర్చి చింతించడం అనవసరం. అలాగే శ్రీహరి చరణ కమలములందు సమర్పింపబడిన ఈ దేహం యొక్క రక్షణను గూర్చి ఆలోచించడం అనవసరం" అంటాడొక దాసుడు. భగవంతునికి దాస్యం చేసేవారి గృహాలలో నిరంతరం భగవత్సంకీర్తన లీలా గుణ శ్రవణ సంస్మరణలు జరుగుతుంటాయి. **"సేవ్యాః శ్రేయోర్థిభిః సన్తః"** అనే ఆర్యోక్తి ఉంది. శ్రేయస్సును కోరుకొనేవారికి సేవింప దగినవారు సత్పురుషులు - అని. **"సాధూనాం దర్శనం పుణ్యం తీర్థ భూతా హి సాధవః"** సాధువుల దర్శనం పుణ్యప్రదము, పుణ్యతీర్థమంటే వారలే. శ్రీ యామున మునిఅభ్యర్థన ఏమంటే **"తవదాస్య సుఖైకసంగినాం భవనేష్వస్త్వపి కీటజన్మ మే, ఇతరావసథేషు మా స్మ భూదపి మే జన్మ చతుర్ముఖాత్మనా"** "ప్రభూ! నీ కైంకర్యజన్యప్రీతిమాత్రాసక్తులైన పరమభాగవతులగృహాలలో నాకు కీటకజన్మనైనా కలిగించు. కాని, తదితర గృహాలలో బ్రహ్మగా పుట్టించినా నే నిష్టపడను" అని. **"మమ మద్భక్త భక్తేషు ప్రీతి రభ్యధికా భవేత్, తస్మా న్మద్భక్తభక్తాశ్చ పూజనీయా విశేషతః"** అని శ్రీకృష్ణముఖోక్తి. తన భక్తులకు భక్తులైన వారిపట్ల భగవంతునికి ప్రీతి అత్యధికం. కాబట్టి పరమభాగవతులకు సేవచేసే భాగ్యం కలిగించమంటారు వైష్ణవులు. దాస్యభక్తిలో ఇంతటి మాన్యత ఉన్నందువల్లనే భక్తి సంప్రదాయాలన్నీ బ్రహ్మలో జీవి విలీనం చెందుతాడనే అంశాన్ని త్రోసిపుచ్చాయి. భక్తిరసం ముక్తి మహత్త్వాన్ని పూర్తిగా తగ్గించి చప్పనిదిగా చేసింది. శ్రీమధుసూదన సరస్వతిస్వామి భక్తికి లక్షణం చెబుతూ **"మోక్ష లఘుతాకృతాం"** మోక్షాన్ని లాఘవం చేసేదని మార్మిక శబ్దాన్ని ఉపయోగించారు. ఉత్తరోత్తర అభివృద్ధిచెందే సుఖం భక్తిసుఖం. దానికి క్షతి ఉండదు. నిజమైన భక్తుడు

భక్తివిషయంలో విసుగు చెందదు. అతనికి నిత్యనూతనానందం లభిస్తుంటుంది. దానితో భక్తిపట్ల అతని ఇచ్ఛ మరింత ఉత్కట మవుతుంది. **"దినే దినే నవం నవం నమామి నందసంభవం"** అన్నారు శ్రీశంకర భగవత్పాదులు. శ్రీకృష్ణు డాయనకు నిత్యనూతనుడుగా కనిపించి, ఆయన భక్తిని కూడా దినదిన ప్రవర్ధమానం చేశాడు. భక్తియుక్తమైన సేవాసుఖంలో కలిగే ఆనందం మోక్షావస్థలో ఉంటుందా? హనుమంతుడు శ్రీరామచంద్రుణ్ణి "స్వామీ! మోక్షపదవికి చేరుకొన్న తర్వాత కూడా నీవు నా స్వామివిగా, నేను నీకు దాసునిగా ఉండి సేవించే భాగ్యం అక్కడ ఉంటే నేను మోక్షాన్ని కోరుకొంటాను. అందుకు మోక్షంలో అభ్యంతరం ఉంటే అది నాకు వద్దు' 'అన్నాడట. **"భవబంధచ్ఛిదే తస్మై స్పృహయామి న ముక్తయే, భవాన్ ప్రభు రహం దాస, ఇతి యత్ర విలుప్యతే"** అని. నాకున్న 'భావబంధం' నాశనమైతే మాత్రం 'భవబంధచ్ఛేదం' నాకు వద్దు అనేది ఇక్కడ ఒక చమత్కృతి. గజేంద్రునివలె వృత్రాసురుడు కూడా శాపగ్రస్తుడే. అతడు ఘోరరాక్షసుడై జన్మించినప్పటికి శ్రీహరిభక్తి అతనిలో క్షీణించలేదు. అతనిలో ధర్మబుద్ధి నశించ లేదు. అతడిలా కోరుకొన్నాడు. **"న నాకపృష్ఠం న చ పారమేష్ఠ్యం న సార్వభౌమం న రసాధిపత్యం, న యోగసిద్ధీ రపునర్భవం వా సమంజస త్వా విరహయ్య కాంక్షే"** (శ్రీమద్భా. 6-11-25) సమగ్ర సకలార్థ రూపుడని శ్రీహరిని సంబోధించి వృత్రాసురుడు ఇంద్రుని సింహాసనాన్ని 'నాక పృష్ఠ' మని పేర్కొని దాని తుచ్ఛతను సూచిస్తూ దానిని తానాశింపనన్నాడు. **"న చ పారమేష్ఠ్యం"** రజోగుణ ప్రధానమైన బ్రహ్మత్వం తనకు వద్దన్నాడు. **"న సార్వభౌమం" రాజ్యాంతే నరకం ధ్రువం**, కాబట్టి చక్రవర్తిత్వమూ తనకు వద్దన్నాడు. **"న రసాధిపత్యం"** భూలోకంలో కంటె అధోలోకంలో భోగాలు అపరిమితంగా ఉండవచ్చు గాక, దాన్ని ఓ స్వామీ! నీవు బలిచక్రవర్తికి ఇచ్చావు, అచ్చట నీవు సేవకుడవుగా ఉంటావు కాబట్టి ఆ రసాధిపత్యాన్ని తాను కోరుకోనన్నాడు. అపరిపక్వ యోగులు కోరుకొనే సిద్ధులు తనకు అవసరం లేదన్నాడు. వైదిక సాత్త్విక కర్మను నిరాకరించే మోక్షం తనకు వద్దన్నాడు. **"మదన్య త్తే న జానంతి నాహం తేభ్యో మనాగపి"** "నా భక్తులు నన్ను తప్ప మరెవరిని ఎరుగరు. వారిని తప్ప నేను మరెవరిని ఎరుగను'' అను భగవద్వాక్యాన్ని బట్టి భగవత్సేవ తప్ప మరేమీ ఆశింపని వృత్రాసురుడు మోక్షాన్ని పూర్తిగా తిరస్కరించాడు. (వృత్రాసుర చతుఃశ్లోకి లోనిదిది) నిన్ను విడిచి నేనేమీ కోరుకోనని నిష్కర్షగా చెప్పాడు. నారద పాంచరాత్రంలోని జితంతా స్తోత్రంలో **"ధర్మార్థకామ మోక్షేషు నేచ్ఛా మమ కదాచన, త్వత్పాదపంకజాస్వాదజీవితం**

**దీయతాం మమ"** "హే భగవన్! నాకు ధర్మార్థ కామ మోక్షాల పట్ల ఏమాత్రం ఆసక్తి లేదు. నాకు నీ చరణకమలచ్ఛాయలో గడిపే జీవితాన్ని ప్రసాదించు" అనేదే పరమార్థం. శ్రీ చైతన్య మహాప్రభువు "శ్రీకృష్ణునికి నిత్యదాసత్వమే జీవుని స్వరూప" మన్నారు. ఈ మహాభావన ఒక ఆనందమహోదధిని ఉత్పన్నం చేస్తుంది. అద్వైత వేదాంతంలోని నిర్విశేషబ్రహ్మమునందలి కోటి గుణిత సుఖం ఈ ఆనందసాగరంలోని ఒక బిందువుతో కూడా సాటి రాజాలదని ఆయన ఉద్ఘాటించారు. శ్రీవిష్ణువక్షస్థలవాసిని అయిన లక్ష్మీదేవి కూడా అతిదీనంగా ఈ రసాస్వాదనకు ప్రార్థిస్తుంది. విధిశంకర నారద శుక సనకాదులందరు ఈ భావంతోనే ఆనందతుందిలులయ్యారని శ్రీచైతన్యులు ప్రవచించారు.

శ్రీమద్భాగవతంలో శ్రీశుకదేవుడు తరచుగా **'తీవ్రేణ భక్తియోగేన'** అని విశేషణయుక్త భక్తిశబ్దాన్ని వాడతాడు. దానికి భాగవతవ్యాఖ్యాత శ్రీధరస్వామి 'ప్రేమభక్తి' అని అర్థం చెబుతారు. దీనిని బట్టి శ్రీధరస్వామి అద్వైతవేదాంతి అయినప్పటికి శుష్కజ్ఞానమార్గావలంబి కాదని, భక్తిమార్గావలంబియే అని గ్రహించవచ్చు. ప్రేమయొక్క స్వరూపం ప్రేమించడమే. ఇందులో ప్రేమించేవారికి ప్రేమాస్పదుడైనవానికి ఇరుపక్షాలవారికి అస్తిత్వ ముంటుంది. ప్రేమ మూలంగా ఇద్దరు సంయుక్తులవుతారు. ప్రేమ పర్యవసానం కూడా అదే. ఆనందం పొందేవాడొకడు వేరే లేనప్పుడు ఆనంద ప్రాప్తికి అర్థమేమిటో బోధపడదు. ఉపభోక్త అనే వాడొకడు వేరుగా ఉండాలి. శ్రీకృష్ణచరణారవిందసేవాసుఖచిత్తులైన నిష్కామభక్తులు తత్సుఖానంద నిరంతరాసక్తులై మోక్షాన్ని ఉపేక్షిస్తారు. శ్రీమద్భాగవతంలో శ్రీకృష్ణ భగవానుడు "**న కించిత్ సాధవో ధీరా, భక్తా హ్యేకాంతినో మమ, వాంఛన్త్యపి మయా దత్తం, కైవల్య మపునర్భవమ్**". **(శ్రీమద్భా.11-20-34)** "ధీరులు, సాధువులు. వారు అనన్య ప్రేమగల నా భక్తులు నన్నేమీ కోరరు. నేనే వారికి ఇచ్చుకోవాలనుకొంటాన్ను. ఇస్తాను కూడా. అయితే వారు ఇతర వస్తువులనే కాదు, మోక్షాన్నికూడా కాంక్షింపరు". ఈ శ్లోకంలోని "ధీరాః" అనే శబ్దం నా భక్తులు ఆపదలను గాని, సంపదలను గాని లెక్కచేయనటువంటి మహాధీరులు అనే విశేషార్థాన్ని స్ఫురింపజేస్తుంది. జనన మరణ చక్రంలో పరిభ్రమించడానికి కూడా వారు భయపడరు. అనగా "శ్రీకృష్ణభక్తులకు ఆవాగమన చక్రంలో పరిభ్రమించే దుస్థితి కలుగదని వారికి నిశ్చయంగా తెలుసు. ఎన్ని జన్మలలోనైనా, ఏ లోకానికి వెళ్లినా వారికి శ్రీకృష్ణ పదారవింద మకరందాస్వాదనమే

కావాలి. శ్రీకృష్ణభక్తునికి పురుషార్థాలు నాలుగు కరస్థ మైనట్టివే. వాటిని మళ్లీ కోరుకోవడం ఎందుకు? ఈ నాలుగింటివల్ల తనకు తృప్తి కలుగనందు వలననే నిరంతరభగవత్సేవను కోరుకొంటాడు శ్రీకృష్ణభక్తుడు. **"హరిభక్తిమహాదేవ్యాః సర్వా ముక్త్యాది సిద్ధయః, భుక్తయ శ్చాద్భుతా స్తస్యా శ్చేటికావదనువ్రతాః"** "భక్తిదేవి బయలు దేరితే ముక్త్యాది సర్వసిద్ధులు దాసీజనంవలె ఆమె వెంట నడచి వస్తా" యని నారదపాంచరాత్రం చెబుతున్నది. **"యస్య భక్తి ర్భగవతి హరౌ నిశ్శ్రేయసేశ్వరే, విక్రీడతోఽ మృతాంభోధౌ కిం క్షుద్రైః ఖాతకోదకైః"** (శ్రీమద్భా. 6-12-22) పరమకల్యాణమయుడైన శ్రీకృష్ణుని చరణారవిందముల యందు ప్రేమమయ భక్తిభావం కలవానికి ఈ లోకంలోని భోగాలతో అవసరమేముంటుంది? అమృత సముద్రంలో ఓలలాడేవానికి క్షుద్రపు మడుగులలోని నీళ్ళతో ఏమి ప్రయోజనం? ముక్తిప్రభృతిసంపత్తి అంతా భక్తిసంపత్తిని అనుసరించి వస్తుందని తాత్పర్యం. భగవత్ప్రేమభక్తి అనుపమానం. భగవత్ప్రీతిపాత్రుడై భగవంతుని ఆలంబనం పొంది ఉన్నతశిఖరానికి చేరి కృతకృత్యుడైన భక్తునికి ఈ పురుషార్థాలతో పనేమిటి? సాంసారిక తుచ్ఛ వస్తువులను, జాగతికమైన ఆలంబనాదులను అతడెప్పుడో విస్మరించాడు. శ్రీకృష్ణభగవానుని పొంది శాశ్వత చిరంతనానంద మహా సముద్రంలో విహరించేవానికి ముక్తి ఎందుకు? **"భుక్తి ముక్తి స్పృహా యావత్ పిశాచీ హృది వర్తతే"** (భక్తి. ర. సింధు 2-11) భోగమోక్ష పిశాచ వాంఛ మదిలో ఉన్నంతవరకు భక్తిరసావిర్భావం జరగదు అది పిశాచవాంఛ అన్నారు శ్రీరూపగోస్వామి. **"పురుషార్థాస్తు చత్వార స్తృణాయంతే సమన్తతః"** (భక్తి.ర.సింధు) శ్రీకృష్ణునియందు ఏ కొంచెమైన ప్రేమ కలిగినా పురుషార్థాలు నాలుగు తృణప్రాయమవుతాయి. **"తుష్టే చ తత్ర కి మలభ్య మనంత ఆద్యే, కిం తైర్గుణవ్యతికరా దిహ యే స్వసిద్ధాః, ధర్మాదయః కి మగుణేన చ కాంక్షితేన సారం జుషాం చరణయో రుపగాయతాం నః"** (శ్రీమద్భా. 7-6-28). సర్వేశ్వరుడైన శ్రీకృష్ణుడు ప్రసన్నుడైన తర్వాత భక్తునికి లభింపనిది ఏముంటుంది? లోక పరలోకాలకు ఏ ధర్మం ఆవశ్యకమవుతుందో అది ప్రయాస లేకుండా చేకూరుతుంది. యుద్ధం చేయనవసరం లేకుండానే అర్థసిద్ధి జరుగుతుండగా, కాదు. నేను యుద్ధమే చేస్తాననేవాడు వెఱ్ఱివాడు. **"పోరితంబులే కయ్యేడు వర్థసిద్ధి వెడగైవను వొల్లక యొండు సేయువే?"** (తిక్కన భారతం ఉద్యోగపర్వం) శ్రీకృష్ణచరణారవిందాలను సేవించేటప్పుడు, భగవన్నామాన్ని కీర్తించేటప్పుడు మోక్షం యొక్క ఆవశ్యకత ఏముంటుంది? ప్రేమ అనేది ఆనందాన్ని అనుకొని ఉండే వస్తువు.

భగవంతునియందు ప్రేమ కలిగిందంటే దానికి విచ్ఛేదమెన్నటికీ జరగదు. **"న మే భక్తః ప్రణశ్యతి"** (గీత 9-31) శ్రీకృష్ణుని సౌందర్య మాధుర్యాలతోపాటు భక్తుని ప్రేమ నిరంతరాభివృద్ధి చెందుతుంటుంది.

బృందావన భక్తిక్షేత్రంలో ప్రేమస్వరూపుడు శ్రీకృష్ణుడు ఎవరికోసం అడుగుపెట్టాడు? దాన్ని తన దివ్యధామంగా ఎందుకు చేసుకొన్నాడు? బృందావన రమణీమణుల ప్రేమ పవిత్రమైనది. వారు తమ సర్వస్వాన్ని శ్రీకృష్ణునికి సమర్పించారు. వారు ధరించిన ఆభరణాలు కూడా శ్రీకృష్ణమయమైనవే! **"శ్రవసోః కువలయ మక్ష్ణో రంజన మురసో మహేంద్రమణిదామ, బృందావనరమణీనాం మండన మఖిలం హరి ర్జయతి"** (కవికర్ణ పూరుని అలంకార కౌస్తుభం) వారి శ్రవణాభరణం నీలోత్పలం, కళ్లల్లో నల్లని కాటుక, వక్షఃస్థలంలో ఇంద్రనీల మణిహారం. నిజానికి ఆ గోపికలు నఖశిఖ పర్యంతం శ్యామమయులయ్యారు. పండితుల వేదాంత పరిజ్ఞానం, శాస్త్ర పాండిత్యం ప్రేమ భక్తి సమక్షంలో పరాస్తం కాకతప్పదు. వేదాంత పారంగతుడైన ఉద్ధవుడు ప్రేమరస భరితలైన గోపికలకు యోగశిక్షణ గరపడానికి మథుర నుండి బృందావనానికి వచ్చాడు. ఆ పల్లెటి గోపికలు ఆయన వద్ద యోగదీక్ష పొందడానికి ఇష్టపడలేదు. ఉద్ధవునికి వినయంగా ఇలా విన్నవించుకొన్నారు. "మహాశయా! యమ - నియమాది సాధన లేవీ మాకు ఆవశ్యక మైనవి కావు. ప్రాణాయామ, ధ్యాన, ధారణ, సమాధులతో కూడా మాకు నిమిత్తం లేదు. మేము వియోగినుల మాదిరిగా మీకు కనబడుతున్నా నిజానికి మేము వియోగినులము కాము. వియోగమే కనుక మాకుంటే మా ప్రియతముని కలుసుకొనే ప్రయత్నంలో యోగసాధన చేయకుండా ఉండలేము. మాకు ఏ సమయంలోను మా ప్రియతముడైన శ్రీకృష్ణుని ఎడబాటు లేదు. మేము సర్వదా ప్రియసంయోగసుఖానందసరోవరంలోనే మగ్నలమై జీవిస్తున్నాము. నీవు బోధింపదలచిన ఈ యోగశాస్త్రం మాకెందుకు ఉపయోగిస్తుంది? మా ప్రియతముడైన కృష్ణుడు మా సమక్షంలో లేకపోతే కదా అతణ్ణి దర్శించడానికి ధ్యానాన్ని అభ్యసింప వలసి ఉంటుంది? మేమందరం ఇక్కడ నఖ శిఖ పర్యంతం శ్యామమయుల మయ్యాము. తాము తెచ్చిన శాస్త్ర గ్రంథం ఇక్కడ విప్పడం వ్యర్థం. పండితోత్తమా! హృదయం ప్రేమ రహితమైనప్పుడు వ్రతాలు, యమ నియమాలు సాధనాలయితే కావచ్చు. శ్యామసుందరుని ముఖకమలం మా నయనాలతో ప్రఫుల్లితం కాకపోతే మాత్రం నీవు బోధించే యోగశాస్త్ర సాధన మాకు ఆవశ్యకమే అవుతుంది. మాకు మా

ప్రియతముణ్ని కలుసుకొనే ఆశ లేనప్పుడు మేము హఠయోగంలోని ఆసనాలు అవీ వేస్తూ కాలక్షేపం చేస్తాము. మా కృష్ణుడు మా దగ్గరుండగా మాకు ప్రాణాయామంతో అవసరమేముంది? మహాయోగులకు దుర్లభమైన తన్మయత్వం మాకు శ్రీకృష్ణప్రేమద్వారా సంప్రాప్తమయింది" అన్నారు. ఇక చెప్పండి. ఉద్ధవ పండితోత్తమా! పల్లెటివారైన వ్రజాంగనలకు యోగదీక్ష ఇచ్చి వారిని మీ శిష్యురాండ్రను చేసుకొనే ఉద్దేశ్యం తమకు ఇంకా ఉన్నదా? ఆ ఉద్దేశ్యం అడుగంటితే వారిచేత ప్రేమ దీక్ష పడసి వారికి తాము శిష్యులు కావడం మంచిది కదా! ప్రేమానందరసవార్ధిలో వారితోపాటు తాము కూడా మగ్నులు కావచ్చు. అదే పనిచేశాడు ప్రాజ్ఞుడైన ఉద్ధవుడు. ఆరాధ్యదేవుని విషయకమైన ప్రేమయే భక్తికి స్వరూపమవుతుంది. **"ఆరాధ్యదేవవిషయకం రాగత్వమేవ భక్తితత్త్వం"** భక్తి తత్త్వానికి సర్వతోమధురాలంబనమైనవాడు శ్రీకృష్ణభగవానుడు. **"భ్రూవల్లితాండవ కలా మధురాననశ్రీః కంకేలి కోరక కరంభిత కర్ణపూరః, కోఽయం నవీన నికషోపల తుల్య వేషో, వంశీరవేణ సఖి! మా మవశీకరోతి"** "ఆ కిశోరుని నర్తమాన భ్రూలతల వలన అతని ముఖశోభ అత్యంత మధురము. అతని కర్ణాగ్రభాగాన విభూషణమైన అశోక కళిక అత్యంత శోభావహము. నవీన నికషోపలం వంటి వేషం గల ఆ కిశోరు డెవరో గాని, అతని వంశీరవం నా బుద్ధిని, మనస్సును పరవశింపజేస్తున్నది" అని తన సఖికి చెప్పుకొంటున్నది ఒక గోపవధూటి. సర్వేంద్రియ సంతర్పక మైనది శ్రీకృష్ణ ప్రేమ. శ్రీకృష్ణ చరణానురాగంలో తమ సర్వస్వాన్ని సమర్పించుకొన్నవారు గోపికలు. **"యా మా భజన్ దుర్జర గేహ శృంఖలాః సంవృశ్చ్య తద్ వః ప్రతియాతు సాధునా"** (శ్రీమద్భా. 10 - 32 - 22) శ్రీకృష్ణుణ్ని దర్శించడంలో వారికి దర్శన సుఖలిప్స ఏమాత్రం లేకపోయినప్పటికి శ్రీకృష్ణుని వలన కోటిగుణితాధికసుఖం లభిస్తుంది. నిరవద్యమైన వారి ప్రేమభక్తికి శ్రీకృష్ణుడు ఉక్కిరి బిక్కిరయ్యాడు. ఆనందబాష్పాలు రాల్చాడు. **"యే యథా మాం ప్రపద్యంతే తాం స్తథైవ భజామ్యహమ్"** (గీత 4 - 11) 'నన్నాశ్రయించడానికి ఆసక్తులైనవారు ఏవిధంగా భావించి నన్నాశ్రయిస్తారో వారిని వారు భావించుకొన్న విధంగా అనుగ్రహిస్తాను' అని తాను ప్రతిజ్ఞాపూర్వకంగా చెప్పిన మాట భంగమవుతుందేమో అని విచలితుడయ్యాడు శ్రీకృష్ణ భగవానుడు. **"దుష్కర ప్రేమరూప ద్రవిణ దాతృత్వే హోత్తమర్ణానాం భవతీనాం తత్ప్రతీకారాసమర్థస్య మమాధమర్ణ్యమేవ స్యా ప్రత్యతీతి తాత్పర్యమ్"** అని శ్రీ వంశీధరస్వామి ఆ శ్లోక వ్యాఖ్యలో ఉటంకించారు. ఆ గోపికల ఉత్తమర్ణతను, తన అధమర్ణతను పడిగట్టుకొని భగవంతుడు

వారికి ప్రత్యుపకారం ఏమిచేయాలో తోచక ఆలోచనలో పడ్డాడు. దీనిని బట్టి గోపికలు నిరవద్య జీవితలు, స్వసుఖనిరభిలాషలని, వారికి శ్రీకృష్ణసుఖమే ముఖ్యమని స్పష్టమవుతుంది. నారద మహర్షి పరమ ప్రేమరూపమైన భక్తిని వ్యాఖ్యానించేటప్పుడు గోపికల భక్తినే దృష్టిలో పెట్టుకొన్నాడనిపిస్తుంది. **"అమృత స్వరూపా చ యల్లబ్ధ్వా పుమాన్ సిద్ధో భవతి, అమృతో భవతి, తృప్తో భవతి, యత్ప్రాప్య న కించిద్వాంఛతి, న శోచతి, న ద్వేష్టి, న రమతే నోత్సాహీ భవతి, యద్ జ్ఞాత్వా మత్తో భవతి, స్తబ్ధో భవతి, ఆత్మారామో భవతి"** (నా.భ.2-6). "భగవంతుని యందు భక్తి పరమప్రేమరూపమవుతుంది. అదే అమృత స్వరూపమవుతుంది. అలాంటి భక్తిని పొంది మనుష్యుడు సిద్ధుడవుతాడు. అమృతుడవుతాడు. తృప్తుడవుతాడు. అటువంటి ప్రేమస్వరూప భక్తి కలిగిన తర్వాత మనుష్యుడు ఏ వస్తువును కోరడు. దేనికి శోకింపడు. ఎవరిని ద్వేషింపడు. దేనియందు ఆసక్తుడు కాడు. ఏ విషయంలోను (విషయ సుఖప్రాప్తి) ఉత్సహింపడు. అలాంటి భక్తిని పొందినవాడు ఉన్మత్తుడవుతాడు. స్తబ్ధుడవుతాడు. ఆత్మారాముడవుతాడు". ఇటువంటి ప్రేమ సమస్తవిశ్వానికి ముక్తిని ప్రసాదించే భగవంతుణ్ని కూడా బంధించివేస్తుంది. **"యద్ బద్ధం ముక్తిదం ముక్తం బ్రహ్మ క్రీడామృగీకృతమ్"** (భక్తి రహస్యం) భక్తులు తమ ప్రేమబంధాలతో భగవంతుణ్ని బంధించి తమ క్రీడామృగంగా చేసుకోగలుగుతారు. ప్రేమసంబంధంతో జగత్తునందలి ప్రతివస్తువు నుండి సరసత్వం జాలువారుతుంది. మనస్సు, ప్రాణం ఆనంద రసవార్ధిలో నిమగ్నమవుతాయి. భగవత్ప్రేమ యందలి అనిర్వచనీయతను గమనించి ఆ సుఖం, ఆ భోగం **"మూకాస్వాదనవత్"** (నారద. భ. 52) మూగవాని ఆస్వాదన వంటిదనడం ఎంతో ఔచిత్య శోభితమైన ఉపమానం. మూగవాడు మధుర పదార్థం తిని సంతోషిస్తాడే కాని, దాని రుచిని ఇతరుల కెవ్వరికి తెలుపలేడు. భక్తుడు కూడా అలాంటి ప్రేమానంద సాగరంలో నిమగ్నమవుతాడు.

శుద్ధమైన ప్రేమ అహైతుకమైనది. అనగా స్వార్థపరమైన ఇచ్ఛ లేనిది. గుణ విశేష సంబంధం కూడా లేనిది. ఏదో ఒక గుణం మీద ఆధారపడిన ప్రేమభావము ఆ గుణం ఏ కారణంతోనైనా లోపించినపుడు క్షీణించి పోతుంది. కాని, యథార్థమైన ప్రేమ గలవారికి తమ ప్రేమాస్పదుల గుణదోషాలను వెదికే అవకాశం ఉండదు. శరణాగతుడైన విభీషణునికి అభయమిచ్చిన శ్రీరామచంద్రుణ్ని **"అనాలోచిత విశేషాశేషలోక శరణ్య"** అని శ్రీమద్రామానుజులు తమ శరణాగతి గద్యలో స్తుతించారు. అనగా

జాతి గుణాదులను గూర్చి ఆలోచింపక ప్రణతులైన సమస్త జీవులకు శరణ్యమైనవాడని అర్థం.

శ్రద్ధాసహితమైన ప్రేమయే భక్తి అవుతుంది. స్నేహసించితమైన ప్రేమ వాత్సల్యంగా, సౌహార్దభరితమైన ప్రేమ సఖ్యంగా, అనన్య ప్రేమభక్తి మధురోపాసనగా శోభిల్లుతుంది. ప్రేమభక్తికి చివరి దశ అనన్యత. అదే దానికి పరాకాష్ఠ స్థితి. అనన్యప్రేమభక్తుడు సిద్ధావస్థకు చేరినవాడవుతాడు. సర్వదా ఏకరసంలో నిమగ్నుడవుతాడు. ఒక క్షణం కూడా తన ప్రేమాస్పదుడైన భగవంతునితో వియోగాన్ని సహించలేడు. ఒడ్డున పడిన చేపలాగా విలవిలలాడతాడు. **"యదుపతికథావియోగే వ్యర్థం గతం ఆయురితి చింతా"** (ప్రబోధ సుధాకరమ్) ఒక క్షణం శ్రీకృష్ణ చింతనం జరగకపోతే తన ఆయువు వ్యర్థమైనట్లు విచారపడేవారట శ్రీశంకర భగవత్పాదులు. ప్రేమ భక్తునికి విరహదశలో కూడా ప్రేమాస్పదుడు లేకుండటం జరగదు. ప్రేమాస్పదుని రూపం సూక్ష్మతరమైనదై ద్యోతకమవుతూనే ఉంటుంది. భగవంతుడు ప్రేమభక్తుని మనోభావంలో కలిసి రంగరింపబడతాడు. భగవంతుణ్ని కట్టెదుట చూడకపోయినా, భగవద్వాణిని చెవులతో వినకపోయినా, శరీరాన్ని స్పర్శింపక పోయినా భక్తుని హృదయఫలకం మీద భగవద్రూపం స్ఫుటంగా ముద్రితమై ఉంటుంది. కాబట్టి భక్తుడు భగవంతుణ్ని దర్శించడం ఆయనతో మాట్లాడటం, ఆయన వాక్కులను వినడం, ఆలింగనం చేసుకోవడం కూడా జరుగుతుంది. అలౌకికమూ అనన్యమూ అయిన ప్రేమదశకు చెందిన ఈ స్థితిలో కలిగిన మధురానుభవం విరహం లేకపోయినా కలుగుతుంది. ఆత్యంతిక ప్రేమోత్పత్తి - ప్రేమ పరిపాకావస్థ ఇది. ఇదొక రకమైన వ్యసనం. ఈ వ్యసనం శ్రీకృష్ణ భగవానునిపట్లనైతే కృతార్థమవుతుందన్నారు శ్రీవల్లభ ప్రభువులు. **"యదా స్యాద్ వ్యసనం కృష్ణే కృతార్థఃస్యాత్ తదైవ హి"** భక్తిబీజం పూజాశ్రవణాదుల చేత ప్రవృద్ధమవుతుంది. ప్రేమాసక్తి వ్యసనావస్థను కలిగిస్తుంది. అన్యవిస్మృతి పూర్వకమైన భగవత్పరత్వమే ఒక వ్యసనం. ఈ వ్యసనంలో ఒక విశేషముంది. అది ఒక విధంగా శాంతిమయమైన ఆనందాన్ని చేకూరుస్తుంది. ఆ ఆనందానుభవం ప్రేమభక్తి వ్యసనులకే తెలుస్తుంది. **"క్షణం యుగశతమివ యాసాం తేవ వినాభవత్"** భగవంతునిపట్ల ప్రేమాసక్తికి వ్యతిరేక స్థితి ఇది. శ్రీ చైతన్య ప్రభువు తమ"శిక్షాష్టకం"లో **"యుగాయితం నిమేషేణ చక్షుషా ప్రావృషాయితమ్, శూన్యాయితం జగత్సర్వం గోవిందవిరహేణ మే"** "గోవిందుని విరహంతో నేడు నాకొక క్షణం యుగంగా తోస్తున్నది. ఈ లోకమంతా శూన్యంగా తోస్తున్నది" అని వ్యథ

పడుతున్నది ప్రేమ భక్తురాలైన గోపిక అన్నారు. ప్రాచీన కాలంలో దక్షిణదేశంలో ఆళ్వారులు ఆత్మ నివేదన భక్తికి సాకార విగ్రహులు. శ్రీకృష్ణభక్తి మధురోపాసకులు. గోదాదేవి (ఆండాళ్) ప్రేమ స్వరూపుడైన శ్రీకృష్ణుడు ప్రేమభక్తికే ప్రసన్నుడవుతాడనీ, తక్కిన సాధనాలన్నీ విడంబనా మాత్రములని నిరూపించింది. **"ప్రీయతేఽమలయా భక్త్యా హరి రన్య ద్విడంబనమ్"** శ్రీరంగనాథుడు ఆమెకు శ్రీకృష్ణుడే. శ్రీ జె.యస్.ఎం. హూపర్ అనే ఆంగ్లకవి ఆళ్వారుల పాశురాన్ని ఇలా ఆంగ్లీకరించాడు.

Day and night she knows not sleep. In floods of tears her eyes do swim. Lotus like eyes, she weeps and reels. No kinship with the world have I. Which takes for true the life that is not true, For Thee alone my passion burns, I cry Rangan, my Lord I!

------ Hooper: Hymns of the Alwars.

ఆదిశేషావతారంగా, శ్రీభాష్యకారుడుగా, శ్రీసంప్రదాయ ప్రవర్తకుడుగా ప్రసిద్ధికెక్కిన శ్రీరామానుజాలు ద్రావిడ భాషలో ఆండాళ్ పాడిన తిరుప్పావై పాశురాలను నిరంతరం మననం చేసేవారట. అందుచేత ఆయన్ను తిరుప్పావై జీయరని లోకులు పిలిచేవారట! ఆళ్వారుల భక్తి సర్వదా ప్రీతిమయము, రాగమయము, ప్రధానంగా ప్రేమమయమైనది. ఆళ్వారుల తర్వాత శ్రీరామానుజాలు శరణాగతి - ఆత్మ సమర్పణను భక్తి ప్రపంచంలో ప్రశస్తం చేశారు. శరీరంతో, వాక్కుతో, మనస్సుతో, ఇంద్రియాలతో, బుద్ధితో, ఆత్మతో, స్వభావానుసారంగా సమర్పణ చేయడమే ఆత్మసమర్పణ. **"కాయేన వాచా మన సేంద్రియై ర్వా, బుద్ధ్యాత్మనా వానుసృత స్వభావాత్, కరోతి యద్ యత్ సకలం పరస్మై నారాయణాయేతి సమర్పయేత్తత్"** (శ్రీమద్భా.11-2-36) శ్రీ యామునముని "హేనాథ! నాలో ధర్మనిష్ఠ లేదు, నేను ఆత్మజ్ఞానం కలవాణ్ని కాను, నీ చరణారవిందములయందు భక్తి గలవాణ్నీ కాదు, నేను అన్ని విధాల ఏమీ లేనివాణ్ని (అకించనుణ్ని), నీ చరణాలకు శరణువేడుకొంటున్నాను. నన్ను కాపాడు", **"న ధర్మనిష్ఠోఽస్మి న చాత్మవేదీ న భక్తిమాన్ త్వచ్చరణారవిందే, అకించనః నాన్యగతిః శరణ్య త్వత్పాదమూలం శరణం ప్రపద్యే"** అని శ్రీరామానుజాని ప్రపత్తి - శరణాగతి మార్గానికి త్రోవ చూపారు. శ్రీరామానుజాని శ్రీసంప్రదాయంలో ఆత్మనివేదన శరణాగతిగా, ప్రపత్తిగా సంపూర్ణ వికాసం పొందింది. ప్రపత్తి అంటే భగవంతుని సంకల్పానికి ప్రతిబంధకమైన తన ప్రవర్తనను నివృత్తి చేసుకోవడం. మనం మన రక్షణ విషయంలో ఏమాత్రం జోక్యం చేసుకొన్నప్పటికి భగవంతుడు మన రక్షణ విషయంలో ఉపేక్ష వహిస్తాడు. నిజానికి ఆయన **"రక్షాపేక్షాం ప్రతీక్షతే"** అన్నట్లు ఎవ్వరైన తనను రక్షింపుమని అపేక్షిస్తారా?

అని నిరీక్షిస్తుంటాడు. మన ప్రయత్నం ఆయన సంకల్పాన్ని అడ్డుతుంది. ఆ ప్రయత్నాన్ని విరమించుకొంటే ఆ భగవంతుని రక్షణకార్యం నిరభ్యంతరంగా జరుగుతుంది. సీతాదేవి తనను తాను రక్షించుకోగల శక్తి గలదైనప్పటికి, శ్రీరాముని రక్షణకై నిరీక్షించింది. హనుమంతుడు తన శక్తిని చూపి రక్షిస్తానని చెప్పినా అతని శక్తిని ఉపేక్షించి కేవలం శ్రీరాముని శక్తి పైననే నిర్భరురాలయింది. దుర్యోధనునిఆజ్ఞతో దుశ్శాసనుడు ఏకవస్త్ర ఆయిన ద్రౌపదిని రాజసభకు ఈడ్చుకొని వచ్చి బలాత్కారంగా ఆమెచీరను లాగి అవమానింప దలచాడు. ద్రౌపది కొంతసేపు ఆ దుష్టునితో పెనగులాడింది. ఒడలిపై చీరను పిడికిళ్లతో గట్టిగా పట్టుకొన్నది. క్రూరకర్కశకాయుడైన దుశ్శాసనునిదౌష్ట్యానికి తట్టుకోలేకపోయింది. సర్వధా అసహాయురాలైంది. తనకు సహాయకుడు, పరమబంధువు, పరమాత్ముడైన శ్రీకృష్ణుడే అని విశ్వసించి **"గోవింద ద్వారకావాసిన్ కృష్ణ గోపీజన ప్రియ, కౌరవైః పరిభూతాం మాం కిం న జానాసి కేశవ?"** అని **"ప్రపన్నాం పాహి గోవింద"** అని శరణాగతి చేసింది. శ్రీకృష్ణుడు ద్వారకలోనే కాదు, సర్వాంతర్యామియై అంతటా నిండి ఉన్నాడన్న పరమవిశ్వాసం ఆమెకు ఉన్నది. దుశ్శాసనునితో ద్రౌపది పెనుగులాడుతున్నంత వరకు శ్రీకృష్ణుడు ఉపేక్షించాడు, ఆమె తన శక్తిని విడిచిపెట్టి శ్రీకృష్ణునిపై భారముంచి "గోపీజన ప్రియ" అని ఎలుగెత్తి ప్రార్థించినపుడు ఆయన పరమ సంతోషంతో వస్త్రావతారుడై ద్రౌపదిని రక్షించాడు. భగవద్గీతలో ఏ ప్రసంగం వచ్చినా శ్రీమద్రామానుజులు భక్తియోగానికి అంగమైన ప్రపత్తిపరంగానే వ్యాఖ్యానిస్తారు. ఆళ్వారులు, పూర్వాచార్యులందరు భగవద్గీతలో ప్రతిపాదింపబడినది ప్రపత్తియే యని వ్యాఖ్యానించారు. మాధ్వ, నింబార్క, వల్లభ, చైతన్య, రాధా వల్లభ, హిత హరివంశుల సంప్రదాయాలను ప్రభావవంతం చేసినది ఈ ప్రపత్తియే. అయోధ్యా నివాసి అయిన స్వామి రామానందులు అపర రామానుజులయ్యారు. ఆయన శిష్య వర్గానికి చెందినవారే శ్రీ తులసీదాసాది మహాకవులు.

ప్రేమ భగవత్స్వరూపము. అది మనోవాక్కులకు అందేది కాదు. దాన్ని వ్యాఖ్యానించ లేము. కేవలం అనుభవించ వలసిన వస్తువది. **"కేవలానుభవానందస్వరూపః సర్వబుద్ధిదృక్"** (శ్రీమద్భా 10-3-13) "కృష్ణా! నీ స్వరూపం కేవలం అనుభవమూ ఆనందమే" అని స్తుతించాడు వసుదేవుడు. శ్రీకృష్ణభగవానునియందు ప్రేమ అధికమయ్యే కొద్దీ మనుష్యుని స్వార్థం క్రమక్రమంగా క్షీణించి పోతుంది. భగవత్ప్రీతిని సంపాదించుకొన్నవారు గోపికలు. వారు ఎక్కడున్నప్పటికి, ఎలా ఉన్నప్పటికి సుఖంగానే

ఉన్నారు. ప్రేమకు బంధితుడైన భగవంతుడు మిత్రుడుగా, పుత్రుడుగా, భర్తగా క్రీడిస్తాడు. వారి ప్రేమముందు మోక్షమనేది ఎలాంటి వస్తువు? ప్రేమరసోన్మత్తుల ప్రవర్తన అగమ్యం. వారి మహిమావధిని ఎవరు దాటలేరు. వారి లక్షణం విలక్షణంగా ఉంటుంది. శ్రీమద్భాగవతంలో ప్రేమోన్మత్తభక్తునిమహిమనుగూర్చి ఒకచోట భగవంతుడే స్వయంగా ఇలా అంటాడు. **"వాగ్ గద్గదా ద్రవతే యస్య చిత్తం రుదత్యభీక్ష్ణం హసతి క్వచిచ్చ"** (శ్రీమద్భా. 16-14-24). భగవంతుని మంగళమయ గుణాలను, లీలలను గానం చేస్తూ, ఇతరులు చేయగా వింటూ ఆ భక్తుల చిత్తం తదాకార మవుతుంది. వారి శరీరం పులకిస్తుంది. కంఠం గాద్గదిక మవుతుంది. వారి కన్నుల నుంచి చల్లని జలధారలు ప్రవిస్తాయి. అట్టి మహాత్ములే భూమిని పునీతం చేస్తారు.

**శ్లో. తమక్షరం బ్రహ్మ పరం పరేశ మవ్యక్త మాధ్యాత్మికయోగగమ్యమ్**
**అతీంద్రియం సూక్ష్మ మివాతిదూర మనంత మాద్యం పరిపూర్ణ మీడే**

తా : అవినాశి, సర్వశక్తిమంతుడు, అవ్యక్తుడు, ఇంద్రియాతీతుడు, అత్యంత సూక్ష్ముడు, అతి సమీపంలో ఉన్నప్పటికి చాలా దూరంలో ఉన్నట్లు తోచేవాడు. భక్తియోగం ద్వారా ప్రాప్తమయ్యేవాడు అయిన ఆదిపురుషుడు - అనంతుడు - పరిపూర్ణుడైనవానిని స్తుతిస్తాను.

**'అక్షరం న క్షరతి'** నశింపనివాడు. **"తస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గీ"** బృహదా. (3-6-9) ఓ గార్గీ ఈ అక్షరుని శాసనాన్నే సూర్య చంద్రులు శిరసావహించి స్థిరంగా ఉన్నారు. **"త్వ మక్షరం సదసత్పరం యత్"** వేదవేత్తల చేత అక్షరుడని పేర్కొనబడేవాడు. **"న క్షరతీతి అక్షరః"** "ముక్తులచేత నిరంతరం అనుభవింపబడుతున్నప్పటికి తన కళ్యాణ గుణాలు తరగనివాడు" అని అర్థం చెప్పారు శ్రీపరాశరభట్టరు. అనగా భక్తి మహిమకు తగినట్లుగా లీలా మహిమను ప్రదర్శించేవాడని తాత్పర్యం. భగవంతుని లీలా మాధుర్యం, భక్తుని ప్రేమసంబంధం - రెండూ ఒక దానితో ఒకటి పోటీ పడతాయి. భగవంతుని లీల భక్తునిభక్తిని అధికం చేస్తుంది. అలాగే భక్తునిభక్తి భగవంతుని లీలను అత్యధికం చేస్తుంది. దర్శకుడు నటుడు ఇద్దరు కలిసి అభినయమాధుర్యానుభవాన్ని పొందినట్లుగా భక్తుడు భగవంతుడు కలిసి లీలామాధుర్యాన్ని ఉపభోగిస్తుంటారు. **"భక్త్యాహ మేకయా గ్రాహ్యః"** భక్తిచేతనే తెలుసుకోదగినవాడు భగవంతుడు. భగవంతుణ్ని తెలుసుకోడానికి భక్తికాకుండా ఇతర సాధనాలతో తెలుసుకోవాలనుకోవడం మూర్ఖత్వం. ఇతర సాధనాలతో తెలుసుకోగోరినవానికి భగవంతునిరహస్యం మరింత అభేద్యంగా

మారుతుంది. ఆయన అతీంద్రియుడు. ఆయన సూక్ష్ముడు. అణువు కంటె అణీయమైనవాడు. **"మహతో మహీయాన్" "జ్ఞాత్వా దేవం శోకమోహౌ జహాతి"** ఆ భగవంతుణ్ని తెలుసుకొన్నవారు శోక మోహాల నుండి విడివడుతారు. ఆ భగవంతుడు అతిదూరంలో ఉన్నవాడు. **"యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ"** (తైత్తిరీయ శ్రుతి 9-1) ఆ భగవంతుణ్ని తెలుసుకోడానికి మనస్సుకు, ఇంద్రియాలకు శక్తి ఉండదు. మనస్సహితంగా ఇంద్రియాలు అక్కడికి వెళ్లి తిరిగి వస్తాయి. అంత దూరంలో భగవంతుడున్నాడని అర్థం. అనంతుడనగా దేశ కాల వస్తువులకు అవధి లేకుండినవాడు. అనగా ఎల్లప్పుడు సర్వత్ర సకల విధాల ప్రవర్తించువాడని అర్థం. **"ఈశ్వరః పరమః కృష్ణః సచ్చిదానంద విగ్రహః, అనాది రాదిః గోవిందః సర్వకారణ కారణమ్"** (బ్రహ్మ సంహిత) **"ఆద్యోహరిః శ్రీకృష్ణః"** (శ్రీమద్భాగవత ఏకాదశ స్కంధం.) శ్రీకృష్ణుని ఆద్యత్వాన్నీ శ్రేష్ఠత్వాన్నీ **"పురుషం ఆద్యం, కృష్ణసంజ్ఞం"** శ్రీకృష్ణునికంటె ఆదియైనవాడెవ్వడూ లేడు. **"ఏకో వశీ సర్వగః కృష్ణ ఈడ్య"** అని తాపన్యుపనిషత్తు. పరిపూర్ణుడనగా అవాప్త సమస్తకాముడని అర్థం. సకల కామనలచే, సంపూర్ణ శక్తులచే సంపన్నమైనవాడు పరిపూర్ణుడు = భగవంతుడు. **"ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే, పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే"** (శ్రుతి - ఈశావాస్యోపనిషద్) సచ్చిదానంద స్వరూపుడైన పురుషోత్తముడు సదా సర్వదా పరిపూర్ణుడు. ఈ జగత్తుకు ఆ పరబ్రహ్మచే పూర్ణత్వమబ్బింది. ఈ పూర్ణమూ ఆ పూర్ణమూ కూడా ఆ పురుషోత్తముని చేతనే ఉత్పన్నమైనవి. ఈ విధంగా పరబ్రహ్మయొక్క పూర్ణత్వంతో జగత్తు పూర్ణమైనప్పటికి కూడా ఆ పరబ్రహ్మము పరిపూర్ణుడు. ఆయన తన పూర్ణమునందలి పూర్ణమును వెడలించినప్పటికిని ఆయన పూర్ణుడయ్యే ఉంటాడు. (Absolute and All-Round Perfection.)

శ్రీకృష్ణ భగవానుని పరిపూర్ణతను "న్యాయవివరణం" **"పూర్ణానందః పూర్ణభుక్ పూర్ణకర్తా పూర్ణజ్ఞానః పూర్ణభాః పూర్ణ శక్తిః, పూర్ణైశ్వర్యాద్ భగవాన్ వాసుదేవో విరుద్ధ శక్తి ర్నచ దోషస్పృగీశః"** "షడైశ్వర్యపూర్ణుడైన శ్రీకృష్ణ భగవానునియందు పూర్ణానందం, పూర్ణభోక్తృత్వం, పూర్ణకర్తృత్వం, పూర్ణజ్ఞానం, పూర్ణజ్యోతి, పూర్ణశక్తి, పూర్ణైశ్వర్యం, విరుద్ధ శక్తిత్వం, అదోష స్పర్శిత్వమూ విద్యమాన మవుతాయి" అని వివరిస్తున్నది. అంతటి భగవంతుణ్ని ప్రసన్నుణ్ని చేసుకోవడానికి విశేషమైన భాష, విశేషమైన శబ్దాలు అవసరం లేదు. విశ్వాస భరితమైన శ్రద్ధాపూర్ణ ప్రేమభక్తి హృదయం ఉంటే చాలు.

**శ్లో. యస్య బ్రహ్మాదయో దేవా వేదా లోకాశ్చరాచరాః**
**నామరూపవిభేదేన ఫల్గ్వ్యా చ కలయా కృతాః"**

తా : ఆ భగవంతుని ఒకానొక సూక్ష్మకళతో అనేక నామరూపభేదాలతో కూడిన బ్రహ్మాదిదేవతలు, వేదాలు, చరాచరజగత్తు సృష్టింపబడుతున్నవి.

అనేకదేవతారూపాలలో నిన్నే లోకులు ఉపాసిస్తారు. అనేకమూర్తులలో నీవే మూల కేంద్ర స్వరూపుడవై ఉన్నావు. నీవు సర్వదేవమయుడవైన ఈశ్వరుడవు. లోకులు తమ ఇచ్ఛానుసారంగా ఆరాధించేది నిన్నే. నీవు ఒకడవే అయిన్పటికి భక్తుల ఇచ్ఛ ననుసరించి అనేక రూపాలతో ప్రతీత మవుతావు. నామ రూప భేదాలతో కూడిన బ్రహ్మరుద్రేంద్రాదిదేవతలు, చరాచర వస్తు సమస్తమూ నీ ఏకైక స్వరూపమే. మనోవాక్కులకు అగోచరుడవగు నీవు భావానురూపమైన భక్తియోగంతో ప్రాప్తిస్తావు. నీ నామ రూపాలు మంగళమయములు. వాటిని శ్రవణస్మరణచింతన చేసిన వ్యక్తి భక్తియోగావిష్టచిత్తుడైన తర్వాత మరల ఈ సంసారంలో పతితుడు కాడని తాత్పర్యం.

**"సర్వదేవమయో హరిః"** శ్రీహరి సర్వదేవమయుడు. బ్రహ్మరుద్రేంద్రాదులు ఆయనలోని విభాగాలే. ఆ విభాగాలను ఉపాసించడంలో ఎలాంటి విరోధముండదు. ఎట్లనగా **"మంత్రాదివ ద్వాఽ విరోధః** (బ్రహ్మసూత్రం 3-3-58) మంత్రాదులకు వలె విరోధం లేదని - ఇందుకు దృష్టాంతం. ఒక శాఖలో చెప్పిన మంత్రాలును, కర్మలును, గుణాలును ఇంకొక శాఖలో సంగృహీతములై వినియోగ పడుతుంటాయి. చింతితరూపం, చింతిత గుణము మోక్ష స్ఫూర్తిలో కలుగుతుంది. చింతిత గుణ రూపాలకు అతిరిక్తంగా గుణసంక్రమణం గాని, రూపసంక్రమణంగాని జరగదు. సర్వేశ్వరుడగు శ్రీకృష్ణుని యొక్క ఒకానొక కళతో ఈ విశ్వమంతా విచిత్రచిదచిత్ప్రవిభాగ వృత్తమై శోభిల్లుతున్నదని శ్రీయామునముని అన్నారు. **కస్యాయుతాయుతశతైకకలాంగకాంశే** విశ్వం విచిత్రచిదచిత్ప్రవిభాగ వృత్తమ్. (స్తోత్రరత్నం) ఎవని అనంత కోటికళలలోని ఏకాంశలోని అంశమే ఈ జడచేతనవిచిత్రసంసారం విభాగపూర్వకంగా నిలిచియున్నదో" అన్నట్లుగా అతడే విశ్వాన్ని నిర్మించాడు. **"మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ"** (గీత 7-7) "ఈ చేతన - అచేతనాలన్నీ దారంలోని మణుల వలె నాయందు గుది గ్రుచ్చబడి ఉన్నాయి" అని శ్రీకృష్ణముఖోక్తి. **"ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్, మమ దేహే గుడాకేశ యచ్చాన్యద్ ద్రష్టుమిచ్ఛసి"** (గీ 11-7) "ఓ అర్జునా! నా శరీరంలో ఒకానొకచోట నున్న చరాచర సహిత సంపూర్ణ జగత్తును

చూడదలచితే చూడు" అని నరాకృతిపరబ్రహ్మమైన శ్రీకృష్ణభగవానుడు తన విశ్వరూపం ప్రదర్శింపబోయే ముందు అర్జునునితో అన్నాడు. **"పశ్యామి దేవాం స్తవ దేవ దేహే సర్వాంస్తథాభూత విశేష సంఘాన్, బ్రహ్మాణమీశం కమలాసనస్థ మృషీంశ్చ సర్వా మరగాంశ్చ దివ్యాన్"** (గీత 11 - 15) శ్రీకృష్ణ భగవానుడు ఈ సంపూర్ణ జగత్తు తనలోని ఒకానొక భాగంలో ఉన్నదన్నాడు. అదెట్లున్నదో చూడగోరాడు అర్జునుడు. అప్పుడు శ్రీకృష్ణుడు తన విశ్వరూపాన్ని చూపాడు. ఆ విశ్వరూపంలోని విలక్షణతను దర్శిస్తూ అర్జునుడు చకితుడయ్యాడు. "దేవా! నీ దేహంలో సకల దేవతలను, అశేష విశేష ప్రాణి సముదాయాన్ని, స్థావర జంగమాలను, కమలాసనస్థుడైన బ్రహ్మను, శంకరుని, నారద వ్యాస వసిష్ఠాది ఋషీశ్వరులను, శేషవాసుకి ప్రభృతులను చూస్తున్నాను" అన్నాడు. శ్రీకృష్ణుని శరీరంలోని ఏకదేశంలోనే సమస్తవిశ్వాన్ని అర్జునుడు దర్శించాడు. ఆయన శరీరం ఇంకా ఎంతున్నదో చెప్పలేము. ఆ విశ్వరూపం "ఏకస్థ" మనే శబ్దంతో సూచితమయింది. **"క్వే దృగ్విధావిగణితాండపరాణుచర్యా వాతాధ్వరోమవివరస్య చ తే మహిత్వమ్"** (శ్రీమద్భా. 10-14) చతుర్ముఖబ్రహ్మ శ్రీకృష్ణుణ్ణి దర్శించి ఇలా స్తుతించాడు. "ఓ నా స్వామీ! నీ ఒక్కొక్క రోమ కూపంలో అగణిత బ్రహ్మాండాలు సూర్యకాంతికి గవాక్షాలలో ప్రసరించు త్రసరేణువులవలె కనిపిస్తాయి. నీ అనంత మహిమను నేనేమని చెప్పగలను? " అని. లోక ప్రసిద్ధమైన పురుషసూక్తం **"పురుష ఏ వేదగ్ం సర్వమ్"** అని భగవంతుని అపరిచ్ఛిన్నత్వాన్ని తెలిపింది. ఆ భగవంతుని శరీరంలో అనేక బ్రహ్మాండాలలో అనేక బ్రహ్మరుద్రాదులు ఇతరేతరానభిజ్ఞులై ఉన్నట్లు సూచిత మవుతున్నది. **"విష్టభ్యాహమిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్"** (గీత 10-42) తన ఒకానొక అంశమీద ఈ బ్రహ్మాండమంతా నిలచియున్నదని శ్రీకృష్ణముఖోక్తి.

భగవంతుడు సృష్టించిన జీవకోటిలో నానావిధ శరీరధారులున్నారు. స్థావరాలు, పశుపక్ష్యాది నానావిధ జంగమాలున్నాయి. ఈ సమస్త జీవ విశేషాలలో మనుష్యుడు ఉత్తమ శ్రేణికి చెందిన జీవి. ఇంతటితో భగవంతునిసృష్టి సమాప్తం కాలేదు. మనుష్యునికంటె ఎన్నోరెట్లు ఉన్నతమైన జీవులు కూడా ఉన్నాయి. అవి మనుష్యుల వలెనే చేతనత కలవి. వాటి శక్తి, జ్ఞానం ముందు మనుష్యుని శక్తీ జ్ఞానమూ అత్యల్పమైనవి. అలాంటి శక్తీ జ్ఞానమూ అపారంగా కలవారు దేవతలు. వారు మనుష్యులకు పైవారు. భగవంతునికి క్రిందివారు. భగవంతునివల్ల వారికి భిన్న భిన్నమైన అధికారాలు లభించాయి. వాటితో వారు పాలన చేస్తుంటారు. వారు

అమరులు, అజరులు. వారికి అమరత్వాన్ని అజరత్వాన్ని కలిగించినవారు మనుష్యులే. వస్తుతః వారికి కూడా నియతమైన ఆయుర్దాయమున్నది. బ్రహ్మాండంలోని దివ్యశక్తులను పొంది ఒక్కొక్క శక్తితో ఒక్కొక్క దేవత అధికారం చేస్తుంది. ఏ శక్తిగల దేవతకు ఆ శక్తి రూపమే లభిస్తుంది. ఒక్కొక్క దేవత ఒక్కొక్క దివ్యశక్తికి నియంత. ఇట్టి సమస్త దేవతలకు నియంత భగవంతుడు. దేవతలను ఉపాసిస్తే ఇష్టకామ్యాలు సిద్ధిస్తాయి. అయితే ఉపాసకుడు తదధిష్ఠాన దేవతనే ఆరాధింప వలసి ఉంటుంది. మనుష్యుని ఉపాసనను అనుసరించి ఆ దేవుడు దివ్యశక్తిని ధరిస్తాడు. అభీష్టాన్ని సిద్ధింపజేస్తాడు. ఆ దేవుని అధికారం సమాప్తమైనప్పుడు అతడు ముక్తి చెందుతాడు. అతనిస్థానంలో భగవంతుడు మరొకణ్ణి నియమిస్తాడు. అలా నియమింపబడేవాడు యోగ్యుడైన మనుష్యుడే అవుతాడు. ఆ మనుష్యుని ఉపాసనా యోగ్యతను బట్టి భగవంతుడతనికి ఆ పదవిని ప్రసాదిస్తాడు. ఈ విధంగా మనుష్యుడు దేవతాస్థితిని పొందడానికి బహువిధాలైన ఉపాసనలను, బహువిధ దేవతా రూపాలను ఆరాధింపవలసి ఉంటుంది. ద్వాపరయుగావసాన కాలంలో సర్వోద్ధార ప్రయత్నాత్ముడై సర్వేశ్వరుడు స్వయంగా అవతరించాడు. అతడే శ్రీకృష్ణుడు. "కృష్ణస్తు భగవాన్ స్వయమ్". తక్కిన దేవతలు, అవతార మూర్తులు ఆ శ్రీకృష్ణుని అంశలు మాత్రమే. ఆ శ్రీకృష్ణ భగవానునిలో సమస్త భూత భవిష్య వర్తమానావతారాలు సమావేశమయ్యాయి. ఆయన పూర్ణ పురుషోత్తముడు. సనాతనబ్రహ్మ. గోలోక విహారియైన గోవిందుడు (మహేశ్వరుడు) క్షీరసాగర శయనుడైన శ్రీమన్నారాయణుడు, వైకుంఠ నిలయుడైన శ్రీమహావిష్ణువు. ఆయన సర్వాంతర్యామియైన పరమాత్మ. ప్రకృతి గర్భస్థాపనుడైన విశ్వాత్మ. విశ్వాతీతుడు భగవంతుడు. కలియుగంలో మనుష్యులు భ్రమ ప్రమాదాలకు లోనై పతితులవుతారనీ, బహువిధ నామ రూపగుణ దేవతారాధనలో క్లేశాలకు లోనౌతారనీ భావించి భగవంతుడు పరమకారుణ్యంతో సర్వలోక సమాదరణీయమైన గీతను ఉపదేశించాడు. **"యో యో యాం యాం తనుం భక్తః శ్రద్ధయాఽర్చితు మిచ్ఛతి, తస్య తస్యాఽచలాం శ్రద్ధాం తా మేవ విదధా మ్యహమ్"** (గీత 7-21) "చేతనా చేతనములు నాకు శరీరం. కాబట్టి బ్రహ్మేంద్రాది దేవతలు నాకు శరీరభూతులు. వారిని శ్రద్ధగా ఆరాధింప గోరినవారికి వారిశ్రద్ధ నిర్విఘ్నంగా ఉండేట్లు నేను చేస్తాను" అన్నాడు. అంతేకాదు, దేవతాంతరాలను ఉపాసించిన భక్తుల కోరికలను నెరవేర్చేవాడను తానే అన్న రహస్యాన్ని కూడా తెలిపి భక్తులకు ఒక మహా సౌలభ్యం కలిగించాలని ఇలా

చెప్పాడు. "**అన్తవత్తు ఫలం తేషాం తద్భవత్యల్పమేధసాం, దేవాన్ దేవయజో యాన్తి, మద్భక్తా యాన్తి మా మపి**" (గీత 7-23) ఇంద్రాది దేవతలను ఆరాధిస్తే ఆ దేవతలకు అంతర్యామిగా ఉన్న నన్ను ఆరాధించినట్లే అవుతుంది. తదారాధకులకు ఫలప్రదాతను నేనే. నా సర్వాంతర్యామిత్వాన్ని తెలిసినవారు 'వాసుదేవః సర్వమితి' అని గ్రహించినవారు నన్ను ఆరాధించి శాశ్వతమైనఫలం పొందుతారు. ఇంద్రాది దేవతలను ఆరాధించినపుడు కలిగే ఫలం అశాశ్వతమైనదనీ, ఆ దేవతలు తమ స్థానం నుంచి చ్యుతులైనప్పుడు ఉపాసకుల ఉపాసన కూడా వ్యర్థమవుతుందనీ కాబట్టి అచ్యుతుడనైన తననే ఆరాధించి సంపూర్ణ శాశ్వత సాధర్మ్యాన్ని పొందవలసినదనీ తెలిపాడు శ్రీకృష్ణభగవానుడు.

**శ్లో. యథార్చిషోఽగ్నేః సవితు ర్గభస్తయో - నిర్యాంతి సంయాం త్యసకృత్ స్వరోచిషం**
**తథా యతోఽయం గుణసంప్రవాహో బుద్ధి ర్మనః భావిశరీరవర్గః**

తా : మండుతున్న అగ్నినుండి జ్వాలలు, సూర్యునినుండి కిరణాలు వెలువడి ఆ అగ్నిలోనే, ఆ సూర్యునిలోనే లీనమవుతుంటాయి. అలాగే పరమాత్మునినుండి బుద్ధి, మనస్సు, ఇంద్రియాలు, శరీరం, గుణప్రవాహాలు వెలువడి ఆయన యందే డిందుతున్నాయి.

"**యథాగ్నేః క్షుద్రా విస్ఫులింగా వ్యుచ్చరంతి**" అని శ్రుతి, "**నిర్యాంతి, ఉద్భవంతి, సంయాంతి, పున స్తత్రైవ లీయంతే స్వరోచిషః**" "**యతో వా ఇమాని భూతాని జాయంతే యేన జాతాని జీవంతి**" "దేనినుండి ఈ ప్రాణులు జన్మిస్తున్నాయో, ఆ విధంగా జన్మించిన ప్రాణులు దేనిచేత జీవిస్తున్నవో మోక్షదశలో దేనిని పొందుతున్నవో, ప్రళయంలో దేనియందు చేరిపోతున్నవో అది జగత్కారణమైన బ్రహ్మము, ఆ బ్రహ్మాన్ని వివరంగా తెలుసుకొనుము'' అని భృగువల్లి శ్రుతి ఉపదేశిస్తున్నది. శ్రీకృష్ణ భగవానుని రూపాలలో సర్వాంతర్యామిరూపం ఒకటి. నిరాకార సర్వవ్యాపకుడైన పరమాత్ముడు ఏకదేశంలో పూర్ణరూపంతో ఎలా అవతరిస్తాడు? అనే ప్రశ్నకు సమాధానం చెప్పడానికి గత్యంతరం లేక అగ్నిని ఉదాహరణగా తీసుకోవలసివచ్చిందే కాని, నిజానికి ఆ పరమాత్మునికి సదృశవస్తువు ఏదీ లేదు; ఉండదుకూడా.

"**యథాగ్నేః క్షుద్రా విస్ఫులింగాః**" అనే శ్రుతివాక్యానికి బ్రహ్మసూత్రం ప్రమాణంగా చూపి శుద్ధాద్వైత పుష్టిమార్గ ప్రవర్తకులైన శ్రీవల్లభులు తమ అణుభాష్యంలో చక్కని వివరణ ఇచ్చారు. "**పరాభిధ్యానాత్తు తిరోహితం తతో హ్యస్య బంధవిపర్యయౌ**" (బ్రహ్మసూత్రం 3-2-5). జీవుడు అణువు. అతడు ఈశ్వరుని అంశ. అనగా ఈశ్వరునితో సమానమైన

గుణం కలవాడు. అతడు బహిర్ముఖుడైన వెంటనే అతని ఈశ్వరీయగుణం తిరోహితమయింది. అతడు పరాధీనుడయ్యాడు. అతని వీర్యం తిరోధానమైనందువల్ల సర్వదుఃఖాలను అతడు సహింపవలసినవాడైనాడు. అతని యశస్సు తిరోభావమైనందువల్ల సర్వహీనుడయ్యాడు. అతని శ్రీ తిరోభావమైనందువల్ల జన్మాది సర్వాపదలు సంక్రమించాయి. అతని జ్ఞానం తిరోభావమైనందువల్ల దేహాదులందు అహం బుద్ధి ఏర్పడింది - విపరీత జ్ఞానం కలిగింది. అతని వైరాగ్యం తిరోభావమైనందువల్ల విషయాసక్తి కలిగింది. భగవద్ధర్మ తిరోధానకార్యంవల్లనే అతడు బద్ధుడైనాడు. జీవుడికి ఈశ్వరాంశ ఉన్నప్పటికి ఆ ఈశ్వరాంశ తిరోధానమైనందువల్లనే లోకంలో అతడు దుఃఖభాగుడు కావలసి వచ్చింది.

ఈ జీవుడు మరల ఈశ్వరీయ ధర్మాన్ని పొందే ఉపాయం ఏదీ లేదా? ఉన్నదని చెబుతున్నది శ్రుతి. **"తస్యాభిధ్యానా ద్యోజనాత్తత్త్వభావాద్భూయశ్చాంతే విశ్వమాయా నివృత్తిః"** (శ్వేతాశ్వతరోపనిషత్తు 1-10) నిరంతర భగవద్ధ్యానంతో, దివారాత్రాలు భగవద్రూప గుణకీర్తనలందు తన్మయత నొందిన చిత్తంతో జీవించినవానికి భగవంతుడు ప్రాప్తిస్తాడు. అనగా అతనియందు భగవద్ధర్మం పునఃప్రతిష్ఠితమవుతుంది. గీతలో శ్రీకృష్ణ భగవానుడీ రహస్యాన్నే స్పష్టమైన శబ్దాలతో చెప్పాడు. **"జన్మ కర్మ చ మే దివ్యం ఏవం యో వేత్తి తత్త్వ తః, త్యక్త్వా దేహం పునర్జన్మ నైతి మా మేతి సోఽర్జున"** (గీత 4-9) "అర్జునా! అప్రాకృతమైన నా అవతారాలను, నేను చేసే సాధు సంరక్షణాది విలక్షణ కర్మలను చక్కగా తెలుసుకొన్నవాడు పునర్జన్మను పొందడు. అతడు నన్నే పొందుతాడు" అని. ఈశ్వరజన్మకర్మల జ్ఞానానికి తత్కీర్తనకు, విశేషమైన ఫలమున్నది. ఇట్టి జ్ఞానయుక్తమైన భక్తిని జీవునికి కలిగించి పుష్టి నిచ్చేదే శ్రీవల్లభుల పుష్టిమార్గం. భగవంతుడు సర్వశక్తిమంతుడు. సౌహార్ద ప్రేమ దయాది సమస్త కళ్యాణమయ దివ్యగుణ సంపన్నుడు, సకల జీవులను పాలించేవాడు, పోషించేవాడు, బంధ విముక్తి కలిగించేవాడు ఆయనయే. ఆయన కృపతోనే జీవునికి ముక్తిసాధన లభిస్తుంది. ఆ సాధన పరిపక్వమైనప్పుడు ఆ జీవి ముక్తి పొందుతాడు. ఈ విషయాన్నే **"సంసార మోక్షస్థితిబంధహేతుః"** అని శ్వేతాశ్వతరోపనిషత్తు (6-16) స్పష్టం చేసింది. ఈ శ్రుతివాక్యాలనే పద్మపురాణం **"కీర్తనాదేవ కృష్ణస్య విష్ణో రమిత తేజసః, దురితాని విలీయన్తే తమాంసీవ దినోదయే"** "అమిత తేజస్వి, సర్వవ్యాపి అయిన శ్రీకృష్ణభగవానుని కీర్తించిన మాత్రం చేతనే దినోదయయమైనంతనే చీకట్లు పటాపంచలైనట్లు సమస్త పాపాలు నశిస్తాయి" అన్నది.

శ్లో. న వై న దేవాసుర మర్త్య తిర్యజ్ న స్త్రీ న షండో న పుమాన్ న జంతుః
నాయం గుణః కర్మ న సన్న చాస న్నిషేధశేషో జయతా దశేషః

తా : అతడు దేవత కాడు, . రాక్షసుడు కాడు. మనుష్యుడు కాడు. పశుపక్ష్యాదులలోనివాడు కాదు. స్త్రీ కాదు, పురుషుడు కాదు, నపుంసకుడు కాదు. అతడొక సాధారణ - అసాధారణ జీవం కాదు. అతడు గుణము కాడు. కర్మయు కాడు. సత్తు కాదు, అసత్తు కాదు. అన్నిటినీ నిషేధించిన తర్వాత శేషించిన వాడు. ఆ శేషించినదే ఆయన స్వరూపం. అతడే సమస్తమూ అయినవాడగు పరమాత్మ నన్ను ఉద్ధరించడానికి ప్రాకట్యమగుగాక!

సత్తు అసత్తులకు అనగా చేతనా చేతనమైన ఉభయ వర్గానికి అతీతమైనవాడు, సకలమూ నిషేధించిన తర్వాత శేషించినవాడు అనగా అశేష కళ్యాణ గుణ గణాన్వితుడు అయిన భగవంతునికి జయమగుగాక! తద్భగవత్ప్రాప్తికి ప్రతికూలాలన్నియు తొలగి పోవును గాక! గజేంద్రుడు నామ రూపాద్యభిమానులైన దేవతాగణాలను పిలువలేదు. అతడెవరి నామాన్నీ పేర్కొనలేదు. గజేంద్రునిచే వర్ణితుడైనవాడు అఖిల కళ్యాణ గుణాశ్రయుడైన నిఖిలదేవతామయుడు శ్రీకృష్ణుడు. గజేంద్రుని స్తవంలోని విశేషణ విన్యాసము బ్రహ్మాది దేవ బృందానికి బోధపడటం అసంభవము. ఆ విశేషణ విన్యాసమంతా పురుషోత్తముడైన శ్రీకృష్ణునికే అన్వయిస్తుంది. "స ఆత్మా అంగా న్యన్యా దేవాః" అనే శ్రుతి వాక్యానుసారంగా సకల దేవతలకు అంగిరూపుడైనవాడు శ్రీహరి. బ్రహ్మాది దేవతల యందు సర్వకారణ కారణత్వం లేదు. గజేంద్రుని చేత ప్రస్తుతింపబడిన సర్వేశ్వరునిలో సాత్వికత్వమూ లేదు భౌతికత్వమూ లేదని చెప్పడంలో భగవంతుని విలక్షణత విదితమవుతుంది. అతడు స్త్రీ కాదు - పురుషుడు కాడు అనడంలో భగవంతుని ప్రాకృత ధర్మరాహిత్యము ప్రదర్శిత మవుతుంది. పైన పేర్కొన్న ఏ ప్రాణి కోటిలోనికి భగవంతుడు చేరడని చెప్పడంచేత సత్వాది గుణాలు, పాపపుణ్యాలు ఆయనలో లేవని అవగతమవుతున్నది. ఇంకా ఏమి చెప్పాలి? ఈ జగత్తులో సత్తునందలి స్థూలాంశము, అసత్తునందలి సూక్ష్మాంశము ఈ రెంటిలో ఏ ఒక్కటీ లేనివాడా భగవంతుడు. అనగా సదసత్తులకు అతీతుడై స్వయం ప్రకాశుడైనవాడు ఆ దేవదేవుడు. పైని పేర్కొన్న వస్తువులనన్నిటిని నిషేధించడం చేత,

అనగా నిషేధ శ్రుతివాక్యం చేత (*నేతి నేతి) సమస్తమూ శేషసీమలో నిలిచిపోగా, ఆ శేషసీమలో నుండియే తన స్వాభావికమైన జ్ఞానబలక్రియలలో అశేషాత్మక రూపంతో ప్రతిభాసించేవాడు ఎవడు? అతడే **"ఓం నమో భగవతే వాసుదేవాయ"** మహామంత్రాధిష్ఠాన దైవము.

**"సర్వే విష్ణుమయా దేవాః సర్వే విష్ణుమయా గణాః, న హి విష్ణుసమా కాచి ద్గతి రన్యా విధీయతే'** సమస్త దేవతలు దేవగణాలు విష్ణుమయమైనవారలే కాని, విష్ణు సమాను లెవ్వరూలే"రని బ్రహ్మపురాణం చెబుతున్నది. **"క శ్శ్రీ ? శ్రియః పరమ సత్త్వ సమాశ్రయః కః?, కః పుండరీకనయనః? పురుషోత్తమః కః? కస్యాయుతాయుతశతైకకలాంశకాంశే విశ్వం విచిత్ర చిదచిత్ప్రవిభాగవృత్తమ్"** అని శ్రీయామునముని సకల వేద ప్రతిపాదితుడైన సర్వేశ్వరుని అనంతైశ్వర్యాన్ని ఒక్క శ్లోకంలో చెప్పారు. లక్ష్మీదేవికి సంపదయైనవాడెవడు? శుద్ధ సత్త్వానికి ఆశ్రయణీయు డెవడు? (సత్తా భాసకమైనది సత్త్వం. ఇది త్రిగుణాలలోని సత్త్వం కంటె విలక్షణమైనది) పుండరీకాక్షుడెవడు? పురుషోత్తము డెవడు? అని ప్రశ్నిస్తూ భగవంతుని మహావిభూతిని ఇలా ప్రస్తుతించారు. చేతనా చేతన విశిష్టమైన అనేక బ్రహ్మాండాలను తన మహిమలోని పెక్కు వేల భాగాలకు చెందిన ఒకానొక అత్యల్పాంశం మీద నిల్పిన వాడెవడు? (అంశ అనగా ఉదాహరణకు నూలు దారంతో, అంశి అనగా నూలు దారాలతో కూడిన వస్త్రంతో పోల్చుకోవచ్చు.) ఆ మహాపురుషుని ఆ సర్వగతుని, ఆ మహావిష్ణువుమహిమవిషయంలో ఆయా బ్రహ్మాండాలలో గల బ్రహ్మరుద్రాదిదేవతలందరు అనభిజ్ఞులే. **"విష్టభ్యా హ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్"** (గీత. 10-42) "ఈ జగత్తంతా నా ఒకానొక స్వల్పమైన అంశం మీద నిలిచియున్నది" అని చెప్పాడు శ్రీకృష్ణ భగవానుడు. విష్ణు పురాణంలో పరాశరులవారు భగవంతుని బ్రహ్మాండధారణం **"యస్యాయుతాయుతాంశాంశే"** తో

---

* 'నేతి' 'న + ఇతి' ఇది కాదు. "యతో వాచో నివర్తంతే" మొదలైన ఉపనిషద్వాక్యాలతో పరమాత్మ తత్త్వం ప్రతిపాద్యమవుతున్నది. ఉదాహరణకు ఒక అమాయికుడైన సేవకుడు ఏదో తప్పు చేశాడనుకొండి. యజమానుడు ఆగ్రహోదగ్రుడై "ఛీ ఛీ. నీవు మనుష్యుడవు కాదురా" అని తిట్టాడు. అమాయికుడు ఆ మాట విని సందిగ్ధంలో పడ్డాడు. తాను మనిషిని కానేమో అనుకొన్నాడు. ఒక పెద్దమనిషి దగ్గరికి వెళ్లి "అయ్యా! నేను ఎవరినో చెప్పండి" అని అడిగాడు. ఆ పెద్దమనిషి లోలోపల నవ్వుకొని "నేను ఒక వరుసలో నీ వడిగిన విషయం చెబుతాను. విను. నీవు ఘటానివి కాదు - పటానివి కాదు. రాయివి కాదు. నీళ్లు కాదు. నేల కాదు. నీవు అమనుష్యుడవు కాదు" అని ఈ విధంగా ప్రతిషేధ రూపంలో "నీవు మనుష్యుడవు" అని తెలియజెప్పాడు. ఈ విధంగానే దృశ్యమానమైన సమస్త వస్తువులను నిషేధిస్తూ, శేషించినదే బ్రహ్మస్వరూపమని పరిచయించడ మిది.

జరుగుతున్నదని తెలిపారు. **"మయి సర్వమిదం ప్రోతం సూత్రే మణిగణా ఇవ"** (గీత 7-7) "ఈ సమస్తమైన చిదచిద్వస్తు సమూహమంతా దారంలోని మణిగణాల వలె అంతర్యామియై ఉన్న నాయందు కూర్చబడినవి" అన్నాడు శ్రీకృష్ణ భగవానుడు. నరాకృతి పరబ్రహ్మమగు శ్రీకృష్ణుడు తన విశ్వరూపాన్ని చూపించినపుడు అర్జునుడు **"పశ్యామి దేవాం స్తవ దేవ దేహే సర్వాం స్తథా భూతవిశేషసంఘాన్, బ్రహ్మాణ మీశం కమలాసనస్థమ్"** (గీత 11 - 15) "దేవా! సకల దేవతలను, సమస్త ప్రాణి విశేష సమూహాలను, అండాధిపతియైన చతుర్ముఖ బ్రహ్మను - నీ దేహమునందు చూస్తున్నాను" అన్నాడు. సమస్త దేవతలు సకల చరాచర జీవకోటి శ్రీకృష్ణమూర్తిలో అంతర్భూతులై ఉండటం చూచి అర్జునుడు ఆశ్చర్యపడ్డాడు. గజేంద్రుడు ఇట్టి అనంత శక్తి ధరుడైన విశ్వమూర్తినే ప్రార్థించాడు. కాని, స్తబ్దమతి కావడం వల్ల వేద ప్రసిద్ధమైన భగవన్నామాన్ని పలుకలేక పోయాడు.

ఆదిశేషుని అవతారమే బలరాముడు. శ్రీమద్భాగవతం (10-2-8) లో భగవానుడు **"దేవక్యా జఠరే గర్భం శేషాఖ్యం ధామ మామకం, తత్ సన్నికృష్య రోహిణ్యా ఉదరే సన్నివేశయ"** "నా శేషనామక రూపం దేవకీదేవి సప్తమ గర్భం. దానిని ఆకర్షించి రోహిణి ఉదరంలో నిక్షేపించు" అని యోగమాయను ఆజ్ఞాపించాడు. అయితే భగవంతునికి శేషుడనే పేరున్నదా? శేషుడు అనంతుడు కదా. అందుకు సమాధానం దేవకి చేసిన స్తోత్రంలో లభిస్తున్నది. **"నష్టే లోకే ద్విపరార్ధావసానే మహాభూతేష్వాదిభూతం గతేషు, వ్యక్తేఽ వ్యక్తం కాలవేగేన యాతే, భవానేకః శిష్యతే శేషసంజ్ఞః"** (శ్రీమద్భా. 10-3-25) "బ్రహ్మాండ ప్రళయం ఏర్పడినపుడు శేష సంజ్ఞగల నీ వొక్కడవు అవశిష్టుడవవుతావు" అని. నిత్య సత్తాశీలుడైన శ్రీకృష్ణుణ్ణి శేషుడంటారు. స్వయంభగవానుడైన శ్రీకృష్ణుని ప్రథమాంశం శేషుడు. అందుచేత అతడు శ్రీకృష్ణునికి ద్వాపరంలో అగ్రజుడై అవతరించాడు. భగవంతునికి కైంకర్యం చేయాలన్న ఉద్దేశ్యంతో శేషుడు భగవంతునికి శయ్యగా, ఆసనముగా, పాదుకలుగా, అంశుకముగా, తలగడగా, వింజామరగా, ఛత్రముగా ఉపచరిస్తాడు కాబట్టి ఆయన్ను శేషుడని పేర్కొంటా"రని శ్రీయామునముని తమ స్తోత్రరత్నంలో ఈ శ్లోకం రచించారు: **"నివాస శయ్యాసన పాదుకాంశుకోపధాన వర్షాతపవారణాదిభిః,** శరీరభేదై స్తవ శేషతాంగతై ర్యథోచితం శేష ఇతీరితో జనైః". శేషాంశసంభూతుడుగా ప్రఖ్యాతి చెందిన భగవద్రామానుజులు తమ "వేదాంత సంగ్రహం"లో శేషుడు భగవంతుని సేవలో అనవధికాతిశయసౌఖ్యాన్ని పొందుతాడని వ్రాశారు. "నిత్య

సేవకుడు మృత ప్రాయు"డనే లోకోక్తి ఉన్నది. దీనికి విరుద్ధంగా శేషుని భగవత్సేవాచరణం అతనికి నిరవధిక సౌఖ్యాన్ని కలిగించినదే కాని, పారతంత్ర్యదుఃఖాన్ని గాని, బాధను గాని కలిగించ లేదు. శ్రీరామ పట్టాభిషేకోత్సవంలో శ్రీరాముడు లక్షణుణ్ని యువరాజ పదవిని స్వీకరింపుమని కోరాడు. శేషాంశసంభూతుడైన లక్ష్మణుడు అందుకు ఇష్టపడలేదు. శ్రీరామ సేవయే తనకు సంతుష్టినిస్తుందన్నాడు. ప్రపత్తి పరుల కార్యక్రమం భగవత్కైంకర్యమే. అనగా భగవత్సేవయే. జీవునికి పరబ్రహ్మకు పెద్ద అంతరం లేదనే భావం కూడా ఈ సందర్భంలో శ్రీమద్రామానుజాలు సూచించారు. పరమాత్మ శేషుడు. జీవాత్మ కూడా శేషుడే. జీవాత్మ అయిన శేషత్వం దాస హేతువు. అయినా ఈ దాస్యం దుఃఖజనకం కాదు. అసేవ్యుని సేవిస్తేనే దుఃఖం కలుగుతుంది. ఆత్మయాథాత్మ్యవేదులకు సేవింప దగినవాడు సర్వేశ్వరుడొక్కడే అని శ్రీమద్రామానుజల సిద్ధాంతము.

ఈ సందర్భంలో గోపికాభక్తిని ప్రస్తావించడం ప్రాసంగికమే అవుతుంది. గోపీభావం ఇలాంటిదే. శ్రీకృష్ణుని సౌఖ్యానికి విశుద్ధమైన ప్రేమాచరణమే పవిత్రమైన గోపీ భావమవుతుంది. గోపికల మనస్సులో ఇహలోక - పరలోక భోగాసక్తి లేదు. వారి సకలేంద్రియాలను శ్రీకృష్ణుడు తప్ప మరే విషయమూ ఆకర్షించదు. వారు తమ మనస్సును శ్రీ కృష్ణుని మనస్సులో, వారు తమ ప్రాణాన్ని శ్రీకృష్ణుని ప్రాణంలో విలీనం చేశారు. శ్రీకృష్ణుడు ఎలా కోరితే అలా జీవించారు. వారు జీవన మరణాలను లోక - పరలోకాలను శ్రీకృష్ణునికి అధీనం చేశారు. తమ సకలేచ్ఛలు శ్రీకృష్ణుని ఇచ్ఛలో కలిపి వేశారు. విలక్షణమైన వారి ప్రేమలో శృంగార మున్నది కాని రాగం లేదు. భోగం ఉన్నది కాని, అంగ సంయోగం లేదు. ఆసక్తి ఉన్నది కాని, అజ్ఞానం లేదు. ఆక్రందన ఉన్నది కాని దుఃఖం లేదు. విరహమున్నది కాని వేదన లేదు. సేవ ఉన్నది కాని, అభిమానం లేదు. సుఖమున్నది కాని, స్పృహ లేదు. భగవంతునికి ఎంతగా సేవ చేసినా భక్తుడు అలసిపోడు. అది అసేవ్యునికి సేవ చేయడం కాదు. ప్రియతమునికి చేసే సేవ అది. ప్రియతముడైన భగవంతుడు ఎంతగా సుఖపడితే అంతగా వారు సుఖిస్తారు. అసేవ్యుని సేవలో ఇలాంటి సుఖం ఉండదు. భగవద్రామానుజాలు ఈ సందర్భాన్ని పురస్కరించుకొని తమ 'వేదార్థ సంగ్రహం'లో అసేవ్యునికి సేవ చేయడం శ్వవృత్తి అవుతుందని గర్హించారు. గీత (9-27) లో శ్రీకృష్ణ భగవానుడు **"యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్, యత్తపస్యసి కౌంతేయ తత్కురుష్వ మదర్పణమ్"**

"అర్జునా! నీకు స్వతః ప్రాప్తించిన లేదా శాస్త్రతః ప్రాప్తించిన గమనాదులు గానీ, సంధ్యోపాసనాదులు గానీ, స్వతః శాస్త్రతః ప్రాప్తించిన అనిషిద్ధమైన భోగంగానీ, శ్రుతిప్రాప్తమూ స్మృతిప్రాప్తమూ అయిన హవనం గానీ, స్వతః శాస్త్రతః ప్రాప్తించిన చాంద్రాయణ ప్రాణాయామాది తపశ్చరణం గానీ, తత్సర్వమూ **"ఇదం భగవతేఽస్తు" "ఇదం భగవతే శ్రీకృష్ణాయ సమర్పయే"** అని నాకు సమర్పించు" అని చెప్పాడు. అట్లు భగవంతుడు చెప్పినట్లే **"యత్కరోమి యదశ్నామి యజ్జుహోమి దదామి యత్ యత్తపస్యామి భగవన్! తత్కరోమి త్వదర్పణమ్"** అని నివేదించి ఆచరించి **"తత్సుఖే సుఖిత్వం"** గా తమ సర్వస్వము శ్రీకృష్ణునికి సుఖసామగ్రిగా సమర్పించి ధన్యులైనవారు గోపికలే.

శ్లో. **జిజీవిషే నాహ మిహాముయా కిం అన్త ర్బహి శ్చావృతయేభయోన్యా**
**ఇచ్ఛామి కాలేన న యస్య విప్లవస్త స్యాత్మలోకావరణస్య మోక్షమ్**

తా : నేను జీవింపగోరటం లేదు. ఈ గజజన్మ బహిరంతరాలు అజ్ఞానంలో ఆవరింప బడినటువంటిది. ఈ ఏనుగు జన్మను బ్రతుకనిచ్చి ఏమి ప్రయోజనం? ఆత్మ ప్రకాశాన్ని నిరోధించే ఈ అజ్ఞానావరణంనుంచి విడిపోవ గోరుతున్నాను. ఈ అజ్ఞానం కాలక్రమాన విడిపోయేది మాత్రం కాదు. కేవలం భగవత్కృపవలననే, తత్త్వజ్ఞానం వలననే దీనికి ముక్తి.

సకలవిధదుఃఖాలు, బంధాలు, ఇచ్ఛలు, వాసనలు - వీటి నుండి తప్పించుకోవడం మోక్షం. **(మోక్షయతి - మోక్షతి - మోక్షతే దుఃఖమనేన)** ఏ జీవియైనప్పటికి కర్మఫలానుసారంగా వివిధ యోనులలో పడి ఆవాగమన బంధంలో చేరవలసి వస్తుంది. ఈ ఆవాగమనం నుంచి విడివడటమే ముక్తి. అదే మోక్షము. అట్టి మోక్షాన్ని పొందడానికి మహత్తరమైన సాధన చేయవలసి ఉంటుంది. మనుష్యుడుగా జన్మించిన వానికే అట్టి సాధన చేయడానికి వీలవుతుంది. పశుపక్ష్యాదులు ముక్తి నొందడానికి ప్రయత్నించ లేవు. మానవులలో కూడా ముక్తి పొందడానికి ఒక మానవజన్మ చాలదు. మనుష్యుని తరువాతిజన్మ మానవజన్మయే అయ్యుంటుందన్న నమ్మిక మేమీ లేదు. అతని కర్మఫలాన్ని అనుసరించి అతనికి జన్మ ఉంటుంది. మానవత్వపు ఉచ్ఛతమ శ్రేణికి చేరుకొన్నవారే ముక్తిని ఆశింపదగినవారవుతారు. అలాంటివారు నూటికి కోటికి ఒకరో అరో ఉంటారు. దివారాత్రాలచక్రం, సృష్టిప్రళయచక్రం, జన్మమరణచక్రం, బంధమోక్షాలచక్రం - ఈ చక్రగతులు అనాదికాలం నుంచి సాగుతూనే ఉన్నాయి. ప్రళయం వచ్చిన తర్వాత సృష్టి ఆగిపోలేదు. భగవంతుడు **"యథాపూర్వ మకల్పయత్"**

పూర్వమున్నట్లుగానే సృష్టించాడు అని శ్రుతులలో వర్ణింపబడింది. విజ్ఞానవివేకశీలుడైన మనుష్యుడు పగ్గాలను దృఢంగా పట్టుకొని ఈ సంసార పథాన్ని అతిక్రమించి పరబ్రహ్మ పరమాత్ముడైన శ్రీవిష్ణు పదానికి చేరుకోవాలని చెబుతున్నది కఠోపనిషత్తు 1-3-9. **"విజ్ఞాన సారథిర్యస్తు మనః ప్రగ్రహవాన్నరః, సోఽ ధ్వనః పారమాప్నోతి తద్ విష్ణోః పరమం పదమ్"**. ఇక ఇంటా బయటా మొద్దు స్వరూపమైన ఏనుగు ముక్తిని ఆశించడం విడ్డూరం కాదా, అంటే అటువంటిదేమీ లేదు. ఏనుగు మొద్దు జంతువే అయినా గజేంద్రుడు అలాంటివాడు కాదు. పూర్వజన్మలో గొప్ప భక్తుడు. అతని భక్తి ఈ జన్మలో కూడా సంక్రమించింది. అదే గజేంద్రునివిశేషం. ప్రాకృతజన్మవాసన నాశనమయింది. గతజన్మలోని భక్తిభావం మరింత సంస్కారం పొంది పునరుద్బుద్ధమయింది.

**శ్లో. సోఽహం విశ్వసృజం విశ్వమవిశ్వం విశ్వవేదసమ్**
**విశ్వాత్మానమజం బ్రహ్మ ప్రణతోఽస్మి పరంపదమ్**

తా : విశ్వానికి అతీతుడై యుండియు విశ్వకర్త అయినవానికి, విశ్వంలో అంతరాత్మ విశ్వరూప సామగ్రితో క్రీడించువానికి, అజన్ముడు, పరమపద స్వరూపుడు అయిన బ్రహ్మమునకు మోక్షాభిలాషినై నేను నమస్కారం చేస్తాను.

గజేంద్రుడు ముముక్షువు. ఈ సమస్త జగత్తును నిర్మించిన పరబ్రహ్మమునకు నమస్కారం మాత్రం చేయగలనని, ఆ పరబ్రహ్మ ప్రసన్నతకు ఉపాయం తెలియనివాణ్ని నేను అని వేడుకొంటున్నాడు గజేంద్రుడు. విశ్వంలో గల జ్ఞానసాధనాలు మనుష్యులకు తెలుసు. ఏనుగునకు ఏమి తెలుస్తుంది? కేవలం నమస్కారం మాత్రం, అదీ మనసులోనే చేయగలుగుతుంది. గజేంద్రుడు భక్తితో భగవంతునికి నమస్కరించాడు. అతని భక్తి జ్ఞానావృతమైనది కాదు. కేవల నిర్విశేష బ్రహ్మజ్ఞానం భక్తికి తోడ్పడదు. అది జ్ఞానమవుతుంది. కాని, భక్తి కాకుండా పోయే ప్రమాదమున్నది. భగవత్తత్త్వజ్ఞానం భక్తికి బాధకం కాకూడదు. అది సాధకం కావాలి. అలాగే కర్మానుష్ఠానం కూడా భక్తికి బాధకం కాకూడదు. భగవత్పరిచర్యా రూపమైన కర్మవిశేషం భక్తికి సాధకం కావాలి. వేదాంతం బ్రహ్మతత్త్వాన్ని నిరూపిస్తూ **"రసో వైసః, రసం హ్యేవాయం లబ్ధ్వానందీ భవతి"** అనే మంత్రాన్ని ఉల్లేఖిస్తుంది. ఆ భగవంతుణ్ని ప్రాప్తింప జేసుకోవడానికి సాధనమైన రసతత్త్వం భక్తిమాత్రమే. ఈ శ్లోకానికి వ్యాఖ్య వ్రాస్తూ శ్రీధరస్వామి **"కేవలం ప్రణతోఽస్మి న తు తం జానామి"** "భక్తితో కేవలం వందనం

మాత్రమే సమర్పిస్తున్నాను. భగవత్ప్రసన్నతకు ఇతరోపాయాలు నాకు తెలియవు" అని వివరించారు. గజేంద్రుడు పశువు కావడంవల్ల, విపద్గ్రస్తుడు కావడం వల్ల వందనం సమర్పించడంకంటె మరేమీ చేయలేడు. తలవంచి చేతులు మోడ్చి భక్తితో చేసేది వందన మవుతుంది. గజేంద్రునికి చేతులు లేవు. తొండమొక్కటి ఉన్నప్పటికి అది వందనం చేయడానికి యోగ్యమైనది కాదు. తొండానికి కరమనే పేరున్నది. వందనం కరద్వయంతో చేయాలి. నవవిధ భక్తిమార్గాలలో వందన మొకటి. వందనభక్తితో అక్రూరుడు చరితార్థుడయ్యాడు. ఇక్కడ గజేంద్రుడు భక్తితో శిరసువంచాడు. **"వాక్ శ్రోత్రే చ కరౌ చిత్తం శిరశ్చక్షు ప్తథైవ చ, షడేతే భగవత్కార్యం యది సక్తాః కృతార్థతా" "కీర్తనే శ్రవణే చైవ గుణానాం రూపదాస్యకే, స్వరూపస్మరణే నత్యా మవతీర్ణస్య దర్శనే".** "భగవద్గుణ కీర్తనం చేయడానికి వాక్కు; భగవద్గుణ లీలాకథా శ్రవణానికి చెవులు; భగవత్సేవకు చేతులు, భగవన్మందిరగమనానికి పాదాలు; భగవత్ స్మృతికి మనస్సు; వందనం చేయడానికి శిరస్సు, భగవద్భాగవత దర్శనానికి చక్షువులు కృతార్థములవుతాయి" అని శాస్త్రం. **"వాసుదేవః సర్వమితి"** అని గజేంద్రుడు శిరసువంచి భక్తితో వందనం సమర్పించాడు. "నమస్కారంతో అపరాధం పరిహారమవుతుంది" అని విష్ణుస్మృతి. అదీకాక, **"ఏకోఽపి కృష్ణస్య కృతః ప్రణామో దశాశ్వమేధావభృథేన తుల్యః, దశాశ్వమేధీ పునరేతి జన్మ, కృష్ణప్రణామీ న పునర్భవాయ"** అని స్మృతివాక్యం. "శ్రీకృష్ణ భగవానునికి భక్తితో ఒకసారి చేసిన నమస్కారం పది అశ్వమేధయాగాల మంగళస్నానాలతో సమానమవుతుంది. అయితే దశాశ్వమేధాలు చేసినవానికి పునర్జన్మ తప్పదు. శ్రీకృష్ణునికి నమస్కరించినవానికి మాత్రం పునర్జన్మ ఉండదు". శ్రీవిష్ణ్వాలయాలలో భగవంతునికి వందనం సమర్పించే విధానమున్నది. ఏకహస్తంతో నమస్కరించ కూడదు. **"ఏకహస్తప్రణామశ్చ ఏకా చైవ ప్రదక్షిణా, అకాలదర్శనం విష్ణో ర్హన్తి పుణ్యం పురాకృతమ్"** (నారదీయ పురాణం) "ఒక చేతిలో నమస్కరించినా, ఒకేసారి ప్రదక్షిణం చేసినా, అకాలంలో దర్శించినా పూర్వం చేసుకొన్న పుణ్యమంతా నశిస్తుంది". దేహమంతా వస్త్రం కప్పుకొని నమస్కారం చేయగూడదు. భగవంతునికి ఎదురుగా నిలిచి నమస్కరించ కూడదు. పట్టకిరీటాలు ధరించి నమస్కరించ కూడదు. పృష్ఠ వామ భాగాలలో నిలిచి నమస్కరించ కూడదు. గర్భ మందిరంలోనికి ప్రవేశించి నమస్కరిస్తే అపరాధ మవుతుంది. ఏకహస్తకృతత్వ వస్త్రావృత దేహత్వ భగవత్తదగ్ర పృష్ఠ వామ భాగాంశ తన్నికట గర్భ మందిరగతత్వాది మయములైన అపరాధాలు జరగకుండా భగవంతునికి నమస్కరించాలనీ భగవంతునికి

దక్షిణభాగాన నిలిచి ప్రణామంచేస్తే సర్వాభీష్టాలు సిద్ధిస్తాయనీ, సాష్టాంగ నమస్కారం సర్వశ్రేష్ఠమనీ స్మృతులు తెలుపుతున్నాయి. **"నమస్కారేణ నశ్యంతి హ్యపరాధా అనేకశః, జనార్దనస్య విధినా కిం పునః కీర్తనా ద్ధరేః"** "నమస్కారంతో అనేకాపరాధాలు నశించి పోతాయి. ఇక శ్రీహరిని కీర్తిస్తే అపరాధాలన్నీ అడుగంటి పోవడమే కాకుండా ఎంతో పుణ్యం లభిస్తుం"దని పురాణాంతరాల ద్వారా తెలుస్తున్నది. శ్రీకృష్ణనామ కీర్తనం పాపాలను నాశనం చేసిన తర్వాతనే అది శాంతిస్తుంది. పాపాలు నశించిన తర్వాత హృదయంలో జ్ఞానజ్యోతిని వెలిగిస్తుంది. జ్ఞానం తర్వాత భగవంతునిపట్ల ప్రేమను ఉత్పన్నం చేస్తుంది. అప్పుడు నామంతో నామి సాక్షాత్కరిస్తాడు.

**శ్లో. యోగరంధితకర్మాణో హృది యోగవిభావితే**
**యోగినో యం ప్రపశ్యంతి యోగేశం తం నతోఽ స్మ్యహమ్**

తా : యోగులు యోగం ద్వారా కర్మను, కర్మవాసనను, కర్మఫలాన్ని భస్మం చేసి యోగ పరిశుద్ధమైన తమ హృదయంలో ఏ యోగేశ్వరుణ్ని సాక్షాత్కరించుకొంటారో ఆ ప్రభువుకు నమస్కరిస్తున్నాను. ఆ యోగజ్ఞానం నాకు లేదు. కాబట్టి కేవలం నమస్కారమే చేయగలుగుతున్నానని భావం.

యోగంలో తమ హృదయాలను పరిశుద్ధంచేసుకొన్నవారికి యోగేశ్వరుని సాక్షాత్కారం లభిస్తుంది. యోగేశ్వరుడనగా సమస్త చేతనా చేతన వస్తువుల స్వభావ యోగాలకు ఈశ్వరుడు అనగా నియామకుడు. యోగేశ్వరుడన్న పదం శ్రీకృష్ణ భగవానుని యందు సమన్వయమై రూఢమైనది. **"యత్ర యోగేశ్వరః కృష్ణో"** (గీత 18 - 78) లోకంలో యోగులు కావడం అత్యంత దుస్తరం. యోగి జనులకు ఈశ్వరుడు యోగీశ్వరుడన్న పదం శివునియందే రూఢమైనది. సమస్త యోగాలకు ఈశ్వరుడు కావడం అనేది పరాకాష్ఠ దశ. గీతలోను, శ్రీమద్భాగవతంలోను, మహాభారతంలోను శ్రీకృష్ణునికి పర్యాయపదంగా పలుచోట్ల యోగేశ్వర పదమే ప్రయుక్తమయినది. సమస్త యోగాలను ఉపదేశించేవాడు, సంకల్పించేవాడు యోగేశ్వరుడు. ఆ సమస్త యోగాలు ఆయనకు స్వతస్సిద్ధంగా ఉన్నట్టివి. సర్వజ్ఞత, ఐశ్వర్యము, సౌందర్యము, మాధుర్యము మొదలైన వైభవయుక్త గుణాలు ఎన్ని ఉన్నవో అవి అన్నియు ఆ భగవంతుని యందు స్వతస్సిద్ధంగా ఉన్నందువల్ల ఆయన యోగేశ్వరుడైనాడు. జ్ఞానాది కళ్యాణ గుణనిధిత్వం నిత్యమూ ఆయనయందు పరాకాష్ఠ దశలో ప్రకాశిస్తుంటుంది. పితకు పిత, ఆ పితకు పిత, ఈ పరంపర పోయి పోయి పరమపిత

అయిన పరమాత్మలో పరిసమాప్తమైనట్లుగానే, సమస్త కళ్యాణ గుణాలు అసీముడైన శ్రీకృష్ణుని యందే చేరి పరిసమాప్త మవుతాయి. కాబట్టి శ్రీకృష్ణుడు యోగేశ్వరుడని పేర్కొనబడినాడు. **"యోగేశ్వరః సర్వయోగానాం ఈశ్వరః, తత్ప్రభవత్వాత్, సర్వయోగబీజస్య చ కృష్ణః"** అని శ్రీశంకర భగవత్పాదులు. **"యోగేశ్వరః కృత్స్నస్యోచ్చావచరూపేణావస్థితస్య చేతనా చేతనస్య చ వస్తునో యేయే స్వభావయోగాః, తేషాం సర్వేషాం యోగానా మీశ్వరః, స్వసంకల్పాయత్త స్వేతర సమస్త వస్తు స్వరూపస్థితి ప్రవృత్తి భేదః, కృష్ణః వసుదేవ సూనుః"** అని భగవద్రామానుజులు. **"యోగేశ్వరః, సర్వోపాయవతాం స్వామి"** అని శ్రీరాఘవేంద్రస్వామి. **"యోగానాం ఈశ్వరః శ్రీకృష్ణః"** అని శ్రీధరస్వామి వివరించారు.

**శ్లో. నమో నమస్తుభ్య మసహ్యవేగశక్తిత్రయాయాఖిలధీగుణాయ**
**ప్రపన్నపాలాయ దురంతశక్తయే కదింద్రియాణా మనవాప్యవర్త్మనే**

తా : ప్రభూ! నీవు శక్తిత్రయ సహితుడవు. నీ శక్తులైన సత్వ రజస్తమస్సులు అప్రతిహతమైన వేగం కలవి. అఘటనాఘటన పటిమ గలవి. సకలేంద్రియ వ్యాపారాలలో నీవే ప్రతీత మవుతుంటావు. ఇంద్రియాలను స్వాధీనం చేసుకోలేని వానికి నిన్ను పొందే మార్గం కూడా కనిపించదు. అనతిక్రమణీయమైన మహామహిమోపేతుడవు నీవు. శరణాగత వత్సలుడవు. నీకు పదే పదే నమస్కరిస్తున్నాను.

సత్వ రజస్తమోగుణాలకు వేగ మెక్కువ. అందులో కామక్రోధాల వేగం అసహ్యమైనది. ఇష్ట విషయ తృష్ణయే కామము. ప్రతికూల విషయ ద్వేషమే క్రోధము. **"కామ క్రోధోద్భవం వేగం"** (గీత 5-23) కామక్రోధాల వేగాన్ని జయింప గలవాడే సుఖపడతాడని గీతోక్తి. విషయాభిలాషలలో కూరుకొని పోయిన ప్రవృత్తిని పరిత్యజించి, భగవంతునియెడ చిత్తాన్ని మరల్చే ఉపాయం ప్రవృత్తి మార్గానికి సాధన మవుతుంది. అదే అసలైన ప్రవృత్తి. విషయవాసనా నివృత్తియే భగవంతునియెడ ప్రవృత్తి. భగవంతుని యెడ ప్రవృత్తియే విషయ వాసనా నివృత్తి. నివృత్తిమార్గ సాధకుడు ఇంద్రియ వాసనలనుంచి పూర్తిగా నివృత్తుడై తపస్సాధన చేసి భగవత్ప్రాప్తిని పొందుతాడు. సకల జీవులలోను ఒకే ఒక భగవంతుణ్ని దర్శిస్తాడు. అనగా వాసుదేవోపలబ్ధిని పొందుతాడని అర్థం. నివృత్తి పరునికిగానీ, ప్రవృత్తి పరునికి_గానీ భక్తిపథమే సహజమైన దవుతుంది. వీరిద్దరు ప్రపన్నులే. గీత గృహస్థసన్న్యాసాశ్రమాలను గురించి ఎలాంటి ఉపదేశం చేయలేదు. సంపూర్ణ గీతాసారం శరణాగతివి

అభ్యసింపజేయడమే, భక్తియోగం ద్వారా శరణాగతిని ప్రబోధించడమే. సాధకుడు సమస్త కామనా వాసనల నుంచి నివృత్తుడై భగవంతునియందు ప్రవృత్తుడు కావడమే శరణాగతికి అర్థం. అనగా సమస్త కామనా వాసనలను భగవంతుని సేవలో వినియోగ పరచి ప్రవృత్తి సుఖాన్ని పొందుతాడు. భగవత్సుఖంలో తన సుఖాన్ని చూచుకొంటాడు. ప్రవృత్తి మార్గంలో శ్రద్ధాయుక్తుడైన భక్తుడు తన సంపూర్ణ కర్మ ఫలాన్ని త్యాగం చేస్తాడు. అభ్యాసం కంటె జ్ఞానం గొప్పది. జ్ఞానం కంటె ధ్యానం గొప్పది. ధ్యానం కంటె కర్మఫల త్యాగం గొప్పదని శాస్త్రం. దీనివల్లనే అనగా త్యాగం వల్లనే శాంతి ప్రాప్తిస్తుంది. **"మామేకం శరణం వ్రజ"** (గీత - 66) ఇది భగవంతుని గుహ్యతమమైన ఉపదేశం. సంపూర్ణ శరణాగతియే పూర్ణభక్తి. భక్తికి పరాకాష్ఠ అయినది ప్రేమ. ఆకించన్య - అనన్యగతికత్వధర్మవిశిష్టులై భగవంతుణ్ని ఆశ్రయించినవారిని "ప్రపన్నులు" అని పేర్కొంటారు. ప్రపన్నులు కావడానికి ప్రజలందరికి అధికారమున్నది. **"ఆనుకూల్యస్య సంకల్పః ప్రాతికూల్యస్య వర్జనమ్"** అనేది వీరి జీవన విధానము. న్యాసవిద్య లేదా శరణాగతియే ప్రపత్తి. భగవంతునియందు సంపూర్ణంగా ఆత్మసమర్పణం, సర్వవిధాల భగవంతునికి శరణుచొరడం ప్రపత్తి. దేవతాంతర శూన్యులై, ఏకాంతులు, పరమైకాంతులునై తమ సర్వస్వం భగవంతునికి నివేదన చేసి భగవత్ప్రసన్నతను అనుభవించడానికి ప్రధాన సాధనమైనది శరణాగతి - భక్తి. అట్టి భక్తిగలవారు ప్రపన్నులు. వారి ప్రవృత్తి ప్రపత్తి.

**వ. అని పలికి తన మనంబున నగ్గజేంద్రుం డీశ్వర సన్నిధానంబు గల్పించుకొని యిట్లనియె.**

తా : ఈవిధంగా గజేంద్రుడు పరబ్రహ్మను అనేక విశేషణాలతో పేర్కొని ప్రార్థించి తుదకు ఆ భగవంతుని సగుణరూపాన్ని తన మనస్సునందు చిక్కించుకొని నిలుపుకొని ఇలా మొఱపెట్టుకొన్నాడు.

**శా. లా వొక్కింతయు లేదు ధైర్యము విలోలంబయ్యెఁ బ్రాణంబులున్**
**ఠావుల్ దప్పెను మూర్ఛ వచ్చెఁ దనువున్ డస్సెన్ శ్రమం బయ్యెడిన్**
**నీవే తప్ప నితః పరం బెఱుఁగ మన్నింపం దగున్ దీనునిన్**
**రావే యీశ్వర! కావవే వరద! సంరక్షింపు భద్రాత్మకా!**

టీ : లావు + ఒక్కింతయున్ లేదు = బలము ఏ కొంచెము లేదు; ధైర్యము, విలోలంబయ్యెన్ = మిక్కిలి చెదరి పోయెను. ప్రాణంబులున్; ఠావుల్ తప్పెను = తమ స్థానములను కోల్పోయెను, మూర్ఛ వచ్చెన్ = మ్రానుపాటు కలిగెను; తనువున్ = శరీరము కూడ; డస్సెన్ = అలసిపోయెను;

శ్రమంబు + అయ్యెడిన్ = కష్టమైనది; నీవే తప్ప = నీవు కాకుండగా; ఇతఃపరము = వేఱొకరిని, ఎఱుగను. దీనునిన్ = దైన్యము పొందిన నన్ను; మన్నింపం దగున్ = ఆదరింప దగును. ఈశ్వర = ఓ జగన్నియంతా! రావే = రమ్ము; వరద = వరదానము చేయువాడా! కావవే =కాపాడుము. భద్రాత్మకా = కల్యాణాత్ముడవైన ఓ స్వామీ; సంరక్షించు = (నన్ను) రక్షించుము.

తా : దేహబలము, మనోబలము క్షీణించినవి. ప్రాణములు కడముట్టినవి. శరీరము అలసి పోయినది. నిన్ను తప్ప నేనింకొక దైవమును ఎరుగను. నన్ను దయతో ఆదరించుము. ఈ దీనుని కాపాడదగును. నీవు వరదుడవు. మంగళ మనస్కుడవు గదా స్వామీ!

గజేంద్రుడు విపద్గ్రస్తుడు. దీనుడు. అనన్యగతికుడు. భగవంతుణ్ణి శరణుచొచ్చినవాడు. అతని ప్రార్థన ఇది. **"అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ, తస్మాత్ కారుణ్యభావేన రక్ష రక్ష జనార్దన"**. ఈ శ్లోక తాత్పర్యమే ఈ పద్యంగా రూపొందింది. నేను యథార్థంగా దీనుణ్ణి. నన్నాదరించుమని వేడుకోవడంలో భగవంతుడు శరణాగత రక్షక బిరుదాంచితుడన్న జ్ఞానం గజేంద్రునికి ఉన్నది. శరణుచొచ్చిన తర్వాత భక్తునికి విపత్తు తొలగకపోతే భగవంతునికి కళంకం కలుగుతుంది. శ్రీయామున ముని ఇలా అన్నారు. **"అభూత పూర్వం మమ భావి కిం వా సర్వం సహే మే సహజం హి దుఃఖమ్, కిన్తు త్వదగ్రే శరణాగతానాం పరాభవో నాథ! న తేఽనురూపః"** (స్తోత్రరత్నం - 25) భగవంతుడు తన భక్తుణ్ణి దృఢచిత్తుణ్ణి చేయడానికి ఎన్నెన్నో ఇబ్బందులు పెడతాడని భగవచ్ఛాస్త్రం చెబుతున్నది. హే నాథ! నే నలాంటి దుఃఖాలనన్నిటినీ సహించాను. గర్భ జన్మ జరా మరణ నరకాది దుఃఖచక్ర మధ్యవర్తిని నేను. కర్మపరతంత్రుడనై సర్వవిధ దుఃఖాలను అనుభవించాను. నా కర్మప్రవాహం అపరిహార్యమనే నిశ్చయంతో దుఃఖాలను ఓర్చుకొన్నాను. నీకు శరణుచొచ్చాను. హే నాథ! నీవు కరుణా సముద్రుడవు, సర్వత్ర సన్నిహితుడవు, సర్వస్వామివి, సర్వశక్తిమంతుడవయిన నీ ఎదుట శరణాగతులు దుఃఖితులై నీ నిరాదరణకు లోనయినవారలయితే నీ ఐకాంతికులు చిత్తక్షోభకు గురి అవుతారు. నేను శరణాగతుణ్ణి, నన్ను పరిత్యజించడం నీకు తగదు. ఎందుకంటే నీవు ధర్మ స్వరూపుడవై శ్రీరాముడుగా అవతరించినపుడు **"సకృదేవ ప్రపన్నాయ తవాస్మీతి చ యాచతే, అభయం సర్వభూతేభ్యో దదా మ్యేత ద్వ్రతం మమ"** (శ్రీమద్రా.6-18-33) ఒక్కసారి నన్ను శరణుచొచ్చి నేను నీ వాడను అనిన సమస్త జీవులకు అభయ మివ్వడమే నా వ్రతమన్నావు గదా స్వామీ! **"అనృతం నోక్త పూర్వం మే న చ వక్ష్యే కదాచన,**

**రామో ద్విర్నాభిభాషతే**". అసత్యమును ఇది వరకెన్నడు పలికినవాడవు కాదు. "**సత్యవాదీ చ రాఘవః**" అని జగత్ప్రసిద్ధి పొందినవాడవు. స్వోక్తికి విరుద్ధంగా భాషించేవాడవు కాదు. నీవు స్వయం భగవానుడవై శ్రీకృష్ణుడుగా ఆవిర్భవించి "**సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ, అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః**" (గీత 18 - 66) "సర్వ ధర్మాలను పరిత్యజించి నన్నొక్కనినే శరణుచొరుము. నేను నిన్ను సర్వపాపాల నుండి విముక్తుణ్ని చేస్తాను. దుఃఖింపకుము'' అని స్పష్టమైన శబ్దాలతో చెప్పావు కదా స్వామి! నీవు నన్ను ఆదరింపకపోతే స్వవచన విరోధమవుతుంది. నేను సహజ దుఃఖభాజనుడను కాబట్టి సర్వదుఃఖసహనం నాకు శక్యము. శరణాగతులను పరిత్యజించడం నీకు విధాయకం కాదు. అది నీకు అనురూపమూ కాదు. నీకు శోభావహమైన విషయం అంతకంటెను కాదు. పోతనగారు ఈ పద్యంలో "**మన్నింపం దగున్ దీనునిన్**" అని భగవంతుణ్ని హెచ్చరించడంలో ఇంత విశేషమున్నది.

భాగవత సంప్రదాయంతో వెలసిన భక్తియోగం నవోద్భావిత స్వరూపాన్ని సంతరించుకొన్నది. భగవద్గీతలోని "**సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ**" అనే చరమశ్లోకార్థానికి ఉదాహరణీయులైనవారు రాధాదిగోపికలు, గోదాదేవి మున్నగు శ్రీకృష్ణ భక్తియుక్తలు. వ్రజధాతువును ప్రయోగించడంలో ఒక అర్థ విశేషమున్నది. 'వ్రజగతౌ' వ్రజ ధాతువు గత్యర్థకము. గత్యర్థకాలన్నీ బుద్ధ్యర్థాలే. 'వ్రజ' అంటే బుద్ధి చేయుము అని అర్థం. కాగా, గీతలో శరణాగతిని ఉపదేశించే సందర్భంలో శ్రీకృష్ణ భగవానుడు 'వ్రజ' ధాతువును ఉపయోగించాడు. దాని సహకారంతో తనకు అత్యంత ప్రియలు, ఆదర్శ శరణాపన్నలు అయిన వ్రజకాంతలను వ్యంజింపజేశాడు. గోవర్ధన ధారణ లీలలో శ్రీకృష్ణుడు "**తస్మాన్మచ్ఛరణం గోష్ఠం, మన్నాథం, మత్పరిగ్రహమ్, గోపాయే స్వాత్మయోగేన సోఽయం మే వ్రత ఆహితః** (శ్రీమద్భా. 10-25-18) ఈ సమస్త వ్రజమూ నన్నాశ్రయించినట్టిది. నేను స్వీకరించినట్టిది. వీరికి నేను ఏక మాత్ర రక్షకుడను. నాథుడను, సాధు సంరక్షణమే నా వ్రతము'' అన్నాడు. గోపికాకృష్ణుల ప్రేమ అత్యంత గాఢమైనది, ప్రచ్ఛన్న కామనమైనది కావడానికి కారణం వారి వివాహంలోని అవ్యక్తత్వమే. గోపికలు శ్రీకృష్ణునికి పరమస్వీయలు. ప్రకటన లీలలో పరకీయలై మధుర రసానికి చరమోత్కృష్టత కలిగించారు. వ్రజస్త్రీలకు తమ భర్తలతో దేహ సంగమం లేదు "**న జాతు వ్రజదేవీనాం పతిభిః సహ సంగమః**". వారి శరీరాలు శ్రీకృష్ణుని దేహం వలె అప్రాకృతాలు. తేజోమయాలు. ప్రేమ భక్తియుక్తలై,

తమ హృదయాలను రాస నికుంజాలు చేసి శ్రీకృష్ణ దర్శన దానం వేడుకొంటూ, నిత్య నవీన సౌందర్య మాధుర్య సుధారస సింధువు, పరమ యోగీంద్ర మహామునీంద్ర వందిత చరణారవిందుడు, పరబ్రహ్మ పురుషోత్తమ మదనమోహన వ్రజేంద్రనందనుడు అగు శ్రీకృష్ణ చంద్రుని నిత్య నిరవద్య చిదానంద రసమయ స్వరూప సామ్రాజ్యంలో మనకు కూడా ప్రవేశాన్ని కలిగిస్తున్న వ్రజకాంతల ఈ విరహ గీతిని చిత్తగించండి.

"ఏహి మురారే కుంజ విహారే ఏహి ప్రణత జనబంధో
హే మాధవ మధుమథన వరేణ్య కేశవ కరుణా సింధో
రాసనికుంజే గుంజతి నియతం భ్రమరశతం కిల కాంత
ఏహి నిభృత పథ పాంథ
త్వామిహ యాచే దర్శనదానం హే మధుసూదన శాంత
శూన్యం కుసుమాసన మిహ కుంజే శూన్యః కేకి కదంబః
దీనః కేకి కదంబః
మృదుకలనాదం కిల సవిషాదం రోదితి యమునా స్వంభః
నవనీరజధర శ్యామలసుందర చంద్రకుసుమరుచివేష!
గోపీ గణ హృదయేశ!
గోవర్ధనధర బృందావనచర వంశీధర పరమేశ!
రాధారంజన కంసనిషూదన ప్రణతిస్తావకచరణే
నిఖిల నిరాశ్రయ శరణే!
ఏహి జనార్దన పీతాంబర ధర కుంజే మంథరపవనే".

వ్రజవాసులే కాదు. జీవకోటి అంతా స్త్రీ మయమే. భక్తునికి భగవంతునికి భార్యా భర్తృ సంబంధమున్నది. భగవంతుడు పురుషోత్తముడు. అఖిలజగతి స్త్రీ స్వభావం కలది. **"పుంస్త్వం నియమ్య పురుషోత్తమతా విశిష్టే, స్త్రీప్రాయభావకథవా జగతోఽఖిలస్య"** (వైష్ణవ ధర్మము).

భక్తిసంప్రదాయం వస్తుతః ప్రవృత్తి మార్గంగా కనిపించినప్పటికి అది నివృత్తిమార్గాన్ని లక్ష్యంగా చేసుకొని కొనసాగుతుంది. భక్తి సంప్రదాయంలో గల ఉపాసనల కన్నిటికి శాంతభావం ప్రాథమికంగాను, అనుస్యూతంగాను చేరుతుంది. భక్తుడు సమష్టి రూపంతో జగత్తును తన ఉపాస్య స్వరూపంగా భావిస్తాడు. కాని, వ్యక్తిగతంగా జగత్కార్యాలపట్ల విరక్తుడై ఉంటాడు. లౌకిక వ్యవహారాలతో సంబంధం పెట్టుకొనడు.

ఈవిధమైన ప్రాచీన పరంపరాగతమైన భక్తియోగాన్ని సంరక్షించే ప్రయత్నంలోనే భగవద్రామానుజులు భక్తికి నవోద్భావిత స్వరూపాన్ని ప్రసాదించి ప్రవర్తింపజేశారు. ఆయన దాక్షిణాత్యుడైనప్పటికి ఆయన చేసిన భక్తి ప్రపత్తుల ప్రవాహం ఉత్తరదేశానికి మళ్లింది. ఆ ప్రవాహంలో ద్వైతమత ప్రతిష్ఠాపకులైన శ్రీమదానందతీర్థుల శ్రీకృష్ణభక్తి ప్రవాహమూ సంగమించి అది మరింత విస్తృతమై అమిత వేగవంతమయింది. విష్ణుస్వామివారు, వారికి ఉత్తరాధికారి అయిన లక్ష్మణభట్టు, ఆతని పుణ్యఫలంగా అవతరించిన శ్రీ వల్లభులు - వీరిచేత పుష్టిమార్గంలో శ్రీకృష్ణ భక్తి యమునా తరంగిణి పరవళ్ళు త్రొక్కింది. మహాకవి సూరదాసుకు దీక్ష యొసగి మంత్రోపదేశం చేసిన మహాత్ముడు శ్రీ వల్లభాచార్యులవారే. వారి పుత్రులు గోపీనాథ విఠలనాథులు తండ్రి సంప్రదాయ ప్రతిష్ఠను ఇనుమడింప జేసిన పుణ్యపురుషులు. వారి అనుయాయులైన శ్రీకృష్ణోపాసకులు ఎనమండుగురు కవులు తమ కవితా మాధుర్యాన్ని భక్తి యమునా ప్రవాహంలో కలిపివేశారు. హిందువులే కాదు, ముసల్మానులు కూడా శ్రీకృష్ణోపాసనలోని పరమార్థాన్ని గ్రహించి అనన్య భక్తులయ్యారు. తాజ్, రసఖాన్, అలీఖాన్, ఖాదిర్ బుక్స్ మొదలైనవారు తమనుతాము శ్రీకృష్ణ చరణారవిందాలకు సమర్పించుకొన్న భక్తశిఖామణులు. తత్ఫలితంగా గుజరాతులోని ఖోజా పంథ్‌కు చెందినవారు కూడా తాము వల్లభ సంప్రదాయానికి చెందినవారమని చెప్పుకొన్నారు. శ్రీవల్లభుల పుష్టిమార్గమే కాకుండా శ్రీనింబార్కుల రాధాకృష్ణుల సఖ్యభావోపాసన, శ్రీచైతన్య మహాప్రభువు వంగదేశంలో ప్రారంభించిన శ్రీకృష్ణభక్తి కీర్తనోద్యమం - ఒక మధురామృత ప్రవాహమయింది. మహారాష్ట్రలో శ్రీ తుకారాముని శ్రీకృష్ణభక్తి అభంగాలతో, గుజరాతులో శ్రీ నరసీమెహతా శ్రీకృష్ణప్రేమ సంగీతముతో, రాజస్థాన మరుభూములలో శ్రీమతి మీరాబాయి శ్రీకృష్ణ ప్రేమభక్తి కలకంఠ గీతులతో ఉత్తర భారతమంతా ప్రేమభక్తిరసంతో ఓతప్రోతమయిది. దానికి తోడు శ్రీహితహరివంశరాయ్ ప్రతిపాదించిన రాధావల్లభసంప్రదాయం, శ్రీచైతన్యుని సంప్రదాయంలో ఉద్భవించి హరివంశ సంప్రదాయంగా పరిణమించిన ప్రేమలక్షణ భక్తి ప్రచారం దేశం నలుమూలల విస్తరించింది. బృందావనం నుంచి బయలుదేరిన శ్రీకృష్ణభక్తి రస ప్రవాహం పూర్వ దిగ్భాగాలకు కూడా చేరింది. శక్తి ఉపాసనకు నెలవైన అస్సాం ప్రాంతానికి చేరి అక్కడి శాక్తేయులను నూటికి తొంభై ఎనిమిదిమందిని వైష్ణవధర్ములను చేసింది. వైష్ణవాగ్రణి అని ప్రశస్తి కెక్కిన శ్రీ శంకరదేవుడు, అతని శిష్యుడు శ్రీమాధవదేవుడు ఈ

మహాపరివర్తనకు మూలకారకులైనారు. మహాకవి, శ్రీరామభక్తుడైన గోస్వామి తులసీదాసు **"తారకాత్ జాయతే ముక్తిః ప్రేమభక్తిస్తు పారకాత్"** అను శివప్రోక్తమైన సూక్తిలోని పరమార్థాన్ని గుర్తెరిగి గోపికా సంవాదాన్ని శ్రీకృష్ణ గీతావళిగా రచించి ధన్యుడైనాడు.

శ్రీకృష్ణుడు ద్వారకలో పతిభావంతోను, బృందావనంలో ఉపపతిభావంతోను క్రీడిస్తాడనడంలోగల పరమార్థాన్ని, రహస్యాన్ని జాగ్రత్తగా గ్రహించినప్పుడే ప్రేమభక్తితత్త్వం బోధపడుతుంది. బృందావనంలోని రాధాది గోపికలు శ్రీకృష్ణునికి పరమస్వీయలని మొదట గుర్తుంచుకోవాలి. **"మన్నాథం మత్పరిగ్రహమ్"** (శ్రీమద్భా 10-25-18) రాధాది గోపికలకు తాను భర్తననీ, వారిని తాను పరిగ్రహించాననీ స్పష్టంగా చెప్పాడు శ్రీకృష్ణుడు. గోపికలు శ్రీకృష్ణునికి పరమస్వీయలే అయినా పరకీయలుగా నటించారు. (నటనాగరుడైన శ్రీకృష్ణునితో నటించిన వారందరు నటులే.) అందుకు కారణం పరకీయాభావంలోనే మధుర రసానికి పరమోత్కృష్ట వికాసం ప్రాప్తిస్తుంది. ఇది చిత్తశుద్ధితో గ్రహించవలసిన విషయం.

గోపికలెవరు? శ్రీవల్లభప్రభువు **"శ్రుత్యంతరాణాం గోపికానామ్"** శ్రుతుల యొక్క మూర్త్యంతరాలని చెప్పారు. వారలా చెప్పడానికి **"గోప్యస్తు శ్రుతయో జ్ఞేయా ఋచో వై గోపకన్యకాః"** (పద్మపురాణం పాతాళఖండం 73-31) అనే పద్మపురాణ వచనమూ, శ్రీమద్భాగవతంలోని శ్రుతిగీతా ఆధారము. గోపికలు పరమ పతివ్రతలని చెప్పడానికి ఇంతకంటె ఏమి కావాలి? సాక్షాత్తు శ్రుతిరూపిణులైనవారు అనగా పరమాత్మయొక్క నిఃశ్వాసములైనవారు - పవిత్రతకు పరాకాష్ఠ లైనవారు గోపికలు. అలాంటివారు శ్రీకృష్ణునికి పరకీయలుగా అభినయించడంలోని విశేషాన్ని సాహిత్యశాస్త్ర మర్మజ్ఞులైనవారే గ్రహించ గలుగుతారు. ఈ విషయంలో ముగ్గురు సాహిత్య దార్శనికులు ఈ విధంగా అభిప్రాయ పడ్డారు. **"బహువార్యతే యతః ఖలు యీవ ప్రచ్ఛన్న కాముకత్వం చ; యా చ మిథో దుర్లభతా సా పరమా మన్మథస్య రతిః"** (భరతుని నాట్యశాస్త్రం) **"వామతా దుర్లభత్వం చ స్త్రీణాం యా చ నివారణా, తదేవ పంచబాణస్య మన్యే పరమమాయుధమ్"** (రుద్రటాచార్యుడు) **"యత్ర నిషేధవిశేషః సుదుర్లభత్వం చ యన్మృగాక్షీణాం, తత్రైవ నాగరాణాం నిర్భర మాసజ్యతే హృదయమ్"**. స్త్రీలలో వామత్వము **"ముగ్ధా నవవయః కామా రతౌ వామా మృదుః క్రుధి"** (దశరూపకం 2-16), దుర్లభత్వము, నియమత్వ నివారణత్వాది ప్రతిబంధకాలుంటాయి. అవే మన్మథుని చేతికి చిక్కిన పరమాయుధాలవుతాయి. విశేషమైన నిషేధం కలిగిన జవరాలు దుర్లభురాలవుతుంది. నాగరిక హృదయానికి

అత్యంతాకర్షణను, ఆసక్తిని కలిగిస్తుంది. నందనందనుడైన శ్రీకృష్ణుడు గోపుడు. **"గోపవేషస్య విష్ణోః"** (కాళిదాసు మేఘదూత 1-15) ఆయన గోపికలతో తప్ప మరెవరితోను క్రీడించడు. గోపికలు ఏ భావంతో శ్రీకృష్ణుణ్ని భజిస్తారో సాధకపురుషుడు కూడా అలాంటి భావంతోనే భజిస్తాడు. పరకీయ కావడానికి పరకీయాభావం పొందడానికి భూమ్యాకాశాలకున్నంత అంతరముంది. పరకీయాభావంలో మూడు విషయాలకు ఎంతో మహత్త్వమున్నది. తన ప్రియతముడని భగవంతుణ్ని నిరంతరం స్మరించడం - ఆ భగవంతుణ్ని కలుసుకోవాలన్న ఉత్కంఠ, దోషదృష్టి ఏ కోశాన లేకుండటం. స్వీయాభావంలో నిరంతరం శ్రీకృష్ణుడు రుక్మిణ్యాదుల దగ్గరనే ఉండటం చేత ఈ మూడూ గౌణమై పోతాయి. స్వకీయ స్వగృహ నిర్వాహకత్వం, పుత్రీ పుత్ర పాలన పోషణలు తన భర్త జరపాలనే కోరుకొంటుంది స్వీయ. ఆమెలో సకామ భావం ప్రచ్ఛన్నంగా ఉంటుంది. కాని, పరకీయ తన ప్రియతముణ్ని ఏమీ కోరదు. ఆశపడదు. తన ప్రియతమునికి సుఖం కలిగించాలనే నిరంతరం ఆరాట పడుతుంది. శ్రీమద్భాగవతంలో గోపికలు ఈ భావాన్నే ఎంతో మనోజ్ఞంగా ప్రదర్శించారు. ఈ విశేషతను గమనించే భక్తితత్త్వజ్ఞులు నిరంతర భగవచ్చింతనకు లౌకికమైన పరకీయాభావాన్నే ఉదాహరించారు. **"యాప్రీతి రవివేకానాం విషయే ష్వనపాయినీ, త్వా మనుస్మరతః సా మే హృదయా న్మాపసర్పతు"** (శ్రీ విష్ణు. పు. 1-20-19) అని ప్రహ్లాదుడు "హే నాథ! అవివేకులైన పురుషులకు విషయ సుఖాల పట్ల విడరాని ఎంతటి ప్రీతి ఉంటుందో అంతటి స్మరణం గల నా హృదయం నుంచి నీ వెన్నటికీ దూరం కావద్దు" అని వివేక హృదయానికి అవివేక హృదయాన్ని సాదృశ్యంగా చెప్పి ప్రార్థించాడు. భావనా మార్గంలో పురుషుడు తానొక వ్రజవాసినిగా భావించుకొని, సౌభాగ్యవతియైన ఏ గోపికారమణి నిర్దేశంతోనో రాధాకృష్ణులను ఆరాధిస్తాడు. వ్రజభామలకున్నట్టి ప్రౌఢాభిమానమే గోపీతత్త్వము. అదే అనన్య భక్తి. ఇట్టి ప్రౌఢాభిమానం ఎలా సిద్ధిస్తుంది? అంటే, సత్త్వరజస్తమోగుణాలతో కూడిన ఈ ప్రకృతిలో పురుషుడు తాను స్వాభావికంగా పురుషుణ్ననుకొంటాడు. శుద్ధచిత్స్వభావంలో శ్రీకృష్ణుడొక్కడే పురుషుడు - పురుషోత్తముడు. శ్రీకృష్ణుడొక్కడు తప్ప యావజ్జీవమాత్రలు స్త్రీలే. చిద్ఘటనంలో వస్తుతః స్త్రీ పురుష చిహ్నాలుండవు. అందువల్లనే వ్రజవాసినులైన గోపికలు ప్రేమభక్తిలో ఉత్తమాధికార లాభాన్ని పొందినవారైనారు. మధురరస స్పృహను పొందాలనుకొన్న

సాధకులైన భక్తులు గోపికలుగా మారవలసే ఉంటుంది. స్పృహకు అనురూపంగా సాధన చేయగా చేయగా సిద్ధి కలుగుతుంది. **"స్త్రియో వా పురుషా వాపి భర్తృ భావేన కేశవమ్, హృది కృత్వా గతిం యాన్తి శ్రుతీనాం నాత్ర సంశయః"** (బృహద్వామనం) స్త్రీలుగాని, పురుషులుగానీ శ్రీకృష్ణుణ్ని భర్తృభావంతో అర్చించడంలో స్త్రీలు సందేహింపవలసిన పనిలేదు. శ్రీకృష్ణుడెవరికీ పరపురుషుడు కాడు; ఆయన పరమ పురుషుడు. తమ స్త్రీత్వానికి పురుషోత్తమత్వం, పరపురుషత్వం, పరమ పురుషత్వం మూడింటిని దక్కించుకొన్న గోపికల అదృష్టమే అదృష్టం. **"అఖిల దేహినాం అంతరాత్మదృక్"** (శ్రీమద్భా 10-31-4) వారు శ్రీకృష్ణుణ్ని పరమ పురుషునిగానే భావించారు. నారదమహర్షి గోపికల శ్రీకృష్ణ ప్రేమను "భక్తి సూత్రాలు" గా రచించినట్లుగా తోస్తుంది. **"అనిర్వచనీయం ప్రేమస్వరూపం. మూకాస్వాదనవత్. ప్రకాశ్యతే క్వాపి పాత్రే. గుణరహితం, కామనారహితం, ప్రతిక్షణవర్ధమాన మవిచ్ఛిన్నసూక్ష్మతర మనుభవరూపమ్, తత్ప్రాప్య తదేవ చింతయతి"** (నారదభక్తి 51-55) "ప్రేమ స్వరూపాన్ని ఏవిధంగాను వర్ణించలేము. మూగవాడు తాను ఆస్వాదించిన మాధుర్యాన్ని గూర్చి చెప్పజాలనట్లే. ఇటువంటి ప్రేమను భగవంతుడు ఏ ఒకనికో ప్రసాదిస్తాడు. ఆ ప్రేమ గుణాలను బట్టి కలిగింది కాదు. ఆ ప్రేమలో కామనాగంధం లేదు. అది అనుక్షణం ప్రవృద్ధమానమై నిరంతరం అఖండంగా ప్రవహిస్తూనే ఉంటుంది. ఆ ప్రేమ చాలా సూక్ష్మరూపం కలదై కేవలం అనుభవంవల్లనే తెలుసుకోదగినదై ఉంటుంది. ఇట్టి ప్రేమగల భక్తుడు భగవంతునిలో ప్రేమనే సదా దర్శిస్తుంటాడు. ప్రేమనే వింటూంటాడు. ప్రేమకు ప్రేమాస్పదునికి ఎలాంటి భేదం ఉండదు. ప్రేమరసోన్మత్తునిస్థితి అగమ్యం. అతని మహిమను ఎవరూ తెలుసుకోలేరు. అతని లక్షణమే విలక్షణం. శ్రీమద్భాగవతంలో ప్రేమోన్మత్త భక్తుని మహిమను ఒకానొక సందర్భంలో భగవంతుడే స్వయంగా ఇలా వర్ణించాడు. **"వాగ్ గద్గదా ద్రవతే యస్య చిత్తం, రుదత్యభీక్ష్ణం హసతి క్వచిచ్చ, విలజ్జ ఉద్గాయతి నృత్యతేచ మద్భక్తియుక్తో భువనం పునాతి"** (శ్రీమద్భా 11-14-24) "ప్రేమభక్తులవాక్కు పారవశ్యంతో గాద్గదికమవుతుంది. హృదయం ద్రవించిపోతుంది. పెద్ద పెట్టున పదేపదే నన్ను పిలుస్తాడు. అప్పుడప్పుడు రోదిస్తాడు. ఊరకే నవ్వుతాడు. సిగ్గువిడిచి ఆడతాడు. నా కళ్యాణగుణాలను గానం చేస్తాడు. అట్టి నా భక్తుడు ముల్లోకాలను పవిత్రం చేస్తాడు" అని. ప్రేమోన్మాదంలో ఒక విధమైన ఆనందముంది. అది ఎలాంటిదో ప్రేమోన్మాదులకు

మాత్రమే తెలుస్తుంది. 'సర్వభావేన' అని గీతలో చెప్పాడు శ్రీకృష్ణుడు. శ్రీవల్లభప్రభువు **"సర్వదా సర్వభావేన భజనీయో వ్రజాధిపః, స్వస్యాయమేవ ధర్మో హి నాన్యః క్వాపి కదాచన"** అని తమ చతుఃశ్లోకిలో చెప్పారు. సమస్త భావాలతో భజియింపదగినవాడు వ్రజాధిపుడైన శ్రీకృష్ణుడు. అన్నప్పుడు భర్తృభావం కూడా చేరుతుంది. అన్యునిమీద మనసుంచినదంటే వ్రతభంగం కానేరదని చెప్పడానికే 'సర్వదా' పదం చేర్చబడింది. పతిభావంతో కాకపోతే పుత్రభావంతోనైనా శ్రీకృష్ణుణ్ని ఆరాధించండని శ్రీవల్లభుల ప్రబోధం. **"సంత్యజ్య సర్వవిషయాం స్తవ పాదమూలమ్"** స్వామీ! నీ పాదసన్నిధిలో సమస్తమూ త్యజించామన్నారు గోపికలు. శ్రీకృష్ణుణ్ని దర్శించినంతనే పురుషులకు సైతం ప్రమదాభావం కలుగుతుందట. **"ఏతస్య దర్శనే తు స్యాత్ ప్రమదాభావ ఏవహి"**. అంతేకాకుండా **"స్త్రీభావో గూఢః"** పురుషుని హృదయంలో స్త్రీభావం గూఢంగా ఉంటుందని శాస్త్రోక్తి. వ్రజాధిపుడు పూర్ణపురుషోత్తముడు. శ్రీగోకుల జన రస దానేచ్ఛా జనిత వామకర గిరిధారణ ప్రోద్యదుత్సాహోల్లసిత హృదయుడు కాబట్టి శ్రీకృష్ణుడు గోకులనాథుడయ్యాడు. **"మన్నాథం మత్పరిగ్రహ"**మని దాపరికం లేకుండా చెప్పాడు. గోపికల విషయం అటుంచి దేహేంద్రియాంతఃకరణ స్త్రీ పుత్ర ధన గృహాదికమంతా భగవంతునిదే అనుకొన్నవాడు సంసార నివర్తకుడవుతాడు. నిశ్చింతుడవుతాడు. ముక్తుడై భగవన్మయు డవుతాడు. గోపికలు తొలుతనే ముక్తలై తర్వాత భగవన్మయలయ్యారు. ముల్లోకాలలో వారిని మించిన అదృష్టవతులు లేరు. **"ఈ వ్రేలం దొక్కని పాదరేణువులు పైవేష్టించినం జాలదే"** అని (పోతనగారు) **"అహో ఽ తిధన్యా వ్రజగోరమణ్యః" "అహో భాగ్య మహో భాగ్యం నందగోపవ్రజౌకసామ్"** అని బ్రహ్మదేవుడు గోపికల పాదధూళిని శిరసున చల్లుకొన్నాడు.

భగవద్రామానుజులు దక్షిణదేశం నుంచి భక్తిరస ప్రవాహాన్ని ఉత్తర దేశానికి మళ్లించడంలో ఆయన వెంట నాచ్చియార్, తిరుప్పావై మొదలైన ఆళ్వారుల ద్రావిడ భక్తి సాహిత్యమంతా అయోధ్యకు చేరుకొన్నది. మర్యాదా పురుషోత్తముడైన శ్రీరామచంద్రుడు శ్రీకృష్ణునివలె లీలా పురుషోత్తముడై రాసలీలావినోదాన్ని అభినయించినట్లుగా ఉత్తరదేశపు శ్రీరామ మధురోపాసనకు చెందిన అనేక గ్రంథాలు తెలుపుతున్నాయి. శ్రీమద్రామానుజులు శ్రీమన్నారాయణోపాసనను ప్రధానంగా చూపినా ఆయన శ్రీరామభక్తుడని ఆయన తిరువారాధన పెట్టిలో సీతారాముల విగ్రహాలుండేవని సంప్రదాయజ్ఞులు చెబుతారు. శ్రీకృష్ణ పరతత్త్వం గురించి,

సర్వేశ్వరత్వం గురించి, నిస్సందేహంగా, నిర్ద్వంద్వంగా చెప్పినవారు కూడా శ్రీమద్రామానుజులే. అది బృందావనంలో శ్రీకృష్ణ మధురోపాసనగా, అయోధ్యలో శ్రీరామ మధురోపాసనగా అభివృద్ధి చెంది లోకంలో ఉపాసనాత్రయ సిద్ధాంతాన్ని వ్యాప్తిలోనికి తెచ్చింది. అయోధ్యలో మర్యాదాయుతమైన శ్రీరామోపాసనకు తృప్తిపడక దానిని కూడా మధురోపాసన చేశారు భక్తులు. రామకథమీద కూడా భాగవతం తన ప్రభావాన్ని చూపింది. సీతాదేవి శ్రీరాముని దగ్గర రాస ప్రస్తావన తెస్తుంది. **"ఆవాం ప్రియే వికుంజేత్ర సర్వర్తు ముఖశోభితే, కచ్చిన్నో విహరిష్యావో రాధాకృష్ణ మివ వ్రజే"** అప్పుడు శ్రీరాముడిలా అంటాడు. **"త్వదంగా ఏవ రాధా సా ప్రియే బృందావనేశ్వరీ, మదంశ ఏవ నియతః కృష్ణో గోపేంద్ర నందనః, తతస్తద్ యుగళం శ్రీమద్రాధా కృష్ణాత్మకం మహత్, సీతారామాత్మకం యుగ్మం ప్రావిశన్నతి పూర్వకమ్"** (ఉపాసనాత్రయ సిద్ధాంతం. పుట 147) సీతాదేవి అభిప్రాయం గ్రహించి శ్రీరాముడు "జానకీ! నీవు బృందావనేశ్వరి అయిన రాధాదేవి అంశగలదానవు. గోపేంద్ర నందనుడైన శ్రీకృష్ణుని అంశ నాది. ఇలా శ్రీరాముడనగానే గోలోకమందలి రాసమండలి వారిముందు అవతరించింది. అందున్న రాధా కృష్ణులలో సీతారాములు లీనమైనారు" అని హృద్యంగా వర్ణితమయింది. ఇలాంటిదే మహాభాగవత పురాణాంతర్గతమైన ఒక అద్భుతమైన కథ కూడా ఉన్నది. అది శివపార్వతులకు సంబంధించినది.*

---

* ఒకసారి శివుడు పార్వతిని "దేవీ! నీవు నాపట్ల ప్రసన్నురాలవైతే నీవు శ్రీకృష్ణునివలె పురుషరూపం ధరించు. నేను రాధవలె స్త్రీరూపం ధరిస్తాను, మనమిద్దరం ఆవిధంగా క్రీడించాలని కోరుతున్నాను" అని అర్థించాడు. అందుకు పార్వతి సంతోషించింది. వెంటనే శ్రీకృష్ణ రూపంతో నిలిచింది పార్వతి. శివుడు పరమసంతుష్టుడై "దేవీ! నేను వృషభానునందినియైన రాధలాగా అవతరిస్తాను. నా ఎనిమిది మూర్తులు రుక్మిణ్యాది అష్ట భార్యలవుతారు. నా భైరవగణం రమణీ రూపాలతో అవతరిస్తుంది" అన్నాడు. అందుకు ఎంతో సంతోషపడి "ప్రభూ! నాయిద్దరు చెలికత్తెలు జయ - విజయలు శ్రీదామ సుదాములుగా నీవెంట ఉంటారు. మా పెద్దన్న బలరాముడుగా వ్యవహరిస్తాడు. మీ కోర్కె సంపూర్ణంగా సఫలమవుతుంది" అన్నది పార్వతి. పార్వతీ పరమేశ్వరులు రాధాకృష్ణుల రూపాలతో క్రీడిస్తుండగా, రాధాదేవి క్రీడాశుకం తన యజమానురాలిని వెదకుతూ వచ్చి రాధరూపంలో ఉన్న శివుణ్ని అనుసరించింది. శివుడు క్రోధంతో మండిపడుతూ రసభంగం చేసినందుకు త్రిశూలం తీసుకొని ఆ చిలుకను తరుముకొంటూ పోయాడనీ, ఆ చిలుక వ్యాసపత్ని గర్భంలో ప్రవేశించిందనీ, ఆమె ప్రసవించిన కుమారుడే శ్రీశుకదేవుడనీ మరొక ఐతిహ్యమున్నది.

బృందావనంలో రాధాకృష్ణుల రాసఖేలనం చూచిన పార్వతీ పరమేశ్వరులు నిధువనానికి వెళ్లి పార్వతి కృష్ణుడుగా, శివుడు రాధగా క్రీడించారని పురాణాల్లో ఉంది. పార్వతి నలుపు, శివుడు తెలుపు. రూపధారణ చేయడానికి వారు అట్టే శ్రమపడలేదనిపిస్తుంది. నవరాత్రులలో పూజలందుకొంటున్న జగజ్జనని, త్రిపురసుందరి శ్రీకృష్ణమూర్తియే.

**కం. వినుదుఁట జీవుల మాటలు చనుదుఁట చనరాని చోట్ల శరణార్థుల కో**
**యనుదుఁట పిలిచిన సర్వము గనుదుఁట సందేహమయ్యెఁ గరుణావార్ధీ!**

టీ : కరుణావార్ధీ= ఓ కృపాసముద్రుడా! జీవుల మాటలు = జీవుల పలుకులను (ప్రార్థనలను) వినుదు (వు) + అట = వినుదువట. (లిడ్లాట్టుల వకారంబునకు లోపంబు విభాషనగు అను (బాల.వ్యా) సూత్రముచే మధ్యమ పురుషైక వచనములోని 'వు' లోపించినది) చనరాని చోట్ల = దుర్గమ ప్రదేశములకైనను; చనుదు (వు) + అట = వెళ్లుదువట! పిలిచినన్ = పిలిచినంతటనే, శరణార్థులకు = శరణాపన్నులకు, ఓయనుదు(వు)అట! = 'ఓ' ఇదే వచ్చుచున్నాను, అనుదు(వు) + అట! అందువట. సర్వమున్ = సమస్తమును; కనుదు(వు) + అట = చూడగలవట. సందేహమయ్యె = అనుమానమనిపించుచున్నది.

తా : ఓ కృపాసముద్రుడా! నీవు విశ్వవ్యాపివై జీవుల మాటలను వినగలవట. వినినంతనే చొరరానిచోట్ల కైనను పోగలవట. శరణాపన్నులు ఆర్తితో పిలిచినంతనే ఆదుకొందువట. సమస్తమును గుర్తెరుగుదువట. శరణాపన్నుడనైన నన్ను ఇంతవరకు నీవు వచ్చి రక్షింపనందుకు నిన్ను గురించి నాకు తెలిసిన విషయాలన్నీ సందేహింపవలసినవి అవుతున్నాయి.

ఏనుగు శరీరమెంత మందమో దాని బుద్ధికూడా అంత మందంగానే ఉంటుంది. అది బహిరంత రజ్ఞాన మౌఢ్యముగలది. దానికి కరుణామయుడైన భగవంతుని గూర్చి ఇట్టి సందేహం కలగడం సహజమే. **"యో మా మేవ మసమ్మూఢో జానాతి పురుషోత్తమం, స సర్వవి ద్భజతి మాం సర్వభావేన భారత"** (గీత 15-11) అని శ్రీకృష్ణ ముఖోక్తి. "అర్జునా! మోహరహితుడైన పురుషుడు నన్ను పురుషోత్తమునిగా తెలుసుకొంటాడు. తెలుసుకొన్న తర్వాత సర్వజ్ఞుడై సర్వభావాలతో నన్నే భజిస్తాడు'' అని. లోకంలో భగవత్తత్త్వం తెలుసుకోవడంలో మూఢత్వం మనుష్యులకే బాధకమవుతున్నప్పుడు ఇక ఏనుగుల వంటి పశువులను గూర్చి చెప్పనక్కర లేదు. సర్వజ్ఞుడైనవాడు పురుషోత్తమ తత్త్వాన్ని తెలుసుకొని ఎలాంటి వికల్పమూ భ్రమా లేదా సంశయమూ లేకుండా సర్వభావాలతో శ్రీకృష్ణభగవానుణ్ణే ఆరాధిస్తాడు.

**ఉ. ఓ కమలాప్త యో వరద యో ప్రతిపక్షవిపక్షదూర కు**
**య్యో! కవి యోగివంద్య! సుగుణోత్తమ! యో శరణాగతామరా**
**నోకహ! యో మునీశ్వరమనోహర! యో విమలప్రభావ! రా**
**వే! కరుణింపవే! తలఁపవే! శరణార్థిని నన్నుఁ గావవే!**

టీ : ఓ కమలా + ఆప్త = ఓ లక్ష్మీనాథా! ఓ వరద = వరములను దానము చేయువాడా! ఓ ప్రతిపక్ష విపక్ష దూర = శత్రువులందైనను విరోధము లేనివాడా! కుయ్యి = నా ఆర్తనాదము

వినుము. ఓ కవియోగి వంద్య = కవులచేత, యోగులచేత నమస్కరింపబడువాడా! సుగుణ + ఉత్తమ = సద్గుణ సంపన్నుడా! (కళ్యాణగుణములు గలవాడ) ఓ శరణాగత + అమర + అనోకహ = శరణాగతులకు కల్ప వృక్షము వంటివాడా! ఓ మునీశ్వర మనోహర = మునీశ్వరుల మనస్సులను హరించునట్టి స్వరూప రూపగుణ విభవాదులు కలవాడా! ఓ విమల ప్రభావ = నిర్మలమైన ప్రభావం కలవాడా! రావే. కరుణింపవే. తలపవే = దయతో నన్ను చూడుము. శరణార్థిని = శరణాపన్నుడను; నన్ను కావవే = నన్ను సంరక్షింపుమా!

తా : లక్ష్మీనాథుడవు నీవు, నీకేమి తక్కువ? భక్తుల కోరికలను ఒసగువాడవు. విజ్ఞలోకముచే ఎల్లప్పుడు ధ్యానింపబడువాడవు. సకల కళ్యాణ గుణ గణాలయుడవు, శరణార్థులకు కల్పవృక్షమవు. మునీశ్వరులకే మనోహరుడవు. అప్రమేయ ప్రభావశాలివి. నిన్ను శరణు వేడుకొన్నాను. నా మొర నాలకించుము. నన్ను తలచుము. నన్ను రక్షింపుము.

ఈ పద్యభావాన్ని బట్టి గజేంద్రుని భక్తి సకామ మైనదా? నిష్కామమైనదా? అనే ప్రశ్న ఉదయిస్తుంది. ధ్రువుడు, ప్రహ్లాదుడు, గోపికలు తమకు అనన్యభక్తియే కావాలని భగవంతుణ్ని ప్రార్థించారు. దుఃఖం నుంచి తప్పుకోవడానికి వారు శరణాగతులు కాలేదు. గజేంద్రుడు గ్రాహవిముక్తికై భగవంతుణ్ని ప్రార్థించాడని భావింపరాదు. జలంలో నివసించే గ్రాహం కంటె కూడా అధికబాధకమైనది సాంసారిక సుఖేచ్ఛావృత్తి. అది జీవుణ్ని భగవద్ జ్ఞాన విముఖుణ్ని చేస్తుంది. భగవద్ జ్ఞాన రహితుడై జీవించాలన్న కోరిక గజేంద్రునికి లేదు. అతడు త్రికాలాబాధితమైన మోక్షపదాన్ని ఆశిస్తున్నాడు. గజేంద్రుడు చతుష్పాత్తువైన ఒక పశువు. కాని, మనుష్య భక్తులు భగవంతుని మహిమను తెలుసుకొని, చూచి, ఆకళింపు చేసుకొన్నవారైకూడా, సాంసారిక ప్రయోజనాలను ఆశించి భగవద్భజన చేయడంలో విశేష మేమిటి? సాంసారిక సుఖస్థితికంటె విపత్పరిస్థితియే భగవద్భక్తికి ప్రేరక మవుతుంది. భగవద్భక్తుడైనవాడు విపత్తులకు వెరవడు. కుంతీదేవి శ్రీకృష్ణుణ్ని నిరంతరం స్మరించడానికి తనకు విపత్తులనే ఇమ్మని శ్రీకృష్ణుణ్ని ప్రార్థించింది. **"విపదః సంతు నః శశ్వత్ తత్ర తత్ర జగద్గురో, భవతో దర్శనం యత్ స్యా దపునర్భవదర్శనమ్"** (శ్రీమద్భా 1-8-25) "హే జగద్గురో! మాకు సర్వత్ర విపత్తులనే రానిమ్ము. ఎవని దర్శనంతో ఈ సాంసారికమైన ఆవాగమనం సమసిపోతుందో ఆ అపారమహిమాన్వితుడవైన నీ దర్శనం మాకు సర్వదా ప్రాప్తిస్తుంది" అని. ధ్రువ - ప్రహ్లాద - కుంతి ప్రార్థనలను బట్టి భక్తి స్వరూపం నిష్కామమే కాని, సకామం కాదని తెలుస్తుంది. అహేతుకమైన

నిష్కామభక్తియే ప్రేమభక్తి అవుతుంది. ప్రేమభక్తిపరులు భగవత్సేవ తప్ప మరేమీ కోరరు. అయితే సాంసారిక వ్యావహారిక విపత్సమయాలలో భగవంతుడు భక్తునికి సహాయపడటంలో అనుచితమూ లేదు. ఆశ్చర్యమూ లేదు. **"యో సౌ విశ్వంభరో దేవః స కిం భక్తా మపేక్షతే?"** విశ్వాన్ని పోషించే భగవంతుడు తన భక్తుల నుపేక్షిస్తాడా ఏమి? సర్వభూత మనోభిజ్ఞుడైన భగవంతుడు భక్తునిఅంతిమధర్మాన్ని గ్రహించే ఆయా సందర్భాలలో సకామభక్తునికి విపత్సమయాలలో సహాయపడతాడు. ఇలా భగవంతుడు సహాయపడటం ఎరిగిన అశ్రద్ధగలవారు కూడా భక్తి శ్రద్ధలు గలవారై భగవంతుణ్ని ఆరాధిస్తారు. వారిలో కూడా భక్తి ఉత్పన్న మవుతుంది. ఏవిధంగా నైనా భక్తి ఉత్పన్నం కావడానికి కేవలం భగవత్కృపయే కారణము. భగవత్కృపతో ఉత్పన్నమైన భక్తి ఎప్పటికీ సమాప్తం కాదు. దానికి విరామమంటూ ఉండదు. దాని వికాసమూ పూర్ణత్వమూ ఇంకా మిగిలే ఉంటుంది. గజేంద్రుడు మొసలిచేత పీడింపబడి తుదకు పరాజితుడైనాడు. గ్రాహవిముక్తికి శ్రీహరిని స్మరించాడు. భగవంతుణ్ని స్మరించిన వెంటనే అతని పూర్వజన్మ సంస్కారం జాగృతమయింది. ఐహిక జీవనాసక్తి, సాంసారిక సుఖభోగ వాంఛ క్షీణించింది. ఆత్మజ్ఞానం కలిగింది. ఆత్మ నిత్యమైనది, సనాతనమైనది, అమృతమైనది. ఆత్మమీదున్న మాయావరణం తొలగిపోయింది. భగవంతునితో ప్రేమమయ భక్తిమయ తాదాత్మ్యం కంటె భిన్నమైనదానిని కోరుకోవడానికి గజేంద్రుడు ఇష్టపడలేదు. అందుకే **"జిజీవిషే నాహ మిహాముయా కి మంతర్బహిశ్చావృతయే భయోన్యా"** (చూడండి 25వ శ్లోకం) "నేను జీవించగోరడం లేదు. బహిరంతరాలు అజ్ఞానంతో ఆవరించిన ఈ గజజన్మతో ఏమి ప్రయోజనం ఉంది కనుక? నాకు ముక్తి కావాలి'' అని కోరుకొన్నాడు గజేంద్రుడు. ఇలా కోరుకొన్న గజేంద్రుణ్ని భగవంతుడు ఏ విధంగా కరుణిస్తాడో పాఠకులు తర్వాత చూస్తారు. గజేంద్రుని ప్రార్థనా క్రమంవల్ల సకామోపాసనయే అయినా భక్తిమహిమచేత అది సకామంగానే నిలువక నిష్కామంగా పరిణతి చెందుతుందని స్పష్టమవుతున్నది. ఇందుకు ఉదాహృతులైనవారు ధ్రువ - కుంతి - గోపికాదులు భగవంతుణ్ని ప్రాప్తింపజేసుకొన్న ధన్యులు. భగవచ్చరణారవిందాలను పొందాలన్న కోరిక జీవికి చరమమూ పరమమూ అయిన ధ్యేయము. కాగా భగవత్ప్రాప్తి సహజమే కాని, భగవచ్చరణాశ్రయాన్ని పొందాలన్న లాలస మాత్రం అత్యంత దుర్లభము. అదే కోరుకొన్నారు ధ్రువ - ప్రహ్లాద - గజేంద్ర - గోపికాదులు.

**వ. అని పలికి మఱియు నరక్షితరక్షకుండైన యీశ్వరుం డాపన్నుండైన నన్నుం గాచుఁగాక యని నింగి నిక్కి చూచుచు, నిట్టూర్పులు నిగిడించుచు, బయలాలకించుచు న గ్గజేంద్రుండు మొఱపెట్టుచున్న సమయంబున**

టీ : అరక్షిత = రక్షణము లేనివారిని, రక్షకుండయిన = రక్షించువాడైనట్టి, భగవంతుడు, ఆపన్నుండనైన = ఆపదనొందినవాడనైన, నన్ను, కాచుగాక = కాపాడును గాక, అని, నింగిన్, నిక్కి చూచుచు = ఆకాశమును కన్నులెత్తి చూచుచు, నిట్టూర్పులు నిగిడించుచు = లోపలి వ్యథను అగపరచునట్టి నిఃశ్వాసములను విడుచుచు, బయలు + ఆలకించుచు = శూన్య ప్రదేశమునందు ఏదో విన వచ్చినట్లు వినుచు, ఆ గజేంద్రుడు మొఱపెట్టుచున్న సమయంబున = ఆర్తధ్వని చేసే సమయంలో.

తా : నిఖిల నిరాశ్రయులకు శరణ్యుడైన భగవంతుడు విపద్గ్రస్తుడనైన నన్ను రక్షించుగాక! అనే నిశ్చయ బుద్ధితో గజేంద్రుడు ఆ భగవంతుని రాకకు ఆకాశాన్ని చూస్తూ, వెచ్చని నిట్టూర్పులు విడుస్తూ, భగవంతుడు వచ్చాడేమో అని అలికిడికి చెవులు రిక్కించి వింటున్నాడు.

మొఱ పెట్టకుండా, దుఃఖపడకుండా ఎంతటివారు భగవంతుణ్ని పొందలేరు. దేవేంద్ర సుఖం కంటె భగవంతుడిచ్చిన దుఃఖం అత్యంత శ్రేష్ఠమవుతుంది. సుఖంలో గొప్ప లాభమేమీ లేదు. జాగతికమైన సుఖం పతనానికి, జాగతికమైన దుఃఖం ఉత్థానానికి సాధనమవుతుంది. శాంతిని అనుభవింపజేసే దుఃఖంలోనే పరమసుఖమున్నది. అంతరంగ శాంతి - ఆనందాలు భాగవత జీవనానికి పరమమైన ఫలాలు. అయితే జీవుడు తన హృదంతరంలో భగవంతుణ్ని శరణు వేడకపోతే ఆ రెండూ అతనికి దుర్లభాలు.

**ఆ.వె. విశ్వమయత లేమి వినియు నూరకయుండి రంబుజాసనాదు లడ్డపడక**
**విశ్వమయుఁడు విభుఁడు విష్ణుండు జిష్ణుండు భక్తియుతున కడ్డపడఁదలంచె**

టీ : అంబుజాసన + ఆదులు = బ్రహ్మాది దేవతలు, విశ్వమయత లేమిన్ = విశ్వాత్ములు కానందున, వినియున్ = గజేంద్రుని ఆర్తి వినియు, అడ్డపడక = మొసలి పట్టును అడ్డుకొనక; ఊరకయుండిరి = మిన్నకుండిరి. విష్ణుండు = మహావిష్ణువు, జిష్ణుండు =జయించు స్వభావం కలవాడు, విభుడు = ప్రభువు; విశ్వమయుడు = విశ్వమంతట నిండియున్నవాడు. కావున, భక్తియుతునకు = భక్తియుక్తుడైన గజేంద్రునికి; అడ్డపడఁదలంచె = సహాయపడదలచెను.

తా : బ్రహ్మాది దేవతలు విశ్వమయత లేనివారు కావున గజేంద్రుని మొఱ విని కూడా ఊరకున్నారు. మహావిష్ణువు విశ్వమయుడు విశ్వమంతా నిండి ఉన్నవాడు, విశ్వరక్షకుడు కనుక భక్తియుతుడైన గజేంద్రుణ్ని రక్షింపదలచాడు.

బ్రహ్మాది దేవతలందరు సర్వేశ్వరుడైన శ్రీకృష్ణుని గౌణావతారాలు. శ్రీకృష్ణ భగవానుని వాస్తవిక తత్త్వాన్ని తెలుసుకొని, ఆయా దేవతలను గుణావతారాలుగా భావించి చేసే ఉపాసన ఆ భక్తుని ఔన్నత్యానికి ఒక సోపానమవుతుంది. కొందరు సాధకులు ఆయా దేవతలు నిత్యులని పూజిస్తారు. వారు మోహావిష్టులై, పొరపాటుపడి అవిధిపూర్వకంగా ఆరాధించి అసారమూ అనిత్యమూ అయిన సుఖాన్నే కోరుకొంటారు. అలాంటి వారికి శాశ్వత ఫలం ప్రాప్తించదు. ఎందుకంటె సమస్త యజ్ఞాలకు, పూజలకు భోక్త - ప్రభువు శ్రీకృష్ణుడే అనే సత్యాన్ని వారు గ్రహించినవారు కాదు. అట్టివారు స్వర్గానికి చేరుకొని, తమ భోగం పూర్తి కాగానే అక్కడినుంచి తిరిగి మృత్యులోకానికి చేరుకొంటారు. ఈ విధంగా ఇతర దేవతలను ఉపాసించి అనిత్య - అసార వస్తువులను కోరి, ఆ దేవతలున్న అనిత్యలోకాలకే చేరుకొంటారు. ఉదాహరణకు పితృగణాలను ఉపాసించేవాడు పితృలోకానికి, భూతగణాలను ఉపాసించేవాడు భూతలోకానికి చేరుకొంటాడు. నిత్య చిత్స్వరూపుడైన శ్రీకృష్ణ భగవానుణ్ని భజించేవాడు ఆయన్నే పొందుతాడు. అయితే ఇతర దేవతలను ఉపాసించినవారికి ఫలమివ్వడంలో శ్రీకృష్ణభగవానుడు పక్షపాతం చూపడు. సకల జీవులకు వాటి కర్మలకు తగిన ఫలమివ్వడం ఆ భగవంతుని స్థిరమైన నియమం. శ్రీకృష్ణుడు తన భక్తుల నుండి విశేష వస్తువులను అపేక్షింపడు. భక్తితో పత్రం, పుష్పం, ఫలం, తోయం సమర్పిస్తే చాలు ప్రసన్నుడై స్వీకరిస్తాడు. పరిశుద్ధ చిత్తులు సమర్పించే ప్రసాదాన్ని తత్క్షణమే ఆయన భుజిస్తాడు. సర్వేశ్వరుడైన శ్రీకృష్ణునితత్త్వం ఇట్టిదని దేవతలకందరికి తెలిసి ఉంటుంది. అందుచేతనే బ్రహ్మాది దేవతలు గజేంద్రుడు తమను పిలువలేదని గ్రహించి ఆతని ఆర్తాలాపాలను విని ఊరకున్నారు. సంస్కృత స్తోత్రంలో **"భగవన్త మితోస్మ్యహమ్"** "నేను భగవంతుణ్ని ఆశ్రయిస్తున్నాను" అని ఉంది. భగవచ్ఛబ్దము శ్రీకృష్ణునియందే రూఢము. **"కృష్ణస్తు భగవాన్ స్వయమ్"** (శ్రీమద్భా.1-3-27) భగవంతుడనగా **"ఐశ్వర్యస్య సమగ్రస్య ధర్మస్య యశసశ్శ్రియః, జ్ఞాన వైరాగ్యయో శ్చైవ షణ్ణాం భగ ఇతీరణా"** (శ్రీవిష్ణు 6-5-74) "సంపూర్ణమైన ఐశ్వర్యం, ధర్మం, యశస్సు, శ్రీ, జ్ఞానం, వైరాగ్యం ఈ ఆరు సమగ్రంగా కలవాడు - భగవంతుడు". **"పరబ్రహ్మభూతస్య వాసుదేవస్య వాచ్యకః"** పరబ్రహ్మము అయిన వాసుదేవునికి అనగా శ్రీకృష్ణునికి వాచకము భగవచ్ఛబ్దము. అతడు సర్వరూపుడు. విశ్వమయుడు. **"జ్యోతీంషి విష్ణు ర్భువనాని విష్ణుర్వనాని విష్ణు ర్గిరయో దిశశ్చ, నద్యః సముద్రాశ్చ స ఏవ విష్ణు ర్యదస్తి యన్నాస్తి చ**

విప్రవర్య" (శ్రీమద్భా. 2-12-38). "ఓ బ్రాహ్మణోత్తమా! తారాగణాలు, భువనాలు, వనాలు, పర్వతాలు, దిశలు, నదులు, సముద్రాలు సమస్తమూ విష్ణుస్వరూపమే. ఇవి కాకుండా ఇంకా ఆవిర్భూతమైనది, తిరోహితమైనది కూడా ఆ విష్ణుస్వరూపమే. ఆ విష్ణువే విశ్వాత్మకుడు. ఆయనకు మించిన దైవం లేదు. **"యదస్తి యన్నాస్తి చ భావాభావరూపేణ ప్రతీతం వస్తు తత్ సర్వం స ఏవ"** అని శ్రీధరస్వామిపాదుల వ్యాఖ్య. శ్రీమద్భాగవతం వేదకల్ప వృక్ష విగళిత ఫలం. పరతత్త్వాన్ని నిరూపించిన ఏకైక గ్రంథం. భగవద్గీతకు, బ్రహ్మసూత్రాలకు అపౌరుషేయమైన భాష్యమిది. దీనిని పఠించినవారు ప్రేమభక్తియుక్తులై తత్ప్రభావితులై తద్గ్రంథ సందర్భాలను పురస్కరించుకొని ఎన్నెన్నో శ్లోకాలు రచించారు. ఈ సందర్భంలో అజ్ఞాత పూర్వకవి ఒకరు **"నక్రాక్రాంతే కరీంద్రే ముకులితనయనే మూలమూలేతి ఖిన్నే, నాహం నాహం న చ భవతి పున ర్మాదృశ స్త్వాదృశేషు, ఇత్యేవం త్యక్తహస్తే సపది సురగణే భావశూన్యే సమస్తే, మూలం య త్ప్రాదురాసీ త్స దిశతు భగవాన్ మంగళం సంతతం వః"** అని మంగళాశాసనం చేశారు. గజేంద్రుడు గ్రాహగ్రస్తుడై కనులు మోడ్చి దుఃఖితుడై "హే విశ్వపతి! (నన్ను రక్షించు) హే భగవాన్!" అని ఎలుగెత్తి పిలుస్తున్న సమయంలో "నీ వంటి శరణాగతులను రక్షించేవాడను నేను కాను, నేను కాను, నేను సమర్థుడను కాను అని సమస్త దేవతలు చేతులు ముడుచుకొని భావశూన్యులయ్యారు. అప్పుడు సకల లోకాధారుడైన శ్రీహరి గజేంద్ర రక్షణార్థం ఆవిర్భవించాడు.ఆయన నిరంతరము మనకు మంగళములను ప్రసాదించుగాక!"

ఇక ప్రకృతాన్ని అనుసరిద్దాము. సర్వతోముఖ పూర్ణత్వం కలవాడు కనుక భగవంతుడు విశ్వుడు. విశ్వము - విశ్వాత్ముడు ఒకరే. **"పరావరగతిజ్ఞాయ సర్వాధ్యక్షాయ తే నమః, అవిశ్వాయ చ విశ్వాయ తద్ద్రష్ట్రేఽస్య చ హేతవే** (శ్రీమద్భా 10-16-48) "నీవు స్థూల సూక్ష్మ ప్రాణుల గతి ఎరిగినవాడవు. విశ్వానికంతటికి అధిష్ఠాన స్వరూపుడవు. విశ్వాతీతుడవు. విశ్వసృష్టికి ప్రధానుడవు నీవై ద్రష్టమాత్రంగా సాక్షిమాత్రంగా ఉంటావు. సర్వకారణ కారణమైన ఓ భగవంతుడా! నీకు నమస్కారము". ఈ విషయాన్నే గీతలో శ్రీకృష్ణ భగవానుడు **"మయా తత మిదం సర్వం జగదవ్యక్త మూర్తినా, మత్స్థాని సర్వభూతాని న చాహం తేష్వవస్థితః** (గీత 9-4) అవ్యక్తమైన అతీంద్రియమూర్తినై ఈ జగత్తునంతటిని ధరించి నియమించుటకై అంతర్యామిగా ఇందు వ్యాపించి ఉన్నాను. కాని, నేను మాత్రం వాటికి అధీనుణ్ని కాను" అన్నాడు. ఇట్టి విశ్వమయత్వం ఒక్క శ్రీకృష్ణ

భగవానునికే ఉన్నది. ఇక మరే దేవతలకు లేదు. **"ఐతదాత్మ్య మిదం సర్వమ్" 'సదాయతన'** ఇత్యాది శ్రుతివాక్యాలు **"వాసుదేవః సర్వమితి"** (గీత 7-19) అను శ్రీముఖోక్తికి పర్యాయాలు. భగవంతునిచేత నియమితులైన బ్రహ్మాది దేవతలు అనేకులున్నారు.

దేవతలకు నివాసస్థానం 'ఆకాశము' **"ద్యౌ ర్వై సర్వేషాం దేవానా మాయతనమ్"** అని శతపథ బ్రాహ్మణము. **"దేవగృహా వై నక్షత్రాణి"** తారాగణమే దేవతల నివాసం అని తైత్తిరీయ శ్రుతి. "దేవా వై నృచక్షసః" (యజుర్వేదం 14-24) దేవతలు మనుష్యుల్ని చక్కగా చూడగలుగుతారు. **"దేవా మహిమానః"** (యజుర్వేదం 31-16) దేవతలు మహిమగలవారు. **"మనుష్యాణాం పరోక్షం తద్దేవానాం ప్రత్యక్షం"** ఆ దేవతలు మనుష్యులకు పరోక్షంగాను, దేవతలకు ప్రత్యక్షంగాను ఉంటారు. **"యద్ యద్ రూపం కామయతే తత్తద్దేవతా భవతి"** (నిరుక్తం) దేవతలు తాము కోరుకొన్న రూపాన్ని పొందగలరు. ఈ దేవతలందరు ప్రపంచ నిర్మాణంలో నిమగ్నులై ఉంటారు. మనుష్యులు ఈ దేవతలను ఉపాసిస్తే అభీష్టసిద్ధి అవుతుంది. ఆ దేవత తాను అధికారంలో ఉన్నంతవరకు దివ్యశరీరంతో ఉంటాడు. అధికారం సమాప్తం కాగానే బ్రహ్మాదులు సైతము ముక్తులవుతారు. " **ఆబ్రహ్మ భువనాల్లోకాః పునరావర్తినోఽర్జున** (గీత 8-16) బ్రహ్మలోకం మొదలుకొని సమస్త లోకాలు శాశ్వతమైనవి కావు" అని ఎరుకపరచి శ్రీకృష్ణ భగవానుడు **"యే ప్యన్యదేవతా భక్తాః యజన్తే శ్రద్ధయాన్వితాః, తేఽపి మామేవ కౌంతేయ యజన్త్యవిధిపూర్వకమ్"** (గీత 9-23) అన్నాడు. **"శ్రద్ధయోపేతా భక్తాః సంతోఽపి యే జనాః యజ్ఞేనాఽన్య దేవతా ఇంద్రాదిరూపా యజన్తే, తేఽపి మామేవ యజంతీతి సత్యం, కిం త్వవిధి పూర్వకం మోక్షప్రాపకం విధిం వినా యజన్తి, అతస్తే పునరావర్తన్తే"** అని శ్రీకృష్ణ ముఖోక్తికి సరళ సుందరమైన వ్యాఖ్య రచించారు శ్రీధరస్వామిపాదులు. ఇంద్రాది దేవతలను ఆరాధిస్తే, ఆ ఆరాధన శ్రీకృష్ణునికే చెందుతుంది. కాని, ఆ ఆరాధన శాస్త్రసమ్మతమైనది కాదు. వారి ఆరాధనవల్ల ముక్తి ప్రాప్తించదు. వారిని ఆరాధించినవారు స్వర్గానికి చేరుకొని, మరల భూలోకంలోని ఆవాగమనచక్రంలోనికి చేరిపోతారు. కనుక **"యాంతి మద్యాజినోఽపి మామ్"** (గీత 9-25) "సమస్త దేవతలకు అంతర్యామిగా ఉన్న నన్నే విజ్ఞులైనవారు ఆరాధిస్తారు. నా అనుగ్రహంతో కృతార్థులవుతారు" అని శ్రీకృష్ణ భగవానుడు గోప్యాతిగోప్యమైన ఈ విషయాన్ని తనకు ఇష్టుడైన అర్జునునికి తెలిపాడు. గజేంద్రుని ప్రార్థనను సమస్తదేవతలు విన్నారు. అతడు సర్వలోకైక

ప్రభువైన శ్రీమన్నారాయణుని శరణు వేడుకొంటున్నాడని గమనించారు. తమ ప్రభువే ఈ గజేంద్రుణ్ని రక్షించాలి. తామందుకు పూనుకోవడం అనుచిత మవుతుందని బ్రహ్మాది దేవతలు మిన్నకున్నారు.

**శ్లో. నాయం వేద స్వమాత్మానంయచ్ఛక్త్యాఽ హంధియా హతమ్**
**తం దురత్యయమాహాత్మ్యం భగవన్త మితోఽస్మ్యహమ్**

తా : ఓ దేవాదిదేవా! నీ మాయ అహంబుద్ధిచే ఆత్మస్వరూపాన్ని నిరోధిస్తుంది. ఈ కారణంగా జీవి తన స్వరూపాన్ని తెలుసుకోలేక పోతున్నాడు. నీ మహిమ అపారము. సర్వశక్తిమంతుడవు, మాధుర్యనిధివి, భగవంతుడవు అయిన నిన్ను శరణు చొచ్చుతున్నాను.

ఆత్మ అంటే ఏమిటి? అదెక్కడుంటుంది?దాని తత్త్వమేమిటి? మన దేశంలో మామిడి చెట్టు ఉన్నది అంటే ఉన్నదని అందరు అంగీకరిస్తారు. ఆ చెట్టు ప్రత్యక్షంగా ఉన్నది కాబట్టి. ఏ దేశంలోనైనా మామిడి చెట్టు లేకపోతే అది అక్కడి జనులకు పరోక్షమవుతుంది. పరోక్షవస్తువును గురించి మనం వింటాము, చదువుతాము. సాధక బాధకాలను తర్కనికషం మీద రాచి నిగ్గు తేల్చుకొంటాము. సాధక ప్రమాణాలు బలమైన వైనప్పుడు ఆ వస్తువు యొక్క అస్తిత్వాన్ని స్వీకరిస్తాము. బాధక ప్రమాణాలే బలమైనవైనప్పుడు ఆ వస్తువు యొక్క అస్తిత్వాన్ని త్రోసిపుచ్చుతాము. మామిడి చెట్టు అస్తిత్వం వలె ప్రత్యక్షమైనదే ఆత్మ అయితే దానిని గూర్చి ఎవరూ పట్టించుకొనరు. ఆత్మ ప్రత్యక్షమైనది కాదు. కాబట్టి దానిని గూర్చి చింతించడం, మథించడం, మననం చేయడం, దర్శనం చేయడం అధికాధికమై, ఆత్మతత్త్వ పరిజ్ఞానం, ఆత్మ అనాత్మల వివేకం భారతీయ దర్శనాలలో ప్రధానాంగమయింది. శ్రీశంకర భగవత్పాదులు **"ఆత్మానాత్మవివేచనం స్వనుభవో బ్రహ్మాత్మనా సంస్థితమ్, ముక్తిర్నో శతకోటి జన్మసు కృతైః పుణ్యై ర్వినా లభ్యతే"** (వివేక చూడామణి) ఆత్మ అనాత్మల వివేకం, సమ్యగనుభవం, బ్రహ్మాత్మభావస్థితి, ముక్తి ఇవి కోటి జన్మలలో చేసుకొన్న శుభకర్మల పరిపాకం లేకుండా ప్రాప్తించవు అన్నారు.

పంచభూతాలతో నిర్మితమైన జీవదేహంలో ఆత్మ ప్రత్యేకంగా ఉంటుంది. దేహం నశించిన తర్వాత ఆత్మ వేరై ఎక్కడెక్కడో పరిభ్రమిస్తుంటుంది. ఈ సృష్టిలో జ్ఞాత - జ్ఞానం - జ్ఞేయం అనే మూడు భాగాలున్నాయి. వీటిలో జ్ఞాతయే ఆత్మ. జ్ఞానం ఆత్మరశ్మి. జ్ఞేయం ఆత్మ యొక్క అంశం (ప్రవర్గ్యం) అనగా మహిమారూపము.

వేదంలో "అంశ"కు ప్రవర్గ్యమనే నామమున్నది. కాగా, వీటిలో ఆత్మను చిత్తు అనీ, జ్ఞానాన్ని చేతనమనీ, ప్రవర్గ్యాన్ని అచిత్తు (జడము) అనీ పేర్కొంటారు. వీటినే న్యాయ దర్శనంలో క్రమంగా ప్రమాత - ప్రమ - ప్రమేయమనీ అంటారు. శ్రీమద్రామానుజులు తమ శ్రీభాష్యంలో వీటిని ఈశ్వరుడు, చిత్తు, అచిత్తు అని పేర్కొన్నారు. పశుపక్ష్యాదులలో ఇంద్రియవికాసం లేనందువల్ల వాటిలో గల ఆత్మ అభివ్యక్తం కాదు. అంతమాత్రాన అవి అనాత్మ పదార్థాలని భావింప గూడదు. ఈ జగత్తుకు మూలకారణమైన పరమాత్ముడు మనఃప్రాణవాఙ్మయాలు గలవాడు, కనుక సమస్త జీవులకు ఆ మూడింటిని ప్రసాదించాడు. అయితే అచేతన - అర్ధచేతన - చేతన జీవులున్నాయి. ఇంద్రియ వికాసం లేని జీవులు త్వగింద్రియంతోనే వృద్ధినొందినవి, జ్ఞానశక్తి మూర్ఛితమైనవి, తైజసశక్తి గలవి ఇలా ఎన్నెన్నో జీవరాసులున్నాయి. ఈ జీవకోటి ఎప్పటినుంచి ఆరంభమైనదో చెప్పలేము. వీటిమీద భగవంతునికి ద్వేషమూ లేదు ప్రేమమూ లేదు **"న మే ద్వేష్యోఽస్తి న ప్రియః"** (గీత 9-29) **"సమోహం సర్వభూతేషు"** (గీత 9-29) భగవంతుడు కర్మఫలదాత. కర్మానుకూలమైన ఫలాన్ని ప్రదానం చేస్తాడు. **"అజ్ఞానేనావృతం జ్ఞానం తేన ముహ్యంతి జంతవః"** (గీత 5-15) అజ్ఞానంచేత జ్ఞానం కప్పబడి మనుష్యుడు మోహగ్రస్తుడవుతాడు. మోహంతో కర్మ, కర్మచేత జన్మ, జన్మచేత సుఖదుఃఖాలను పొందుతాడు. కఠోపనిషత్తు ఆత్మను వివరించి చెప్పింది. **"అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే"** అని. శ్రీకృష్ణుడు ఈ మంత్రానికి స్పష్టమైన రూపమిచ్చాడు. **"న జాయతే మ్రియతే వా కదాచి న్నాయం భూత్వా భవితా వా న భూయః, అజో నిత్యః శాశ్వతోఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే"** (గీత 2-20) ఈ ఆత్మ పుట్టేదీ కాదు, నశించేదీ కాదు. అందుకు కారణం అది అజన్మం కావడమే. అది నిత్యమైనది సనాతనమైనది. శరీరం మరణించినా ఆత్మ మరణించదు. **"అనాత్మ న్యాత్మవిజ్ఞానం శబ్దో వా భ్రాంతిలక్షణః"** (శ్రీ విష్ణు. పు. 2-13-86) అనాత్మయందు ఆత్మత్వ జ్ఞానం కలగడం భ్రాంతిచేతనే. **"ఆత్మ విజ్ఞాన మహంబుద్ధి శబ్దః అహమితి శబ్దః"** ఆత్మను చెప్పడానికి శుద్ధాది విశేషణాంతర సద్భావాలున్నప్పటికి జాత్యాదిధర్మసద్భావంవల్ల అహంశబ్దంతోనే పేర్కొనడం జరుగుతున్నదని విష్ణుపురాణ వ్యాఖ్యాత శ్రీ విష్ణుచిత్తస్వామివారు వివరించారు. **"అహం శబ్దస్య మిథ్యాత్వ విషయత్వా దనాత్మన్యాత్మ విజ్ఞానం దోషాయస్యాదిత్యర్థః"** అని విష్ణు పురాణానికి మరొక ప్రసిద్ధ వ్యాఖ్యాత అయిన శ్రీధరస్వామి "అహం శబ్దం మిథ్యాత్వ విషయం ఆత్మను అహం శబ్దంతో పేర్కొనడం

దోషమవుతుం" దన్నారు. విష్ణుపురాణం ఆత్మ అనాత్మల భేదాన్ని జడభరత సౌవీర నరేశుల సంవాదంలోను, ఋభునిదాఘుల సమావేశంలోను వివరించింది.*

శరీరాలు కర్మఫలాలను అనుభవించడానికి పంచభూతాల సంఘాతరూపంగా ఏర్పడినవి. ఇవి **"పుణ్యః పుణ్యేన కర్మణా భవతి, పాపః పాపేన కర్మణా భవతి"** అని చెప్పబడినవి. కాబట్టి కర్మావసానం కాగానే అవి నశిస్తాయి. ఆత్మ అవినాశి. దేహం వలె ఆత్మ వికారాన్ని పొందదు. **"అవినాశి తు త ద్విద్ధి యేన సర్వమిదం తతమ్"** (గీత - 2-17) అవినాశి అయిన ఆత్మతత్త్వం ఈ ప్రపంచమంతటా వ్యాపించి ఉన్నది. సంకలనాత్మక జ్ఞానం, స్మృతి మనస్సు చేసే పని. మనస్సు ఆత్మద్వారానే పని చేస్తుంది. ఆత్మ అనేది లేకపోతే ఇంద్రియాలు, మనస్సు నిష్క్రియమైనవి అవుతాయి. కాబట్టి ఆ రెండింటి జ్ఞానానికి మూలమైనది ఆత్మ. ఉత్పత్తి - వృద్ధి - బాల్యం - యౌవనం - వార్ధక్యం - మృత్యువు అనే ఈ ఆరు వికారాలు లేనిది ఆత్మ.

---

* ఋభుమహర్షి బ్రహ్మమానస పుత్రుడు. బ్రహ్మ తత్త్వజ్ఞుడు. శరీరం తప్ప వేరే నివాసం లేని సర్వదా సహజ స్థితిలో జీవించే ఆత్మజ్ఞాని, అవధూత. పులస్త్యుని పుత్రుడు నిదాఘుడు వేదాధ్యయనం చేస్తుండగా ఆ ఆశ్రమ సమీపానికి ఋభు మహర్షి వెళ్లాడు. నిదాఘుడు ఋభువును చూచి లేచివచ్చి ఎవరో మహాత్ముడని భక్తితో ప్రణమిల్లాడు. ఋభువుకు అతని మీద అనుగ్రహం కలిగింది. "కేవలం వేదాధ్యయనంతో ప్రయోజనం లేదు. ఆత్మజ్ఞానాన్ని అలవరచుకో"మ్మని ఉపదేశించాడు. నిదాఘుడు ఆయన్ను తన గురువుగా భావించి ఆయనతోపాటు సంచరింపసాగాడు. "నీవు నాకు శిష్యుడవు కాదలచితే గృహస్థాశ్రమాన్ని స్వీకరించు" అని ఆజ్ఞాపించాడు ఋభు మహర్షి. నిదాఘుడు గృహస్థాశ్రమం స్వీకరించి ఒక నగరంలో నివసమున్నాడు. కొన్నేండ్లు గడిచాయి. ఋభుమహర్షి ఆ నగరానికి వచ్చాడు. సంయోగవశం చేత ఆ రోజు ఆ నగరాధిపతి ఏనుగెక్కి ఊరేగింపుగా వీధిలోనికి వచ్చాడు. నగర ప్రజలు గుంపులు గుంపులుగా కూడి మహారాజును దర్శిస్తున్నారు. నిదాఘుడు కూడా ఒకచోట చేరి ఆ ఉత్సవాన్ని తిలకిస్తున్నాడు. ఋభువు అతని దగ్గరికి వెళ్లి "ఎందుకిలా జనం గుంపులు కూడారు?" అని అడిగాడు. "నీకు కనిపించడం లేదూ? మహారాజు ఏనుగుమీద ఊరేగుతూ వస్తున్నాడు. ఆ ఉత్సవం చూడటానికి జనులు గుంపులు కూడారు" అని చెప్పి నిదాఘుడు ఉత్సవం చూస్తూ నిలుచున్నాడు. అప్పుడు మళ్లీ ఋభువు "అయ్యా! నీవు రాజు అన్నావు - ఏనుగు అన్నావు. ఎవరు రాజు? ఎవరు ఏనుగు?" అని అడిగాడు. "అదిగో పర్వతంలాగా కనిపిస్తున్నదే అదే ఏనుగు. దానిమీద ఎక్కి కూర్చున్నవాడు రాజు" అని వివరంగా చెప్పాడు నిదాఘుడు. "అయ్యా! నీవు చెప్పేది నాకు అర్థం కావడం లేదు. రాజు ఏనుగు నీటి లక్షణాలేమిటో తెలియజెప్పండి" అని అర్థించాడు ఋభువు. ఆ ప్రశ్నకు నిదాఘుడికి కోపం వచ్చింది. ఋభుమహర్షిని వంగదీసి అతని మెడమీద కూర్చొని, "నీవు ఏనుగవు. నీమీద కూర్చున్న నేను రాజును "అని సోదాహరణంగా చెప్పాడు. అప్పుడు చాలా శాంతంగా ఋభువు ఇలా అన్నాడు. "అయ్యా! నీవు రాజువుగా, నేను ఏనుగుగా ఉన్నాము. సరే. నీ వెవరివో నే నెవరినో తెలియజెప్పు"మని అడిగాడు. అది విని నిదాఘుడు గభాలున దిగి ఋభుని పాదాల మీద పడి "స్వామీ! నీవు తప్పక నా గురువై ఉంటావు. నీవంటి అద్వైత సంస్కారి, సుసంస్కృత చిత్తుడు లోకంలో మరొకడు లేడు. నా గురుదేవుడైన ఋభు మహర్షులే మీరు. తెలియక చేసిన అపరాధాన్ని దయతో క్షమించండి" అని వేడుకొన్నాడు. ఋభువు నవ్వుతూ "ఎవరికి ఎవరు అపరాధం చేస్తారు? ఒక చెట్టుకు గల రెండు కొమ్మలు ఒకదాని నొకటి రాచుకొంటే ఏ కొమ్మది అపరాధ మవుతుంది? మును పెన్నడో ఒకసారి మీ ఇంటికి వచ్చి భోజనం చేసి అన్వయ వ్యతిరేకంగా ఆత్మను గూర్చి బోధించాను. ఇప్పుడు అన్వయ క్రమంలో ఆత్మబోధ చేశాను. ఈ విషయంలో నీవు పరినిష్ఠుడవు కావాలి. ఈ రెండు పద్ధతులను తెలుసుకొంటే నీవు సంసారంలో ఉంటూనే నిర్లిప్తుడవై మనుగడ సాగిస్తావు" అని పలికి ఋభు మహర్షి యథేచ్ఛగా వెళ్లిపోయాడు.

# గజేంద్ర మోక్షము

## గోపీనయనోత్పలార్చితవ్యాఖ్యావిలసితము

## మహోద్ధరణిక

**మ. అల వైకుంఠ పురంబులో నగరిలో నామూలసౌధంబు దా**
**పల మందారవనాంతరామృతసరఃప్రాంతేందుకాంతోపలో**
**త్పలపర్యంకరమావినోదియగు నాపన్నప్రసన్నుండు వి**
**హ్వలనాగేంద్రము పాహి పాహి యనఁ గుయ్యాలించి సంరంభియై**

టీ : అలవైకుంఠపురంబులోన్ = అక్కడ వైకుంఠపురములో, నగరిలో = రాజభవన సముదాయంలో, ఆమూల సౌధంబు దాపల = ఆ ప్రధాన సౌధమునకు సమీపమున; మందార వనాంతర = మందారవనం నడుమ, అమృతసరస్ = అమృత సరస్సు యొక్క, ప్రాంత = సమీపమున; ఇందుకాంత + ఉపల = చంద్రకాంతపు రాళ్లమీద; ఉత్పల పర్యంక = కలువపూల శయ్యయందు, రమా వినోదియగు = లక్ష్మీ దేవితో వినోదించువాడైన; ఆపన్న ప్రసన్నుండు = ఆపదలో ఉన్నవారిని అనుగ్రహించువాడు; విహ్వల = వశము తప్పిన; నాగేంద్రము = గజేంద్రుడు; పాహి పాహి అనన్ = రక్షించుము - రక్షించుము అనునట్టి, కుయ్యి + ఆలించి = మొఱ విని; సంరంభియై = ఉత్సాహము గలవాడై (తర్వాతి పద్యంతో అన్వయము)

తా : వైకుంఠపురంలో రాజప్రాసాద భవన సముదాయంలోని ప్రధానమైన ఒకవైపుననున్న సౌధము దగ్గరి కల్పవృక్ష వనమునందలి అమృత సరోవర తీరమునందు చంద్రకాంత శిలా వేదిక పైన, కలువపూలు పరచిన శయ్యయందు శ్రీలక్ష్మీదేవితో ఆనందిస్తున్న దీనజనశరణ్యుడు శ్రీమన్నారాయణుడు, తన భక్తుడైన గజేంద్రుడు దుఃఖిస్తూ..... సర్వేశ్వరా, పరాత్పరా! నన్ను రక్షింపుము - రక్షింపుము అని చేయు మొఱవిని వేగంగా లేచి-

**"షాడ్గుణ్యాత్ వాసుదేవః"** వాసు దేవుడు షాడ్గుణ్యయుక్తుడు. దివ్యలక్ష్మీ పతిత్వం,

నిత్యసహచారిణీత్వం కలవాడు. అయినా భక్త ప్రియుడు అని విశదం చేయడానికే పోతనగారు ఈ పద్యంలో "రమావినోది" అని వైకుంఠవాసుని వర్ణించారు. ఇక వైకుంఠాన్ని గూర్చి తెలుసుకొందాము.

సంసారంలోని త్రివిధ తాపాలనుంచి జీవుడు ముక్తుడు కావడానికి శాస్త్రకారులు కర్మ - జ్ఞాన - భక్తి - ప్రపత్తి మున్నగు సాధనాలను ప్రతిపాదించారు. జీవునిపై భగవంతుని కృప ఉంటేనే ఈ సాధనలు ఫలిస్తాయి. కాబట్టి జీవుడు ఈ విషమ సంసారం నుండి ముక్తుడై పరమపదాన్ని పొందాలంటే భగవత్కృప ఉండాలి. శ్రీకృష్ణ భగవానుడు గీతలో తన దివ్యధామం గురించి, అక్కడికి రాదగినవారిని గురించి చెప్పాడు. **"మత్ప్రసాదా దవాప్నోతి శాశ్వతం పద మవ్యయమ్"** (గీత 18-56) నా అనుగ్రహంతో శాశ్వతమూ అవ్యయమూ అయిన పదమును పొందుతారు అని. పరలోక - పరమపదాలను గూర్చి వైకుంఠాన్ని గూర్చి వైష్ణవాచార్యులు వేద వేదాంగాలను బట్టి ఇలా వర్ణించారు. పరబ్రహ్మ పురుషోత్తమునికి చెందినవి రెండు విభూతులు 1. భోగవిభూతి 2. త్రిపాద విభూతి. **"పాదోఽస్య విశ్వా భూతాని త్రిపాదస్యామృతం దివి"** (యజుర్వేదం 31-3) ఒక పాదంలో భోగవిభూతి; ఇందులో విశ్వమంతా ఉంటుంది. దీనినే సంసారమంటారు. మూడు పాదాలను త్రిపాద విభూతి అంటారు. ఇది వైకుంఠం, దివ్యధామం, పరమవ్యోమం, పరమపదం, గోలోకం, బృందావనం, గోకులం, మున్నగు పేర్లతో వర్ణితమయింది. ఈ రెండు విభూతులకు మధ్య జ్ఞానమయ ప్రవాహమైన విరజానది ప్రవహిస్తుంటుంది. **"వైకుంఠేపిమ్ని విరజాం వ్యందమానాం మహానదీమ్" "విరజానదీం తాం మనసాత్యేతి"** ఈ శ్రుతివాక్యాలు రెండూ విరజానది ఉనికిని ప్రమాణీకరిస్తున్నాయి. విరజానదికి ఈవలి ఒడ్డున జగత్తు, ఆవలి ఒడ్డున పరమపదం ఉన్నది. పరమపదానికి క్షయమనేది ఉండదు. మహాభారతంలో వైకుంఠ వర్ణన మున్నది. **"అత్యర్కానల దీప్తం తత్ స్థానం విష్ణో ర్మహాత్మనః, స్వయైవ ప్రభయా రాజన్! దుష్ప్రేక్ష్యం దేవదానవైః"** "శ్రీవిష్ణు భగవానుని స్థానమైన వైకుంఠం సూర్యాగ్నులతో దేదీప్యమానంగా ఉంటుంది. దాని ప్రభలు నలుదెసలకు చిమ్మబడుతుంటాయి. దేవదానవులు దానిని చూడజాలరు. అది స్వయంప్రకాశము". అనంత గరుడ, విష్వక్సేనాది నిత్యసూరులు సర్వదా పరమపదాన్ని దర్శిస్తూ ఆనందానుభవం పొందుతుంటారు. పరమపదం శుద్ధ సత్వమయము. అక్కడ రజోగుణ తమోగుణాలుండవు. భగవద్రామానుజులు తమ గీతాభాష్యంలోను, వైకుంఠ గద్యలోను

శ్రుతివాక్యాలను బట్టి వైకుంఠాన్ని అత్యద్భుతంగా వర్ణించారు. **"క్షయన్తమస్య రజసః పరాకే"** (ఋగ్వేదం) రజోగుణమయమైన ప్రకృతికి పైన భగవంతుడుంటాడు. ఈ విషయాన్నే నారాయణోపనిషత్తు **"యదేక మవ్యక్త మనంతరూపం విశ్వం పురాణం తమసః పరస్తాత్"** ఆ వైకుంఠం చక్షురాదీంద్రియాలకు గోచరించేది కాదని చెబుతున్నది. **"తద్విష్ణోః పరమంపదం సదా పశ్యంతి సూరయః"** (ఋగ్వేదం) ఆ విష్ణువు యొక్క పరమ పదాన్ని నిత్యసూరులు (జ్ఞానులు) సదా దర్శిస్తుంటారు. ఈ శ్రుతివాక్యాన్నే విష్ణుపురాణం **"ఏకాంతినః సదా బ్రహ్మధ్యాయినో యోగినశ్చ యే, తేషాం తు పరమం స్థానం యద్వై పశ్యన్తి సూరయః"** (విష్ణు 1-6-39) యోగులు, అనన్య భక్తులు పరబ్రహ్మమును ధ్యానించేవారు ఈ పరమధామానికి చేరుకొంటారు. దీనిని నిత్యసూరులు దర్శిస్తారని చెబుతున్నది. **"పరస్య బ్రహ్మణః పరిపూర్ణస్య సర్వగతస్య సత్యసంకల్పస్య స్వేచ్ఛా పరికల్పితాః స్వాసాధారణ అప్రాకృతాశ్చ లోకా వాత్యంతాయ సన్తి శ్రుతి స్మృతీతిహాస పురాణ ప్రామాణ్యాత్"** (శ్రీభాష్యం 4-3-11) సర్వతః పరిపూర్ణుడు, సర్వవ్యాపకుడు, సత్యసంకల్పుడు అయిన భగవంతుడు తన సంకల్పంతో అనగా స్వేచ్ఛతో పరికల్పించిన అప్రాకృతములైన వైకుంఠాది లోకాలు ఉన్నవి అని శ్రుతి స్మృతి ఇతిహాస పురాణాదులు ప్రమాణీకరిస్తున్నాయి. "విషేధ ప్రసంగో నాస్తి" "సన్త్యేవ" అవి లేవనే మాట ఎక్కడా లేదు. 'ఉన్నవి' అని శ్రుతప్రకాశిక కంఠోక్తిగా చెబుతున్నది. తమ వైకుంఠ గద్యలో **"చతుర్దశ భువనాత్మకమండం దశగుణితోత్తరం చావరణసప్తకం సమస్తం కార్యకారణజాత మతీత్య పరమవ్యోమశబ్దాభిధేయే బ్రహ్మాదీనాం వాఙ్మనసాగోచరే శ్రీమతి వైకుంఠే దివ్యలోకే ----"** అనగా "చతుర్దశ భువనాలతో విభాజితమైన బ్రహ్మాండానికి పదిరెట్లు గొప్పదై, సకల కార్యకారణ సముదాయంతో కూడిన ఏడు ప్రాకారాలకు అవ్వల దివ్య శోభాసంపన్నమైన అలౌకిక వైకుంఠధామం భగవంతుని దివ్యసూరులతో విరాజిల్లుతుంటుంది'' అని అత్యద్భుతంగా వర్ణించిన భగవద్రామానుజులు తాము వర్ణించిన విధంగానే శ్రీరంగనాథ దేవాలయాన్ని సప్తప్రాకారాలతో భూలోకవైకుంఠధామంగా నిర్మింపజేశారు. తాము ఆ శ్రీరంగనాథుని జయధ్వజంగా, శ్రీరంగరాజచరణాంబుజ మూలదాసుడుగా కీర్తితులయ్యారు. శ్రీ వైకుంఠస్తవంలో ఇలా వర్ణితమయింది : **"కదా మాయాపారే విశదవిరజాపారసరసి, పరే శ్రీవైకుంఠే పరమరుచిరే హేమనగరే, మహారమ్యే హర్మ్యే వరమణిమయే మండపవరే, సమాసీనం శేషే తవ పరిచరేయం పదయుగమ్"** "హే భగవన్! ప్రకృతి మండలావరణానికి అవ్వల, అతి విస్తృతమైన విరజా నదికి ఆవలగల చిత్ర విచిత్ర మణి ఘటిత పరమ మనోహర సువర్ణపుర శ్రీవైకుంఠ మహానగరంలో, అత్యంత రమణీయము, సర్వోచ్చస్థానము

అనర్ఘ మణిగణ ప్రకాశితమయిన రత్నమండపంలో సహస్రఫణా మణి శోభితుడైన శేషుని పర్యంకమందు విరాజితుడై నిత్య సూరులతో కూడినవాడై సుఖంగా కూర్చున్న నీ చరణ కమల యుగళానికి పరిచర్య చేసే శుభసమయం నాకెప్పుడు కలుగుతుందో!" "విష్వక్సేన సంహిత"లోను శ్రీ వైకుంఠవర్ణన మున్నది: "**వైకుంఠే తు పరే లోకే శ్రీ సహాయో జనార్దనః, ఉభాభ్యాం భూమినీళాభ్యాం సేవితః పరమేశ్వరః, మహాయోగీ జగద్ధాతా దివ్య సింహాసనోపరి దివ్య సంస్తరణోపేతే శేషాహిఫణ మండితే, పంచోపనిషదామ్నాత దివ్యమంగళ విగ్రహః, అప్రాకృత తమర్దేహో నిత్యాకృతిధరో యువా, నిత్యాతీతో జగద్ధాతా నిత్యై ర్ముక్తైశ్చ సేవితః**" పరమవైదిక సిద్ధాంతానుసారులైన వైష్ణవులకు మాన్యమైన విషయం శ్రీవైకుంఠము. అది అపునరావృత్తి స్థానము.

ఈ పద్యానికి చెందిన ఒక అద్భుతమైన ఐతిహ్యమున్నది. పోతనగారు "అల వైకుంఠపురంబులో ---" అని మాత్రం వ్రాసి, వైకుంఠాన్ని ఎలా వర్ణించాలో తోచక ఆలోచిస్తూ ఊరి అవతలికి వెళ్లాడట. కొంతసేపయిన తర్వాత పోతన తిరిగి వచ్చి "అమ్మాయీ! ఆ తాళపత్ర గ్రంథం ఇటు తీసుకు రా! పూర్తిచేస్తాను" అన్నాడట కూతురుతో. ఆ మాటలు విని కూతురు ఆశ్చర్యపడి "ఇంతకు ముందేకదా మీరు వచ్చి పద్యం పూర్తి చేసి వెళ్లారు. మళ్లీ పూర్తి చేయడమేమిటి?" అన్నది. పోతన తన గ్రంథాన్ని చూచుకొంటే "అల వైకుంఠపురంబులో" అనే పద్యం అత్యంత హృద్యంగా అనవద్యంగా పూర్తి చేయబడి ఉన్నది. "అమ్మా! ఎవరు వ్రాశారమ్మా ఇంత చక్కని పద్యం?" అని కూతుర్ని అడిగారు పోతనగారు. "నాయనా! ఇంతకుముందు మీరే వచ్చి పద్యం పూర్తిగా వ్రాసి వెళ్లారు" అని ఆమె మళ్లీ చెప్పేసరికి ఆ వచ్చినవాడు తన ఇష్టదైవమైన శ్రీరామచంద్రుడే అని గ్రహించి పోతనగారు ఆ పద్యాన్ని పలుసార్లు చదువుకొని, ఆనందించి "నీవెంత అదృష్టవంతురాలవమ్మా. శ్రీరామచంద్రుణ్ని దర్శించావు" అని కూతుర్ని మెచ్చుకొన్నాడట.

భక్తకవుల జీవితాలలో ఇట్టి అద్భుత సంఘటనలు ఉండటంలో ఆశ్చర్యపడవలసినది లేదు. గీతగోవింద కర్త జయదేవుడు తన అష్టపదిలో ఒక పాదం ఎలా వ్రాయాలో తోచక ఆలోచిస్తూ బయటికి వెళ్లాడట. ఇంతలో శ్రీకృష్ణుడు జయదేవుని రూపంతో వచ్చి ఆ అష్టపదిని పూర్తిచేసి వెళుతుండగా "మళ్లీ వెళుతారేమిటి? వంట అయింది. భోజనం చేసి మరీ వెళ్లండి" అన్నది భార్య. సరే అని భోజనం చేసి వెళ్లిపోయాడు శ్రీకృష్ణుడు. ఆ తర్వాత అసలు జయదేవుడు వచ్చి చూచాడు. తన భార్య భోజనం చేస్తున్నది. ఎన్నడూ తాను భుజింపక ముందు భోజనం చేయని తన భార్య ఇవ్వేళ

తన కంటె ముందుగా భోజనం చేయడం చూచి ఆశ్చర్యపడి, గ్రంథకుటిలోనికి వెళ్లి తన తాళపత్ర గ్రంథం చూచుకొన్నాడు. అష్టపది శృంగార రస బంధురంగా పూర్తి చేయబడి ఉంది. "ఇది ఎవరు వ్రాశారు?" అంటూ గబగబ వచ్చి భోజనం చేస్తున్న భార్యను అడిగాడు. "మీకేమైనా మతి పోయిందా? మీరే వచ్చి వ్రాసుకొని, భోజనం చేసి, కాస్తయినా విశ్రమించకుండా వెళ్లిపోయారు. మీరుకాక మరెవరు ఇంట్లోకి వచ్చి వ్రాస్తారనుకొంటున్నారు?" అన్నది భార్య పద్మావతి. శ్రీకృష్ణభగవానుడు తన రూపంతో వచ్చి వ్రాశాడని తెలుసుకొని సంతోషంతో ఉప్పొంగిపోయి తన భార్య భుజిస్తున్న విస్తరాకులో చొరబడి గబగబ ఇంత అన్నం తిని "ఇది శ్రీకృష్ణప్రసాదమే. నీవెంత అదృష్టవంతురాలవే. నన్ను కూడా కొంత తిననివ్వవే" అని భార్యను బతిమాలాడట జయదేవుడు.

గుజరాతుకు చెందిన శ్రీ నర్సీమెహతా 13వ శతాబ్దివాడు. శ్రీకృష్ణ భక్తుడు. చాలా పేదవాడు. ఆ రోజు తండ్రి తద్దినం. భోక్తలను పిలుచుకొన్నాడు. నెయ్యికోసం గిన్నె పట్టుకొని అంగడికి వెళ్లాడు. దారిలో బృందావనం నుంచి వచ్చిన శ్రీకృష్ణభక్తులు కొందరు కనిపించారు. వారితో శ్రీమద్భాగవతం గురించి మాట్లాడుతూ కాలం గడిపివేశాడు. అపరాహ్ణం దాటింది. తండ్రి తద్దినమనీ, తాను నెయ్యికోసం వచ్చాననీ మరచిపోయాడు. ఎప్పటికో గుర్తు వచ్చింది. భార్య ఏమంటుందో అని భయపడుతూ నేతి గిన్నెను పట్టుకొని త్వరత్వరగా ఇంటికి వెళ్లాడు. తాను పిలిచిన భోక్తలు ముగ్గురూ తిరిగి వెళ్లిపోవడం చూచాడు. ఇంటిలోనికి వచ్చి "ఇదిగో! నెయ్యి తెచ్చాను. భోక్తలు వెళ్లిపోయారేమిటి?" భయపడుతూ భార్యను అడిగాడు. తన భర్తను వింతగా, ఎగాదిగ చూచి "బండిమీద అన్ని సరుకులు తెచ్చిందెవరు? అరటాకులు, నెయ్యి అన్ని వస్తువులు తెచ్చింది మీరు కాదా? శాస్త్ర ప్రకారంగా వంట చేశాను. ఇద్దరం కలిసి భోక్తలకు వడ్డించాము. సంభావన సమర్పించాము. భోక్తలు సంతృప్తిపడి ఇప్పుడే వెళ్లిపోయారు. ఇంట్లో డబ్బీ నిండా నెయ్యి ఉంది. మీకేమన్నా మతిపోయిందా? నాకు ఆకలవుతున్నది. వెంటనే భోజనానికి కూర్చోండి" అని గదమాయించింది భార్య. తన రూపంతో శ్రీకృష్ణ భగవానుడే దయచేసి తిథికార్యం పూర్తిచేసి వెళ్లాడని తెలుసుకొని శ్రీనర్సిమెహతా లోలోపల ఉప్పొంగి పోయాడు. ఈ వాస్తవం భార్యకు ఎంత చెప్పినా ఆమెకు బోధపడదని చెప్పకుండా ఊరకున్నాడు. మహాత్మాగాంధిగారి అభిమాన కవి ఈ నర్సీమెహతాయే. ద్వైతాద్వైత సంప్రదాయ ప్రవర్తకుడు రాధాకృష్ణ యుగళో

పాసకుడు అయిన శ్రీమదాచార్య నింబార్కుల జీవితంలో కూడా ఇటువంటి ఐతిహ్యమున్నది.

**మ. సిరికిం జెప్పఁడు శంఖచక్రయుగముం జేదోయి సంధింపఁ డే**
**పరివారంబును జీరఁ డభ్రగపతిం బన్నింపఁ డాకర్ణికాం**
**తరధమ్మిల్లముఁ జక్కనొత్తఁడు వివాదప్రోత్థిత శ్రీకుచో**
**పరిచేలాంచలమైన వీడఁడు గజప్రాణావనోత్సాహియై**

టీ : సిరికిన్+చెప్పడు = లక్ష్మీదేవికి కూడా చెప్పడు. చేదోయిన్ = చేతులు రెంటియందును, శంఖచక్రయుగమున్ = శంఖచక్రముల రెండింటిని; సంధింపఁడు = చేర్చుకొనడు; ఏ పరివారంబును= ఎటువంటి అనుచరులను; చీరఁడు = పిలువడు; అభ్రగపతిన్ = పక్షీంద్రుడైన గరుత్మంతుని, పన్నింపఁడు = సిద్ధముగా ఉండమని చెప్పడు. ఆకర్ణికాంతర = చెవియందలి పూవు వరకు జారిన, ధమ్మిల్లము = జుట్టు ముడిని; చక్కనొత్తఁడు = చక్కచేసికొనడు; వివాద ప్రోత్థిత = తగవుపడి లేచిన; శ్రీ = లక్ష్మీదేవి యొక్క; కుచ + ఉపరి = స్తనముల మీదనుండిన, చేల + అంచలమునైనన్ = చీర చెంగునైనను, గజప్రాణ + అవన + ఉత్సాహియై = గజరాజు ప్రాణాలను కాపాడుట యందలి ఉత్సాహముతో, వీడఁడు = విడువడు.

తా : ఆర్తుడైన గజేంద్రుని ప్రాణాలను కాపాడటానికి ఉత్సాహియైన శ్రీమన్నారాయణుడు హఠాత్తుగా లక్ష్మీదేవి ప్రక్కనుంచి లేచి బయలు దేరాడు. తాను ఎక్కడికి వెళుతున్నది లక్ష్మీదేవికి చెప్పలేదు. రెండు చేతుల శంఖచక్రాలు ధరింపలేదు. తన పరివారాన్ని రమ్మన లేదు. గరుత్మంతుని ఆరోహింప లేదు. చెవుల వరకు జారిన జుట్టును కూడా చక్క చేసుకో లేదు. అంతకు ముందు చదరంగ క్రీడలో ఓటమి పొంది తన చేత జిక్కిన లక్ష్మీదేవి పైట చెంగును సైతం విడువలేదు.

శ్రీమన్నారాయణుని ఆర్తత్రాణ పరాయణత్వం ఈ పద్యంలో వర్ణితమయింది. భగవంతుని అప్రాకృతమైన కళ్యాణ గుణ గణాలలో ఆర్తత్రాణ పరాయణత్వం ముఖ్యమైనది. "**నక్రగ్రస్త పదం సముద్ధతకరం బ్రహ్మాదయోభో సురాః, పాల్యంతామితి దీన వాక్యకరిణం దేవేష్వశక్తేషు యః, మా భైషీరితి యస్య నక్రహననే చక్రాయుధః, శ్రీధరః, ఆర్తత్రాణ పరాయణః స భగవా న్నారాయణో మే గతిః**" (శ్రీ నారాయణాష్టకం) "మొసలిచేత పీడింపబడిన తన తొండమును పైకెత్తి "ఓ బ్రహ్మాది దేవతలారా! నన్ను రక్షించండి" అని దీనంగా మొఱపెట్టుకొనే గజేంద్రుణ్ని రక్షించడానికి దేవతలు అసమర్థులయ్యారు. అది చూచి 'భయపడవద్దు' అంటూ మొసలిని వధించడానికి చేత సుదర్శన చక్రం ధరించిన దీనరక్షకుడు భగవన్నారాయణుడు నాకు ఏకైక రక్షకుడు". భగవద్భక్తి

యుక్తులైన దీనుల్ని రక్షించడం భగవంతుని బాధ్యత అవుతుంది. ఆయన విశ్వతోముఖుడు అందరి మొఱలను వినగలడు. ఆర్తులైన భక్తులను సంరక్షించడానికి వేగిర పడతాడు. విభీషణుడు తనను శరణు చొచ్చినపుడు శ్రీరాముడు **"అవాలోచిత విశేషాశేషలోక శరణ్యుడై"** అభయమిచ్చాడు. భగవద్రామానుజాలు **"ప్రపన్నార్తిహరం విష్ణుమ్"** అను శాస్త్రోక్తిని పురస్కరించుకొని తమ వైకుంఠ గద్యలో భగవంతుణ్ని అఖిల సత్వ దయైక సాగరుడ నీ శరణాగత వత్సలతకు ఏకైక సముద్రుడు అనీ, భక్తజనులను తన హృదయానికి హత్తుకొని కాపాడటం ఆయన ఏకైక భోగమనీ, గుణాలను, అవగుణాలను విచారించకుండగనే సమస్త జీవులపట్ల అనుకూల మర్యాదాయుతమైన శీలము గలవాడనీ వర్ణించారు. **"అనాలోచితగుణగణాఖండ జనానుకూలమర్యాదాశీలవత: (వైకుంఠ గద్య) స్వాభావికానవధికాతిశయగుణవత్తయా దేవతిర్యఙ్మనుష్యాద్యఖిల జనహృదయానందన్య"** (వైకుంఠ గద్య) "స్వాభావికము, అసీమము, అతిశయము అయిన కళ్యాణ గుణాలతో కూడియున్న వాడైనందున శ్రీమన్నారాయణుడు దేవతలకు, పక్షులకు, పశువులకు, మనుష్యాది సమస్త జీవులకు హృదయానందాన్ని కలిగిస్తాడు" అన్నారు. సకల సంప్రదాయాలు భగవంతుడు ప్రపన్నార్తిహరుడనే చెబుతున్నవి. శ్రీమద్రామాయణ మహాభారత భాగవతాది గ్రంథాలలో శ్రీమన్నారాయణుని ఆశ్రిత వాత్సల్యం గురించి, ఆర్తత్రాణ పరాయణత్వం గురించి విశేషంగా చెప్పబడింది. ఒక జంతువును రక్షించడంలో భగవంతుడు ఎంత వేగిరపడ్డాడో తెలపడానికి గజేంద్రమోక్షణ కథానకమే నిదర్శనము. భగవంతుని దీన రక్షాపరత్వాన్ని గురించి గజేంద్రమోక్షమును పురస్కరించుకొని ఒక ప్రాచీన సంస్కృత కవి చెప్పిన చక్కని శ్లోకం పోతనగారి ఈ పద్యానికి మూలమేమో అనిపిస్తుంది. **"అనాదృత చమూపతి ప్రహిత హస్త మస్వీకృత ప్రణీతమణిపాదుకం, కిమితి విస్మితాంత:పురమ్, అవాహనపరిష్కృతం పతగరాజ మారోహత: కరిప్రవర బృంహితే భగవత స్త్వరాయై నమ:"** "విపద్గ్రస్తుడైన గజేంద్రుణ్ని రక్షించడానికి హఠాత్తుగా గరుత్మంతుని జీను లేని పీఠంమీది కెక్కిన శ్రీమన్నారాయణుడు తన సేనాపతియైన విష్వక్సేనుణ్ని ఆదరించ లేదు. మణిమయములైన పాదుకలను కూడా ధరించలేదు. అంత:పుర స్త్రీలు "ఏమయింది? ఏమయింది?" అని ఆశ్చర్యంతో అరుస్తున్నా వారికి బదులు చెప్పకుండా అతి శీఘ్రంగా బయలుదేరాడు". భాగవతం పఠించి ప్రభావితులైన పండితులు, కవులు ఆయా మనోజ్ఞ ఘట్టాలను వర్ణించినట్లు మన కనేక సంస్కృత శ్లోకాలు

లభ్యమవుతున్నాయి. భాగవతాన్ని తెనిగింప నుద్యమించిన పోతనగారు ఆ శ్లోకాలను గమనించే ఉంటారనడంలో సందేహం లేదు. 13వ శతాబ్దిలో కాశ్మీర పండితుడు శార్ఙ్గధరుడు సంకలనం చేసిన సంస్కృత శ్లోకసంపుటి శార్ఙ్గధరపద్ధతిలో శ్రీమద్భాగవత ఘట్టాలకు చెందిన అనేక శ్లోకాలు లభ్యమవుతున్నాయి. శ్రీమద్భాగవత దశమస్కంధ పూర్వ భాగానికి శ్రీహరిసూరి అనే ఒక మహాకవి "హరిభక్తి రసాయనమ్" అనే శ్లోకరూప వ్యాఖ్యాన గ్రంథం రచించాడు. ఈయన క్రీ.శ.1656 నాటివాడు. దశమ స్కంధ పూర్వభాగంలో పూరింపదగిన అయిదువేల శ్లోకాలు రచించి మూల గ్రంథంలోని మనోజ్ఞఘట్టాలకు వన్నె తెచ్చాడు. శ్రీహరిసూరివలెనే మరెందరో ప్రాచీన కవి పండితులు భాగవత ఘట్టాలను వర్ణించి ఉండవచ్చును.

**వ. ఇట్లు భక్తపాలన పరాయణుండును, నిఖిలజంతు హృదయారవింద సదన సంస్థితుండును నగు నారాయణుండు కరికులేంద్ర విజ్ఞాపిత దీనాలాపంబు లాకర్ణించి లక్ష్మీకాంతా వినోదంబులం దగులు చాలించి, సంభ్రమించి, దిశలు నిరీక్షించి గజేంద్ర రక్షాపరత్వంబు నంగీకరించి నిజపరికరంబు మరల నవధరించి గగనంబున కుద్గమించి వేంచేయు నప్పుడు.**

టీ : ఇట్లు = ఈ విధంగా; భక్తజన పాలన పరాయణుండును = భక్తజనులను రక్షించు కార్యమునందు ఆసక్తుడును, నిఖిల జంతు = సకల జీవులయొక్క; హృదయ + అరవింద సదన = హృదయములనెడి పద్మ నిలయములందు; సంస్థితుండును = ఉండువాడును; కరికులేంద్ర విజ్ఞాపిత = గజేంద్రునిచే మొరపెట్టబడిన, నానావిధదీన + ఆలాపంబులు = అనేక విధములైన దీనవాక్యాలను; ఆకర్ణించి = విని; లక్ష్మీదేవితోడి వేడుకలందలి, తగులు = ఆసక్తిని, చాలించి, సంభ్రమించి = తొందరపొంది; దిశలు నిరీక్షించి = దిక్కులు పరికించి; గజేంద్రరక్షా పరత్వంబున్ = గజేంద్రుని రక్షించు కార్యమును, అంగీకరించి - సమ్మతించి, నిజపరికంబు = తన ఆయుధమైన సుదర్శన చక్రమును, అవధరించి = చిత్తమున తలచుకొని; గగనంబునకు = ఆకాశమునకు, ఉద్గమించి = (ఎగసి) లేచి, వేంచేయునప్పుడు = వచ్చునపుడు.

తా : భక్తజన రక్షకుడు, సర్వభూతాంతరాత్ముడు అగు శ్రీమన్నారాయణుడు గజేంద్రుని దీనాలాపాలను విని, లక్ష్మీదేవితో వినోదించడం విరమించి; గజేంద్రుణ్ని కాపాడాలని నిశ్చయించుకొని, తన సుదర్శన చక్రాన్ని స్మరించి, దిక్కులు పరికించి ఆకాశానికి లేచి వేంచేసే సమయంలో -

లక్ష్మీదేవి పద్మవనాలయ, శ్రీమన్నారాయణుడు నిఖిల జంతు హృదయ పద్మ నిలయుడు. అనగా సర్వభూతాంతరాత్ముడని అర్థం. నరాకృతితో ద్విభుజుడైయున్న

శ్రీకృష్ణభగవానుడు భక్త రక్షణావసరమందు చతుర్భుజుడైన శ్రీమన్నారాయణుడుగా ప్రత్యక్షమవుతాడు. లక్ష్మీస్వరూప అయిన రుక్మిణి వివశురాలై మంచం నుండి పడిపోతున్న సమయంలో దగ్గరున్న శ్రీకృష్ణుడు **"పర్యంకా దవరుహ్యాశు తాముత్థాప్య చతుర్భుజః** (శ్రీమద్భా10-60-26) అని శ్రీ శుకదేవుడు శ్రీకృష్ణునికి పర్యాయపదంగా చతుర్భుజుడన్న పదం ప్రయోగించడం గమనింపదగ్గది. **"విష్ణోః శ్రీ రనపాయినీ"** లక్ష్మీదేవి శ్రీమన్నారాయణునితో క్షణికమైన విశ్లేషము కూడా లేనిది. శ్రీమన్నారాయణునితో నిత్య యోగము కలది. కాంతిగల వస్తువునుండి కాంతిని విశ్లేషించడం సాధ్యం కానట్లుగా, భగవత్తత్త్వం నుంచి శ్రీతత్త్వాన్ని విశ్లేషించడం సాధ్యంకాదు. అట్టి లక్ష్మీదేవితో తగులు చాలించి గజేంద్ర రక్షా పరత్వంతో తొందరపడినాడని భావము.

**శ్రీశుక ఉవాచ:**

**శ్లో. ఏవం గజేంద్ర ముపవర్ణిత నిర్విశేషం**
**బ్రహ్మాదయో వివిధలింగభిదాభిమానాః**
**నైతే యదోపసస్పృపు ర్నిఖిలాత్మకత్వాత్**
**తత్రాఖిలామరమయో హరి రావిరాసీత్**

తా: శ్రీ శుకదేవుడిలా చెబుతున్నాడు. పరీక్షిన్మహారాజా! గజేంద్రుడు ఇలా నామరూప రహితమైన పరమాత్ముణ్ని స్తుతించాడు. అందుచేత భిన్న భిన్న నామాలు, రూపాలు గల దేవతలు తమ తమ నామ రూపాభిమానాల మూలంగా గజేంద్రుణ్ని రక్షించడానికి ముందుకు రాలేకపోయారు. అపుడు సర్వాత్ముడైన కారణంగాను, సర్వదేవస్వరూపుడైన కారణంగాను స్వయంభగవానుడు శ్రీమన్నారాయణుడు ఆవిర్భూతుడయ్యాడు.

గజేంద్రుడు వర్ణించిన నిఖిలగుణాశ్రయుడు, అఖిలదేవమయమూర్తి ఆవిర్భూతుడయ్యాడు. అందుకు కారణం గజేంద్రుని ప్రార్థనలో ఏ దేవుని విశేష నామోల్లేఖము లేకపోవడమే. అతడు హంసవాహను డనలేదు. వృషభవాహను డనలేదు. వజ్రపాణి అనలేదు. సృష్టికర్త అనిగానీ, సంహారకర్త అనిగానీ, స్వర్గాధిపతి అనిగానీ పేర్కొనలేదు. ఆయా దేవతల చిహ్నాలుగాని, వాహనాలుగాని, వారి కార్యాలుగాని రూపాలుగాని వర్ణించలేదు. గజేంద్రుడు ప్రయోగించిన విశేషణవిన్యాసంతో చేసిన ఈస్తవం బ్రహ్మాది దేవ బృందానికి బోధపడటం అసంభవమైన కారణంగా

పురుషోత్తముడైన శ్రీకృష్ణ భగవానుడు స్వయంగా గజేంద్రునికి ముక్తి కలిగించడానికి ఆవిర్భూతుడైనాడు. **"స ఆత్మా అంగా న్యన్యా దేవతాః"** ఇత్యాది శ్రుతివాక్యాలను అనుసరించి సకల దేవతలకు అంగిరూపంతో శ్రీకృష్ణ భగవానుడు ఆవిర్భూతుడై స్వయంగా గజేంద్రుని దగ్గరకు వచ్చాడని శ్రీ శుకదేవుడు పరీక్షిత్తుకు స్పష్టం చేశాడు. ఈ శ్లోకానికి ముందటి "స వై న దేవాసుర మర్త్య" శ్లోకంలో బ్రహ్మాది దేవతలు శ్రీకృష్ణ భగవానుని స్వల్ప మాత్రాంశలతో ఉద్భూతులైన వారని, శ్రీకృష్ణుడే సర్వకారణాలకు కారణమైనవాడని వ్యంజింపబడింది. ఆయా దేవతలు సర్వకారణ కారణులు కానందున గజేంద్రుని రక్షించడానికి ముందుకు రాలేనివారయ్యారు. సాత్వికత్వ - భౌతికత్వాలు లేకపోవడం అనేది ఒక వైలక్షణ్యం గజేంద్రునిస్తుతిలో ఉన్నది. స్త్రీత్వ పురుషత్వాలు లేకపోవడమనే ప్రాకృతధర్మరాహిత్యం మరొకటి గజేంద్రుని స్తుతిలో ప్రదర్శిత మయింది. ఏ జాతికి చెందిన ప్రాణి కాదు అని కూడా కథితమయింది. సత్త్వాది గుణాలు, పాప పుణ్యాలు, కర్మలు లేనివాడని చెప్పబడింది. పైన పేర్కొన్న సముదాయాన్ని ప్రవర్తింపజేసేవాడని వర్ణింపబడినవాడు. అతడెవరు? శ్రీమన్నారాయణుడు - సనాతన పరబ్రహ్మము, పూర్ణ పురుషోత్తముడు, సచ్చిదానంద రూపుడు శ్రీకృష్ణభగవానుడే కదా! భగవన్నామాలలో శ్రీకృష్ణనామమే విశేష్యము. తక్కిన నామాలన్నీ విశేషణాలే. జగత్తత్త్వము తెలిస్తే అది బ్రహ్మజ్ఞాన మవుతుంది. ఆత్మతత్త్వం తెలిస్తే అది పరమాత్మ జ్ఞాన మవుతుంది. లేదా యోగమవుతుంది. ఈశ్వరతత్త్వం తెలిస్తే అది శ్రీకృష్ణ భక్తి అవుతుంది లేదా భగవత్స్వరూపజ్ఞానమవుతుంది. భగవంతుడు సర్వదా ఒక్కడే **"ఏకమేవాద్వితీయం బ్రహ్మ"**అనే శ్రుతివాక్యాన్ని ఎవరూ కాదన లేరు. నిర్విశేషత్వ సవిశేషత్వాలు, నిర్గుణత్వ సగుణత్వాలు, నిరాకారత్వ సాకారత్వాలను గూర్చి వాదవివాదాలు జరపడం భగవంతునిపట్ల అపరాధం చేయడమే అవుతుంది. శ్రీ వేదాంత దేశికులు తమ "తత్త్వ ముక్తా కలాపం"లో ఇలా అన్నారు **"సావద్యం కేఽపి సోపాధిక మథ కతిచిచ్ఛక్తిభిర్జుష్ట మన్యే, స్వీకృత్యైకా ద్వితీయ శ్రుతిమపి జగదు స్తద్విశేష్యైక్య నిష్ఠామ్, నిత్యత్వం విగ్రహత్వం ప్రకృతి పురుషయో ర్దైతుతాం విశ్వకర్తుః, తద్వైశిష్ట్యం చ శాస్త్ర ప్రథిత మజహతాం కోఽపరాధోఽ తిరిక్తః"** ఏకమేవాద్వితీయ సర్వభవన సమర్థ సత్య సంకల్పుడైన పరబ్రహ్మ అనేక నామ రూప కర్మలను ప్రకటించడం ఐచ్ఛికంగా జరుగుతుంది. అట్టి భగవంతునికి **"విశేషణ పరిగ్రహ మాత్రం అపరాధః"** అంటారు శ్రీ వేదాంతదేశికులు. ఇట్టి అపరాధం తత్త్వవేత్తలందరు చేసినవారే. కొందరు బ్రహ్మమును

అవిద్యా విశిష్టుడంటారు. అదొక అపరాధం. కొందరు ఉపాధివిశిష్టుడంటారు. అదొక అపరాధం. మరికొందరు శక్తి విశిష్టుడనీ, కొందరు నిర్విశేషుడనీ అంటారు. ఇలా అనే వారందరు **"ఏకమేవాద్వితీయం బ్రహ్మ"** అనే శ్రుతివాక్యాన్ని ఉదాహరిస్తుంటారు. కాబట్టి **"సర్వేషా మపి సమాన దోషత్వమ్"** అని శ్రీ వేదాంత దేశికులు భగవంతుడు **"అశేష చిదచిత్ప్రకారం బ్రహ్మ ఏకమేవ తత్త్వమ్"** అను తమ విశిష్టాద్వైత సిద్ధాంతాన్ని నిరతిశయ సుందర శబ్దాలతో అభివ్యక్తం చేశారు. **"సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ"** అను శ్రుతివాక్యానికి శ్రీమద్రామానుజులు "సద్రూపుడు, చిద్రూపుడు, కాల - దేశ - వస్తు పరిచ్ఛేద రహితుడైనవాడు భగవాను''డని అర్థం చెప్పారు. నిఖిలాత్మకత్వమే నిర్విశేషత్వమని సారాంశము.

శ్రీకృష్ణుని భగవత్తత్త్వం గురించి శ్రీ శుకదేవుడిలా చెప్పాడు. **"కృష్ణమేన మవేహి త్వ మాత్మాన మఖిలాత్మనాం, జగద్ధితాయ సోప్యత్ర దేహీవాభాతి మాయయా"** (శ్రీమద్భా.10-14-54) ఈ యశోదానందనుడైన శ్రీకృష్ణుణ్ని నీవు ఆత్మలకు ఆత్మగా తెలిసికొనుము. లోకకల్యాణార్థము యోగమాయా సమావృతుడై దేహధారివలె కనిపిస్తాడు. **"దేహ దేహి విభాగోఽత్ర నేశ్వరే విద్యతే క్వచిత్"** భగవంతునియందు దేహ దేహి విభాగము ఏ మాత్రము ఉండదని శ్రీమధ్వాచార్యులవారు మహావారాహవచనాన్ని ఉదాహరించారు. పై శ్లోకంలో 'మాయ' అనగా ఆత్మీయ సంకల్పమని అర్థము. లేదా "కృప'' అని అర్థము. **"నాహం ప్రకాశః సర్వస్య యోగమాయాసమావృతః"** (గీత 7-25) భగవంతుడన్ని చోట్ల అందరికి కనిపించడు. కనిపించినపుడు అజ్ఞులు అది భగవంతుని మాయ అనుకొంటారు. అది భౌతిక దేహమని కూడా మూఢులు భావిస్తారు. **"మాయోపాధి రివ ప్రతీయతే న తు మాయోపాధి రిత్యర్థః"** అని శ్రీవంశీధర స్వామి అన్నారు. భగవంతుడు తన ప్రాకట్యానికి మాయోపాధిని స్వీకరిస్తాడని కొందరు వాదిస్తారు. అది శ్రీకృష్ణుని విషయంలో పొసగదు. శ్రీకృష్ణుడు సచ్చిదానంద స్వరూపుడు. ఆయనయే స్వయంభగవానుడు. భగవత్స్వరూపమనగా శ్రీకృష్ణుని రూపమే అవుతుంది. వేదాంతంలో సగుణ - నిర్గుణ; సవిశేష - నిర్విశేష వాదాలు కనిపిస్తాయి. నిర్విశేషవాదియైన శ్రీశంకరభగవత్పాదులు తమ బ్రహ్మసూత్ర వ్యాఖ్యానంలో (3-2-13) **"సవిశేషత్వమపి బ్రహ్మణోఽభ్యుపగంతవ్యమ్"** "పారమార్థికంగా నిర్విశేష బ్రహ్మమే. అయినా ఆయనను సవిశేషంగానే భావించాలి'' అన్నారు. ఇంతెందుకు? వేదాలను విభాగం చేసినవాడు వేదవ్యాసమహర్షి. వేదార్థాలు ఉపబృంహితమైనవే పురాణాలు.

వేదాలలోని నిగూఢార్థాన్ని తెలుసుకోడానికి పురాణాల సహాయం పొందడంకంటె వేరే ఉపాయం లేదు. పౌరాణిక జ్ఞానం లేకుండా వేదార్థ చర్చ చేసేవానిని చూస్తే వాడు తమ తలను బ్రద్దలు కొడతాడని వేదాలు భయపడిపోతాయి **"బిభేత్యల్పశ్రుతాద్ వేదో మా మయం ప్రహరిష్యతి"** అని వాయుపురాణం చెబుతున్నది. ఆ పురాణాలను రచించినవాడు వేదవ్యాస మహర్షియే. వేదార్థం ఆయనకంటె మరెవరు చెప్పగలరు? భగవంతుడు ప్రకృతి గుణాలకు సర్వథా అతీతుడు కనుక నిర్గుణుడయ్యాడు. ఆయన స్వరూపానికి సంబంధించిన అచింత్యానంత దివ్య గుణాలు నిత్యమూ ఆయనయందు నివసిస్తున్నాయి కనుక సగుణుడయ్యాడు. శ్రీకృష్ణ భగవానుడు తన భగవత్తత్త్వం గురించి శ్రీ శంకరునికి ఇలా చెప్పాడు. (పద్మపురాణం. పాతాళ ఖండం. 51, 66, 71) **(1) "యద్యద్య మే త్వయా దృష్టమిదం రూప మలౌకికం, ఘనీభూతామలప్రేమసచ్చిదానంద విగ్రహమ్, (2) "నీరూపం నిర్గుణం వ్యాపి క్రియాహీనం పరాత్పరం, వదన్త్యుపనిషత్సంఘా ఇదమేవ మయానఘ! (3) ప్రకృత్యుత్థ గుణాభావా దనంతత్వాత్తథేశ్వరమ్; అసిద్ధత్వా న్మద్గుణానాం నిర్గుణం మాం వదన్తి హి (4) అదృశ్యత్వా న్మమైతస్య రూపస్య చర్మచక్షుషా, అరూపం మాం వదన్తే తే వేదాః సర్వే మహేశ్వర (5) వ్యాపకత్వా చ్చిదంశేన బ్రహ్మేతి చ విదుర్బుధాః; అకర్తృత్వా త్ప్రపంచస్య నిష్క్రియం మాం వదన్తి హి. (6) మాయాగుణైర్యతో మేంశాః కుర్వంతి సర్గవాదికం, న కరోమి స్వయం కించిత్ సృష్ట్యాదిక మహం శివ!"** దీని తాత్పర్య మిది: "ఓ శివా! నా అలౌకిక (హానోపాదాన రహితము, దేహ దేహి భేద రహితము, స్వరూపభూతమైన భగవద్దేహము) రూపాన్ని నేడు నీవు దర్శించావు. ఈ దేహం విశుద్ధ ప్రేమ ఘనీభూతమైన శరీరము. ఇది సచ్చిదానంద రూపము. ఉపనిషత్సముదాయం నాయీ రూపాన్ని నిరాకార నిర్గుణ, సర్వవ్యాపి, నిష్క్రియ, పరాత్పర బ్రహ్మమని పేర్కొంటూ ఉంటుంది. నాలో ప్రకృతి జన్య గుణాలు (సత్త్వ - రజ స్తమస్సులు) లేని కారణంగాను; నా కళ్యాణగుణ సామర్థ్యాన్ని అంచనా వేయలేని కారణంగాను నన్ను నిర్గుణుడంటారు. నేను అనంతుడను కాబట్టి నన్ను ఈశ్వరుడంటారు. నాయీ రూపము చర్మచక్షువులకు అగుపింప జాలదు. కాబట్టి నన్ను రూపరహితునిగా నిరాకారునిగా వేదాలు వర్ణించాయి. నేను నా చైతన్యాంశతో సర్వవ్యాపకుడనైన కారణంగా పండితులు నన్ను బ్రహ్మమంటారు. ఈ ప్రపంచానికి కర్తను నేను కానందున నన్ను నిష్క్రియుడంటారు. ఓ శివా! నేను స్వయంగా ఏమీ చేయను. బ్రహ్మ విష్ణు రుద్రరూపమైన నా అంశలు ఈ సృష్ట్యాది కార్యాలు నిర్వహిస్తాయి". ఈ శ్లోకాలను బట్టి, ఉపనిషత్సముదాయాన్ని బట్టి శ్రీకృష్ణ భగవానుడే పరబ్రహ్మమనీ,

పరమాత్ముడనీ సర్వలోక మహేశ్వరుడాయనయే అనీ స్పష్టమవుతుంది. ఇంతెందుకు? భగవంతుడెవరో తెలుసుకోడానికి ఒక్క భగవద్గీత చాలు. సుకృత మున్నవానికి శ్రీకృష్ణుడు భగవంతుడుగా తోస్తాడు. శ్రుతి అదే చెబుతున్నది. **"నాయ మాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన, యమేవైష వృణుతే తమాం స్వామ్"** (కఠోపనిషత్తు 1-2-23) ఈ పరమాత్ముడు ప్రవచనాలవల్ల లభించడు. బుద్ధితో గ్రహింపలేము. వినుకలి చేతను తెలుసుకోలేము. ఆ భగవంతుడు ఎవనిపై కృప చూపుతాడో అతని ఎదుట తన సచ్చిదానంద స్వరూపాన్ని ప్రకాశింపజేస్తాడు.

**శ్లో. తం తద్వదార్త ముపలభ్య జగన్నివాసః**
**స్తోత్రం నిశమ్య దివిజైః సహ సంస్తువద్భిః**
**ఛందోమయేన గరుడేన సముహ్యామాన**
**శ్చక్రాయుధోఽ భ్యగమదాశు యతో గజేంద్రః**

తా : విశ్వాధారుడైన భగవానుడు అత్యంత పీడితుడైన గజేంద్రుణ్ని చూచాడు. అతని స్తోత్రాన్ని విన్నాడు. వెంటనే ఛందోమయుడైన గరుత్మంతుని అధిరోహించాడు. దేవతలు స్తుతిగానాలు చేస్తుండగా చక్రాయుధుడు శీఘ్రంగా గజేంద్రుడున్న చోటికి చేరుకొన్నాడు.

ఈ శ్లోకంలో చక్రాయుధుడన్న పదం శ్రీవిష్ణువునకు పర్యాయపదంగా ప్రయోగింపబడినదే కాని, సుదర్శన చక్రం చేబూని వచ్చినవాడని భావింపరాదు. భక్తవత్సలుడైన భగవంతుడు తన భక్తుణ్ని రక్షించడంలో ఎంత తొందర పడతాడో సూచించడానికి **"ఛందోమయేన గరుడేన"** అనగా వేదపఠనం ఎంత వేగిరంగా జరుగుతుందో అంతవేగంగా గజేంద్రుని దగ్గరకు వచ్చాడని అర్థం. **"వహ్నికుండ ప్రవిశ్యమాణరాజపుత్రవ్యాయేన"** అని శ్రీవంశీధర స్వామి ఉదాహరించారు. సభలో కూర్చున్న మహారాజు తన కుమారుడు అగ్నికుండంలో పడిపోవడం చూచి ఎంత ఆతురతతో, ఎంత స్నేహపారవశ్యంతో, ఎలాంటి సాధనం లేకుండా, ఎవరినీ పిలువకుండా తన బిడ్డణ్ణి కాపాడుకోవడానికి ఎంత వేగంగా పరుగెత్తుతాడో ఆర్త రక్షణ పరాయణుడు, భక్తవత్సలుడు ఆయిన భగవంతుడు అంత వేగంగా గజేంద్రుడున్న చోటికి చేరుకొన్నాడని శ్రీ వంశీధర స్వామి విశదీకరించారు. సుదర్శన చక్రం, పాంచజన్యశంఖం, కామోదకీగద, నందకఖడ్గం, శార్ఙ్గధనుస్సు ఇవి శ్రీ విష్ణుదేవుని మంగళకరములైన పంచాయుధాలు. ఇవి ఆయనకు స్వరూప భూతములైనవే

కాని, ప్రత్యేకములైన వస్తుమాత్రములు కావు. శ్రీకృష్ణుడు తాను సంకల్పించినపుడు చతుర్భుజుడైన విధంగా, ఆయన సంకల్పానుసారంగా ఈ మంగళాయుధాలు వెలువడుతుంటాయి. **"ప్రత్యనీకభయావహమ్, ఏకాంతభక్తిభావేన ప్రీతో భృత్యాభిరక్షణమ్"** (శ్రీమద్భా. 9-4-28) విరోధులకు భీతిని, భక్తులకు రక్షణను కలిగించేది సుదర్శన చక్రం. సుదర్శనం శ్రీకృష్ణదర్శనానికి చిహ్నం. ఉషఃకాలంలో శ్రీవిష్ణుపంచాయుధాలను స్మరించడం పుణ్యం. భగవంతుణ్ని ఆశ్రయించినవారికి అవి ఆయుధాలుగా తోచవు, ఆభరణాలుగా దర్శనమిస్తాయి. సుదర్శనచక్రంమధ్య ఓంకారముంటుంది. చక్రంలోని ఆరుదళాల మధ్య షడక్షర సుదర్శన మంత్రముంటుంది. ఆ తర్వాతి అష్టపత్రాలలో **"ఓం నమో నారాయణాయ"** అనే అష్టాక్షర మంత్రముంటుంది. ఆ పిమ్మటి ద్వాదశ దళాలలో వాసుదేవ మంత్రం **"ఓం నమో భగవతే వాసుదేవాయ"** ఉంటుంది. ఆ తర్వాతి పదహారు దళాలలో అకారాది షోడశాక్షరాలుంటాయి. ఆ పిమ్మట ముప్పై రెండు దళాలలో శ్రీనారసింహ మహామంత్రముంటుంది. సుదర్శన చక్రం సర్వకామదము. అది మోక్షద్వారము. ఋగ్యజుస్సామ బ్రహ్మమయము. అమృతమయము. ఆ చక్రానికి ఎదుట వసుగణం నివసిస్తుంది. దానికి దక్షిణాన ఆదిత్యులు, పశ్చాద్భాగంలో విశ్వదేవతలు, ఉత్తరాన బ్రహ్మ విష్ణు మహేశ్వరులు విరాజమానులై ఉంటారు. నాభిలో సూర్యచంద్రులుంటారు. పార్శ్వభాగం ఋక్కులచే ఆవృతమై ఉంటుంది. ఇట్టి సుదర్శన చక్రాన్ని ఉపాసింపదలచినవారు మొదటగా గోదానం చేయవలసి ఉంటుందని శాస్త్రం చెబుతున్నది. శ్రీ మద్భాగవతంలో (6-8) ప్రముఖమైన శ్రీ నారాయణకవచస్తోత్రంలో సుదర్శన చక్రం ఇలా వర్ణితమవుతుంది. **"చక్రం యుగాంతానలతిగ్మనేమి, భ్రమత్ సమంతాత్ భగవత్ప్రయుక్తం, దందగ్ధి దందగ్ధ్యరిసైన్య మాశు, కక్షం యథా వాయుసఖో హుతాశః"** ఓ సుదర్శన చక్రమా! నీవు చక్రాకారుడవు. నీ అంచులు ప్రళయకాలాగ్ని జ్వాలలవలె తీవ్రమైనవి. భగవంతుని ప్రేరణతో నీవు అంతటా పరిభ్రమిస్తుంటావు. వాయుసాహచర్యంగల అగ్ని ఎండు గడ్డిని వలె సమస్తమును దగ్ధం చేస్తుంటావు. ఆ విధంగానే నా శత్రుసేనలను శీఘ్రంగా దగ్ధం చెయ్యి - దగ్ధం చెయ్యి. **"స్ఫుర త్సహస్రార శిఖాతితీవ్రం, సుదర్శనం భాస్కరకోటితుల్యం, సురద్విషాం ప్రాణవినాశివిష్ణోః చక్రం సదాఽహం శరణం ప్రపద్యే"** ఇది శ్రీసుదర్శన చక్ర ధ్యానము. భగవంతుడు నిత్యుడైనట్లుగా, భగవత్స్వ రూప భూతములైన సుదర్శనాది పంచాయుధాలు కూడా నిత్యములే. సుదర్శన దేవుని అనుగ్రహమే భగవదను

గ్రహము. శ్రీవిష్ణుహృదంతరవర్తి సుదర్శన చక్రము. సుదర్శనస్వామికి శ్రీకృష్ణునియందు ప్రేమ అధికము. శత్రువులున్నారని తెలిసినంతనే అక్కడికి స్వయంగా వెళ్లి వారిని నశింపజేస్తాడు. శత్రుసంహారకాండలో సుదర్శనుని దీక్ష గొప్పది. భగవంతునికి శత్రువు లెవ్వరూ నిజానికి ఉండరు. **"సమోహం సర్వభూతేషు న మే ద్వేష్యోస్తి న ప్రియః** (గీత.9-29) నాకెవ్వరు ద్వేష్యులు లేరు. ప్రియులును లేరు. నే నందరియందును సమానాదరభావం కలవాడను సుమా! అన్నాడు శ్రీకృష్ణ భగవానుడు. భగవద్భక్తులకు శత్రువులైనవారే ఆయనకు శత్రువులు. సుదర్శనస్వామి కూడా నిర్మూలించేది వారినే. దేవతలచే నుతింపబడుతూ శ్రీమన్నారాయణుడు గజేంద్ర రక్షణకు వస్తున్నాడనడంలో శేషవిష్వక్సేనాది భగవత్పరివారం వెంట వస్తున్నదని భావించాలి. భగవంతుడు ఒక జంతువును రక్షించడంలో చూపిన అపార కారుణ్యాతిశయానికి అబ్బురపడి, ఆయనచే నిలుపబడిన లీలా పురుషులైన బ్రహ్మాదులందరు ఆ సమయంలో ఆయన్ను సేవించి ధన్యులవుతారు. భగవంతుని సగుణత్వ సాకారత్వ సవిశేషత్వాల నిరూపణకు తామస మన్వంతరంలో ప్రబల నిదర్శనంగా నిలిచిన అత్యద్భుత ఘటన ఈ సుదర్శన దర్శనం.

**శ్లో. సోఽన్త స్సరస్యురుబలేన గృహీత ఆర్తో**
**దృష్ట్వా గరుత్మతి హరిం ఖ ఉపాత్త చక్రం**
**ఉత్క్షిప్య సాంబుజకరం గిర మాహ కృచ్ఛ్రా**
**న్నారాయణాఖిలగురో భగవన్ నమస్తే.**

తా: సరోవరంలోపలి బలిష్ఠమైన మొసలి చేత పట్టువడి గజేంద్రుడు అత్యంతార్తితో వ్యాకులు డయ్యాడు. ఆ సమయంలో అతడు ఆకాశంలో గరుడవాహనం పైన చక్రాయుధధారియై ఆవిర్భవించిన శ్రీహరిని దర్శించాడు. వెంటనే తన తొండంతో ఒక పద్మాన్ని పైకెత్తి పట్టుకొని అతి ప్రయాసతో "నారాయణా! అఖిల జగద్గురూ! భగవన్! నీకు నమస్కారము" అనగలిగాడు.

నమస్కారాత్మకమైన భక్తి నవవిధ భక్తిమార్గాలలో ఒకటి. దానికే 'వందన' మని నామాంతరము. కొంతమంది భక్తులకు భగవంతుని అనంత కళ్యాణైశ్వర్యాలను శ్రవణం చేయడానికి గాని, భగవచ్చరణ సేవ చేయడానికి గాని అధికారం - యోగ్యత లేకపోవచ్చు. అలాంటి దైన్యాక్రాంత హృదయులు భగవంతునికి కృతజ్ఞతాపూర్వకంగా కేవలం ఒక నమస్కారం చేస్తే చాలు, భగవంతుడు ప్రసన్నుడవుతాడు. సాష్టాంగ

నమస్కారం శ్రేష్ఠమైనదే అయినా కొందరు చేయలేక పోవచ్చు. వారు మనస్ఫూర్తిగా రెండు చేతులను మోడ్చితే చాలు. నమస్కారం సర్వయజ్ఞాలలో శ్రేష్ఠమైనది. ఒకసారి చేసిన సాష్టాంగ నమస్కారంతోనే శ్రీహరి ప్రసన్నుడవుతాడు **"నమస్కారః వ్నృతో యజ్ఞః సర్వయజ్ఞేషు చోత్తమః, నమస్కారేణ చైకేన సాష్టాంగేన హరిం వ్రజేత్"** క్రియాశక్తి సమర్పణమే నమస్కారము. (శ్రీనారసింహ పురాణం) భగవానునికి, సూర్య భగవానునికి శిరసువంచి, చేతులు పైకెత్తి నమస్కరించాలని భరతుని నాట్యశాస్త్రం కూడా చెబుతున్నది. ఇక్కడ గజేంద్రుడు పశువు కాబట్టి తన (కరమును) తొండమును పైకెత్తి నమస్కారంతోపాటుగా భగవంతునికి పుష్పం సమర్పించాడు. **"పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి, త దహం భక్త్యుపహృతమ్, అశ్నామి ప్రయతాత్మనః"** (గీత 9-26) "నాకు సమర్పించడమే పరమ ప్రయోజనంగా భావించునటువంటి పరిశుద్ధ మనస్కుడు భక్తితో సమర్పించే పత్రము - పుష్పము - ఫలము - తోయము నైనను నేను పరమప్రీతితో ఆరగిస్తానన్నాడు శ్రీకృష్ణభగవానుడు. భక్తి సులభుడు భగవంతుడనీ, భక్తులకు అది సుఖారాధన కార్యమవుతుందనీ గీతలో చెప్పబడింది. సరోవరంలో ఉన్న గజేంద్రునికి భగవత్సమర్పణకు తామరపువ్వు సులభంగా లభ్యమయింది. అర్చారూపంలో ఉన్న భగవంతుడు కూడా భక్తితో సమర్పించిన పత్రాదికాలను ప్రీతితో స్వీకరిస్తాడని గ్రహింపవలసి ఉంది. అలా గ్రహించేవాడెవరు? **"సర్వతః పాణిపాదం యత్ సర్వతోఽక్షిశిరోముఖమ్"** (గీత. 13-13) గల భగవంతుడు అనగా శ్రీకృష్ణుడు. భగవచ్ఛబ్దవాచ్యుడు శ్రీకృష్ణుడే. **"శుద్ధే మహావిభూత్యాఖ్యే పరే బ్రహ్మణి శబ్ద్యతే, మైత్రేయ భగవచ్ఛబ్ద స్సర్వకారణకారణే"** (శ్రీ విష్ణుపురాణం 6-5-72) మైత్రేయా! సకల కారణ కారణుడు, మహా విభూతి సంజ్ఞుడైన పరబ్రహ్మమునకు భగవచ్ఛబ్దం ప్రయోగిస్తారు. సంపూర్ణైశ్వర్యం, సంపూర్ణ ధర్మం, సమగ్ర యశస్సు, సంపూర్ణ సంపద, సంపూర్ణ జ్ఞాన - వైరాగ్యాలు ఆరు భగమంటారు. ఈ ఆరింటిని కలవాడు భగవంతుడు. **"ఐశ్వర్యస్య సమగ్రస్య ధర్మస్య యశస శ్శ్రియః, జ్ఞాన వైరాగ్యయో శ్చైవ షణ్ణాం భగ ఇతీరణా" "వసంతి యత్ర భూతాని భూతాత్మ న్యఖిలాత్మని స చ భూతేష్వశేషేషు వకారార్థ స్తతోఽ వ్యయః"** (శ్రీవిష్ణు.పు.6-5-74-75) ఈ అఖిల భూతాత్మునియందు, అనగా వాసుదేవునియందు సకల భూత గణాలు నివసిస్తుంటాయి. సమస్త జీవులలో నివసించేవాడు కాబట్టి ఆ భగవంతునికి అవ్యయుడనే పేరు కలిగింది. భగవంతుడు సవిశేషుడు, సాకారుడు, సగుణుడు, సచ్చిదానందరూపుడు కావుననే భక్తులు

సమర్పించిన పదార్థాన్ని ఆరగిస్తా నన్నాడు. ఈ శ్లోకంలో నారాయణనామం తర్వాత భగవచ్ఛబ్దం కూడా ప్రయోగింప బడింది. భక్తసంరక్షణకు శ్రీకృష్ణ భగవానుడు చతుర్భుజాలతో, శంఖ చక్రాలతో ఆవిర్భవిస్తాడనీ, ప్రేమ భక్తుల సమక్షంలో శిఖపింఛమౌళిగా, పీతాంబరధారిగా, వనమాలిగా మురళీధరుడై ఆవిర్భవిస్తాడనీ శాస్త్రపురాణాదులు చెపుతున్నవి. శ్రీ శంకర భగవత్పాదులు, భగవద్రామానుజాలు మొదలైన నామాలలోని భగవచ్ఛబ్దం కేవలం పూజ్యవాచకం. అది ఔపచారిక ప్రయోగమవుతుంది. **"ఉత్పత్తిం చ వినాశం చ భూతానా మాగతిం గతిమ్, వేత్తి విద్యా మవిద్యాం చ స వాచ్యో భగవానితి"** లోకోత్పత్తిని, వినాశనమును, జీవుల రాకపోకలను, విద్యను, అవిద్యను తెలుసుకొన్న పూజనీయుణ్ని భగవానుడని ఔపచారికంగా పేర్కొంటారని శాస్త్రం చెబుతున్నది. "అఖిల గురువు" అనగా సర్వలోకోపదేష్ట అని అర్థం. సకల జీవరాశికి హితము కోరువాడు - అఖిల గురువు. నీవు సకల లోకములకు గురుడవు. ఉపదేష్టవు. "నీ మహిమ నాకేమి తెలుస్తుంది? నేను చదువుకొన్నదానను కాను. పెద్దల నడిగి తెలుసుకొన్నదానను కాను. కృష్ణా! యోగేశ్వరా! అఖిలగురూ! భగవన్! నీకు నమస్కారము. పురుషోత్తమ జ్ఞానము భక్తి చేతనే ప్రాప్తిస్తుంది." **"శ్రీకృష్ణ కృష్ణసఖ వృష్ణ్యృషభావనిధ్రుగ్ - రాజన్యవంశదహనా నపవర్గ వీర్య, గోవింద గోద్విజ సురార్తి హరావతార యోగేశ్వరాఖిలగురో భగవన్ నమస్తే"** (శ్రీమద్భా.1-8-43) అని కుంతీదేవి ప్రార్థించింది. **"అచింత్యైశ్వర్య బోధకాని చరిత్రాణి వీర్యాణి"** శ్రీకృష్ణుని అచింత్యైశ్వర్య వీర్యాన్ని తెలుసుకోవడం జ్ఞానులకే సాధ్యం కాదు. తాను అజ్ఞురాలను అని తెలుపుకొన్నది కుంతీదేవి. గజేంద్రుడును నేను పశువును, నీ మహిమ నాకెలా తెలుస్తుంది? అనే చోట "అఖిలగురో" అని భగవంతుణ్ని సంబోధించాడు. **"కృష్ణం వందే జగద్గురుమ్"** గురువైనవాడెల్లప్పుడు సమస్త జీవులకు శ్రేయస్సునే కోరతాడు. **"రిక్తహస్తేన నోపేయా ద్రాజానం దైవతం గురుమ్"** రిక్తహస్తాలతో మహారాజును, దైవతమును, గురువును దర్శింపరాదని శాస్త్రము. అందుచేతనే, అఖిలలోకగురువునగు భగవంతునికి సమర్పించడానికి గృహీతాంబుజకరుడైనాడు గజేంద్రుడు. భగవన్నారాయణుడు పరమతత్త్వము. ఆయనయే పరమ జ్ఞానము. పరబ్రహ్మము, పరంజ్యోతి, పరమాత్మ, పరాత్పరుడు శ్రీమన్నారాయణుడే - ఆయన తప్ప మరేమియు లేదు. **"యచ్చ కించి జ్జగత్సర్వం దృశ్యతే శ్రూయతేపి వా; అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః"** అని వేదం కీర్తిస్తున్నది. **"నారాయణః పరం బ్రహ్మ తత్త్వం నారాయణః పరః, నారాయణః**

**పరంజ్యోతి రాత్మా నారాయణః పరః, పరాదపి పరశ్చాసౌ తస్మాన్నాస్తి పరం మునే"** (శ్రీనృసింహపురాణం 64-63-64) ఈ విశ్వంలో కనిపించేది వినిపించేది, లోపల బయట అంతట నారాయణునిచేత వ్యాప్తమై ఉన్నది. శ్రీమన్నారాయణుడే సర్వోత్తమ జ్ఞానము, యోగము, ధర్మము కూడా. మునీశ్వరులు ఆ నారాయణునే యథారుచితో, యథామతితో భిన్న భిన్న నామ రూపాలు గల వానినిగా వ్యాఖ్యానించారు. మేధావులైన మహానుభావులు సుదీర్ఘమైన అధ్యవసాయపూర్వకంగా సమస్త శాస్త్రాలను పఠించి, మననంచేసి, సమన్వయాత్మకంగా, నిష్కర్షగా చెప్పినది శ్రీమన్నారాయణుని ఆరాధించటమే సమస్త జనులకు సర్వశ్రేష్ఠమైన పరమోత్తమ కర్తవ్యము అని. **"ఆలోడ్య సర్వశాస్త్రాణి విచార్య చ పునః పునః, ఇదమేకం సునిష్పన్నం ధ్యేయో నారాయణః సదా"** ఈ శ్లోకం వేదవ్యాస ప్రోక్తమైన సమస్త పురాణాలలోను కనిపిస్తుంది. వేదం, శ్రీమద్రామాయణం, మహాభారతం, అష్టాదశ పురాణాలు ఆదిలోను, అంతంలోను శ్రీమన్నారాయణునే కీర్తించాయి. **"కేచిద్ వదంతి ధనహీనజనో జఘన్యః, కేచిద్ వదంతి గుణహీనజనో జఘన్యః, వ్యాసోవదత్యఖిలవేదవిశేషవిజ్ఞో నారాయణస్మరణహీనజనో జఘన్యః॥"** కొందరు ధనహీనుణ్ని నీచుడంటారు. మరికొందరు గుణహీనుణ్ని నీచుడంటారు. సకల వేదవిశేషజ్ఞులైన వేదవ్యాసులవారు నారాయణస్మరణం లేనివాణ్ని మాత్రమే నీచుడంటారు. **"శ్రీమన్నారాయణో విష్ణుః వాసుదేవోఽభిరక్షతు"** (శ్రీవిష్ణు దివ్యసహస్రనామ స్తోత్రం) "శ్రీమన్నారాయణుడు, విష్ణువు వసుదేవుని కుమారుడునగు శ్రీకృష్ణ భగవానుడు రక్షించుగాక!" పై వాక్యంలో వాసుదేవుడు **"వృష్ణీనాం వాసుదేవోఽస్మి'** ' (గీత 10-37) అర్జునా! నేను వృష్ణివంశీయులలో వాసుదేవుడను, **"అయమేవ తవ సఖా'** ' నీకు సుహృత్తయినవాణ్ని అని చెప్పినట్లుగా వాసుదేవ శబ్దం ఇక్కడ సవిశేష సగుణ సాకార సచ్చిదానంద రూపుడగు శ్రీకృష్ణునికే వాచ్యమయిందని గ్రహించాలి. 'వాసుదేవ' శబ్దమునకు భగవచ్ఛబ్దమునకు భేదం లేదు. కాని, ద్వాదశాక్షర మహామంత్రము **"ఓమ్ నమో భగవతే వాసుదేవాయ"** అని సగుణసవిశేష పరబ్రహ్మమును సుస్పష్టం చేస్తున్నది. వాస్తవమునకు సర్వేశ్వరేశ్వరుడగు శ్రీకృష్ణునిగూర్చి సవిశేష నిర్విశేష వాదము చేయడం దోషమవుతుంది. ఆయన సవిశేషుడు, నిర్విశేషుడు కూడా.

**శ్లో. తం వీక్ష్య పీడిత మజః సహసావతీర్య**
**సగ్రాహ మాశు సరసః కృపయోజ్జహార**

**గ్రాహో ద్విపాటితముఖా దరిణా గజేంద్రం**
**సంపశ్యతాం హరి రమూముచదుచ్ఛ్రియాణామ్**
**"ఇతి శ్రీమద్భాగవతే మహాపురాణే పారమహంస్యాం సంహితాయాం అష్టమస్కంధే**
**మన్వంతరానువర్ణనే గజేంద్రోపాఖ్యానే ద్వితీయోఽధ్యాయః".**

తా: గజేంద్రుడు గ్రాహగ్రస్తుడై అత్యంత పీడితుడై ఉండటం భగవంతుడు చూచాడు. వెంటనే గరుత్మంతునిపైనుండి క్రిందికి దిగాడు. పరమకృపాళువై గజేంద్రునితోపాటుగ మొసలిని కూడా సరోవరం నుండి బయటికి లాగాడు. లాగి తన సుదర్శన చక్రంతో మొసలి నోటిని తెగనరకి గజేంద్రుణ్ని దేవతలందరు చూస్తుండగా విడిపించాడు.

భగవంతునిసుదర్శనంచేత కాలరూపమకరం నాశనమవుతుంది. సుదర్శన ప్రభ అందరికి దర్శన మిస్తుంది. గజేంద్రుడు భగవంతునికి సమర్పించడానికి శుండాదండ నిక్షిప్తమైన పద్మాన్ని చూపాడు. తులసీ కమలాలు భగవంతునికి అత్యంత ప్రియమైనవి. కమలం బ్రహ్మసృష్టి కాదు. అది క్షీరాబ్ధిశాయి శ్రీమన్నారాయణుని నాభినుంచి ఉద్భవించింది. ఆయనకు పరమ ప్రియమైనది. దాన్ని ఆప్యాయంగా అందుకొన్నాడు భగవంతుడు. గజేంద్రుడు భగవద్దర్శనంలో లీనమైనాడు. ఆయన్ను స్మరించడం మరచిపోయాడు. అదే ఉచ్ఛ్రశ్రేణికి చెందిన స్మరణ మవుతుంది. భగవంతుడు ఆర్తబంధువు. భక్తవత్సలుడు. బయటి బలము ఎందుకూ ఉపయోగపడదు. అవసాన దశలో గజబలమున్నప్పటికీ దాని ఉపయోగమేమీ ఉండదు. అని నిశ్చయించి దుర్బలులకు బలమైనవాడు భగవంతుడే అని గ్రహించి గజేంద్రుడు శరణాగతి చేశాడు.

**మ. తనవెంటన్ సిరి, లచ్చి వెంట నవరోధవ్రాతమున్ దాని వె**
**న్కను బక్షీంద్రుఁడు వానిపొంతను ధనుఃకౌమోదకీశంఖచ**
**క్రనికాయంబును నారదుండు ధ్వజినీకాంతుండు రా వచ్చి రొ**
**య్యన వైకుంఠపురంబునం గలుగువా రాబాలగోపాలమున్**

టీ : తన వెంటన్ = తన వెంబడి, సిరి = లక్ష్మి, లచ్చి వెంటన్ = లక్ష్మీదేవి వెంబడి; అవరోధ వ్రాతమున్ = అంతఃపుర స్త్రీ సమూహమును; దాని వెన్కను, ఆ సమూహము వెంబడి, పక్షీంద్రుఁడు = గరుత్మంతుడు, వాని పొంతను = అతనికి చేరువగా, ధనుః కౌమోదకీ శంఖ చక్ర నికాయంబును = శార్ఙ్గమనే ధనుస్సు, కౌమోదకి అనే గదాయుధం, పాంచజన్యమనే శంఖం, సుదర్శనమనే చక్రం - వాటి సమూహమును (నందకమనే ఖడ్గము మొ॥), నారదుండు; ధ్వజినీకాంతుండు = విష్ణుసేనాధిపతియగు విష్వక్సేనుడును; రాన్ = రాగా; ఒయ్యన =

క్రమముగా, వైకుంఠపురంబునం గలుగు వారు = వైకుంఠ నగరంలో గల; ఆబాల గోపాలమున్ = పిల్లలనుండి పశువుల కాపరులవరకు గల వారందరు, అనగా నిత్య పార్షదులు, నిత్యసూరులు మొదలైన వారందరు వచ్చిరి.

తా : ఆర్తత్రాణ పరాయణుడగు శ్రీమన్నారాయణుడట్లు త్వరపడి పోవుచుండగా ఆయనవెంట లక్ష్మీదేవియు, ఆమె వెంట అంతఃపుర స్త్రీ సమూహమును, ఆ సమూహము వెంట గరుత్మంతుడును, అతని వెంత శ్రీ విష్ణువు యొక్క చైతన్య మూర్తులైన శంఖ చక్రాది దివ్యాయుధాలును, నారద మహర్షియు, విష్వక్సేనుడును వెంబడింపగా చూచి వైకుంఠపురము నందలి సమస్త దేవతలును కదలి వచ్చిరి.

వైకుంఠం : త్రిగుణాలలో రజోగుణ మొకటి. సత్వగుణ తమోగుణాలు లేనిదే రజోగుణము నిలువ లేదు. కాబట్టి రజోగుణమంటే 'ప్రకృతి' అని అర్థం. త్రిగుణాలు గలిగిన ఈ ప్రకృతిమండలానికి పైన భగవంతుని దివ్యధామమున్నది. దానినే వైకుంఠమని, పరమవ్యోమమని, గోలోకమని, పరమపదమని పేర్కొంటారు. శ్రీమద్భాగవతము భగవల్లోకమును బ్రహ్మమని పేర్కొన్నది. **"సత్యం జ్ఞాన మనంతం యద్ బ్రహ్మ జ్యోతిః సనాతనమ్** (శ్రీమద్భా 10-14-15) "విష్ణోః పదే పరమే మధ్వ ఉత్సః" (ఋగ్వేదం) శ్రీవిష్ణుభగవానుని పరమపదంలో మాధురీ స్రోతస్సున్నదని శ్రుతి తెలుపుతున్నది. బ్రహ్మ నివసించే సత్యలోకానికి పైన శ్రీవిష్ణు పరంధామమున్నది. దాని దర్శనం దేవతలకు కూడా దుర్లభం. అది పవిత్రస్థానము. సూర్యాగ్నుల కంటె అధికంగా భాసమానమైన, నిశ్చలమైన, అపరిణామి, అవినాశి అయిన శ్రీ వైకుంఠధామమున్నదని మహాభారతం తెలుపుతున్నది. **"అత్యర్కానల దీప్తం తత్ స్థానం విష్ణోర్మహాత్మనః"** శ్రీమద్భగవద్గీతలో శ్రీకృష్ణుడు తన స్థానాన్ని గూర్చి **"యోగీ పరం స్థాన ముపైతి చాద్యమ్"** (గీత 8-28) యోగీశ్వరులు ఆద్యమైన పరంధామానికి చేరుకొంటారనీ, **"యద్ గత్వా న నివర్తంతే తద్ ధామ పరమం మమ"** (గీత 15-6) నా భక్తులైన ఈ మానవులు ఏ చోటికి వెళ్లి ఆవృత్తినిగాని పునరావృత్తినిగాని పొందరో అదియే నా పరమధామము అని శ్రీకృష్ణ భగవానుడన్నాడు. శ్రీ వైకుంఠ ప్రాప్తికి సాధనమేదో శ్రీమద్భాగవతం స్పష్టం చేసింది. **"అకామః సర్వకామో వా మోక్షకామ ఉదారధీః, తీవ్రేణ భక్తి యోగేన యజేత పురుషం పరమ్"** (శ్రీమద్భా. 2-3-10) బుద్ధిమంతుడైన పురుషుడు నిష్కాముడుగానో, సకల కామనాయుక్తుడు గానో, లేదా మోక్షకామిగానో తీవ్రమైన ప్రేమభక్తి యోగంతో పురుషోత్తముడైన భగవానుణ్ని ఆరాధించాలి. పురుషోత్తమ, భగవచ్ఛబ్దాలు రెండూ శ్రీకృష్ణుణ్ని ఉద్దేశించినవే.

**వ. తదనంతరంబ ముఖారవింద మకరంద బిందు సందోహ పరిష్యందమానానంద దిందిందిరయగు నయ్యిందిరాదేవి గోవిందకరారవింద సమాకృష్యమాణ సంవ్యానచేలాంచలయై పోవుచు -**

టీ : తత్ + అనంతరంబ = ఆ తర్వాతనే; ముఖ + అరవింద = ముఖమనెడి పద్మమునుండి; మకరంద బిందు = పూదేనె బిందువులు; (ఘర్మజల బిందువులు) పరిష్యందమాన = స్రవించుచుండగా; ఆనందత్ = ఆనందించుచున్నట్టి; ఇందిందిరయగు = తుమ్మెదలు గలదియగు; ఆ + ఇందిరాదేవి = ఆ లక్ష్మీదేవి; గోవింద = గోవిందుని (శ్రీకృష్ణుని); కర + అరవింద = పద్మము వంటి చేతితో, సమాకృష్యమాణ = లాగబడుచున్న; సంవ్యాన = పైట; చేల + అంచలయై = చీర చెఱగు కలదియై, పోవుచు -

తా : ఆ లక్ష్మీదేవి ముఖమును కమలమను భ్రాంతిచే మధుబిందువులకై తుమ్మెదలు వ్రాలి యుండగా, తన కొంగు విడువక శ్రీవిష్ణువు అట్లే పట్టుకొని లాగుకొనిపోవుచుండగా ఆమె పోవుచు -

శ్రీమన్నారాయణుని ఎడబాయకుండగా నిత్యము ఆయన వెంట నుండునది లక్ష్మీదేవి. అందుచే ఆమెను 'నిత్యానపాయిని' అని శ్రీమద్రామానుజులు తమ శరణాగతి గద్యలో స్తుతించారు. **"శ్రీవత్సవక్షా నిత్యశ్రీః" "నిత్యై వైషా జగన్మాతా విష్ణో శ్రీ రనపాయినీ, అన్యేషు చావతారేషు విష్ణో రేషానపాయినీ"** శ్రీవిష్ణుదేవుని ఇతరావతారాలలో కూడా లక్ష్మీదేవి తన భర్తను ఎడబాయకుండా ఉంటుంది. **"పతిభావో హి మర్యాదా, ప్రియాభావో హి పోషణం"** పతిభావంలో మర్యాద ఉంటుంది. ప్రియాభావంలో ఇచ్చుకోవడమే ఉంటుందిగాని పుచ్చుకోవడం ఉండదు. భరణపోషణలు ప్రేమభక్తిమార్గంలో ఉంటాయి. కాని, జ్ఞాన మార్గంలో భరించేవాడు ఉండడు. పోషింపబడేవాడును ఉండడు. శ్రీమద్రామాయణంలో నిజానికి సీతాదేవి శ్రీరాముని ఎడబాయ లేదు **"అవతారేష్వపి కదాచి ద్విశ్లేషశోకాదే రభినయమాత్రమేవ"** శ్రీరామావతారంలో శ్రీరాముడు సీతను, సీత శ్రీరాముని ఎడబాయడం శోకించడం కేవలం అది అభినయం మాత్రమే అని శ్రీవేదాంత దేశికులు గద్యత్రయ వ్యాఖ్యలో స్పష్టంచేశారు. భక్త రక్షణకు వెళుతున్నప్పుడు కూడా శ్రీమన్నారాయణుడు శ్రీలక్ష్మీ సహితుడై వెళతాడని గ్రహించవలయును. **"రాఘవత్వేఽ భవత్సీతా రుక్మిణీ కృష్ణ జన్మని, అన్యేషు చావతారేషువిష్ణో రేషానపాయినీ** (శ్రీ విష్ణు. పు. **1-9-144**) శ్రీ విష్ణువు శ్రీరాముడుగా అవతరించినపుడు లక్ష్మీదేవి సీతగా, శ్రీకృష్ణుడుగా అవతరించినపుడు ఆమె రుక్మిణిగా అవతరించి ఎడబాయకుండా ఉన్నది. **"దేవత్వే దేవరూపా సా మానుషత్వే చ మానుషీ"**

దేవత్వంలో ఆమె లక్ష్మి. మానుషత్వంలో ఆమె రుక్మిణి. లక్ష్మీదేవి సీతగా అవతరించి 'రావణాది దుష్టనిగ్రహ సాధనభూత' యై శ్రీరామునికి సహకరించిందని శ్రీధరస్వామి విష్ణు పురాణ వ్యాఖ్య.

**మ. తన వేంచేయు పదంబుఁ బేర్కొనఁ డనాథస్త్రీజనాలాపముల్**
**వినెనో! ముచ్చులు ముచ్చిలించిరొ ఖలుల్ వేదప్రపంచంబులన్**
**దనుజానీకము దేవతానగరిపై దండెత్తెనో! భక్తులం**
**గని చక్రాయుధుఁ డేడి చూపుఁడని ధిక్కారించిరో దుర్జనుల్.**

టీ : తన వేంచేయు పదంబున్ = తాను వెళ్లెడి చోటును; పేర్కొనఁడు = చెప్పడు; అనాథ స్త్రీజన + ఆలాపముల్ వినెనో! = దిక్కులేని స్త్రీల మొఱ విన్నాడో ఏమో; ఖలుల్ = నీచులైన, ముచ్చులు = దొంగలు; వేద ప్రపంచంబులన్ = వేద సమూహములను; ముచ్చిలించిరొ = దొంగిలించినారేమో! దనుజ + అనీకము = రాక్షస సైన్యము; దేవతా నగరిపై = అమరావతిపై దండెత్తెనో = దాడి చేసెనో ఏమో! భక్తులన్ + కని = భక్తులను చూచి, చక్రాయుధుఁడు = శ్రీవిష్ణువు; ఏడి చూపుఁడు = ఎక్కడ, చూపించుడు, అని, దుర్జనుల్ = దుష్టులు, ధిక్కారించిరో = తిరస్కరించిరో ఏమో!

తా : తన భర్త తన పైట చెంగును విడవడం కూడా మరచి త్వరత్వరగా వెళ్లిపోవడం చూచి లక్ష్మీదేవి ఇలా ఊహిస్తున్నది.

కౌరవ సభలో అనాథయై ద్రౌపది వంటి మరే భద్ర స్త్రీ ఆర్తితో తనను రక్షింపుమని పిలిచినదో ! లేదా సోమకాసురునివంటివారు బ్రహ్మదేవుని నుండి వేదాలను అపహరించినారో ఏమో! రాక్షస సేనలు ఇంద్రుని అమరావతిపై దండెత్తినవో ఏమో! లేక ప్రహ్లాదుని వంటి భక్తులను, నీ దైవము విష్ణువు ఎక్కడున్నాడురా, చూపుమురా అని గద్దించి తర్జించినారేమో!

ఈ పద్యంలో కౌరవసభలో దిక్కులేని ద్రౌపది చేసిన శరణాగతి విషయాన్ని అనుసంధించుకోవాలి. **"గోవింద ద్వారకావాసిన్! కృష్ణ! గోపీజన ప్రియ; కౌరవైః పరిభూతాం మాం కిం న జానాసి కేశవ, హేనాథ! హే రమానాథ! వ్రజనాథార్తి నాశన, కౌరవార్ణవమగ్నాం మా ముద్ధరస్వ జనార్దన; కృష్ణ కృష్ణ మహాయోగిన్! విశ్వాత్మన్ విశ్వభావన, ప్రపన్నాం పాహి గోవింద! కురుమధ్యేఽ వసీదతీమ్"** (మహా.సభా.67/41-44) ఇట్లు శరణు వేడినంతనే శ్రీకృష్ణుడు వస్త్రావతారుడై ద్రౌపదికి మానదుడైనాడు. **"అమానీ మానదో మాన్యః"** (శ్రీవిష్ణు దివ్య సహస్ర నామాలు) బ్రహ్మదేవుడు నిద్రావస్థలో నుండగా సోమకాసురుడు వేదాలను అపహరించి సముద్రంలో దాగుకొన్నాడు. బ్రహ్మ మేల్కొని వేదాలు అపహృత

మైనందుకు దుఃఖిస్తూ శ్రీవిష్ణువును ప్రార్థించాడు. శ్రీ విష్ణువు మత్స్య రూపుడై సముద్రంలో ప్రవేశించి సోమకాసురుని సంహరించి ఆ వేదాలను తెచ్చి బ్రహ్మకు ఇచ్చాడు. పెక్కు పర్యాయాలు రాక్షససేనలు ఇంద్రుని అమరావతిపై దండెత్తినవి. వృత్రాసురుడు, నరకాసురుడు, రావణాసురుడు మొదలైన రాక్షసులు స్వర్గంపై దండు వెడలినవారే. పరమ భక్తుడు, తనకు కుమారుడు నగు ప్రహ్లాదుని చూచి హిరణ్యకశిపుడు **"డింభక! సర్వస్థలముల నంభోరుహ నేత్రుఁడుండు ననుచు మిగుల సంరంభమ్మునఁ బలికెద వీ స్తంభంబునఁ జూపఁగలవె? చక్రిన్ గ్రిక్రిన్"** అని గద్దించి పలికాడు. తన భక్తుని మాటను సత్య మొనర్చుటకు శ్రీహరి తత్క్షణమే **"నానా జంగమ స్థావరోత్కర గర్భంబుల నన్నిదేశముల నుద్దండ ప్రభావంబునన్"** సర్వాంతర్యామియై విశిష్ట ాానవహన నోచితమైన శ్రీనరసింహాకృతి తాల్చినాడు. ప్రపన్న రక్షణ పరాయణుడైనప్పుడు శ్రీమన్నారాయణుడు లక్ష్మీదేవిని సైతము మరచిపోతాడని శ్రుతిమధురమైన ఈ పద్యంలో వ్యంజింపబడింది.

**వ. అని వితర్కించుచు**

తా: అని తనలో తాను ఊహించుచు

**శా. తాటంకాచలనంబులో భుజనటద్ధమ్మిల్లబంధంబుతో**
**శాటీముక్తకుచంబుతో నదృఢచంచత్కాంచితో శీర్ణలా**
**లాటాలేపముతో మనోహరకరాలగ్నోత్తరీయంబుతోఁ**
**గోటీందుప్రభతో నురోజభరసంకోచద్వలగ్నంబుతోన్**

టీ : తాటంక + ఆచలనంబుతో = కర్ణాభరణాలు సంపూర్ణంగా చలించుటలతో; భుజ = భుజముపై; నటత్ = నర్తించు; ధమ్మిల్ల బంధంబుతో = కొప్పుముడితో; శాటీముక్త = పైట నుండి విడివడిన, కుచంబుతో = స్తనముతో; అదృఢ = గట్టితనము లేని; చంచత్ = కదలుచున్న; కాంచితో = ఒడ్డాణముతో; శీర్ణ = చెదరిన; లాలాటాలేపముతో = నొసటి బొట్టుతో; (పూతతో) మనోహర =మనోహరుడైన శ్రీనారాయణుని యొక్క, కర = చేతియందు, ఆలగ్న = పూర్తిగా చిక్కుకొన్న, ఉత్తరీయంబుతో = పైటతో; కోటీ + ఇందు ప్రభతో = కోటి చంద్రుల కాంతితో, ఉరోజభర = వక్షోజముల భారముచే; సంకోచత్ = సన్నమగుచున్న, వలగ్నంబుతోన్ = నడుముతో.

తా : ఆర్త రక్షణ పరాయణుడై శ్రీమన్నారాయణుడు త్వరత్వరగా వెళుతున్నప్పుడు, ఆయన్ను అనుసరించిన లక్ష్మీదేవి గబగబ నడుస్తుండగా ఆమె చెవికమ్మలు ఊగులాడుతున్నవి. వెంద్రుకల ముడి భుజములం దటునిటు పడుతున్నది. పైటకొంగు

జారినది. ఒడ్డాణము కదలాడుతూ మెరుస్తున్నది. మనోహరుడైన శ్రీవిష్ణువు చేతిలో పైటకొంగు పట్టుబడి పోయింది. ఆమె వదనము కోటి చంద్రుల కాంతితో ప్రకాశిస్తున్నది. వక్షోజభారంతో నడుము వణకాడుతున్నది.

ఆపన్నుల ఆర్తిని పోగొట్టడంలో దీక్షాబద్ధుడు శ్రీమన్నారాయణుడు. **"ఆర్తానాం ఆర్తిహంతారం" "ఆపదా మపహర్తారం"** అని నుతింపబడినవా డాయన. ఆపన్నార్తి ప్రశమనం ఒక యజ్ఞం. ఆ యజ్ఞంలో దీక్షితుడాయన. ఆయన సహధర్మచారిణి, ప్రియసహచరి లక్ష్మీదేవి. క్షీరానికి మాధుర్యం వలె శ్రీ నారాయణుని ఒక్క క్షణమైనా వీడి ఉండనిది. **"మధురతా దుగ్ధరాశేః"** క్షీరసాగరంలో జన్మించిన లక్ష్మీదేవికి అలాంటి ప్రాశస్త్యం ఉండటం సహజమని స్తుతించారు శ్రీవేదాంతదేశికులు.

పోతనగారు శ్రీలక్ష్మీదేవి వర్ణనలో ఆమె హావభావ హేలలనే కాక, అయత్నజములైన ఆమె శరీర శోభాకాంత్యా ద్యలంకారాలను ఈ పద్యంలో హృద్యంగా వర్ణించారు.

**కం. అడిగెద నని కడు వడిఁ జను వడిగినఁ దను మగుడ నుడువఁడని నడయుడుగున్**
**వెడవెడ సిడిముడి తడఁబడ నడుగిడు నడుగిడదు జడిమ నడుగిడు నెడలన్**

టీ : అడిగెదను + అని = ఆ విధంగా త్వరపడి పోవుటకు కారణము అడుగుతానని, కడు వడిన్ చనున్ = చాల తొందరగా భర్త వెంట వెళ్లును, అడిగినన్ = అడిగినట్లైతే, తను, మగుడన్= తనకు తిరిగి, నుడువఁడని = చెప్పడని, నడ + ఉడుగున్ = నడచిపోవుట మానుకొనును; వెడవెడ = మెల్లమెల్లగా; చిడిముడి= తొట్రుపాటు, తడఁబడన్ = తడబాటు కలుగగా, అడుగు + ఇడున్ = ముందుకు అడుగు పెట్టును, అడుగు+ఇడదు = అడుగు వేయదు. జడిమన్ = జడత్వములో; అడుగిడు నెడలన్ = అడుగుపెట్టు సందర్భమునందు.

తా: తన భర్త హడావుడిగా ఎక్కడికి వెళుతున్నాడో తెలుసుకోదలచి లక్ష్మీదేవి త్వరత్వరగా ఆయన వెంట పడుతుంది. ఆ తొందరలో ఆయన బదులు చెప్పడని చప్పున ఆగిపోతుంది. మళ్లీ తొట్రుపడుతూ ముందుకు అడుగు పెడుతుంది. ఎటూ చెప్పడని చప్పున జడత్వంతో నిలిచిపోతుంది.

ఈ పద్యంలో లక్ష్మీదేవికి కలిగిన సందేహాన్ని, ఆందోళనను పోతనగారు ఛందస్సుందరంగా వ్యంజించారు. **"అడుగిడు నడు గిడదు జడిమ నడుగిడు నెడలన్"** ఇందు వృత్యను ప్రాసాలంకారం లక్ష్మీదేవి స్థితికి నిలువుటద్దంగా భాసిస్తున్నది. విభావాదులలో ఒకటి జడత. విరహవ్యథాధిక్యంతో అంగాలు, మనస్సు కూడా చేష్టారహితం కావడాన్ని 'జడత' అంటారు. **"జడతా హీన చేష్టాంగానాం మనసస్తథా"** (సాహిత్యదర్పణం) తన భర్తను కలుసుకోవాలి, విషయమేమిటో అడగాలనే ఉత్కంఠతో లక్ష్మీదేవికి ఇట్టి

జడిమ ఏర్పడింది. భరతముని ఈ జడతను గూర్చి చెప్పిన సూత్రానికి అభినవగుప్తుడు చక్కని వివరణ ఇచ్చాడు. "**జడతా నామ సర్వకార్యాప్రతిపత్తిః. ఇష్టానిష్టశ్రవణదర్శన వ్యాధ్యాదిభి ర్విభావైః. సముత్పద్యతే. తా మభినయే దకథనా విభాషణ తూష్ణీంభావాప్రతిభానిమేష నిరీక్షణ పరవశత్వాదిభి రనుభావైః**" అనిష్ట దర్శన శ్రవణ వ్యాధులవల్ల జడత ఏర్పడుతుంది. దీని ప్రభావంవల్ల సకలకార్యాలలోను ప్రవృత్తి అనేది లోపిస్తుంది. మౌనం వహించడం, అస్పష్టంగా మాట్లాడటం, గొణుగుకోవడం, నిర్నిమేష దృక్కులతో చూడటం, పరవశం పొందడం జడతాభినయ విశేషాలని నాట్యశాస్త్రం వివరించింది.

**సీ. నిటలాలకము లంట నివుర జుంజుమ్మని ముఖసరోజము నిండ ముసరుఁ దేంట్ల**
**నళులఁ జోపఁగఁ జిల్కలల్ల నల్లన చేరి యోష్ఠబింబద్యుతు లొడియ నుఱుకు**
**శుకములఁ దోలఁ జక్షుర్మీనములకు మందాకినీ పాఠీన లోక మెసఁగు**
**మీన పంక్తుల దాఁట మెయిదీఁగతో రాయ శంపాలతలు మింట సరణి గట్టు**

**శంపలను జయింపఁ జక్రవాకంబులఁ గుచయుగంబుఁ దాఁకి క్రొవ్వు సూపు**
**మెలఁత మొగులు పిఱిఁది మెఱుఁగుఁ దీవయుఁ బోలె జలదవర్ణు వెనుకఁ జనెడు నపుడు**

టీ : మెలఁత = లక్ష్మీదేవి, మొగులు పిఱిఁది =మేఘము వెనుక నుండు; మెఱుపుఁదీఁగెయుఁ బోలె = తటిల్లతవలె (మెఱుపువలె), జలదవర్ణుని వెనుక = నీల మేఘ శ్యాముడైన శ్రీ విష్ణువు వెనుక; చనెడు నపుడు = వెళ్ళునపుడు, (ఎట్లుండెననగా) నిటలాలకములంట నివురన్ = నుదుటిపై ముసరిన ముంగురులు అతిశయించుటకు, జుంజుమ్మని = ఝుంకారాలు చేస్తూ ముఖ సరోజము నిండన్ = ముఖ పద్మమునంతటను; ముసరు తేంట్లు = కప్పునటువంటి తుమ్మెదలు; అళులన్ = ఆ తుమ్మెదలను, జోపఁగన్ = పారదోలుటకు; చిల్కలు, అల్లనల్లనచేరి = మెల్లమెల్లగా వచ్చి; ఓష్ఠబింబద్యుతిన్ = దొండపండు వంటి పెదవి కాంతిని; ఒడియన్ =ఒడిసి పట్టుకొనుటకు; ఉఱుకును; శుకములఁదోలన్ = ఆ చిలుకలను పారదోలుటకు; చక్షుర్మీనములకున్ = కన్నులనెడి చేపలకు; మందాకినీ పాఠీన లోకము = ఆకాశ గంగలోని చేపల గుంపు; ఎసఁగున్ = (దర్పముతో) విజృంభించును, మీనపంక్తులు = ఆ చేపల గుంపు; దాటిపోగా; మెయిదీఁగతోన్ = తీగె వంటి శరీరముతో, రాయన్ = రాచుకొనుటకు; శంపాలతలు = మెఱపు తీగెలు (విద్యుల్లతలు); మింట = ఆకాశమున; సరణిగట్టున్ = వరుస గట్టును; శంపలను జయింపన్ = మెఱపు దీగెలను జయించుటకు; చక్రవాకంబులు = జక్కవ పిట్టలు; కుచయుగంబున్ + తాకి = వక్షోజ ద్వయమునకు తగిలి; క్రొవ్వు సూపున్ = తమ అతిశయమును చూపును.

తా : శ్రీ విష్ణువు వెంట లక్ష్మీదేవి తొట్రుపడుతూ వెళ్లేటప్పుడు ముంగురులు ముఖానికి అంటుకొనగా వాటిని సరిచేసుకోవలసి వచ్చినది. ఎందుకనగా ఆమె ముఖమొక పద్మమనుకొని తుమ్మెదలు ముసరగా వాటిని తోలుకొంటున్నది. ఆమె

అధరమును చూచి చిలుకలు అది దొండపండని భ్రమపడి మూగినవి. వాటిని అదలించడానికి ఆమె నయనాలను పోలిన ఆకాశ గంగలోని చేపలు విజృంభించాయి. వాటి విజృంభణను అరికట్టడానికి ఆమె సువర్ణవర్ణ దేహకాంతికి దీటైన మెఱపులు మెరిశాయి. ఆ మెఱపులను అడ్డుకోడానికి ఆమె స్తనసదృశములైన చక్రవాక పక్షులు వచ్చాయి.

శ్రీ విష్ణువు వెంట తొట్రుపడుతూ వెళ్లుతున్న లక్ష్మీదేవి సమగ్ర స్వరూపాన్ని కవి సమయాలతో, ఉపమానద్రవ్యాలతో వర్ణించడమే ఈపద్యంలో ముఖ్యాంశం.

**మ. వినువీధిన్ జనుదేరఁ గాంచి రమరుల్ విష్ణున్ సురారాతి జీ**
**వనసంపత్తినిరాకరిష్ణుఁ గరుణావర్ధిష్ణు యోగీంద్రహృ**
**ద్వనవర్తిష్ణు సహిష్ణు భక్తజనబృందప్రాభవాలంకరి**
**ష్ణు నవోఢోల్లసదిందిరాపరిచరిష్ణున్ జిష్ణు రోచిష్ణునిన్**

టీ : వినువీధిన్ = ఆకాశ మార్గమునందు, చనుదేరన్ = బయలు దేరగా; అమరుల్ = దేవతలు; సుర + అరాతి = దేవతలకు శత్రువులైన రాక్షసుల, జీవన సంపత్తి = బ్రతుకనెడి భాగ్యమును, నిరాకరిష్ణున్ = పోగొట్టు స్వభావము గలవానిని; కరుణా వర్ధిష్ణు = కారుణ్యము వృద్ధియగు స్వభావము గలవానిని; సహిష్ణు = సహన స్వభావము గలవానిని; యోగీంద్ర హృద్వన వర్తిష్ణు = యోగీశ్వరుల మనస్సనెడి వనములందు వర్తించు స్వభావము గలవానిని; భక్తజన బృంద = భక్తుల సమూహమునకు, ప్రాభవ = ఐశ్వర్యమును, అలంకరిష్ణు = అలంకరించు స్వభావము గలవానిని; నవోఢా = క్రొత్త పెండ్లి కూతురువలె; ఉల్లసత్ = ప్రకాశించుచున్న; ఇందిరా = లక్ష్మీదేవికి, పరిచరిష్ణున్ = పరిచర్య చేయు స్వభావము గలవానిని; జిష్ణున్ = జయించు స్వభావము గలవానిని; రోచిష్ణునిన్ = ప్రకాశించు స్వభావము గలవానిని, విష్ణున్ = శ్రీ విష్ణుదేవుని; కాంచిరి = దర్శించిరి.

తా : ఆర్తత్రాణ పరాయణుడై వేగంగా వస్తున్న దనుజారిని, దయా సముద్రుని, యోగీశ్వరమనో విహారిని, భక్తజనప్రాభవకారిని; ఇందిరాసుందరీసేవాసక్తుని, శ్రీ మహావిష్ణువును దేవతలు దర్శించుకొన్నారు.

**వ. ఇట్లు పొడఁగని,**

తా : ఆ విధంగా దయచేస్తున్న శ్రీ విష్ణువును దర్శించి,

**మ. చనుదెంచెన్ ఘనుఁ డల్లవాఁడె హరి పజ్జం గంటిరే లక్ష్మి శం**
**ఖనినాదం బదే! చక్రమల్లదె! భుజంగధ్వంసియున్ వాఁడె క్ర**
**న్నన నేతెంచె నటంచు వేల్పులు నమో నారాయణాయేతి వి**
**న్నను లై మ్రొక్కిరి మింట హస్తి దురవస్థావక్రికిన్ జక్రికిన్.**

టీ : ఘనుఁడు = గొప్పవాడైన (మేఘశ్యాముడైన), హరి = శ్రీహరి; అల్లవాఁడె = అల్లడుగో, చనుదెంచెను = వచ్చెను, కంటిరే = చూచినారా?; లక్ష్మి = ఆమెయే లక్ష్మీదేవి; శంఖ నినాదంబదె = అదే పాంచజన్య ధ్వని; చక్రమల్లదె = అదే సుదర్శన చక్రము; భుజంగ ధ్వంసియున్ వాఁడె = అతడే గరుత్మంతుడు; క్రన్ననన్ + ఏతెంచె = శీఘ్రముగా వచ్చెను; అటంచున్; వేల్పులు = దేవతలు; నమో నారాయణాయ + ఇతి = నమస్కారము నారాయణమూర్తికి అను, నిస్వనులై = శబ్దముతో కూడిన వారై, మింటన్ = ఆకాశము నుండియే; హస్తి దురవస్థా వక్రికిన్ = గజేంద్రుని దురవస్థను తొలగించువానికి, చక్రికిన్ = చక్రాయుధునకు; మ్రొక్కిరి = నమస్కరించినారు.

తా : అంతరిక్షమునందు గుమిగూడిన దేవతలందరు అడుగో శ్రీమన్నారాయణుడు దయచేస్తున్నాడు. ఆయన వెనుక నున్నదియే లక్ష్మీదేవి. అదే పాంచజన్య ధ్వని, అదే సుదర్శనచక్రము. అతడే గరుత్మంతుడు. భగవంతుని పరివార మంతయు శీఘ్రంగా విచ్చేసినది అనుచు **"ఓం నమో నారాయణాయ"** అని ఏకకంఠముగా పలికి, గజేంద్రుని దురవస్థను తొలగింప చక్రాయుధధారియైన శ్రీ విష్ణువునకు సాష్టాంగపడినారు.

ఈ పద్యంలో అష్టాక్షర యుక్తమైన **'ఓమ్ నమో నారాయణాయ'** అను మహామంత్రం స్మరింపబడింది. **"సర్వభూతస్థ మేకం నారాయణం కారణపురుష మకారణం పరంబ్రహ్మ, శోకమోహ వినిర్ముక్తో విష్ణుం ధ్యాయన్న సీదతి"** సర్వభూతస్థితుడైన ఏకమాత్ర కారణ పురుషుడు, కారణరహిత పరబ్రహ్మ నారాయణుడు. ఆయన్ను ధ్యానించిన వారు శోక మోహాలనుండి తొలగిపోతారు. ఎట్టి కష్టాన్ని పొందరని నారాయణోపనిషత్తు ఉద్ఘాటిస్తున్నది. అఖిల జగత్కారణుడు శ్రీమన్నారాయణుడని వేదం స్పష్టపరిచింది.

దేవతలు భగవంతుణ్ని దర్శింప గలుగుతారు. మనుష్యులు కూడా భగవంతుణ్ని చర్మచక్షువులతో చూడగలుగుతారు. కాని, భగవద్దర్శనం కలిగే సమయంలో వారు దేవత్వం పొంది ఉంటారని గ్రహించాలి. దేవత్వం పొందినవారే భగవంతుణ్ని దర్శించడానికి అధికారులవుతారు. తక్కినవారు భగవద్దర్శనానికి యోగ్యులు కారు. భగవంతుణ్ని దర్శించడంలో సాధకుని లేదా భక్తుని అపారమైన తపస్సు కంటె భగవంతుని అపార కృపాతిశయమే అధికంగా ఉంటుంది. భగవంతుణ్ని గూర్చి తెలుసుకొన్నవాడే దివ్యుడవుతాడు. బ్రహ్మ అవుతాడు. అతని వంశీయులు కూడా బ్రహ్మజ్ఞాను లవుతారని శ్రుతి చెబుతున్నది. **"స యో హ వై తత్పరమం బ్రహ్మ వేద బ్రహ్మైవ భవతి, నా స్యాబ్రహ్మవిత్కులే భవతి. తరతి శోకం । తరతి పాప్మానం గుహాగ్రంథిభ్యో విముక్తోఽమృతో భవతి"** (ముండకోపనిషత్ - 2- 9) సర్వవిధ శోకాలను, చింతలను,

పాపసముదాయాన్ని అతిక్రమిస్తాడు. అతని మస్తిష్కంలో సంశయాలు, విపర్యయాలు, దేహాభిమానం, విషయాసక్తి మొదలైన చిక్కుముళ్లు ఏవీ ఉండవు. శ్రీకృష్ణ భగవానుడు అటువంటి వానిని తనతో సమానునిగా చేసుకొంటానని "మమ సాధర్మ్య మాగతాః" (గీత 14-2) అని అనుగ్రహం చూపాడు. "నా౽దేవో దేవ మర్చయేత్" అని శాస్త్రం. దేవత్వం పొందకుండగా దేవుణ్ని అర్చింపగూడదని శాస్త్రం చెప్పడంలోని అంతరార్థం ఏమంటే దివ్యమైన మనస్సుతోనే, పరిశుద్ధసత్త్వమయమైన హృదయంతోనే దేవుణ్ని అర్చించాలని శాస్త్రోద్దేశము.

వ. **అయ్యవసరంబునఁ గుంజరేంద్ర పాలనపారవశ్యంబున దేవతా నమస్కారంబు లంగీకరింపక మనప్రమాన సంచారుండై పోయి పోయి కొంత దూరంబున శింశుమారచక్రంబునుం బోలె గురు మకర కుళీర మీన మిథునంబై, కిన్నరేంద్రుని భాండాగారంబునుం బోలె స్వచ్ఛ వరకచ్ఛపంబై, భాగ్యవంతుని భాగధేయంబునుం బోలెఁ బరాగ జీవనంబై, వైకుంఠంబునుం బోలె శంఖచక్ర కమలాలంకృతంబయి, సంసార ప్రకారంబునుంబోలె ద్వంద్వ సంకుల పంక సంకీర్ణంబయి యొప్పు నప్పంకజాకరంబుఁ బొడఁగని -**

టీ : ఆ + అవసరంబున = ఆ సమయమునందు; కుంజరేంద్ర పాలన = గజరాజును రక్షించుట యందలి; పారవశ్యంబునన్ = మైమరపుచేత, మనప్రమాన సంచారుండై = మనో వేగముతో సమమైన సంచారము గలవాడై, శింశుమార చక్రంబునుంబోలె = రాసుల చక్రము వలె; మకర = మకర రాశి; కుళీర = కర్కాటక రాశి; మీన = మీన రాశి; మిథునంబై = మిథునరాశి కలదియై, (మొసళ్లు, ఎండ్రకాయలు; చేపల జంటలు గలదియై) కిన్నరేంద్రుని = కుబేరుని; భాండాగారంబునుంబోలె = ధనాగారము వలె; స్వచ్ఛ = నిర్మలమైన; వర = శ్రేష్ఠమైన; కచ్ఛపంబై = కచ్ఛపమను పేరుగల నిధితో కూడినదై (తాబేళ్ళు కలదియై), భాగ్యవంతుని = అదృష్టవంతుని, భాగధేయంబునుంబోలె = అదృష్టము వలె; పరాగ జీవనంబై = అనురాగముతో కూడిన జీవనము గలదియై (పుప్పొడితో కూడిన నీరు గలదియై), వైకుంఠంబునుంబోలె = వైకుంఠము వలె; శంఖ చక్ర కమలాలంకృతంబై = శంఖము, చక్రము, లక్ష్మీదేవి మున్నగు వానిచే అలంకరింప బడినదై, (శంఖములు, చక్రవాక పక్షులు, పద్మములు మొదలగువానిచే శైసేయ బడినదై), సంసార ప్రకారంబునుం బోలె = సంసారమునందలిరీతి వలె; ద్వంద్వ సంకుల పంక సంకీర్ణంబై = నీటి జంతువుల జంటలతో సంకులమైన బురద గలదై, (సుఖ దుఃఖాది ద్వంద్వములతో సంకులమైన పాపముతో కూడినదై); ఒప్పు = శోభిల్లు; ఆ + పంకజాకరంబు = ఆ పద్మసరస్సును; పొడఁగని = చూచి.

తా : గజేంద్రుని రక్షించడానికి మహావేగంగా వెళుతున్న మహావిష్ణువు, అచ్చటికి విచ్చేసి నమస్కరిస్తున్న దేవతల అభివాదనములను గైకొనక పోయిపోయి మొసళ్లు,

ఎండ్రలు, చేపలు, తాబేళ్లు, సంకులు, చక్రవాక మిథునములు, తామర పూలు కలిగి కరిమకరుల పోరాటంతో పంకిలమైన ఆ కాసారాన్ని చూచి -

పోతనగారు ఏనుగులు కల్లోల పరచిన సరస్సును ఇంతకుముందు శృంగార రస బంధురంగా వర్ణించారు. భగవంతుడు దర్శించిన ఆ సరస్సును ఇక్కడ సందర్భోచితమైన శ్లేషలతో అలంకరించారు. శ్లేషాలంకారం రెండు విధాలుగా ఉంటుంది. శబ్దాన్ని ఆశ్రయించిన శ్లేషను శబ్ద శ్లేష అంటారు. శబ్దశ్లేషలో శబ్ద పరివర్తనం జరగదు. అనగా శ్లిష్టశబ్ద స్థానంలో దాని పర్యాయ పదాన్ని వాడటానికి వీలుండదు. అర్థశ్లేషలో శబ్ద పరివర్తనం జరిగి మరింత సౌందర్యం చేకూరుతుంది. "అనేకార్థశబ్దవిన్యాసః శ్లేషః" అని నిర్వచనం.

**మ. కరుణాసింధుఁడు శౌరి వారిచరమున్ ఖండింపఁగాఁ బంపె స**
**త్వరితాకంపితభూమిచక్రము, మహోద్యద్విస్ఫులింగచ్ఛటా**
**పరిభూతాంబరశుక్రమున్, బహువిధబ్రహ్మాండభాండచ్ఛటాం**
**తరనిర్వక్రముఁ బాలితాఖిలసుధాంధశ్చక్రమున్ జక్రమున్**

టీ : కరుణాసింధుఁడు = కృపాసముద్రుడు; శౌరి = విష్ణువు (శ్రీకృష్ణుడు), వారి చరమున్ = మొసలిని; ఖండింపఁగాన్ = ఖండించుటకు; సత్వరిత = వేగముచేత; ఆకంపిత = అన్నివైపుల వణికింపబడిన; భూమి చక్రము = భూ చక్రము గలదియును; (భూమండలమును కంపింప జేయునదియు); మహోద్యత్ =గొప్పగా పైకెగురు, విస్ఫులింగచ్ఛటా = అగ్ని కణములచే; పరిభూత = అవమానింపబడిన, అంబర శుక్రమున్ = ఆకాశము నందలి శుక్ర నక్షత్రము కలదియు; బహువిధ = అనేక విధములైన; బ్రహ్మాండ భాండచ్ఛటా = బ్రహ్మాండాల వరుస యొక్క; అంతర = లోపల; నిర్వక్రము = (మొక్క వోనిదియు), పాలితాఖిల సుధాంధశ్చక్రమున్ = సకల దేవతా సమూహమును పరిపాలించు నదియునగు, చక్రమున్ = సుదర్శన చక్రమును; పంపెను = ప్రయోగించెను.

తా : కృపా సముద్రుడైన శ్రీహరి మొసలిని ఖండించడానికి పంపిన సుదర్శన చక్రపు వేగాతిశయం వల్ల భూమండలం కంపిత మయింది. దాని అగ్ని కీలలతో ఆకాశాన గల శుక్ర నక్షత్రం మరుగున పడింది. బ్రహ్మాండ భాండంలో అడ్డు లేకుండా ఆ చక్రం ప్రవర్తించింది. సకల దేవతా సమూహాన్ని రక్షించేది ఆ సుదర్శన చక్రం.

**వ. అట్లు పంచిన**

తా : ఆ విధంగా పంపబడిన శ్రీసుదర్శన చక్రము.

**శా. అంభోజాకరమధ్యనూతనవళివ్యాలింగనక్రీడవా**
**రంభుండైన వెలుంగుఱేనిచెలువారవ్ వచ్చి నీటన్ సుభుల్**

**గుంభధ్వానముతోఁ గొలంకువు కలంకం బొందఁగాఁ జొచ్చి దు**
**ష్టాంభోవర్తి వసించుచక్కటికి డాయంబోయి హృద్వేగమై**

టీ : అంభోజాకర మధ్య = పద్మ సరస్సు నడుమ; నూతన నళినీ= నవ వికసిత పద్మమును; ఆలింగన క్రీడన = కౌగిలింతల క్రీడను, ఆరంభుండైన = ప్రారంభించినవాడైన, వెలుంగుతేని చెలువారన్ = సూర్యుని అందచందాలతో; వచ్చి; నీటన్ = సరోవర జలములందు; గుభుల్ గుంభధ్వానముతో = గుబగుబ ధ్వనులతో; కొలంకువు = సరస్సు; కలంకంబు + ఒందగా = కల్లోలితమగునట్లుగా; చొచ్చి = ప్రవేశించి; దుష్టాంభోవర్తి = దుష్టమైన జలచరమగు మొసలి, వసించు = నివసించు; చక్కటికి = సమీపమునకు; డాయంబోయి = చేరబోయి, హృద్వేగమై = ఆ విష్ణుమూర్తి మనోవేగమువంటి వేగముకలదై.

తా : శ్రీహరిచే ప్రయోగింపబడిన సుదర్శనచక్రము తామర కొలనియందలి నవవికసిత పద్మంతో క్రీడించే సూర్యునివలె ప్రవేశించి, తామర కొలను గుభిల్లునట్లుగా కలయదిరిగి, దుష్టమగు ఆ మొసలి యుండిన చోటికి త్వరితంగా వెళ్లి -

"**వ్రేలి నలంకరించినను విష్ణు హృదంతర వర్తియై సముద్వేలితమైన లోచన రవి ప్రతిబింబము వోలె మజ్జ్వలజ్వాలలు జిమ్ముచున్ దమఃవర్గము నుగ్గొనరించి శాంతమై గ్రాలు సుదర్శన మ్మొసఁగుఁగాత! సిరుల్ ప్రణమిల్లువారికిన్** (శతరూపకావ్యంలోనిది.) సుదర్శన చక్రం శ్రీకృష్ణుని హృదయంలో వర్తిస్తుంటుందని ప్రసిద్ధము. ఆశ్రితులకు సుదర్శనము సందర్శనీయము. భగవదాభరణమై శోభిల్లుతుంటుంది. శత్రువులకది భయానకమైన ఆయుధంగా తోస్తుంది. సర్వాయుధ మయమైనది సుదర్శన చక్రము. "**కూష్మాండ చండభూతాద్యా యే చ దుష్టా గ్రహాః స్మృతాః, పలాయంతేఽ నిశం భీతా వర్మణోస్య ప్రభావతః**" సుదర్శనకవచం పఠించినంత మాత్రం చేతనే దుష్టగ్రహాలు పలాయనం చేస్తాయని 'సుదర్శన కవచ' మహిమ చాటుతున్నది. 'నారాయణ కవచం'లో "**చక్రం యుగాంతానల తిగ్మనేమి, భ్రమత్ సమంతాత్ భగవత్ప్రయుక్తం, దందగ్ధి దందగ్ధ్యరి సైన్య మాశు, కక్షం యథా వాతసఖో హుతాశః** (శ్రీమద్భా 6-8-23) ఓ సుదర్శనదేవా! నీవు చక్రాకారుడవు. నీ చక్రాంచలాలు ప్రళయాగ్ని జ్వాలల వలె తీవ్రములు. శ్రీకృష్ణుని ప్రేరణతో నీవు సర్వత్ర పరిభ్రమిస్తావు. వాయు సహితాగ్నివలె శుష్కతృణాన్ని దహించునట్లుగా శీఘ్రంగా నా శత్రువులను దగ్ధం చేయి". ప్రాణభయం కలిగినపుడు తన శరీరరక్షణకు శ్రీసుదర్శన దేవుణ్ని ఇలా ప్రార్థిస్తారు.

సుదర్శనం శ్రీకృష్ణ దర్శనానికి చిహ్నం. శ్రీరంగ పుణ్యక్షేత్రంలో శ్రీకూర నారాయణస్వామి సంస్కృతంలో సుదర్శనశతకం రచించారు. మయూరకవి

రచించిన సూర్య శతకం వలె సుదర్శనశతకం పఠించిన వారికి సమస్త బాధలు తొలగిపోతాయని ప్రసిద్ధి.

**శా. భీమంబై తలఁద్రుంచి ప్రాణములఁ బాపెం జక్ర మాశుక్రియన్**
**హేమక్ష్మాధరదేహమున్ జకితవన్యేభేంద్రసందోహమున్**
**గామక్రోధనగేహమున్ గరటిరక్తస్రావగాహంబు ని**
**స్సీమోత్సాహము వీతదాహము జయశ్రీమోహమున్ గ్రాహమున్**

టీ : చక్రము = సుదర్శన చక్రము; ఆశు క్రియన్ =వేగవంతమైన చేష్టతో; హేమక్ష్మాధర దేహమున్ = మేరుగిరి అంతటి శరీరము గలదానిని; చకిత = భయపెట్టబడిన; వన్యేభేంద్ర సందోహమున్= అడవి యేనుగుల సముదాయము గలదానిని, కామ క్రోధన గేహమున్= కామ క్రోధాలకు నిలయమైన దానిని; కరటి = గజేంద్రుని; రక్తస్రావ = రక్తపు పారుదల యందు, గాహంబు = మునిగిన దానిని; జయశ్రీ మోహమున్ = జయలక్ష్మిపై మోహము గలదానిని; నిస్సీమోత్సాహము = మేరలేని ఉత్సాహము గలదానిని; వీత దాహము = దప్పిక లేనిదానిని (ఆయాసము లేని దానిని), గ్రాహమున్ = మొసలిని; భీమంబై = భయానకమైనదై, తలఁద్రుంచి; ప్రాణములఁ బాపెన్ = హతమార్చెను.

తా : ఆ సుదర్శన చక్రం మహావేగంగా వచ్చి, మేరుగిరి వంటిది, అడవి యేనుగులను భయపెట్టినటువంటిది, కామ క్రోధాలకు నిలయమైనటువంటిది, ఏనుగు కాలి రక్తంలో మునకలెత్తుతున్నటువంటిది, మహోత్సాహం కలిగినటువంటిది, దప్పిక లేనటువంటిది, జయమును పొందగోరినటువంటిది అయిన మొసలిని తలను ఘోరంగా త్రుంచి హతమార్చినది.

**వ. ఇట్లు నిమిష పూర్వంబున సుదర్శనంబు మకరితల ద్రుంచు నవసరంబున**

తా : ఈ విధంగా ఒక క్షణంలో సుదర్శన చక్రం మొసలి తలను ఖండించే సమయంలో.

**కం. మకర మొకటి రవిఁ జొచ్చెను మకరము మఱియొకటి ధనదు మాటున డాఁగెన్**
**మకరాలయమునఁ దిరిగెఁడు మకరంబులు కూర్మరాజు మఱువున కరిగెన్**

టీ : మకరము + ఒకటి = రాశులలో గల మకరము; రవిఁజొచ్చెన్ = సూర్యుని చేరెను; మకరము మఱియొకటి = మరొక మకరము; ధనదు మాటున = కుబేరుని చాటున; డాగెన్ = దాగుకొనెను; మకరాలయమున = సముద్రమందు, తిరిగెడు = సంచరించెడి, మకరంబులు = మొసళ్లు, కూర్మరాజు మఱువునకు = ఆది కూర్మము యొక్క మరుగునకు; అరిగెన్ = వెళ్లెను.

తా : మేరువు పర్వతము వంటి ఆ మొసలిని క్షణకాలమున తలద్రుంచి వధించడం చూచి, ఆ భయానకమైన సుదర్శన చక్రం తమపైకి దూకునేమోయని భయపడి

రాశులలోగల మకరము సూర్యుని అండ చేరినది. నిధులలోగల మకరము కుబేరుని మరుగునకు చేరినది. సముద్రములోని మొసళ్లన్నియు ఆదికూర్మము అండజేరినవి అని చమత్కారార్థము. రాశులలో మకరమను రాశి ఒకటున్నది. కుబేరుని నిధులలో ఒక దానిపేరు "మకరము".

పోతనగారు చేసిన ఉత్ప్రేక్ష వంటిదే శ్రీహరిసూరి "శ్రీ భక్తిరసాయనం" (6-65)లో ఒక చక్కని ఉత్ప్రేక్ష చేశాడు. **"భుక్త్వాపి మృత్తికాం మాతురగ్రే కిం వా వదేయమ్, ఇత్యక్షిరూపౌ చంద్రార్కౌ సాక్షిణౌ భ్రేమతుః సదా"** శ్రీకృష్ణుడు మన్ను తిన్నాడు. యశోద కోపించి నిజంగా మన్ను తిన్నావా? అని గద్దించి అడిగింది. అప్పుడు శ్రీకృష్ణుడు **"నాహం భక్షితవానంబ! సర్వే మిథ్యాభిశంసినః"** (శ్రీమద్భా 1౦-8-35) అమ్మా! నేను మన్ను తినలేదు. అందరు అబద్ధాలు చెబుతున్నారు అన్నాడు. అది విన్నారు శ్రీకృష్ణుని నేత్రస్థానీయులైన సూర్యచంద్రులు. మన ప్రభువు అబద్ధం చెబుతున్నాడు. నేను కర్మసాక్షిని గదా. ఇప్పుడు మన కర్తవ్యం ఏమిటి? ప్రభువును సమర్థించడమా? మానడమా? అని ఆందోళనపడుతూ సూర్యచంద్రులు ఆకాశంలో అహర్నిశలు పరిభ్రమిస్తున్నారని చక్కని ఉత్ప్రేక్ష.

**మ. తమముం బాసిన రోహిణీవిభుక్రియన్ దర్పించి సంసార చ**
**క్రము వీడ్కొన్న విరక్తచిత్తునిగతిన్ గ్రాహంబు పట్టూడ్చి పా**
**దము లల్లార్చి కరేణుకావిభుఁడు సౌందర్యంబుతో నొప్పె సం**
**భ్రమదాశాకరిణీకరోజ్ఝితసుధాంభఃస్నానవిశ్రాంతుఁడై**

టీ : తమమున్ + పాసిన = చీకటిని, రాహుగ్రహమును, వదలిన; రోహిణీ విభుక్రియన్ = చంద్రుని వలె; దర్పించి = అతిశయించి; సంసార దుఃఖము, వీడ్కొన్న = వదలిపెట్టిన; విరక్త చిత్తుని గతిన్ = వైరాగ్యవంతుని వలె; గ్రాహంబుపట్టు = మొసలిపట్టును; ఊడ్చి = వదలించుకొని; పాదములు + అల్లార్చి = పాదాలను సరిచేసికొని; కరేణుకా విభుఁడు = (అచ్చోటి కప్పుడు చేరిన) ఆడ ఏనుగులకు పతియైన గజేంద్రుడు; సంభ్రమత్ = తొట్రుపడుచుండిన; ఆశాకరిణీ = దిగ్గజముల యొక్క భార్యలు; కర + ఉజ్ఝిత = తొండముల నుండి వదలబడిన; సుధా + అంభస్ + స్నాన = అమృత జలముల స్నానముచేత విశ్రాంతుఁడై = శ్రమమునుపాసిన, సౌందర్యంబుతోన్ + ఒప్పెన్ = సౌందర్యముతో ప్రకాశించెను.

తా: చీకట్లను వదలిన, రాహువును వదలిన, చంద్రునివలె, సంసార దుఃఖాన్ని వదలిన విరాగివలె, గజేంద్రుడు మొసలి పట్టునుండి విడివడి, కాళ్లను జాడించుకొని, దిగ్గజముల భార్యలు తమ తొండములతో చల్లిన అమృత జలములచే స్నానమాడి, శ్రమను పోగొట్టుకొని సౌందర్యంతో ప్రకాశించాడు.

శా. పూరించెన్ హరి పాంచజన్యముఁ గృపాంభోరాశిసౌజన్యమున్
భూరిధ్వానచలాచలీకృత, మహాభూతప్రచైతన్యమున్
పారోదారసితప్రభాచకితపర్జన్యాదిరాజన్యమున్
దూరీభూతవిపన్నదైన్యమును, నిర్ధూతద్విషత్సైన్యమున్.

టీ : హరి = శ్రీమహావిష్ణువు; కృపా + అంభోరాశి = దయాసముద్రుని, సౌజన్యమున్ సౌజన్యము కలదియు; భూరి = గొప్పదగు; ధ్వాన = ధ్వనిచేత; చలాచలీకృత = కదలింపబడిన; మహాభూత ప్రచైతన్యమున్ = మహా భూతముల చేష్టలు గలదానిని; పార + ఉదార = సామర్థ్యముతో గొప్పదైన సితప్రభా = తెల్లని కాంతిచే; చకిత = భయపెట్టబడిన; పర్జన్య + ఆది రాజన్యమున్ = మొరసెడి శ్రేష్ఠములైన మేఘములు కలదియు; (తన తెల్లదనముచే నల్లని కారుమేఘాలను భయపెట్టునదియు), దూరీ భూత = దూర మొనర్ప బడిన; విపన్న = ఆపన్నుల యొక్క; దైన్యమును = దీనత్వము గలదానిని; (దీనుల ఆపదలను తొలగించు నట్టిది); నిర్ధూత = ఎగుర గొట్టబడిన; ద్విషత్ = శత్రువుల యొక్క; సైన్యమును = సేన గలదానిని; (శత్రుసేనలను తరిమివేయుదానిని), పాంచజన్యమున్ = పాంచజన్యమను శంఖమును; పూరించెన్ = ధ్వనింపజేసెను.

తా : అంతట శ్రీమహావిష్ణువు కృపాసముద్ర సౌజన్యము గలదానిని, తన మ్రోతచేత స్థావర జంగమాలను కల్లోలపరచుదానిని, తన తెల్లని కాంతులచే ప్రళయకాల పర్జన్య మేఘాలను భయపెట్టుదానిని, దీనుల దైన్యమును తొలగించు దానిని, శత్రు సైన్యాన్ని పారదోలునట్టి పాంచజన్య శంఖాన్ని పూరించాడు.

ఈ గజేంద్ర మోక్షం పుణ్యకథలో శ్రీహరి, లక్ష్మీదేవి, గరుత్మంతుడు, సుదర్శన చక్రము, పాంచజన్య శంఖము స్మరింప బడ్డాయి. ప్రాతఃకాలాన వీటిని స్మరిస్తూ నిద్ర లేచినవారికి శుభ పరంపరలు కలుగుతాయని, ఆపదలు తొలగుతాయని అభిజ్ఞులు, అనుభవజ్ఞులు అయిన పెద్దల విశ్వాసము. శ్రీకృష్ణదేవరాయలు తన "ఆముక్త మాల్యద'' కావ్యంలో వర్ణించిన శ్రీవిష్ణు పంచాయుధ స్తోత్రం చదువరులకు సంతృప్తి నిస్తుంది. **"అరులకు భీకరమ్మై ప్రణతాళికి శ్రీకరమై చెలంగి శ్రీహరి కటకోజ్జ్వలత్కర తలాంబర మందున చంద్రబింబమై, గురుతరమై లసత్కుముద కుంద మృణాళ మనోజ్ఞ గౌరమై వరలెడు పాంచజన్య మనువారము మాకు శుభమ్ము లిచ్చుతన్"!** (శతరూప కావ్యంలోనిది.)

మ. మొరసెన్ నిర్జరదుందుభుల్, జలరుహామోదంబులై వాయువుల్
తిరిగెన్, బువ్వులవానజల్లు గురిసెన్, దేవాంగనాలాస్యముల్
పరఁగెన్ దిక్కులయందు జీవజయశబ్దధ్వానముల్ నిండె, సా
గర ముప్పొంగెఁ దరంగచుంబితనభోగంగాముఖాంభోజమై

టీ : నిర్జర దుందుభుల్ = దేవతల నగారాలు; మొరసెన్ = (వాటంతట అవి) ధ్వనించెను; వాయువుల్ = గాలులు; జలరుహ + ఆమోదంబులై = తామరపూల సుగంధము కలవియై; తిరిగెన్ = వ్యాపించెను; పువ్వుల వానజల్లు, కురిసెన్; దేవ + అంగనా లాస్యముల్ = దేవతా స్త్రీల నృత్యములు; పరగెన్ = ఒప్పెను; దిక్కులయందు; జీవ = జీవలోకము యొక్క; జయ శబ్ద ధ్వానముల్ = జయ జయ ధ్వనులు, నిండెన్; తరంగ చుంబిత = తరంగముల చేత ముద్దుగొన్న నభోగంగా = ఆకాశ గంగ యొక్క, ముఖ + అంభోజమై = ముఖపద్మము గలదియై, సాగరము = సముద్రము; ఉప్పొంగెను = పొంగి పొరలెను.

తా : కృపాసింధువైన శ్రీహరి ఒక ఏనుగును రక్షించినందుకు దేవతల నగారాలు స్వయంగా మ్రోగాయి. పద్మ సుగంధ వాయువులు వీచాయి. పుష్ప వర్షం కురిసింది. దేవతా స్త్రీలు నృత్యం చేశారు. జీవకోటి మహానందంతో శ్రీహరికి జయ జయ ధ్వానాలు చేసింది. సముద్రం ఆకాశమెత్తు ఉప్పొంగింది.

గజేంద్రమోక్షంలోని ప్రధానాంశం ఈ పద్యంలో వ్యంజిత మయింది. అఖిల లోకేశ్వరుడు ఒకానొక జంతువు మొఱవిని స్వయంగా విచ్చేసి ఆ జంతువును రక్షించడం, **"సమోహం సర్వభూతేషు"** (గీ 9-29) శ్రీముఖోక్తికి ఇది దృష్టాంతం. మనుష్య జన్మలో ఉన్నప్పుడు చేసిన మహత్తరమైన పూజ, కాలాంతరాన మనుష్యేతర జన్మ మెత్తినప్పటికి శ్రీకృష్ణ భగవానుడు ఆశ్రిత వాత్సల్య వివశుడై స్వయంగా వచ్చి ఉద్ధరిస్తాడన్న సత్యాన్ని ఈ కథ చాటి చెబుతున్నది. అందుచేతనే దేవలోకంలో నగారాలు మ్రోగాయి. పంచభూతాలు పరవశించి ఉప్పొంగాయి. జీవకోటి ఆత్మవిశ్వాసంతో భగవంతునికి జయ జయ ధ్వనులుచేసింది. ఈ సందర్భంలో **"సాగర ముప్పొంగెఁ దరంగచుంబితనభోగంగాముఖాంభోజమై"** అని పోతనగారు వర్ణించి, మహాకవి కాళిదాసు రచించిన రఘువంశంలోని శ్లోకాన్ని గుర్తుకు తెచ్చారు. **"ముఖార్పణేషు ప్రకృతిప్రగల్భాః, స్వయం తరంగాధరదానదక్షః, అనన్యసామాన్యకళత్రవృత్తిః పిబత్యసౌ పాయయతే చ సింధుః"** "లోకంలో సుందరీమణుల అధరపానం కాముకులైన పురుషులు చేయడం కద్దు. పురుషాధరపానం స్త్రీలు చేసినట్లు కనిపించదు. ఈ విషయంలో మహా గంభీరుడైన సముద్రుని పద్ధతి అద్భుతమైనదే కాకుండా విశిష్టమైనది. ఎందుకంటే - నదులు తమ ముఖాలను చాచి సముద్రుని ముందుకు వస్తాయి. తమ ప్రియుడైన సముద్రుడు అధరపానానికి ఆశపడతాడని. కాని, అతడు వాటి ముఖాలను చుంబించటంతో ఆగడు. తన తరంగ రూపమైన అధరాలనూ ఆ నదుల చేత చుంబింపజేసుకొంటాడు. అంటే ధీర గంభీరుడైన సముద్రుడు అధరపానమూ

చేస్తాడు. అధరదానమూ చేస్తాడు తన ప్రియలకు. ముఖార్పణంలో సహజంగా ప్రగల్భలయిన యువతులకు ఈ పద్ధతి మహానందకారణం అవుతుంది. తమ భార్యలతో ఇలా మెలగటం అందరికీ తెలియదు. అతడు సామాన్యుడా? మహా చతురుడు!" అని శ్లాఘించాడు కాళిదాసు. ఈ పద్యంలో ఉవ్వెత్తున ఉప్పొంగిన సముద్రుడు ఆకాశగంగా ముఖాంభోజచుంబనానికి ఆశపడటం కనిపిస్తుంది.

**కం. నిడుదయగు కేల గజమును మడువున వెడలంగఁ దిగిచి మదజలరేఖల్**
**దుడుచుచు మెల్లనఁ బుడుకుచు నుడిపెన్ విష్ణుండు దుఃఖ ముర్వీనాథా!**

టీ : ఉర్వీనాథా! = ఓ పరీక్షిన్మహారాజా! నిడుదయగు కేలన్ = పొడవైన చేతితో; గజమును; మడువునన్ = సరస్సు నుండి, వెడలంగన్ + తిగిచి = బయటికి లాగి; మదజలరేఖల్ = మదజలపు చారలు; తుడుచుచున్; మెల్లన పుడుకుచున్ = మెల్లగా నిమురుచు; విష్ణుండు, దుఃఖమును = గజేంద్రుని శోకమును, ఉడిపెన్ = పోగొట్టెను.

తా : శ్రీ శుకదేవుడు పరీక్షిత్తును ఆశ్వాసిస్తూ భగవంతుని కారుణ్యాతిశయాన్ని, దీనవత్సలతను తెలుపుతున్నాడు. ఓ రాజా! శ్రీవిష్ణువు తనపొడువైన చేతితో మడుగులో నున్న ఏనుగును స్వయంగా వెలువలికి లాగి, దాని చెంపలను తుడిచి, తల నిమురుచు, దాని దుఃఖాన్ని పోగొట్టినాడు.

**కం. శ్రీహరికరసంస్పర్శను దేహము దాహంబు మాని ధృతిఁ గరిణీసం**
**దోహము దాను గజపతి మోహనఘీంకారశబ్దములతో నొప్పెన్**

టీ : శ్రీహరి కర సంస్పర్శను = శ్రీ విష్ణువు తన చేతితో తాకుట వలన, దేహమును, దాహమును మాని; ధృతిన్ = ధైర్యముతో; కరిణీ సందోహము = ఆడయేనుగుల సమూహము, తానును, గజేంద్రుడు, మోహన = సొంపైన, ఘీంకార శబ్దములతో + ఒప్పెన్ = ఘీంకృతులతో శోభిల్లెను.

తా : శ్రీ విష్ణు హస్త స్పర్శచేత భయమును వీడి, శరీరాయాసము తీరి, ఆడ యేనుగులతో గూడి గజేంద్రుడు ఇంపుగా ఘీంకృతులు చేశాడు.

**కం. కరమున మెల్లన నివురుచుఁ గర మనురాగమున మెఱసి కలయంబడుచున్**
**గరి హరికతమున బ్రతుకుచుఁ గరపీడన మాచరించెఁ గరిణుల మఱలన్**

టీ : హరి కతమున = శ్రీహరి కారణముగా, బ్రతికిన; కరిణులు = ఆడయేనుగులు, మరలన్ = మునుపటి వలె; కరములన్ = తొండములతో; మెల్లన, నిమురుచు; కరము + అనురాగమున = మిక్కుటమగు ప్రేమతో; ఒరసి = కదిసి, కలయం బడుచున్ = పైకొనుచు; కరపీడనము = తొండమును తొండముతో కలుపుకొను సౌఖ్యమును; ఆచరించెన్ = చేసెను.

తా : శ్రీహరి అనుగ్రహంతో బయటపడిన గజేంద్రుణ్ణి ఆడ యేనుగులన్నీ చుట్టుకొని తిరిగి తొండంతో పెనవేసుకొని తమ ప్రేమను వెల్లడించాయి.

**సీ. జననాథ! దేవల శాపవిముక్తు(డై పటుతర గ్రాహరూపంబు మాని**
**ఘను(డు హూహూ నామ గంధర్వు(డప్పుడు తనతొంటి నిర్మలతనువు(దాల్చి**
**హరికి నవ్యయునకు నతిభక్తితో మ్రొక్కి తవిలి కీర్తించి గీతములు పాడి**
**యా దేవు కృపనొంది యందంద మఱియును వినతశిరస్కు(డై వేడ్క తోడ**

**దళితపాపు(డగుచు( దనలోకమున కేగె నపుడు శౌరి కేలనంటి తడవ**
**హస్తిలోకనాథు( డజ్ఞానరహితు(డై విష్ణురూపు( డగుచు వెలు(గుచుండె**

టీ : జననాథ = ఓ మహారాజా! దేవల శాప విముక్తుడై = దేవలుడను మునిశాపము నుండి తొలగినవాడై, పటుతర = మిక్కిలి బలిష్ఠమైన, గ్రాహరూపంబున్ = మొసలి రూపమును; మాని = వదలి; ఘను(డు = గొప్పవాడైన, హూహూనామ గంధర్వు(డు; అప్పుడు, తన తొంటి నిర్మల తనువున్ = తన తొల్లిటి స్వచ్ఛమైన దేవతా రూపమును, తాల్చి, అవ్యయునకు, హరికి = శాశ్వతుడు సనాతనుడునగు శ్రీహరికి, అతి భక్తితో, మ్రొక్కి, తవిలి = భక్తికి లోనై, కీర్తించి గీతములు పాడి, ఆ దేవుని కృపన్; పొంది, అందంద = అపుడపుడే, వినత శిరస్కు(డై = తలవంచినవాడై, వేడ్కతోడ, దళితపాపు(డు = పాపములను నశింప జేసుకొన్న వాడు, అగుచు, తన లోకమునకు, గంధర్వలోకమునకు ఏగెను. అపుడు = ఆ సమయమున, శౌరి = శ్రీకృష్ణుడు, కేలనంటి= చేతితోతాకి, తడవన్ = నిమురగా; హస్తిలోకనాథుడు = గజేంద్రుడు; అజ్ఞానరహితుడై =అజ్ఞానము లేనివాడై; విష్ణురూపుడై, వెలయుచుండెన్ = శోభిల్లుచుండెను.

తా : ఓ మహారాజా! పూర్వం దేవముని శాపాన్ని పొంది మడుగులో మొసలియై పడియుండిన హూహూనామగంధర్వుడు శ్రీహరిచేత ఖండితుడై స్వస్వరూపాన్ని పొందాడు. భగవంతుణ్ణి స్తుతించి కీర్తించి, ఆ భగవంతుని ఆజ్ఞతో గంధర్వ లోకానికి వెళ్లిపోయాడు. ఆ తర్వాత శ్రీవిష్ణుకరస్పర్శ చేత గజరాజా విష్ణుసదృశ రూపాన్ని (విష్ణు పార్షదుని రూపాన్ని) పొంది ప్రకాశించాడు.

భగవత్పార్షదులు చతుర్విధాలైన ముక్తులను అనగా సాలోక్య - సామీప్య - సాయుజ్య - సార్ష్టి ముక్తులను కోరరు. భగవంతుణ్ణి సేవించడంలోనే పరిపూర్ణతను, కృతకృత్యతను పొందుతారు. భగవత్సేవారసానుభవరూపమైనది వారి భక్తి. కాలాంతరాన నశించే వస్తువు లేవీ వారు కోరరు అని భగవద్వాక్య మున్నది. **"మత్సేవయా ప్రతీతం తే సాలోక్యాది చతుష్టయమ్, నేచ్ఛంతి సేవయా పూర్ణాః కుతోఽన్యత్కాల విద్రుతమ్ (శ్రీమద్భా. 9-4-67).** గజేంద్రుని మనస్సెరిగి భగవంతు డతనికి అత్యంతప్రియమైన పార్షద పదవిని ప్రసాదించాడు. ప్రేమభక్తికి విజ్ఞాపన మనేది అక్కర లే దనిపించాడు. ఇతరుల

బంధాలను తొలగించే భగవంతుడు భక్తులప్రేమబంధాలకు బంధితుడవుతాడు. గజేంద్రుడు ఒక చతుష్పాత్తు అయిన జంతువు. అతడు భగవత్పూజాదికర్మలను చేయలేడు. కాని, అతని భావం గొప్పది, పవిత్రమైనది. భావం గొప్పదైనప్పుడు స్వల్పాతిస్వల్పమైన కర్మ కూడా మహత్తరమైన దవుతుంది. అత డందజేసిన పూజాపుష్పం విలువ చెప్పలేము.

**మ. అవనీనాథ! గజేంద్రుఁడై మకరితో నాలంబు గావించె మున్**
**ద్రవిళాధీశుఁడతండు పుణ్యతముఁ డింద్రద్యుమ్నునాముండు వై**
**ష్ణవముఖ్యుండు గృహీతమౌననియతిన్ సర్వాత్ము నారాయణున్**
**సవిశేషంబుగఁ బూజసేసెను మహాశైలాగ్రభాగంబునన్**

టీ : అవనీనాథ! = ఓ రాజా! గజేంద్రుఁడై, మకరితో = మొసలితో, ఆలంబు గావించె = పోరాట మొనర్చెను; మున్ = పూర్వ జన్మమునందు, అతండు, ద్రవిళాధీశుఁడు = ద్రవిడ దేశ ప్రభువు. పుణ్యతముఁడు = పుణ్యులలో అత్యంత శ్రేష్ఠుడు. ఇంద్రద్యుమ్న నాముండు = ఇంద్రద్యుమ్నుడను పేరుగలవాడు; వైష్ణవ ముఖ్యుండు = విష్ణు భక్తులలో ముఖ్యుడు; గృహీత మౌన నియతిన్ = స్వీకరించిన మౌన వ్రతముతో; సర్వాత్మున్ = సమస్తమునకు ఆత్మ (పరమాత్మ) అయిన నారాయణున్ = శ్రీమన్నారాయణుని, సవిశేషంబుగన్ = శంఖ చక్రాది లాంఛనుడు, లక్ష్మీ సహితుడు, గరుడారూఢుడు అయిన సవిశేషుడైనవానియందు భక్తితో, మహాశైల + అగ్ర భాగంబునన్ = ఒక మహాపర్వతము పైన, పూజ చేసెను = పూజించెను.

తా : ఓ రాజా! మకరముతో ఘోరంగా పోరాడిన గజేంద్రుని పూర్వ జన్మ వృత్తాంత మిది. ఆ గజరాజు పూర్వజన్మలో ద్రవిడ దేశాధీశుడైన ఇంద్రద్యుమ్న మహారాజు. పుణ్యతముడు. విష్ణు భక్తుడు. అతడొక మహాపర్వతభాగాన కూర్చుండి మౌనవ్రతముతో సవిశేషుడు, సాకారుడు, సగుణుడు అయిన శ్రీమన్నారాయణుని భక్తితో పూజించాడు.

**మ. ఒకనాఁడా నృపుఁ డచ్యుతున్ మనములో నూహించుచున్ మౌనియై**
**యకలంకస్థితి నున్నచోఁ గలశజుం డచ్చోటికిన్ వచ్చి, లే**
**వక, పూజింపక యున్న రాజుఁగని నవ్యక్రోధుఁడై "మూఢ!లు**
**బ్ధ! కరీంద్రోత్తమయోనిఁ బుట్టు"మని శాపంబిచ్చె భూవల్లభా!**

టీ : భూవల్లభా! = పరీక్షిన్మహారాజా! ఒకనాడు, ఆనృపుఁడు = ఆ ఇంద్రద్యుమ్నుడు; అచ్యుతున్ = శ్రీవిష్ణువును, వనములోనన్, ఊహించుచున్ = స్మరించుచు, మౌనియై = మౌన వ్రతియై; అకళంక స్థితిన్ = నిర్మలమైన స్థితిలో, ఉన్నన్ = ఉండగా, కలశజుండు = అగస్త్యుడు;

అచ్ఛోటికిన్, వచ్చి (ఆ సమయంలో) ఇంద్రద్యుమ్నుడు, లేవక = లేచి గౌరవముగా నిలబడక, పూజింపక, ఉన్నన్ = ఉండగా, మౌని కని = అగస్త్యముని చూచి, నవ్యక్రోధుడై = క్రొత్తగా కలిగిన కోపముగలవాడై; మూఢ! = మూర్ఖుడా, లుబ్ధ! = లుబ్ధుడా, కరీంద్రోత్తమ యోనిన్ = మదపు టేనుగునకు, పుట్టుమని = జన్మింపుమని, శాపంబు + ఇచ్చె = శాపమిచ్చెను.

తా : ఓ రాజా! ఇంద్రద్యుమ్న మహారాజు మౌనవ్రతుడై తన మనస్సులో శ్రీహరిని ధ్యానించుకొంటున్నప్పుడు అగస్త్యమహాముని అక్కడికి విచ్చేశాడు. ఆ ఇంద్రద్యుమ్నుడు తనను చూచి లేవనందుకు, పూజింపనందుకు ఆ మునికి హఠాత్తుగా కోపం వచ్చింది. మూర్ఖుడా! లుబ్ధుడా! అంటూ నీవు మదపుటేనుగువై జన్మించుమని శపించాడు.

అగస్త్యుడు శివ భక్తుడు. **"అగస్త్యో బ్రాహ్మణః శైవః స ఏవ బ్రాహ్మణః స్మృతః"** (భాగవతార్థ నిబంధమ్ 1-25). ఇంద్రద్యుమ్నుడు విష్ణు భక్తుడు. అతడు మహారాజు. అగస్త్యుడు తన శిష్యపరివారంతో వచ్చాడు. ఇంద్రద్యుమ్నుడు విష్ణువ్రత పరాయణుడై మౌనవ్రతంలో ఉన్నాడు. శ్రీహరిని స్మరిస్తున్నాడు. ఆ సమయంలో అతడు లేవరాదు, పరులను పూజింపరాదు. కాని, మహాత్ముడైన అగస్త్యునికి ఆ రాజు వైఖరి కోపం కలిగించింది. అది ఇంద్రద్యుమ్నుని దురదృష్టం కావచ్చు. అగస్త్యుని అపచారం కావచ్చు. అగస్త్యుడు అతణ్ని స్తబ్ధమైన ఏనుగువై జన్మించుమని శపించాడు. ఆ ముని ఆ సందర్భంలో కోపించడానికి గాని, శపించడానికి గాని కారణం భగవంతుని సంకల్పమే అయ్యుంటుంది. మహర్షుల శాపాలు భగవంతుని సంకల్పంతో వరాలుగా పరిణమిస్తాయి. ఇంద్రద్యుమ్నుడు మదపుటేనుగుగా జన్మించి, శ్రీహరి కర స్పర్శను పొంది, అగస్త్యాది మహర్షులకు కూడా లభింపని అత్యున్నతమైన భగవత్పార్షద పదవిని పొందాడు. అగస్త్యునికి అట్టి నవ్యక్రోధాన్ని కలిగించినవాడు కరుణాసింధువైన శ్రీకృష్ణభగవానుడే. ఇంద్రద్యుమ్నుని అనన్యమైన భక్తికి మెచ్చి తన దగ్గరకు చేర్చుకోవాలన్న సంకల్పంతోనే శ్రీకృష్ణుడా మునికి హఠాత్తుగా కోపం కలిగించి ఉండవచ్చు. **"సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తః స్మృతిః జ్ఞాన మపోహనం చ"** (గీత - 15 -15) సకల జీవుల హృదయాలలో ఉండినవాడను నేను. నావల్లనే స్మృతి, జ్ఞానం, అపోహనం (సంశయాది దోషాల విచ్ఛేదం) కలుగుతాయి అన్నాడు భగవానుడు. ఎక్కడో ఏకాంతంగా పర్వతం మీద కూర్చుండి మౌన వ్రతంతో శ్రీహరిని స్మరిస్తున్న ఇంద్రద్యుమ్నునివద్దకు అగస్త్యుడు శిష్యసమేతంగా వెళ్లడమేమిటి? శపించడమేమిటి? ప్రతిశాపం ఇవ్వగలిగినవాడైనా **"తరోరివ సహిష్ణునా"** వృక్షం వలె సహనశీలుడై

ఇంద్రద్యుమ్నుడు అది భగవంతుని నిర్ణయమని మిన్నకున్నాడు. ఇదంతా భగవంతుని అచింత్య లీల. ఇంద్రద్యుమ్నుడు గజజన్మను పొందాలి. తనను కీర్తించిన ఏనుగును కూడా ఆదరించి తన కారుణ్యాతిశయాన్ని భగవంతుడు భక్తలోకానికి చాటి చెప్పాలన్న తలంపు కావచ్చు. శంఖచక్రాదులతో కూడిన చతుర్భుజరూపుడైన శ్రీకృష్ణుని పూజించడంవల్ల ఇంద్రద్యుమ్నుడు సకల దేవతలను పూజించినవాడయ్యాడు. స్కాందపురాణ బ్రహ్మ నారద సంవాదంలో **"అర్చితే దేవదేవేశే శంఖ చక్ర గదా ధరే; అర్చితాః సర్వదేవాః స్యుర్యతః సర్వగతో హరిః"** అని ఉంది. శ్రీకృష్ణ భగవానుడు సర్వదేవమయుడని ఈ శ్లోకం తెలుపుతున్నది. అందుచేతనే ఇంద్రద్యుమ్నునికి అనన్యలభ్యమైన పార్షదపదవిని ప్రసాదించి మానవజాతికి ఒక పశువైన గజేంద్రుణ్ని ప్రాతఃస్మరణీయుణ్ని చేశాడు శ్రీకృష్ణుడు.

**కం. మునిపతి నవమానించిన - ఘనుఁ డింద్రద్యుమ్నవిభుడు కౌంజరయోనిం**
**జననంబందెను, విప్రులఁ - గని యవమానింపఁదగదు ఘనపుణ్యులకున్.**

టీ : మునిపతిన్ = అగస్త్యుని; అవమానించిన; ఘనుఁడు = గొప్పవాడైన; ఇంద్రద్యుమ్నుఁడు; ప్రభువు = రాజు; కౌంజరయోనిన్ జననంబు అందెను = ఏనుగు గర్భమున పడి ఏనుగై జన్మించెను. విప్రులన్ = వేదబ్రాహ్మణులను; కని, ఘనపుణ్యులకున్ = ఎంత గొప్ప పుణ్యంగలవారికైనను, అవమానింపన్, తగదు = కూడదు.

తా : అగస్త్య మహాముని తనను చూచి అభ్యుత్థాన - ఆసనదాన - ఆతిథ్య పూజాదులతో సత్కరింపని ఇంద్రద్యుమ్నుణ్ని కోపించి ఏనుగుజన్మ మెత్తుమని శపించాడు. ఎంతటి పుణ్యాత్ములైనా వేద బ్రాహ్మణులను అవమానింపగూడదు.

ఆ శాపవశాన అభిమాని అయిన ఇంద్రద్యుమ్నుడు త్రికూట పర్వతారణ్యంలో గజేంద్రుడుగా జన్మించాడు.**"అభిమానం సురాపానం, గౌరవం రౌరవం సమమ్"**

**కం. కరినాథుఁడయ్యె నాతఁడు - కరులైరి భటాదులెల్ల, గజమైయున్నన్**
**హరిచరణసేవకతమునఁ - గరివరునకు నధికముక్తి గలిగె మహాత్మా!**

టీ : మహాత్మా = ఓ మహానుభావా! ఆతఁడు = ఆ ఇంద్రద్యుమ్నుడు (అగస్త్యుని శాపం చేత) కరినాథుఁడయ్యెన్ = గజేంద్రుడై జన్మించెను. భటాదులెల్ల = అతని అనుచరులెల్ల, కరులైరి = ఏనుగులైరి; గజమైయుండన్ = ఇంద్రద్యుమ్నుడు గజమై యుండినను, హరి చరణసేవ కతమున = శ్రీహరి చరణములకు సేవ చేసిన కారణమున, కరివరునకు = గజేంద్రునకు; అధికముక్తి = మోక్షాధికమైన భగవత్పార్షద పదవి లభించెను.

తా : ఓ రాజా! ఆ ఇంద్రద్యుమ్నుడు మకరితో పోరాడిన గజేంద్రుడు గాను,

తక్కినవారు ఆ గజేంద్రునికి అనుచరులైన గజములుగాను జన్మించారు. విష్ణువ్రతపరాయణుడైన కారణాన పశువైన గజేంద్రునికి అత్యున్నతమైన భగవత్పార్షద పదవి ప్రాప్తించింది.

**ఆ.వె. కర్మతంత్రుఁడగుచుఁ గమలాక్షుఁ గొల్చుచు నుభయనియతవృత్తి నుండె వేనిఁ**
**జెడును గర్మమెల్ల శిథిలమై మెల్లన ప్రబలమైన విష్ణుభక్తి సెడదు.**

టీ : కర్మతంత్రుఁడగుచు = కర్మానుష్ఠానంచేస్తూ, కమలాక్షున్ = శ్రీకృష్ణుని; కొలుచుచు = భజిస్తూ; ఉభయ నియతవృత్తిన్ = సుఖదుఃఖాదిద్వంద్వములందు సమభావంతో, ఉండెనేని; కర్మమెల్ల = పూర్వజన్మకర్మమంతయు, శిథిలమై, చెడును; ప్రబలమైన = మిక్కిలి ప్రభావవంతమైన; విష్ణుభక్తి = శ్రీహరియందలి భక్తిమాత్రము; చెడదు = నశింపదు.

తా: నిత్యనైమిత్తిక కర్మలను యథావిధిగా జరుపుతూ, శ్రీకృష్ణభగవానుని భజిస్తూ ఉన్నవానికి పూర్వజన్మలో చేసిన పాపకర్మలన్నియు నశిస్తాయి. కాని, పూర్వ జన్మలో చేసిన శ్రీకృష్ణభక్తి మాత్రం నశించదు. క్షీణించదు. **"కౌంతేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి"** (గీత 9-31) భగవద్వచనం. "అర్జునా! నా భక్తునికిగాని, నా యందలి భక్తికి గాని క్షయమనేది ఉండదని నీవే ప్రతిజ్ఞాపూర్వకంగా లోకానికి చాటిచెప్పు" మన్నాడు శ్రీ కృష్ణభగవానుడు. గజేంద్రుడు ఇంద్రద్యుమ్నుడై ఉన్నప్పుడు చేసిన పాపమంతా క్షాళితమైంది. కాని, అతడు పూర్వజన్మలో చేసిన శ్రీకృష్ణానుస్మరణభజనభక్తిభావం నశించలేదు. సరికదా అది ఇప్పుడు పరాకాష్ఠస్థితిని పొంది అతడు భగవంతునికి నిత్య పార్షదుడైనాడు. దీనిని బట్టి గ్రహింపవలసిన విషయమేమంటే **"స్వల్ప మప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్"** (గీత 2-40) "ధర్మానుష్ఠానాన్ని స్వల్పంగా ఆచరించినా అది జన్మ-మరణరూపమైన మహాభయం నుంచి తప్పక రక్షిస్తుంది" అని శ్రీకృష్ణముఖోక్తి.

మనుష్యుడు తపస్సు, దానం, తీర్థాటన, వ్రతాలు మున్నగు పుణ్యకార్యాలు చేసినప్పుడు అవి ఫలమిచ్చినా, ఇవ్వకపోయినా నిర్వికారుడై సాధన చేయవలసే ఉంటుంది. సాధకుడు ఫలమందు, విఫలమందు సమబుద్ధి గలవాడై ఉండాలి. ఫలమిచ్చేవాడు భగవంతుడు. ఆయన సర్వభూతమనోభిజ్ఞుడు. **"ప్రభుః సర్వసమర్థో హి తతో నిశ్చింతతాం వ్రజేత్"** శ్రీ కృష్ణ భగవానుడు సర్వసమర్థుడు, కాబట్టి సాధకుడు నిశ్చింతుడై ఉండాలి. ఆయన కృపాసింధువు కాబట్టి తప్పక అనుగ్రహమే చూపుతాడు.

**కం. చెడుఁగరులు హరులు ధనములు చెడుదురు నిజసతులు సుతులు చెడుచెనటులకున్**
**చెడక మనునట్టి గుణులకుఁ జెడని పదార్థములు విష్ణుసేవావిరతుల్**

టీ : చెడు చెనటులకున్ = చెడిపోవునట్టి మూఢులకు, కరులు = ఏనుగులు, హరులు = గుఱ్ఱములు; ధనములున్ = సంపదలు, చెడు = చెడిపోవును; నిజసతులు, సుతులున్ = స్వభార్యలు, కుమారులు, చెడుదురు, చెడక మను = చెడిపోకుండగా జీవించు, గుణులకున్ = సద్గుణములు గలవారికి; విష్ణుసేవా నిరతుల్ = శ్రీహరిసేవయందలి అభిలాషలు(భక్తి) చెడని పదార్థములు.

తా : శ్రీకృష్ణభక్తి లేక చెడిపోయిన మూర్ఖుల సమస్తసంపదలు చెడిపోవడం కద్దు. శ్రీకృష్ణభక్తిభావన గలిగిన సాధుసజ్జనులు ఇహపర సౌఖ్యాలను పొంది ధన్యులవుతారని తాత్పర్యం.

**వ. అప్పుడు జగజ్జనకుండగు నప్పరమేశ్వరుండు దరహసిత ముఖకమల యగు నక్కమల కిట్లనియె**

టీ : అప్పుడు = గజేంద్రునికి నిజపార్షద పదవిని ప్రసాదించిన తర్వాత, జగజ్జనకుండగు = లోకములకు తండ్రియగు; ఆ+పరమేశ్వరుండు, దరహసితముఖ కమలయగు = చిరునవ్వుతోడి ముఖపద్మము గలదియగు, కమలకు = లక్ష్మీదేవికి; ఇట్లనెను.

తా: శ్రీహరి ఆర్తత్రాణ పరాయణత్వాన్ని లక్ష్మీదేవి స్వయంగా గ్రహించింది. ఒక జంతువును రక్షించడానికి ఎంత వేగిరపడ్డాడో తెలుసుకొని, తన భర్త కారుణ్యాతిశయానికి సంతోషించి చిరునవ్వుతో శ్రీహరిని చూచింది. ఆమెతో శ్రీహరి ఇట్లన్నాడు.

**కం. బాలా! నా వెనువెంటను హేలన్ వినువీథినుండి యేతెంచుచు నీ**
**చేలాంచలంబుఁ బట్టుట కాలో నేమంటి నన్ను నంభోజముఖీ!**

టీ : అంభోజముఖీ = పద్మమువంటిముఖముగల దానా! బాలా! నా వెనువెంటను; వినువీధి నుండి = ఆకాశవీధినుండి, హేలన్ = విలాసముగా; ఏతెంచుచు = వచ్చుచు; నీ చేలాంచలంబున్ = నీ చీరచెరగును; పట్టుటకు = వదలకుండగా పట్టుకొనుటకు; ఆలో = అట్లు వచ్చునపుడు; నన్నున్, ఏమంటివి; = ఏమని తలచితివి.

తా : ఓ పద్మవదనా! నీవు నావెంబడి వస్తూ, నీ పైటకొంగును విడిచిపెట్టడం మరచి పట్టి లాగుకొని వెళుతున్నప్పుడు నన్ను గూర్చి నీవేమనుకొన్నావు?

**కం. ఎఱుఁగుదుఁ దెఱవా! యెప్పుడు మఱవను సకలంబు నన్ను మఱచిన యెడలన్**
**మఱతువని యెఱిఁగి మొఱఁగక మఱవక మొఱయిడిరయేని మఱి యన్యములన్.**

టీ : తెఱవా! = ఓ సుందరీ! సకలంబు = సమస్త జీవరాశి; నన్ను మఱచిన యెడలన్ = నన్ను మరచిన సమయమందు; మఱవను = నేనుమాత్రము మరచిపోను; మఱి అన్యములన్ = ఇతరములను; మఱతుము అని = తలపను అని; ఎఱిఁగి = తెలిసి; మొఱగక = మోసగింపక; మఱవకపీమరక; మొఱ ఇడిన = మొఱపెట్టిన యెడల; ఎపుడు = సర్వదా; ఎఱుగుదును = తెలియుదును.

తా : లక్ష్మీ! నన్నెవరు మరచినారో వారిని నేను మరువను. నన్ను మరవకుండా సర్వదా భజించువారి యోగక్షేమాలను ప్రసాదించు విషయంలో నేను ఏమరను.

**వ. అని పలికిన నరవిందమందిరయగు నయ్యిందిరాదేవి మందస్మిత చంద్రికా సుందరవదనారవింద యగుచు ముకుందున కిట్లనియె.**

టీ : అని పలికినన్ = శ్రీహరి ఇట్లనగా; అరవింద మందిరయగు = కమలవాసిని యగు; ఇందిరాదేవి = లక్ష్మీదేవి; మందస్మిత చంద్రికా దరహాస = వెన్నెలవంటి చిరునవ్వుతో కూడిన; సుందరవదన+అరవింద యగుచు = అందమైన ముఖపద్మము గలదియై, ముకుందునకు = మోక్షమొసగునట్టి శ్రీకృష్ణునకు; ఇట్లనియె.

తా : శ్రీహరి పలుకులు విని పద్మవనాలయయగు లక్ష్మీదేవి చిర్నవ్వు నవ్వుతూ ఇట్లన్నది.

**కం. దేవా! దేవరయడుగులు భావంబున నిలిపి కొలుచు పని నా పనిగా**
**కోవల్లభ! యే మనియెద నీ వెంటనె వచ్చుచుంటి నిఖిలాధిపతీ!**

టీ : దేవా! నిఖిలాధిపతీ! (అఖిలాండ పతీ) దేవరయడుగులు = నీ పాదములు; భావంబున నిలిపి = మనస్సులో నిలుపుకొని, కొలుచుపని = సేవించుట; నా పనిగాక = నా కర్తవ్యమేయగును; ఇంకేమందును. (నీ పాదములను సేవించుటకు) నీ వెంటనే వచ్చుచుంటిని.

తా: స్వామీ! నీ పాదపద్మాలను మనస్సులో నిలుపుకొని భజించడంకంటె నాకు వేరే ఏమి పని ఉన్నది? అందుచే త్వరత్వరగా నీవు వెళ్లునప్పుడు నీ పాదాలవెంటబడి నేను కూడా వస్తున్నాను.

భగవంతుని దీనదయాళుత్వము, ఆశ్రితవాత్సల్యము లక్ష్మీదేవికి అనుభవైక వేద్యమే. ఆమె కూడా శ్రీహరి కళ్యాణగుణములు కలదే. "**శ్రేయసీం శ్రీనివాసస్య కరుణామివ రూపిణీమ్**" ఆమె శ్రీనివాసుని అనుగ్రహరూపిణి. "ఇతడు నా బిడ్డడు, అపరాధి కాడు'' అని జీవుణ్ని భగవత్కృపా పాత్రుణ్ని చేస్తుంది లక్ష్మీదేవి. కృపాపారతంత్ర్యము - అనన్యార్హతలు గల లక్ష్మీదేవి "శ్రీవత్సవక్షా నిత్యశ్రీః'' భగవంతునితోడి నిత్య సామీప్య సిద్ధి కలది. భగవంతునికి పరతంత్రురాలు కాబట్టి, భగవంతునితోపాటు ఆమె కూడా వస్తుంది.

**కం. దీనులకుయ్యాలింపను దీనుల రక్షింప మేలుదీవనఁ బొందన్**
**దీనావన! నీ కొప్పును దీనపరాధీన! దేవదేవ! మహేశా!**

టీ : దేవదేవ! మహేశా! దీన పరాధీన = దీనులకు వశమైన ఓ స్వామీ! దీనుల కుయ్యి = ఆర్తజనుల మొఱను, ఆలింపను = వినుటకు; దీనుల రక్షించుటకు; మేలు దీవన పొందన్ = మేలైన దీవనలు పొందుటకు, నీకు+ఒప్పును = నీకు తగును.

తా: స్వామీ! నీవు దీనుల మొఱవింటావు. వారిని రక్షిస్తావు. వారిచే స్తుతింపబడతావు. నీవు దీనులకు వశమైనవాడవు. ఇది సర్వేశ్వరేశ్వరుడవగు నీ కొక్కనికే తగును.

దీనులకుయ్యి అంటే దీనుల ప్రార్థన. విశ్వాసపూర్వకంగా భగవంతునితోడి ఆత్మీయతను స్థాపించుకోవడమే ప్రార్థన. భాషా వైదుష్యం ప్రార్థనకు అవసరం లేదు. శ్లోకాలు తనకు రావనీ, భాషాజ్ఞానం లేదనీ చింతింప నవసరం లేదు. భగవంతుణ్ని ప్రసన్నుణ్ని చేసుకోవడానికి విశేషభాష, విశేషశబ్దాలు ఉపయోగపడవు. నిజానికి ఆయన్ను ప్రసన్నుణ్ని చేసుకోడానికి విశ్వంలోని శబ్దరాశినంతా, పాండిత్యమంతా ఉపయోగించినా చాలదు. భగవత్ప్రసన్నతకు ఒకేఒక వస్తువు ఆవశ్యకమవుతుంది. అదే విశ్వాస భరితమూ భక్తిశ్రద్ధాయుతమూ అయిన హృదయము. వేదవేదాంగ శాస్త్ర పురాణాదులన్నీ ఈ విషయాన్నే తెలుపుతూ బహువిధాలుగా వివరించాయి. భగవంతునితోడి ప్రగాఢమైన ఆత్మీయతను స్థాపించుకొన్నవాడు భగవత్సదృశుడవుతాడు. అతనికి ఈ జగత్తులో భగవంతుడొక్కడు తప్ప మరేదీ కనిపించదు. పతివ్రతకు ఈ జగత్తులో తన భర్త తప్ప మరే వస్తువుతోను అవసరం ఉండదు. ఇంకే వస్తువు ఆమెకు సుఖకరం కాదు. అట్టి పాతివ్రత్య భరితమైన హృదయమే భక్తుని హృదయం అయ్యుండాలి.

**వ. అని మఱియును సముచిత సంభాషణంబుల నంకించుచున్న యప్పరమ వైష్ణవీరత్నంబును సాదరసరససల్లాపమందహాసపూర్వకంబుగా నాలింగనంబు గావించి సపరివారుండై గరుడ గంధర్వ సిద్ధ విబుధగణ జేగీయమానుండై గరుడారూఢుం డగుచు హరి నిజసదనంబునకుం జనియె. అని చెప్పి శుకయోగీంద్రుం డిట్లనియె.**

టీ : సముచిత సంభాషణములన్ = తగిన మాటలతో, అంకించుచున్న = స్తుతించుచున్న; పరమ వైష్ణవీ రత్నంబును = శ్రేష్ఠమైన విష్ణుభక్తి గలదానిని, (లక్ష్మీదేవిని) సాదర = ఆదరముతోడి, సరస = రసయుక్తమైన, సల్లాప = సంభాషణగల, మందహాస పూర్వకంబుగా = చిర్నవ్వు మొదటగల్గునట్లు, ఆలింగనంబు గావించి = కౌగిలించుకొని, సపరివారుండై = పరివారముతో కూడ; గరుడ, గంధర్వ, సిద్ధ, విబుధగణ = దేవతాజాతులచేత, జేగీయమానుండై = జయధ్వనులచే కీర్తింపబడినవాడై. హరి; నిజసదనంబునకు = వైకుంఠమందిరమునకు చనియె.

తా: ఈ విధంగా లక్ష్మీదేవి స్తుతిస్తుండగా, శ్రీహరి ఆమెతో సరససల్లాపాలాడుతూ, సాదరంగా ఆలింగనం చేసుకొని, దేవతాగణాలు జయజయధ్వనులు చేస్తుండగా, తన పరివారం వెంటవస్తుండగా, గరుత్మంతుని అధిరోహించి వైకుంఠ మందిరానికి వెళ్లాడు. అని చెప్పి, శుకయోగీంద్రుడిలా చెప్పాడు.

సీ. **నరనాథ! నీకును నాచేత వివరింపఁ బడిన యీ కృష్ణానుభావమైన గజరాజమోక్షణకథ వినువారికి యశము హెచ్చును గల్మషాపహంబు దుస్స్వప్ననాశంబు దుఃఖసంహారంబు ప్రొద్దున మేల్కాంచి పూతవృత్తి నిత్యంబు పఠియించు నిర్మలాత్మకులైన విప్రులకును బహువిభవ మమరు**

**సంపదలు గల్గుఁ బీడలు శాంతిఁ బొందు సుఖముసిద్ధించు, వర్ధిల్లు శోభనములు మోక్ష మరచేతిదైయుండు ముదము చేరు ననుచు విష్ణుండు ప్రీతుఁడై యానతిచ్చె.**

టీ : నరనాథ! = రాజా! నీకును, నాచేత, వివరింపబడిన = స్పష్టపరచబడిన; ఈ కృష్ణానుభావమైన = శ్రీకృష్ణుని ప్రభావమును తెలిపెడిదైన; గజరాజమోక్షణకథ వినువారికి, యశము = కీర్తి కలిగించును; కల్మష+అపహంబు = పాపమును తొలగించును; దుస్స్వప్ననాశంబు = చెడు కలలనుతొలగించును, ప్రొద్దున మేల్కాంచి; పూతవృత్తి = పవిత్రమగు నియమముతో, నిత్యంబు పఠియించునట్టి; నిర్మల+ఆత్మకులైన = నిర్మలమనస్కులగు; విప్రులకును = బ్రాహ్మణులకు (బ్రహ్మజ్ఞానులకు), బహువిభవంబు = గొప్పవైభవము; అమరున్ = కలుగును; సంపదగల్గు; పీడలు = బాధలు శమించును, సుఖము సిద్ధించును; ముదము = సంతోషము చేకూరును; మోక్షము, అరచేతిదై ఉండు = ముక్తి అత్యంతసులభముగా ప్రాప్తించును అని విష్ణుండు; ప్రీతుడై = సంతుష్టినొందినవాడై; ఆనతిచ్చె = సెలవిచ్చెను.

తా : పరీక్షిన్మహారాజా! నీకు వినిపించిన శ్రీకృష్ణుని ప్రభావానికి చెందిన గజేంద్రమోక్షణ కథ వినువారికి యశస్సు వృద్ధి అవుతుంది. పాపాలు నశిస్తాయి. ఇది విన్నవారికి, పఠించినవారికి దుస్స్వప్నాలు కలుగవు. వేకువజామున మేల్కొని గజేంద్రమోక్షస్తవమును పఠించిన బ్రహ్మజ్ఞానులకు ఐశ్వర్యము, సకలశుభాలు కలుగుతాయి. సమస్తపీడలు తొలగిపోతాయి. సౌఖ్యాలు కలుగుతాయి. శుభాలు వర్ధిల్లుతాయి. మోక్షం హస్తగతమవుతుంది అని శ్రీహరి పరమ సంతుష్టుడై స్వయంగా తెలిపాడు.

వ. **అని మఱియు నప్పరమేశ్వరుండిట్లని యానతిచ్చె. ఎవ్వరేని నపరరాత్రాంతంబున మేల్కాంచి సమాహితమనస్కులయి నన్నును, నిన్నును, నీ సరోవరంబును, శ్వేతద్వీపంబును, నాకుం బ్రియంబైన సుధాసాగరంబును, హేమనగంబును, నిగ్గిరి కందరకాననంబులను, వేత్ర కీచక వేణులతాగుల్మ సురపాదపంబులను, నేనును బ్రహ్మయు ఫాలలోచనుండును నివసించియుండు నక్కొండ శిఖరంబులను, కౌమోదకీ కౌస్తుభ సుదర్శన పాంచజన్యంబులను, శ్రీదేవిని, శేష గరుడ వాసుకి ప్రహ్లాదనారదులను, మత్స్య కూర్మ వరాహాద్యవతారంబులను,**

**దశావతార కార్యంబులను, సూర్య సోమ పావకులను, బ్రణవంబును, ధర్మతప స్సత్యంబులను, వేదంబులను, వేదాంగంబులను, శాస్త్రంబులను, గోభూసుర సాధు పతివ్రతా జనంబులను, జంద్రకాశ్యప జాయాస ముదయంబును, గౌరీగంగా సరస్వతీ కాళిందీ సునందా ప్రముఖ పుణ్యతరంగిణీ నిచయంబును, నమరులను, నమరతరువులను, నైరావతంబును, నమృతంబును, ధ్రువుని, బ్రహ్మర్షినివహంబును, పుణ్యశ్లోకులయిన మానవులను సమాహితచిత్తులై తలంచువారలకుఁ బ్రాణావసానకాలంబున మదీయంబగు విమలగతి నిత్తునని హృషీకేశుండు నిర్దేశించి శంఖంబు పూరించి సకలామరవందిత చరణారవిందుండై విహగ పరివృఢవాహనుండై వేంచేసె. విబుధానీకంబు సంతోషించెను. అని చెప్పి శుకుండురాజున కిట్లనియె.**

టీ : అపరరాత్రాంతంబున = వేకువజామున మేల్కొంచి; సమాహితచిత్తులయి = ప్రసన్నమైన మనస్సు గలవారలయి; స్మరింపదగిన పుణ్యపదార్థములు.

శ్వేతద్వీపము, పాలసముద్రము, గజరాజు మోక్షణము జరిగిన సరోవరము; మేరుపర్వతము, అందలి గుహలు; త్రికూట పర్వతారణ్యము, వృక్షలతలు, నేను, బ్రహ్మ, శివుడు విహరించు పర్వతశిఖరము, నా కౌమోదకీ గద, కౌస్తుభమణి, సుదర్శన చక్రము, పాంచజన్యశంఖము, లక్ష్మి, ఆదిశేషుడు, గరుత్మంతుడు, నారదముని, ప్రహ్లాదుడు, దశావతారాలు, అందలి నా లీలా విశేషాలు, సూర్య చంద్రాగ్ని భట్టారకులు, ఓంకారము, తపస్సు, సత్యము, ధర్మము, నాల్గువేదాలు, షట్శాస్త్రాలు, గోవులు, బ్రహ్మజ్ఞానులు, పతివ్రతలు, గంగాది పుణ్యనదులు, దేవతలు, కల్పవృక్షాలు, ఐరావతగజము. అమృతము, ధ్రువుడు, బ్రహ్మర్షులు, పృథుహరిశ్చంద్రాది పుణ్యశ్లోకులైన రాజులు మున్నగువారిని శ్రద్ధగా స్మరించేవారికి ప్రాణావసాన సమయంలో నిర్మలమైనబుద్ధి కలిగించి వారికి వైకుంఠప్రాప్తి కలిగిస్తాను అని హృషీకేశుడైన శ్రీకృష్ణుడు శంఖాన్ని పూరించి, గరుడారూఢుడై వేంచేశాడు. ఆయన నిర్దేశానికి దేవతలందరు సంతోషించారు అని చెప్పి శ్రీశుకదేవుడు పరీక్షిత్తుతో ఇలా అన్నాడు.

**కం. గజరాజమోక్షణంబును నిజముగఁ బఠియించునట్టి నియతాత్మలకున్**
**గజరాజవరదుఁ డిచ్చును గజతురగస్యందనములుఁ గైవల్యంబున్**

టీ : గజరాజమోక్షణంబును; నిజముగ,పఠియించునట్టి = చదువునట్టి; నియతాత్ములకున్ = నియమబుద్ధులకు; గజరాజ వరదుఁడు = గజేంద్రునికి వరమిచ్చి రక్షించినవాడగు శ్రీకృష్ణభగవానుడు; గజతురగ స్యందనములు = ఏనుగులు, గుఱ్ఱాలు,రథాలు ఐహికములైన సమస్తసౌఖ్యములను, కైవల్యంబున్ = మోక్షమును, ఇచ్చును.

తా : పరీక్షిన్మహారాజా! ఈ గజేంద్రమోక్షస్తవమును శ్రద్ధాభక్తులతో పఠించినవారికి ఈ లోకంలో ధనకనక వస్తువాహన సకలసుఖాలను, తర్వాత మోక్షాన్ని శ్రీకృష్ణ భగవానుడు తప్పక ప్రసాదిస్తాడు. హరిః ఓం తత్సత్.

: మహాకవి బమ్మెరపోతానామాత్య ప్రణీత శ్రీమదాంధ్రమహాభాగవతాంతర్గత గజేంద్రమోక్ష గోపీనయనోత్పలార్చిత వ్యాఖ్య సంపూర్ణము :

**"త్వదీయం వస్తు గోవింద తుభ్య మేవ సమర్పయే"**

**"సర్వం శ్రీకృష్ణార్పణ మస్తు"**

**యస్యామలం దివి యశః ప్రథితం రసాయాం**
**భూమౌ చ తే భువనమంగళ దిగ్వితానమ్**
**మందాకినీతి దివి భోగవతీతి చాథో**
**గంగేతి చేహ చరణాంబు పునాతి విశ్వమ్**

***(శ్రీమద్భా. 10-60-44)***

**భవభయ మపహర్తుం జ్ఞాన విజ్ఞానసారం**
**నిగమకృ దుపజహ్రే భృంగవద్వేదసారమ్**
**అమృత ముదధిత శ్చాపాయయద్ భృత్యవర్గాన్**
**పరమ పురుష మాద్యం కృష్ణసంజ్ఞం నతోఽస్మి**

***(శ్రీమద్భా. 11-29-49)***

